# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

అక్టోబర్ చతుర నవల బంగారులేడి ..............

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..................................................

..................................................

..................................................

..................................................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

## సచిత్ర విచిత్రం

# జంతులోకంలో తారావిహారం





"ముద్దులొలికే బుజ్జి వండికొక్కు ముద్దుగులగటం గజంగా నా లక్కు" అంటున్న జూడీగ్రీన్

మాటింగ్ తలనొప్పితో అస్తమానం బిజీబిజీగా ఉండే ఈ ఆస్ట్రేలియన్ టి.వి.తారలు మానసికోల్లాసం కోసం ఆటవిడుపుగా మెల్‌బోర్న్‌లోని రాయల్‌జూని ఆమధ్య సందర్శించారు. అధికారులు అనుమతి ఇవ్వడంతో జంతుకోకంలో విహరిస్తూ, వాటితో కలిసి కేరింతలు కొడుతూ సరదాగా ఆడుతూ పాడుతూ కాలం గడిపేశారా 'బుల్లితెర' తారలు. ఆ సమయంలో తీసిన ఫొటోలే ఇవి.





"ప్రమాదకరమైన కొండచిలువ అంటారుగాని నన్నేం చేయదిది. ఎందుకంటే ఇది నా నేస్తంగదా?" అని వగలుపోతున్న జూడీగ్రీన్



"మండూక నేస్తమా! జారేవు మిత్రమా!" అంటున్న జూడీజేమ్స్

గార్దభరాజాన్ని గారాబం చేస్తూ లాలిస్తున్న నవజవ్వని

# చతుర ప్రపంచం

## మొండి దర్శకుడు

జర్మన్ దర్శకుడు వెర్నర్ హెర్జాక్ కన్నా మొండిఘటం సినీ ప్రపంచంలో మరొకరు ఉండరనే చెప్పాలి. సిన్మా అనేది కేవలం వినోదప్రధానంగానూ కాలక్షేపసాధనంగానూ మాత్రమేగాక, ఆలోచింపచేసేదిగా కూడా ఉండాలని అతని అభిప్రాయం. అందుకే తను చెప్పదల్చుకున్న విషయాన్ని ఎక్కడా రాజీ పడకుండా చెప్పడానికతడు ప్రయత్నిస్తాడు.

స్క్రిప్టుకి అనుగుణంగా ఉండడంకోసం ఒకసారి వెయ్యికి పైగా ఎలుకల్నిపట్టి ఓపికగా వాటన్నింటికీ తెల్లరంగువేసి సన్నివేశాన్ని చిత్రీకరించాడు. అందుకోసం ఎంతో డబ్బు, ఎంతో కాలం వ్యయమైనా అతను లెక్కచేయలేదు. మరోసారి ఇంకో చిత్రం కోసం రకరకాల ఆఫ్రికన్ కోతుల్ని తెప్పించి తాను అనుకున్న ఎఫెక్టువచ్చేదాకా విసుగులేకుండా ఎన్నో టేకులు తీశాడు.

గ్లాస్ కిన్స్కీ మంచినటుడే కాని కొంచెం తలతిక్క మనిషి. అలాంటి వ్యక్తితో మన దర్శకోత్తముడు పూర్తిగా అమెజాన్ అడవుల్లోనే ఓ చిత్రంతీశాడు. చావుకి తెగించి ఆ కీకారణ్యాలలో నటించలేక "ఎందుకు ఒప్పుకున్నానురానాయనా?" అంటూ బాధపడ్డాడు కిన్స్కీ. దానికితోడు ఎఫెక్టు పేరుతో తీసిన షాట్నే పదిసార్లు తీస్తుంటే విసుగేసిందతనికి. దాంతో సిన్మా పూర్తికాకముందే తనదారిన తాను పోతానంటూ మంకుపట్టు పట్టాడతను. ఎవరెంత చెప్పినా వినలేదు. వెంటనే వెర్నర్ జేబులోంచి రివాల్వర్ తీసి "ఎలా పోతావో నేనూ చూస్తాను... ఇక్కడినించి కదిలావంటే ఈ రివాల్వర్లోని బుల్లెట్లన్నీ నీ వెన్నులో దిగబడ్తాయి ఖబడ్దార్" అంటూ బెదిరించాడు. అంతే! సిన్మాపూర్తయ్యేంతవరకూ ఆ నటుడు నోరెత్తితే



ఒట్టు.

పసితనం నుంచే సిన్మాపట్ల అనురక్తి పెంచుకున్నాడు వెర్నర్. చదువుకొనే రోజుల్నించే తను స్వయంగా సిన్మా స్క్రిప్టులు రాయడం మొదలెట్టాడు. ఓసారి తన స్క్రిప్టు నొకదాన్ని ఓ సిన్మా కంపెనీకి పంపాడతను. దాన్ని చూసి రచయితతో ముఖాముఖి సంప్రదించాలని అతన్ని పిలిపించుకున్నారు వాళ్లు. తనేదాని రచయితనంటూ పదహారేళ్లన్నా నిండని వెర్నర్ ఎంత చెప్పినా నమ్మక అతన్ని వెళ్లగొట్టేశారా కంపెనీ యజమానులు.

అప్పటినుంచీ తనే స్వయంగా సిన్మాలు తియ్యాలని నిర్ణయించుకున్నాడు వెర్నర్. రాత్రంతా ఓ వెల్డింగ్ కంపెనీలో పనిచేసివచ్చిన డబ్బుతో మూవీకెమెరా ఫిల్ము కొనుక్కుని పగలు సిన్మాలు తీయడం మొదలెట్టాడు. అలా తీసే అచిరకాలంలో ప్రపంచప్రఖ్యాత దర్శకుడిగా కీర్తి ప్రతిష్ఠలు గడించాడతను.

"నిజంగా నీ దగ్గర సిన్మాతీసే సత్తా ఉంటే చాలు డబ్బులేకున్నా ఇబ్బంది లేదు. అవసరమైతే ఓ మూవీకెమేరాను ముడి ఫిల్ముని దొంగతనం చేసైనా సిన్మాతీయవచ్చు. గాజు అద్దాలమధ్య కూర్చుంటాం. గాలి ఆడకచచ్చే పరిస్థితి వస్తే ఊర్కుంటామా? అద్దాలు పగలగొట్టి బయటికిరామూ? తప్పొప్పులు ఎంచుకుంటూ కూర్చుంటామా? అలాగే ఇదీనూ..." అంటాడతను నిర్మోహమాటంగా

---

## గమ్మత్తయిన వాచీలు

రిస్ట్ వాచీలంటే ఈరోజుల్లో తెలియనివాళ్లెవరు? సాధారణంగా ఈ వాచీలు టైమ్‌తోపాటు అవి ధరించినవారి స్టేటస్‌ని కూడా తెలియచేస్తుంటాయి.

ఆధునిక కాలంలో వాచీలు టైమ్‌ని, స్టేటస్‌ని తెలియజేయడంతోపాటు మరెన్నో ప్రయోజనాల్ని అందిస్తున్నాయి. ముఖ్యంగా విదేశీవాచీలు బహుముఖ ఉపయోగాల్ని అందించడంలో ముందంజలో ఉన్నాయి. ప్రపంచంమొత్తంమీదా ఒకే టైమ్ ఉండదుగదా? తూర్పునించి ఉత్తరానికి వెళ్లినకొద్దీ టైమ్‌లో తేడాలు వస్తాయి. ఉదాహరణకు మనదేశంలో రాత్రి అయితే అమెరికాలో పగలు అవుతుంది. అమెరికావాళ్లు యిలాంటి తేడాల్ని దృష్టిలో పెట్టుకొని ప్రపంచంలోని 28 అతి పెద్ద నగరాలలోని టైమ్‌ని చూపించే వాచీని ఒకదాన్ని రూపొందించారు. దాని డయల్‌మీద ప్రపంచపటం చిత్రితమై ఉంటుంది. అది పెట్టుకుంటే ప్రపంచంలో ఏదేశంలో ఎక్కడ ఎంత టైమ్ అయిందీ మనకు సులభంగా తెలుస్తుంది. దీని వెల ఎంతోకాదు, కేవలం 500 రూపాయలేనట. ఇక్కడ కాదండోయ్ అమెరికాలో...

కాలిఫోర్నియాలోని ఒక వాచ్ కంపెనీవారు 'అల్అజార్' అనే పేరుతో ప్రత్యేకంగా ముస్లిమ్‌లకోసమని ఓ వాచ్‌ని రూపొందించారు. అరబ్బీ భాషలో 'అల్అజార్' అంటే 'ప్రార్థన' అని అర్థం. ఈ వాచ్‌లో నమాజ్ చేసే సమయానికి అలారమ్ మోగుతుంది. మక్కా ఉన్న దిశవైపు తిరిగి నమాజ్ చేస్తారుగదా ముస్లిమ్‌లు! అందుకోసం ఈ వాచ్‌లో మక్కా ఏదిశలో ఉన్నదీ కూడా చూపే 'సూచిక' కూడా ఉంది. ఈ వాచీ రెండువేల రూపాయల వరకూ ఖరీదు చేస్తుందని తెలుస్తోంది.

వేటగాళ్లకు, నావికులకు, పర్వతారోహకులకు ఎక్కువగా ఉపయోగపడే 'ఎమర్జన్సీ వాచ్'నొకదాన్ని తయారుచేశారు ఓ స్వీడిష్ వాచ్‌కంపెనీవారు. దారితప్పినప్పుడు ఈ వాచీలో ఒక బటన్ నొక్కితేచాలు, రేడియో సిగ్నల్స్ 20 కిలోమీటర్ల దూరంవరకూ ప్రయాణించి మన ఉనికిని అక్కడివాళ్లకు తెలియజేస్తాయి. తద్వారా మనం వాళ్ల సాయాన్ని అందుకోవచ్చు. ఆ వాచీలో మరో ప్రత్యేకత ఉంది. దానికి వెనుక పక్కన ఉన్న మెరుపువూతమీద సూర్యకిరణాలు పడితే అవి అయిదు కిలోమీటర్ల దూరం వరకూ పరావర్తనం చెంది, అక్కడ ఉన్న వ్యక్తులకు మన ఉనికిని తెల్పుతాయట. ఈ వాచీ ఇంకా మార్కెట్లోకి రాలేదు. వస్తేగనుక దీని ఖరీదు 21,000 రూపాయలపైమాటేనట.

అమెరికాలోని కొడక్, టైమెక్స్ కంపెనీలు

---

కవర్‌ఫోటో: జగ్‌మోహన్




కూడా కొన్ని ప్రత్యేకమైన వాచీల్ని తయారుచేస్తున్నాయి. సుమారు 35,000 రూపాయల ఖరీదుచేసే ఈ వాచీలలో ఒక్క బటన్ నొక్కితే చాలు మనం కోరుకున్న వ్యక్తుల ముఖాలు డయల్‌మీద ప్రత్యక్షమౌతాయి. జపాన్‌లోని ఒక కంపెనీ స్త్రీలకోసమని ప్రత్యేకంగా ఓ వాచీని రూపొందించింది. ఈ 'లేడీస్‌వాచీ'లో ఆయా స్త్రీల పీరియడ్స్ ఎప్పుడు వచ్చేది ఒకవేళ గర్భవతులైతే ఏసమయంలో ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి, శారీరక ఉష్ణోగ్రత ఏవ రిమితులలో ఉండాలి, మొదలైన వివరాలన్నీ తెలియజేసే ఏర్పాట్లున్నాయట. దీని వెల 4,500 రూపాయలవరకూ ఉండవచ్చునని అంచనా.

---

## థియేటరు యజమాని దౌర్భాగ్యం

నగరం నడిబొడ్డున నిలిచి, ట్రాఫిక్‌కి అంతరాయం కలిగిస్తోందని మున్సిపల్ అధికారులు పదేళ్ళక్రితం పూనేలోని ఓ పురాతన థియేటర్‌ని కూలగొట్టారు. ఫలితంగా అప్పటికే అప్పుల ఊబిలో మెడదాకా కూరుకుపోయి ఉన్న సదరు థియేటర్ యజమాని ఆనందరావు రోడ్డున పడాల్సివచ్చింది. బతకడంకోసం ప్రస్తుతం ఆయన అదే నగరంలో కట్‌లెట్లు, గప్‌చిప్‌లు అమ్ముకుంటున్నాడు. పూలమ్మిన చోటే కట్టెలమ్ముకుంటున్నట్లున్న ఆయన దయనీయ పరిస్థితి చూసి ఎరిగినవాళ్ళు చింతాక్రాంతులవుతున్నారు.

పూనేలో మొట్టమొదటి సినిమాహాలు నిర్మించిన ఘనత ఆనందరావు తండ్రిదే! హైదరాబాదునుంచి వాస్తుశిల్పుల్ని, కళాకారుల్ని పిలిపించి 1915 నాటికల్లా ఆయన థియేటర్ నిర్మాణాన్ని పూర్తిచేశాడు. అత్యంత రమణీయంగా తయారైన ఆ థియేటర్ పేరు 'ఆర్యన్'. అలా ప్రారంభమైన ఆ హాలులో 1931 వరకూ మూకీ చిత్రాలే ప్రదర్శింపబడ్డాయి. ఆటు తర్వాత టాకీ యుగం ప్రారంభమైంది. భారతదేశంలో తయారైన మొట్టమొదటి టాకీ సిన్మా 'ఆలంఅరా'ను ప్రదర్శించిన ఘనత 'ఆర్యన్'దే! అంతేకాదు 'ఆర్యన్' చరిత్ర ఇంకా ఉంది. 1920లో లోకమాన్య బాలగంగాధర తిలక్ ఆ థియేటర్‌లో కూర్చుని బాబూరావు పెయింటర్ తీసిన 'సైరంధ్రి' చిత్రాన్ని చూశాడు. అటు తర్వాతకాలంలోని అభిమానుల ఆనందోత్సాహాలమధ్య థియేటర్ గోల్డెన్ జూబ్లీ, సిల్వర్ జూబ్లీ ఫంక్షన్లను కూడా జరుపుకుంది. మరో ప్రత్యేకత ఏమంటే థియే







టర్ యజమాన్యం శ్రమదమాదులకోర్చి చలన చిత్రరంగ ప్రముఖుల్ని తరచుగా నగరానికి ఆహ్వానించి అదే థియేటర్‌లో ఘన సన్మానాలు చేసేవారు. '50 ఏళ్ళ పురోభివృద్ధి' పేరుతో 'ఆర్యన్'పై ఓ డాక్యుమెంటరీ కూడా చిత్రీకరింపబడింది. ఆ డాక్యుమెంటరీని 'ఫెస్టివల్ ఆఫ్ ఇండియా'ను పురస్కరించుకొని 1981లో న్యూయార్కులో ప్రదర్శించారు కూడా!

ఇంతటి ఘన చరిత్ర ఉన్నా ఏం లాభం? యజమాని ఆనందరావు ఇంకా ఇతరత్రా ప్రముఖులు, ప్రజలూ ఎన్ని విజ్ఞప్తులు చేసినా పట్టించుకోక 'ట్రాఫిక్‌కి ఆటంకం' అంటూ పురపాలక సంస్థ అధికారులు దాన్ని నేలమట్టం చేయడాన్కి పూనుకొన్నారు. తన తండ్రి ప్రతిష్ఠాత్మకంగా కట్టించిన థియేటర్‌ను ఎవరో కూల్చివేయడం భరించలేక ఆ పని తానే చేసి అధికారులకి స్థలాన్ని అప్పగించాడు ఆనందరావు. ఈ లెక్కన ట్రాఫిక్‌కి అవరోధమని చెప్పి రేపు హైదరాబాద్‌లోని చార్మినార్‌ని కూడా కూలదోయించగల సమర్థులే అధికారులు... ఏం చేయగలం?

## క్రికెట్‌బ్యాట్ తమాషాలు

క్రికెట్‌బ్యాట్‌ను కేవలం బంతిని కొట్టడానికే గాక ఇంకా ఇతరత్రా అనేకరకాలుగా ఉపయోగించే ఘనులూ ఉన్నారు. గూండాలు, దాదాలు క్రికెట్‌బ్యాట్లు పుచ్చుకుని తలలు పగలకొట్టుకోవడం మన సిన్మాల్లో చూస్తూనేఉన్నాంగదా? క్రికెట్ బ్యాట్లతోనే తలపడే మొగుడూ పెళ్ళాలుంటారని కొందరు అనుభవజ్ఞులు చెబుతున్నారు. పెద్దాడు చంటాడ్ని కొట్టాలన్నా, రెండోవాడు పెద్దాడ్ని మోదాలన్నా మన పిల్లకాయలు కూడా తప్పనిసరిగా క్రికెట్‌బ్యాట్‌నే ఉపయోగిస్తున్నారని వినికిడి. ఏదేమైతేనేం ఆటసాధనం ఆయుధంగా కూడా ఉపయోగపడుతోంది.

క్రికెట్ బ్యాట్‌ని మరింత విచిత్రంగా వాడిన పెద్దమనుషులూ ఉన్నారు. ఇంగ్లాండ్‌లోని ఓ సైనికాధికారికి క్రికెట్ అంటే మహా సరదా. ఆయనగారు అర్జంటుగా ఏదో ఊరు వెళ్తున్నప్పుడు ఎవరికో కొంత డబ్బీయవల్సి వచ్చిందట. ఆ క్షణంలో అయ్యగారివద్ద నగదూలేదు, చెక్కుబుక్కూలేదు. వెంటనే తన దగ్గరున్న క్రికెట్ బ్యాట్‌మీదే ఇంత సొమ్ము కావాలని రాసి సంతకం చేసి "ఇదే చెక్కు అనుకోండి తీసుకెళ్ళి ఫలానా బాంకులో ఇచ్చి డబ్బు తెచ్చుకోండి" అని ఆ వ్యక్తికి ఇచ్చేశాడట. మొదట తెల్లబోయినా ఆ వ్యక్తి చేసేదిలేక ఆ బ్యాట్‌ని బాంక్‌కి తీసుకెళ్ళాడు. బాంకు అధికార్లు కూడా ఆఫీసర్‌గారి పరిస్థితి అర్థంచే



సుకొని ఆ బ్యాట్‌నే చెక్‌గా స్వీకరించి ఆ పార్టీకి డబ్బిచ్చి పంపారు. ఇప్పటికీ ఆ బాంక్‌లో ఆ 'బ్యాట్‌చెక్' అలాగే ఉందట.

1975లో పాకిస్తాన్‌నుంచి న్యూయార్క్‌మీదుగా మరో దేశానికి ఎగుమతి అయిన క్రికెట్ బ్యాట్లలో అధికారులకి ఓ బ్యాట్ అనుమానం కల్గించింది. సునిశిత పరిశీలనద్వారా ఆ బ్యాట్ బోలుగా ఉందని తేలింది. పగులకొట్టి చూస్తే లోపల 20,000 పౌండ్ల విలువచేసే నల్లమందు దొరికిందట. అంటే క్రికెట్‌బ్యాట్లు స్మగులింగ్‌కీ ఉపయోగిస్తునాయన్నమాట.

1921లో హెస్టింగ్స్‌లో జరుగుతున్న ఓ క్రికెట్‌మ్యాచ్‌లో ఆస్ట్రేలియన్ బ్యాట్స్‌మెన్ ఆర్మ్‌స్ట్రాంగ్, ఇంగ్లండ్ బౌలర్ ఆర్థర్ గిలిగాన్ ధాటికి



తట్టుకోలేక ఉక్రోషంతో బ్యాట్‌తో గిలిగాన్ చేతిమీద గట్టిగా కొట్టి, పొరపాటున తలిగిందని 'సారీ' చెప్పాడు. అయితే విషయం గ్రహించుకున్న గిలిగాన్ ఆ తర్వాత బంతితో ఆర్మ్‌స్ట్రాంగ్ టోపీని ఎగరకొట్టేసి దెబ్బకు దెబ్బ బదులు తీర్చుకున్నాడు. ఆర్మ్‌స్ట్రాంగ్ ముఖం బంతి దెబ్బకు వాచిపోయిందని వేరే చెప్పేపనేముంది?

కూపర్ అనే రచయితకి క్రికెట్ అంటే ప్రాణం. క్రికెట్ గురించి వందకుపైగా పుస్తకాలు రాసిన ఘనుడాయన. ఆయన తన బాత్‌రూమ్‌లోని అద్దందగ్గర ఓ క్రికెట్‌బ్యాట్ బొమ్మను అంటించుకొని అక్కడున్నంతసేపుకూడా దాన్నే చూస్తూ క్రికెట్ గురించి గుర్తుచేసుకునేవాడంటే అతనికి క్రికెట్‌పట్లగల అభిరుచి ఏపాటిదో మనం అర్థంచేసుకోవచ్చు. ఓరోజున అయన బాత్‌రూంలోని అద్దంముందు నిలబడి ఆ బ్యాట్‌వంకే తదేకంగా చూస్తున్నప్పుడు ఆ ఇంటి పనిపిల్ల, "అయ్యా... అదేంబొమ్మ? మీరు రోజూ అక్కడ నిలబడి దాన్నంత 'ఇది'గా చూస్తారెందుచేత?" అని అడిగింది. కూపర్ పరమానందభరితుడైపోయాడు. క్రికెట్ బ్యాట్ గురించి, ఆటగురించి ఆమెకు సుదీర్ఘ ఉపన్యాసమివ్వాలని అనుకొంటున్నంతలో ఆమే మళ్ళీ "చూడబోతే ఇదేదో చైనీస్ రేజర్‌లా ఉందే? దీన్ని మీరు ఉపయోగించడం ఏమిటి సార్ అసహ్యంగా?" అనేసింది పుటుక్కున. కూపర్ ఉత్సాహం కుప్పకూలిపోయింది. ఏం మాట్లాడాలో తెలియక పిచ్చిచూపులు చూశాడు. ఇక ఆయన మొహం ఎలా ఉంటుందో మీరే ఊహించుకోవాలి.

క్రికెట్ బ్యాట్ గురించే మరో గమ్మత్తయిన విషయం చెబుతుంటారు. ఓ ఇంగ్లీషాయనకి క్రికెట్ అంటే చచ్చేంత మోజు. ఆడినా ఆడకపోయినా ఆయన చేతిలో ఎప్పుడూ క్రికెట్ బ్యాట్ ఉండాల్సిందే! చివరికి పడగ్గదిలోకి కూడా దాన్ని ఆయన వెంటపెట్టుకుపోయేవాడు. మొగుడు ఛాదస్తంచూసి పెళ్ళాం నిత్యం దెబ్బలాడేది. ఓరోజున అతను ఇంటికి వచ్చేసరికి పక్కింటివాడితో తన పెళ్ళాం లేచిపోయిందనీ, అందుకు తన బ్యాటే కారణమనీ అతనికి తెల్సిపోయింది. అయినా అతనేం చింతించలేదు. పెళ్ళాం పోతే పోయింది, బ్యాట్ పట్టుకుపోలేదు అదే పదివేలు అని సంతసించాడట.




# ఏరిన ముత్యాలు

★ ఉత్సాహమివ్వని సుగుణం క్షేమంకాదు.

— సీలీ.

★ చాలామంది సద్గుణాలను పొగుడుతారు కానీ పాటించరు.

— మిల్టన్

★ సమయాన్ని అతిగా దుర్వినియోగపరిచేవారే సమయం లేదంటూ పితూరీలు చేస్తుంటారు.

— బ్రూయర్

★ గడిచిపోయిన వెయ్యి సంవత్సరాలకంటే, రానున్న వెయ్యి సంవత్సరాలకంటే ఇప్పుడు నీ చేతిలో ఉన్న సమయమే విలువైనది.

— మౌలానా

★ కాలంకంటే విలువైనదేదీ లేదు. అంతకంటే విచ్చలవిడిగా ఖర్చు చెయ్యబడేది లేదు.

— ఆంగ్ల సామెత

★ విలువైనకాలాన్ని ఏపనీ లేకుండా, కేవలం షికార్లు కొట్టడంలో వ్యర్థపరిచే మూర్ఖుణ్ణి నేను మనస్ఫూర్తిగా ద్వేషిస్తాను.

— ఎర్ల్‌ఆఫ్ ఛెస్టర్‌ఫీల్డ్

★ అడగకముందే సలహా ఇవ్వకు.

— జర్మన్ లోకోక్తి

★ పెళ్లిచేసుకొమ్మనిగాని, యుద్ధానికి వెళ్లమనిగాని సలహా ఇవ్వకు.

— స్పెయిన్ లోకోక్తి

★ నీకు నిన్నుమించిన సలహాదారు లెవ్వరూలేరు.

— అజ్ఞాత్

★ సలహా ఎవరికి ముఖ్యమో సరిగ్గా వారికే అది రుచించదు.

— జాన్సన్

★ దేవుడు సత్యమని చెప్పేకంటే సత్యమే దేవుడని చెప్పటం సరియైనది.

— గాంధీజీ

★ నిజం చెప్పే సమయంలో ఇద్దరు వ్యక్తుల అవసరం ఉంటుంది. ఒకరు నిజం చెప్పేవాడు, రెండవవాడు అది విని నమ్మేవాడు.

★ నీవు చెప్పేది నిజమే అయితే దాన్ని గుర్తుపెట్టుకోవలసిన ఇబ్బంది నీకుండదు.

— మార్క్‌ట్వేన్

★ సుగుణం, సంపద ఒకేచోట ఉండటం కష్టం. తాగటానికి వీలులేని చెరువులోనే కావలసినంత నీరు.

— శూద్రమహాకవి

★ నెలరోజుల గ్రంథపఠనంకంటె తెలివైనవ్యక్తితో గంట సంభాషణ మేలు.

— చైనా సూక్తి

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

# చతుర

సంచిక: 9
సంపుటి: 15
అక్టోబర్: 1992



"శ్రీరాముడికి బాధలు మొదలయింది అడవికెళ్ళినప్పటినుండీ కాదండోయ్. ఎందుకంటే మాంచి వయసులో వున్న ఆయన జంగిల్‌లో కూడా జాలీగానే గడిపివుండాలి. కానీ... సరిగ్గా... సీతమ్మ బంగారు లేడిని తెమ్మన్నప్పుడే ప్రారంభమయింది ఆయనకి నిజమైన కష్టకాలం..." అంటూ ఆ పెద్దమనిషి మరి నలుగురు పెద్దమనుషులకు చెప్పడం మొదలెట్టిన కథ చిలవలు పలవలై మలుపులు తిరిగి శ్రోతలను ఎంతగానో ఆశ్చర్యపరిచింది.

**హాస్యాన్నందిస్తూనే ఆలోచింపచేసే కాశీవిశ్వనాథ్ నవల 'బంగారులేడి' ఈనెల 'చతుర' సమర్పణ.**

రాజా సీతారామదాసుగారు యీమధ్యనే రిటైర్ అయిపోయేరు!

రిటైర్ అవడమంటే ఆయనేదో వుద్యోగంచేసి రిటైర్ అయిపోలేదు. ఆయనో పారిశ్రామికవేత్త! యజమానిగా తన కంపెనీని అద్భుతంగా నిర్వహించిన తర్వాత, యాభైఎనిమిదేళ్ళు పూర్తవగానే, రిటైర్మెంటనేది వుద్యోగస్తులకే ఎందుకుండాలి? యజమానులకెందుకుండగూడదు? ఓ వయసు రాగానే వుద్యోగస్తుల శరీరం, మెదడు సక్రమంగా, సమర్థవంతంగా పనిచెయ్యవనేకదా వాళ్ళకి రిటైర్మెంటు యిచ్చింది. అలాంటప్పుడు అదే వయసున్న యజమానులు మాత్రం బాధ్యతలనించి ఎందుకు రిటైర్ కాకూడదని, వేరెవరో ప్రశ్నించే అవకాశం యివ్వకుండా, తనకు తనే ప్రశ్నించుకున్నాడు.

తన కంపెనీ బాధ్యతల్ని అల్లుళ్ళకప్పగించి, యిప్పుడు యింట్లో కూర్చున్నాడు.

మరి, ఖాళీగా కూర్చున్న వాడికి కాలక్షేపం జరగాలి కదా! అందుకే తను చెప్పే కబుర్లు విని, 'ఆహా ఓహో' అంటూ తాళం వేయడానికో ఆరుగురు మనుషుల్ని సమకూర్చుకున్నాడు.

ప్రతిరోజు, వుదయం, సాయంత్రం తన గతానుభవాల్ని వాళ్ళకి వివరించి, వాళ్ళని చిత్రవిచిత్రమైన ప్రశ్నలు వేసి, చమత్కారమైన జవాబులు రాబట్టి, సంతోషించడాన్ని తన శేషజీవితానికి మిగిలిన ఒకే ఒక కార్యక్రమంగా పెట్టుకున్నాడు.

ఆయనకి దొరికిన శ్రోతలు కూడా ఆయనలా రిటైరయిపోయిన వాళ్ళే కాబట్టి వాళ్ళకీ మంచి కాలక్షేపం అయిపోతోంది. వాళ్ళు వుదయం ఎనిమిదో గంటకల్లా వచ్చి వాలడానిక్కారణం అక్కడ వుదయంపూట పెట్టే రుచికరమైన టిఫిన్లు, మధ్యాహ్నం పెట్టే విందుభోజనాల్లాంటి భోజనాలు, రాత్రిపూట అందించే విదేశీ విస్కీలు!

రిటైరయిపోయింతర్వాత అంత సుఖవంతమైన జీవితాన్ని అనుభవించడం మా అదృష్టమే అనుకుంటూ, ఆ మాజీ వుద్యోగస్తులంతా ఆయన నందిని చూపించి పంది అన్నాసౌనేనంటూ తాళం కొట్టేస్తున్నారు.

రాజా సీతారామదాసు అడిగే ప్రశ్నల తీరేవేరు! ఏదో ఓ సాధారణమైన ప్రశ్న అడుగుతారు. జవాబు మాత్రం చమత్కారంగా వుండాలని నియమం పెడతారు.

"మీకు జవాబు తెల్సికూడా చెప్పలేకపోయేరో మీకివాళ ఇండియన్ సరుకే తప్ప ఫారిన్ విస్కీ వుండదు" అని షరతు పెడతారు. ఆయన్ని సంతృప్తి పరచినవాళ్ళు స్కాచ్‌కి నోచుకుంటారు. లేనివాళ్ళకి ఎలాగూ ఇండియన్ సరుకు తప్పదు. వెనకటికి చందమామ పత్రికలో సింద్‌బాద్ కథలంటూ సముద్రంమీద ప్రయాణం చేసి వ్యాపారం చేసొచ్చిన ఓ వ్యాపారస్థుడి అనుభవాల్ని కథలుగా వేసేవారు. ఆయన తన అద్భుతమైన అనుభవాల్ని చెప్పేవాడు. వినేవాళ్ళు, ఆహా ఓహో అనేవాళ్ళు. ఆయన చెప్పినవి నిజమో, అబద్ధాలో, మొత్తంమీద ఆయన చెప్పిందానికి తాళం వేసినవాళ్ళకి సకల మర్యాదలూ జరిగేవి. ఈ సీతారామదాసు తంతూ అంతే అనుకుంటూనే శ్రోతలు తాళం వేయనారంభించారు.

ఆరోజు ఆయన అడిగిన ప్రశ్న ఏవిటంటే "రామాయణం మీ అందరకీ తెల్సిందేగదా. శ్రీరాముడికి నిజమైన కష్టాలు ఎప్పుడు ఆరంభమయ్యాయో చెప్పండి చూద్దాం"

ఇదీ ఒక ప్రశ్నేనా అని అనుకుంటూ ఓ రిటైర్డ్ ఎకౌంట్స్ ఆఫీసరు జవాబు చెప్పాడు, "శ్రీరాముణ్ణి కైక అడవులకి వెళ్ళమన్నప్పట్నించీ కష్టాలు ఆరంభమయ్యేయి". ఆ మాట విని సీతారామదాసు వెకిలిగా నవ్వేడు. "యింత సులభంగా మీరు జవాబు చెప్పే ప్రశ్నయితే నేనెందుకడుగుతానండి? నేను రీసెర్చి చేసిన ప్రకారం, రాముడికి కష్టాలు ఆరంభమైంది అడవులకి వెళ్ళినప్పట్నించీ కాదు. అప్పటికి రాముడు మాంచి వయసులో వున్నాడు కాబట్టి, సంసారం చెయ్యడానికి అంతఃపురం అయితేనేవిటి, అడవి అయితేనేవిటని అంత జంగిల్‌లో కూడా సీతాదేవితో జాలీగానే గడిపేసాడు. అయితే ఆయనకి అసలైన ట్రబుల్స్ ఎప్పుడు స్టార్టయ్యేయీ అంటే, అదిగో అదే చెప్తున్నాను. జాగ్రత్తగా వినండి. సీతాదేవి బంగారు లేడిని చూసినప్పుడు, చూసి వూరుకోకుండా ఆ బంగారులేడిని తనకి




తెచ్చివ్వమని కోరినప్పుడు, అడవిలో బంగారు లేడి ఎలా వచ్చింది? ఎందుకొచ్చిందీ అనే ఆలోచన రాముడికి రానప్పుడు, కేవలం భార్య ముచ్చట తీర్చడానికి వెనకా ముందు ఆలోచించకుండా ఆ లేడిని పట్టుకోడానికి పరుగులు తీశాడే, అప్పుడు... అప్పుడు స్టార్టయ్యాయి కష్టాలు'' అంటూ సీతారామదాసు పగలబడి నవ్వాడు.

రాముడి కష్టాల గురించి చెప్తూ అతనెందుకలా నవ్వుతున్నాడో అర్థంకాకపోయినా, తినబోయే మొఘల్ బిర్యానీ, తెప్పించిన బీరు గుర్తుచేస్కొని మిగతావాళ్ళూ నవ్వేరు.

అయితే ఆడిటింగు డిపార్టుమెంట్లో సూపర్నెంటుగా పనిచేసిన 'అప్పారావు మాత్రం సగం వరకు నవ్వి, మిగతా సగం నవ్వకుండా అడిగాడు

''మీరు ఎప్పుడు ఏ పురాణంలోని పిట్టకథ గురించి చెప్పినా, వర్తమానకాలానికి దాన్ని అన్వయించి ఫలానావాడు ఫలానా దుష్యంతుడిలాంటి వాడేనని పోలిక తెస్తుంటారు. కానీ, యిప్పుడు మీరు చెప్పిన రాముళ్ళేరి? సీత లేరి? బంగారు లేళ్ళు ఎక్కడివి?''

రాజాసీతారామదాసు వెండి తీగెల గుత్తిలాంటి తన తెల్లని గెడ్డాన్ని నిమురుకుంటూ చిన్మయానందస్వామిలా చిరునవ్వు నవ్వుతూ-
''ఎందుకు లేరు అప్పారావుగారూ? రాముడంతటి పురాణపురుషులు లేకపోయినా, వివేకం లేకుండా కంటికి కనబడ్డ బంగారు లేడిని చేజిక్కించుకోవాలనే రాముళ్ళూ వున్నారు. ఆ రాముళ్ళని వుసిగొల్పే సీతలూ వున్నారు. అంతెందుకు... రాంబాబు, అమలల కాపురాన్నే తీస్కోండి'' అంటూ రాంబాబు దంపతుల కథని చెప్పనారంభించాడు.

★ ★ ★

రాంబాబు రాజాగారి కొడుకు కాదు.

అతనికి విశాఖపట్నం బీచ్ రోడ్లో పన్నెండు బెడ్‌రూములున్న బంగళాలేదు.

ఓ టయోట కారు లేదు.

ప్రతిఏటా ఓ రెండు కోట్లు ఆదాయం వచ్చే వ్యాపారాల్లేవు.

కనీసం నెలకో వెయ్యి రూపాయిలొచ్చే వుద్యోగం కూడా లేదు.

మరేం వున్నాయట? చేతిలో ఓ బీకామ్ డిగ్రీ వుంది. అది కూడా సినిమాల్లో హీరోలకుండే యూనివర్సిటీ ఫస్టు రేంకు డిగ్రీకాదు. సాదా సీదా, సెకెండ్ క్లాసులో పాసయ్యేడని నిరూపించే ఓ డిగ్రీ!

డిగ్రీ చదువుకుంటే వుద్యోగాలు నీ ఎడ్రస్ వెదుక్కుంటూ, నీ కాళ్ళదగ్గరకే వస్తాయని చిన్నతనంలో ఎవరో పెద్దాయన చెప్తే నిజమే కాబోలుననుకుని డిగ్రీకోర్సు పూర్తిచేశాడు. తీరా చదివేక తెలిసింది, వుద్యోగాలు మనకాళ్ళదగ్గరకి కాదుగదా, లంచాలు, రికమెండేషన్లూ లేకపోతే, వాటి కాళ్ళదగ్గరకి మనం వెళ్ళినా అవి మనల్ని తన్ని తోసేస్తాయని!

రాంబాబు ఎన్నో ఇంటర్వ్యూలకెళ్ళాడు. కొన్నిసార్లు, నేను తప్పకుండా సెలక్టయిపోతానూ అనుకున్నాడు, కానీ అవలేదు. కొన్నిసార్లు నేను చచ్చినా సెలక్టవను అనుకున్నాడు. అతని మాటే నిజమైంది. అయినా, అతను భయపడలేదు. ఎప్పుడూ వేస్తున్నట్టే విజిల్ వెయ్యడం మానలేదు. నిన్నటి గురించి నిరాశ, రేపటి గురించి ఆశ లేకుండా దిల్‌కుష్ రాజాలా గడిపేస్తున్నాడు.

అయితే, అతన్ని బాధపెట్టే విషయాలేవీ లేవా అంటే ఎందుకులేవు? ఎప్పుడూ కారుల్లో తిరిగే మనిషికి ఒక్కరోజు కారు రిపేరొచ్చి ఆటోరిక్షాలో వెళ్ళాలనుకున్నప్పుడు అతనూ బాధపడతాడు. ప్రతిక్షణం ఎయిర్ కండీషన్డ్ రూముల్లో బ్రతికే మనిషి ఒక్క పావుగంట కరెంటు పోయి, వుక్కపోస్తే ''అబ్బా నాఅంత కష్టాలు అనుభవించే వాడెవడూ యీ లోకంలో వుండడ''నుకునే, యీ కాలంలో వుద్యోగం, సద్యోగం లేని రాంబాబుకే కష్టాలుండవా? వుంటాయి! అయితే అతనికొస్తున్న కష్టాలు నిరుద్యోగంవల్ల కాదు. వెంకటాచలపతివల్ల వస్తున్నాయి.

ఈ వెంకటాచలపతి మరొకరు మరొకరు అయితే అతనివల్ల వచ్చే కష్టాల్ని రాంబాబు ఏనాడో కాదనేవాడు, కాలదన్నేవాడు! కానీ, అతను మరెవరో కాదు, సాక్షత్తు రాంబాబు తండ్రే! అతని వయసు యాభైఅయిదు అయినా, మనసు మాత్రం యిరవై అయిదులోనే వుండిపోయింది.

భార్య పోయిందగ్గర్నించి, నేను "పెళ్లైన బ్రహ్మచారిని" అంటూ చెప్పుకు తిరిగే చలప తికి గుమ్మడికాయ కూరన్నా, శాస్త్రీయ సంగీత మన్నా, వుద్యోగం చెయ్యడమన్నా పరమ అస హ్యం! రాంబాబు తల్లి, అంటే చలపతి భార్య బ్రతికున్నరోజుల్లో ఓ డొక్కు సినిమాహాల్లో బు క్కింగ్ క్లర్కుగా ఏం పనిచేశాడో. అంతే! ఆ తర్వాత మరి పని చెయ్యనని మొండికెత్తేశా డు. ఎందుకు పనిచెయ్యవూ అని అడిగితే, నాకు పని గండం వుందట, నేను యిక మీదట పనిచేస్తే గుండాగి చచ్చిపోతానట. కావాలంటే అడగండంటూ రూపాయి పావలా లంచం యిచ్చి ఓ గుంట్రాయిలాంటి కొండదొరని తీసు కొచ్చి అందరిముందూ చెప్పించాడు. ఆ మాట ల్ని రాంబాబు నమ్మకపోయినా, 'మొండివాడు మహారాజుకంటే గొప్పవాడ'న్న సామెతని నమ్మడంచేత తండ్రివిషయాన్ని వదిలేశాడు. కానీ, ఆ తండ్రిమాత్రం కొడుకుని వదల్లేదు.

ఓరోజు వుదయాన్నే రాంబాబు యింటికి దగ్గర్లోనే వున్న ఓ కిరాణా షాపుకి రాంబాబుని పిలవమంటూ పోలీస్ స్టేషన్నించి ఫోన్ వచ్చింది.

ఆ ఫోన్ సందేశం ఏమిటంటే నిన్నరాత్రి పోలీసులు చేసిన రైడ్‌లో చలపతి ఓ బ్రోతల్ హౌస్‌లో దొరికిపోయేడని! మనం మనం మాట్లాడుకోవలసిన పద్ధతిలో మాట్లాడుకోక పోతే కొత్తగా వచ్చిన మెజిస్ట్రేటు యిలా బ్రోతల్ కేసుల్లో దొరికిన వాళ్ళని జైలుకి పంపించేస్తు న్నాడు. అటుపైన మీ యిష్టమంటూ హెడ్ కానిస్టేబుల్ చెప్పేడు.

ఆ వార్త వింటూనే చేతిలో వున్న ఫోన్‌తో నెత్తి బాదుకున్నాడు రాంబాబు.

"ఏం జరిగింద"ని అడిగాడు షాపు ప్రొప్ర యిటరు. ఏం చెప్పాలో తెలియక "ఏం లేదండీ, దసరా మామూళ్ళకోసం పోలీసులు ఫోన్లు చేసి మరీ ప్రాణాలుతోడేస్తున్నారు" అనేసి అక్కడనించి వెళ్ళిపోయేడు రాంబాబు.

ఆ మాటని ప్రొప్రయిటరు కాదుగదా, తుడ వడానికొచ్చిన స్వీపరు సన్యాసమ్మ కూడా నమ్మలేదు, ఎందుకంటే దసరా యింకా బారె డు దూరం వుంది. వున్నా లేకపోయినా వుద్యోగం సద్యోగం లేకుండా తిరిగే రాంబాబు నెందుకు దసరా మామూళ్ళు అడుగుతారు?

రాంబాబు ఓ ఫ్రెండు దగ్గర మూడువంద లు అప్పుచేసి టూటౌన్ స్టేషన్‌కెళ్ళాడు.

చేసిన తప్పుకి సిగ్గుపడిపోతూ, తనని చూడ గానే ముఖం చాటేస్తాడనుకున్న తండ్రి, అలా చెయ్యకుండా ఏదో సినిమా పాట పాడుకుంటూ సంతోషంగానే కనిపించాడు.

"యింత వయసొచ్చినా అలాంటి వెధవ పనులు చెయ్యడానికి సిగ్గులేదటయ్యా?" అంటూ ముసలి యస్సైగారు అతన్ని మంద లిస్తున్నాడు.

రాంబాబు తండ్రివేపోమారు కోపంగా చూసి, యస్సై దగ్గరకెళ్ళి నమస్కారంచేసి "మీతో ప్రైవేటుగా మాట్లాడాలి సార్" అన్నాడు మెల్లగా.

"మీనాన్న గురించే కదా. ఆ విషయం నాతో కాదు, మా హెడ్డు గురుమూర్తితో మాట్లాడు" అంటూ హెడ్ కానిస్టేబుల్ని చూపించాడు.

అతన్తో రాంబాబు మాట్లాడాడు. కాదు కాదు, అతను మాట్లాడుతుంటే కేవలం విన్నాడంతే!

ఆ హెడ్డుగారికి పశువుల్నించి పాలు పిండడం వచ్చోరాదో తెలీదుగాని, పులిలాంటి మనిషినించైనా డబ్బు అనే పాలు పిండె య్యడం వచ్చు. "ఇప్పుడుగాని నువ్వు మీ బాబుని విడిపించుకు తీసుకెళ్ళకపోతే, అత గాణ్ణి మా యస్సై ఏ రాజీవ్‌గాంధీ హత్యా కేసులోనో యిరికించేసి వురిశిక్ష వేయించేస్తా డనే లెవెల్లో రాంబాబుని బెదరగొట్టి, అయిదు వందలకి తక్కువిస్తే, మీ నాన్నమీద ఆశలు వదిలేస్కుని అతగాడి ఫోటోకి దండవేసే స్కోండి అని మరో బాంబు పేల్చాడు.

రాంబాబు, తన దగ్గర అంతకంటే ఎక్కువ లేవని చెప్పి మూడువందలు అతని జేబులో కుక్కేసాడు. అయినా గురునాథం యింకా గునుస్తూనే "సరే... నేనింకా కాఫీ తాగలేదు ఓ పదో పదిహేనో వుంటే పడెయ్" అన్నాడు. తన జేబులో మిగిలిన రెండు రూపాయిల పావలా తీసి అతని చేతిలో పెట్టి ఓ దండంపెట్టేశాడు రాంబాబు. చలపతిని వదిలేశారు. అతను వెళ్తూ వెళ్తూ యస్సై దగ్గర ఆగి "తమరు యిందాక ఏమని సెలవిచ్చేరు సార్? ఈ వయసులో యీ దిక్కుమాలిన పనులేమిటనా? మీది గూడా దాదాపు నావయసే! ఈ వయ

సులో మీరు లంచాలు తీస్కుని నేరస్థుల్ని ఒదిలెయ్యగా లేంది నేను వ్యభిచారంచేస్తే తప్పా? నాది తప్పయినప్పుడు మీది మాత్రం తప్పు కాదా?'' అంటూ వాదించాడు.

పోలీసులందరికీ క్షమాపణ చెప్పి, తండ్రిని బలవంతాన లాక్కుంటూ బయటకెళ్ళాడు రాంబాబు.

బయటకొచ్చేక చలపతి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ ''ఎండ ఎక్కువగా వుందిరా, ఆటోరిక్షాని పిలువ్'' అన్నాడు. రాంబాబుకి ఒళ్ళు మండినా తమాయించుకుంటూ ''నా దగ్గర వున్నదంతా పోలీసులు వూడ్చేసారు, నా దగ్గర యింకేం లేవు'' అన్నాడు. ''జేబులో ఏం లేకపోయినా ఏ పరుపుకిందో అయిదో పదో దాచే వుంటావు. వెనకటికి, మీ అమ్మా అంతేరా, ఎప్పుడు డబ్బులు అడిగినా లేవుకాక లేవు అనేది. నాలుగు తన్నేక ఏ పరుపు కిందనించో, ఏ పోపులడబ్బాలోనించో చిల్లర తీసేది''

రాంబాబుకి అక్కడ వుండడమే అసహ్యమనిపించి మామూలు రిక్షాని పిలిచాడు. రిక్షాలో వెళ్తూ, రిక్షావాడికి వినిపించకుండా రాంబాబు గొణిగాడు ''యీ వయసులో యిలాంటి పనులు చెయ్యడమేమైనా బాగుందా?''

''ఏభై ఎనిమిదేళ్ళు వచ్చేవరకు వుద్యోగం చెయ్యొచ్చని గవర్నమెంట్ నిర్ణయించినప్పుడు, ఏభై అయిదేళ్ళవాణ్ణి నేను యిలాంటి పనులు చెయ్యడానికి రూల్సేం అడ్డుపడవు'' బీడీ కాలుస్తూ చలపతి చాలా కులాసాగా జవాబు చెప్పేడు. అయినా రాంబాబు గొణుగుతూనే వున్నాడు. చలపతికి చిర్రెత్తుకొచ్చి, రిక్షా ఆపించి, అందులోనించి కిందకి గెంతేసి, తారాస్థాయిలో అరవడం ఆరంభించేడు.

''నేను నీతో రానురా. చచ్చినా రాను. నువ్వు వెళ్ళిపో! అక్కడికి నేనేదో తప్పుచేసినట్టు, నాకోసం నువ్వేదో త్యాగంచేసినట్టు! అలా సినిమా డైలాగులు మాట్లాడతావేంటి? భీష్ముడు తన తండ్రికి పెళ్ళి చెయ్యడంకోసం తను పెళ్ళి చేస్కోకుండా బ్రహ్మచారిగా వుండిపోయేడు. నువ్వా భీష్ముడికంటే గొప్పోడివా?'' అంటూ గెంతులేస్తూ మాట్లాడుతుంటే దారిన పోతున్న జనం ఆగి చిత్రంగా చూడసాగారు.

రాంబాబు తండ్రిని యింటికి రమ్మని ప్రాధేయపడ్డం, అతను రానని గెంతులేస్తూ అరవడం చూసిన ఒకాయన ''భలే చిత్రమైన తండ్రిరా'' అంటూ కాండ్రించి నేలమీద వుమ్మేడు. చలపతి గభీమని వెళ్ళి అతని చొక్కాపట్టుకున్నాడు.

''ఏరా బక్కనాకొడకా, నేను చిత్రమైన తండ్రినా? కొడుకుని పిల్చి, మీ అమ్మమీద నాకు డౌట్‌గా వుందిరా అని చెప్పి పరశురాముడిచేత తన పెళ్ళాం రేణుక తల నరికించిన జమదగ్ని చిత్రమైనవాడు కాదా? అలాంటి కసాయి పని నేనేమైనా చేయించానా? ఎప్పుడో తన సెకెండ్ వైఫ్ కైకేయికిచ్చిన మాట నిల్పుకోడానికి దశరథుడు, తన పెద్ద కొడుకు శ్రీరాముణ్ణి ఫామిలీతోసహా ఫారెస్టులకి పంపించేశాడు. నేను అంతకంటే కర్కోటకుణ్ణా? పురాణాలు వదిలేయ్‌రా... కొడుక్కి పెళ్ళి సంబంధం చూడ్డానికెళ్ళి, చిత్రాంగిని చూసి చిత్తైపోయి, కోడలు కావల్సిందాన్ని పెళ్ళాంగా చేసుకున్న రాజరాజనరేంద్రుడికంటే చెడ్డవాణ్ణా?'' అంటూ అరుస్తున్న చలపతిని అతికష్టంమీద యింటికి తీసుకొచ్చాడు.

రాంబాబు జీవితంలో, అందమైన గ్రంథంలో దొర్లిన చిన్న చిన్న అచ్చుతప్పుల్లాంటి యీ టైపు యిబ్బందులున్నా అతనెప్పుడూ వుక్కిరిబిక్కిరి కాలేదు. వుపద్రవాల్ని తట్టుకుంటూ వుల్లాసంగానేవున్నాడు.



**రాం**బాబుకి ఓ రెడీమేడ్ క్లాత్ స్టోర్స్ ప్రొప్రయిటరు వెంకట్రావుతో కాస్తో కూస్తో పరిచయం వుంది. ఒకరోజు వెంకట్రావు రాంబాబుని పిల్చి ''మా షాపులో ఓ సేల్స్‌మేన్ పోస్టు ఖాళీ




అయింది. అది నీకు తగిన వుద్యోగం కాకపోయినా, నువ్వు ఖాళీగా వున్నావని అడుగుతున్నాను. ఆ వుద్యోగం నువ్వు చేస్తావా?'' అని అడిగాడు. అప్పటికి రాంబాబు మరో చోట బట్టలు వేలంపాడే మరో చిన్న వుద్యోగం చేస్తుండడంవల్ల ఆ వుద్యోగాన్ని తన తండ్రికి ప్పించేడు. ఆ వుద్యోగంలో జాయినైన మొదటి వారమంతా బోనులో బంధించిన అడవి సింహంలా చలపతి యింటా బయటా గర్జిస్తూనే వున్నాడు. వారం తర్వాత ఎందుకో సడన్‌గా తిట్టడం మానేశాడు. పైగా తనకీ వుద్యోగం యిప్పించినందుకు కొడుక్కి థాంక్సు చెప్పేడు. తండ్రికి పెళ్ళిచేసి, తను బ్రహ్మచర్యం వహించిన భీష్ముడికంటే నువ్వు బెటర్రా అంటూ రాంబాబుని పొగిడాడు. రాంబాబుకి తండ్రిలో వచ్చిన మార్పు మొదట నమ్మబుద్ధికాలేదు. అయితే, బందిపోటుగా బతికిన వ్యక్తి వాల్మీకి వంటి మహర్షిగా మారగా లేంది, బాధ్యతలు లేకుండా తిరిగిన తన తండ్రిలో యీ మార్పురావడంలో ఆశ్చర్యమేం వుందీ అని తనకి తనే జవాబు చెప్పుకున్నాడు. అదేగాకుండా చలపతిలో మరో మార్పు కూడా వచ్చింది. ఏనాడూ దేవాలయానికెళ్ళి పైసా దక్షిణవేసి, దేవుడికి దండం కూడా పెట్టని తండ్రి గత కొన్నిరోజులుగా ప్రతీ శుక్రవారం రాత్రి రెండు కొబ్బరిచిప్పల్ని యింటికి తీసుకొచ్చి వెంకటేశ్వరుడికి తను పూజచేసి కొబ్బరికాయ కొట్టేనని చెప్పనారంభించాడు. అతన్లో భక్తితత్వం మొదలైందనుకుందామన్నా వెంకటేశ్వరుడికైతే శనివారం కొబ్బరికాయ కొట్టాలిగాని, శుక్రవారం రాత్రి ఎందుకు కొడతారూ అని రాంబాబుకి, అతని చెల్లెలు రేఖకి కూడా సందేహం వచ్చింది. అయితే దాన్ని చలపతి చాలా సులభంగానే తొలగిస్తూ ''శనివారం అనేది వెంకటేశ్వరుడికి ప్రీతికరమైన దినమే కావచ్చు, కానీ ఆరోజు చాలామంది కొబ్బరికాయ కొడతారు. అప్పుడు మనమూ కొడితే గుంపులో గోవిందా అయిపోయి, మనం కొబ్బరికాయే కొట్టేమో, వుత్త అరటిపండే పెట్టేమో దేవుడికి తెలిసే అవకాశం వుండదు. అదే, మనం శుక్రవారం రాత్రే కొట్టేస్తే దేవుడు ఫ్రెష్‌గా వుండి, మనం కొబ్బరికాయ కొట్టిన విషయాన్ని క్లియర్‌గా చూస్తాడు'' అన్నాడు.

ఔనుకాబోలు అనుకున్నారు పిల్లలు. చలపతి వుద్యోగంలో జాయనై నెల అవస్తోంది కాబట్టి అతని నెలసరి సంపాదన యింటికి చేరుతుందని రాంబాబు అనుకుంటున్న తరుణంలో ఓ వార్త తెలిసింది. అదేవిటంటే, ప్రతి శుక్రవారం చలపతి దేవుడి గుడికి వెళ్ళడంలేదు. కొబ్బరికాయా కొట్టడంలేదు. క్లాత్ షాపు ప్రొప్రయిటరు ప్రతీ శుక్రవారం లక్ష్మీదేవికి పూజచేయించి, షాపుకి దిష్టితీసిన కొబ్బరికాయని వీధిలో కొట్టడం ఓ అలవాటు. అలా కొట్టిన కొబ్బరికాయని ముష్టివాళ్ళు, కుర్రాళ్ళు ఎత్తుకుపోకుండా, వాళ్ళతో గొడవపడి, ఆ కొబ్బరి చిప్పల్ని చలపతి యింటికి తెస్తున్నాడు. మానాన్నకింకా కక్కుర్తి బుద్ధి పోలేదని బాధపడ్డాడు రాంబాబు.

ఆ బాధని మరింత పెంచుతూ మరో వార్త, క్లాత్ షాపు ప్రొప్రయిటరు చలపతిని పోలీసులకి అప్పగించేడని తెలిసి రాంబాబు ఆ షాపుదగ్గరకి పరుగెత్తాడు.

ఇద్దరు కానిస్టేబుల్సు చలపతిని చెరో రెక్క పట్టుకుని నిలబడ్డారు. బహుశా అప్పటికే అతన్ని కొట్టినట్టున్నారు. తెల్లగా వుండే అతని చెంపలు ఎర్రగా కందిపోయివున్నాయి. ''రాంబాబు, నువ్వేదో అడిగావు కదాని మీనాన్నని పనిలో పెట్టుకున్నాను. కానీ, మీ నాన్న వుత్త దొంగ. రోజుకో జత బట్టలు తీసి, చొక్కా వెనక దాచేసి, బయట సగం రేటుకి అమ్మేస్తున్నాడు. షాపు కట్టేసింతర్వాత మీ నాన్న రోజూ బార్‌లో కెళ్ళడం చూసి, నాకు అనుమానం వచ్చి నిఘావేశాను. ఇవాళ దొరికిపోయేడు'' అన్నాడు షాపు ప్రొప్రయిటరు.

రాంబాబుకేంచెయ్యాలో పాలుపోలేదు. అతన్ని పక్కకి తీసుకెళ్ళి ''మానాన్న తరపున నేను క్షమాపణ చెప్తున్నాను, దయచేసి అతన్ని పోలీసులకప్పగించకండి. మీకొచ్చే నష్టాన్ని ఒక్కసారిగా కాకపోయినా, రెండు మూడు వాయిదాల్లో తీర్చేస్తాను'' అంటూ ప్రాధేయపడ్డాడు. అతనూ ఒప్పుకుని కంప్లయింట్‌ని వుపసంహరించుకున్నాడు.

ఇంటికొచ్చేక, రాంబాబు అతన్ని మందలించబోతుంటే, చలపతి అతనికి అవకాశమివ్వకుండా తనే ఎదురువాదించాడు ''నాకు పనిగండం వుందిరాబాబూ అని నెత్తీ నోరూ

కొట్టుకు చెప్పినా వినకుండా నన్న వుద్యోగంలో పెట్టేవు. ఇప్పుడేమైందో చూడు, ధర్మరాజు లాంటి నాచేత ఆ శనీశ్వరుడు దొంగతనం చేయించాడు. యిప్పుడింత అల్లరైపోయింది. ఇది నాకెంత అవమానం చెప్పు! నీకోసం నేనింక అవమానాలు భరించలేను. యింకెప్పుడూ నన్ను పనిలోకెళ్ళమని చెప్పకు''

అతనలా చెప్తుంటే రాంబాబుకి ఎలుకతోలు ఎన్నాళ్ళు వుతికినా నలుపునలుపేగాని తెలుపు రాదనే పద్యం గుర్తొచ్చి మరేం మాట్లాడకుండా మౌనం వహించాడు.

★ ★ ★

రాంబాబు తండ్రి గురించి ఇలా ఉంటే ఇహ రాంబాబు చేసిన వుద్యోగ ప్రయత్నాల గురించి చూద్దాం.





రాంబాబు చాలా ఇంటర్వ్యూలకి వెళ్ళి, వచ్చి, అలా ప్రయత్నాలకి షష్ఠిపూర్తి జరిగిపో యింతర్వాత, యింక వుద్యోగాల గురించి వేటాడి ప్రయోజనం లేదని, సూరిబాబనే ఓ బట్టల షావుకారు దగ్గరకి వెళ్ళి అమ్మకానికో బట్టలమూట తీసుకున్నాడు. సాధారణంగా అలాంటి బట్టల మూటల్ని భుజాన వేసుకునో, సైకిల్ మీద పెట్టుకునో వీధులంట తిరుగుతూ అమ్మడం రివాజు.

''చదువుకున్నోడివి, నువ్వు ఆ పనేం చెయ్యగలవు రాంబాబూ'' అంటూనే సూరిబాబు బట్టలమూట ఇచ్చేడు.

''నేను ఎవరి దగ్గరికీ వెళ్ళకుండా నలుగుర్నీ నా దగ్గరకే పిలిచి బట్టలు అమ్ముతాను, చూస్తుండండి'' అన్నాడు రాంబాబు నవ్వుతూ.

ఆరోజే జగదాంబ జంక్షన్లో, ఓ ఫుట్‌పాత్‌మీద బట్టలమూట పెట్టి, వాటిని వేలంపాట రూపంలో అమ్మనారంభించాడు. దారంటపోయే అలగాజనం, మధ్యతరగతివాళ్ళు అతని మాటల చమత్కారానికి ముగ్ధులై నిలబడి, బట్టల్ని వేలంపాడ్డం ఆరంభించారు. కానీ ఆ వ్యాపారమూ నెలకంటే ఎక్కువ రోజులు సాగలేదు.

ఓరోజు ఓ పదిమంది ఆడకూలీలు, మగకూలీలు అతన్ని వెదుక్కుంటూ వచ్చేరు. ఆడవాళ్లు కట్టుకున్న చీరలు మోకాళ్లవరకు లాగేసున్నాయి. మగాళ్ల లుంగీలూ అలాగే లాగేసివున్నాయి. వారంరోజుల క్రితం పూర్ణామార్కెట్ జంక్షన్‌లో రాంబాబు దగ్గర ఆ చీరలు, లుంగీలు కొన్నామని, ఒక్కసారి నీట్లో ముంచేసరికి అవి సగానికి సగం సైజుకి లాగేసాయని వాళ్ళు ఫిర్యాదుచేశారు. పెట్టెచీకుడు బట్టలు అమ్మి తమను మోసంచేశాడని కేకలు వేశారు.

రాంబాబు కంగారుపడకుండా వాళ్లకి సర్దిచెప్పడానికి ప్రయత్నిస్తూ- ''చూడండి శ్రమజీవులారా, నా బట్టలు మామూలు బట్టలు కావు. వాటికి కాలజ్ఞానం వుంది. ఇది వేసవికాలం కాబట్టి, అవి మీదకి ముడుచుకుపోయి, మీకు చల్లగా గాలితగిలే ఏర్పాటుచేశాయి. ఇంకో మూడు నెలలు ఆగితే శీతాకాలం వస్తుంది గదా. అప్పుడు ఇవే బట్టలు పాదాలవరకు సాగిపోయి, మీకు వేరే దుప్పట్లవసరం లేకుండా చేస్తాయి'' అన్నాడుగాని, అతని మాటలగారడీ వాళ్లమీద పనిచేయలేదు. అందరూ కలసి మీదపడి కొట్టబోవడంతో ఆ బట్టల వేలంపాటకి ఆరోజుతో మంగళం పాడేశాడు.

తర్వాత మరోసారి... రాష్ట్రంలోని నక్సలైట్లు, తీవ్రవాదులు చేస్తున్న ఘనకార్యాలు, వారిని లొంగిపొమ్మని ప్రభుత్వం చేస్తున్న ప్రకటనలు, అలా లొంగిపోయిన వారి జీవనోపాధికి ఇస్తామంటున్న సదుపాయాలు, గురించి రాంబాబు ఎప్పటికప్పుడు ఎదురింటి బాబాయ్‌గారి పేపరు ద్వారా తెలుసుకున్నాడు. ఓ పదిరోజులపాటు గెడ్డం గీయకుండా, పల్చగా పెంచుకుని, జుత్తంతా చెరుపుకుని ఒకరోజు ఒన్‌టౌన్ స్టేషన్‌కి వెళ్లాడు. ఆరోజు ఓ పదిమంది నక్సలైట్లు స్వచ్ఛందంగా లొంగిపోతున్నారని తెలిసే వెళ్ళాడు. వాళ్లలో కలిసిపోయి నిలబడ్డాడు. యస్పై అతన్ని వివరాలు చెప్పమన్నాడు.

''నా పేరు రాంబాబు, ఎలియాస్ బండన్న. నేను మంగళంపాలెం మరిడన్న గ్రూప్‌కి చెందినవాణ్ని. ప్రభుత్వాధికారులను నాలుగుసార్లు కిడ్నాప్ చెయ్యడంలోను, రైలు పేల్చివేయడంలోను, మందుపాతర్లు పేల్చి రెండు జీపుల్ని ధ్వంసం చెయ్యడంలోనూ నాకు భాగముంది. అయినా, హింసాత్మకమైన ఈ జీవితాన్ని వదిలెయ్యాలనుకుంటున్నాను. కళింగ యుద్ధంలో జరిగిన రక్తపాతాన్ని చూసి శాంతిప్రియుడిగా మారిన అశోకుడు నాకు ఆదర్శం. ప్రభుత్వంవారు ప్రకటించినవిధంగా నేను లొంగిపోతున్నాను. నాకు మా గ్రూప్‌తో చాలా చాలా గొడవలు జరిగాయి. వాళ్లనించి విడిపోయి, జనజీవన స్రవంతిలో కల్సిపోదామనొచ్చేను. మీరో లక్షో, రెండు లక్షలో కేమ, ఒక ఎకరం నేల ఇస్తే జైజవాన్, జైకిసాన్ అంటూ ఉత్తమ భారత పౌరుడిగా బతికేస్తాను'' అంటూ ఓ పావుగంటసేపు తను ఎందుకు లొంగిపోతున్నదీ వివరించాడు.

అయినా అక్కడున్న డియస్పీగాని, సర్కిల్‌గాని, యస్పైగాని, కానిస్టేబుల్సుగాని అతను చెప్పిందాన్ని నోట్ చెయ్యలేదు. అందరూ అతన్నే రెప్పార్పకుండా చూస్తున్నారు.

రాంబాబుకేం అర్థంకాలేదు. ''ఏవిటి సార్ అందరూ అలా చూస్తున్నారు? ఒకవేళ మీరిచ్చే రాయితీలవీ తీసుకున్నాక మళ్లీ నేను నక్సలైటుగా మారిపోతాననుకున్నారా? అదేంలేదు. కావాలంటే కాగితం రాసిస్తాను'' అన్నాడు వాళ్ళకి నమ్మకం కలిగించడానికి ప్రయత్నిస్తూ.

పోలీసులంతా పగలబడి నవ్వేరు. స్టేషన్‌పై కప్పు ఎగిరేలా నవ్వేరు. హెడ్‌కానిస్టేబులు రాంబాబు దగ్గరకొచ్చి ''ఏరా, నా కొడకా, నీకు తమాషాగా వుందా? మేం నెత్తిమీద టోపీలు




పెట్టుకున్న పోలీసోళ్లమనుకున్నావా, లేక చెవిలో పువ్వు పెట్టుకున్న వెంగళప్పల మనుకున్నావా? నీ పేరు రాంబాబు. నువ్వో వేలంపాట గాడివి. నీకు ఉద్యోగం, సద్యోగంలేకుండా ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజి దగ్గర ఎన్నోసార్లు కనిపించేవు. నీ గురించి ఈ వివరాలు చాలా... ఇంకా నీ జాతకం తిరగేసెయ్యమంటావా'' అంటూ హూంకరించాడు.

రాంబాబు టైఫాయిడ్ జ్వరం వచ్చినవాడిలా వణికాడు- ''సారీ... సారీ సార్, ఏ ఉద్యోగమూ దొరక్క...'' అంటూ నీళ్లు నమిలాడు.

''అంటే బతకడానికి ఏ దారీ దొరక్క ఇలా అబద్ధం చెప్పేవా?'' యస్సై అడిగాడు.

''ఔనండి''

''అయితే నీకు తిండీ, బట్ట ఫ్రీగా వచ్చేమార్గం మేమే చూపిస్తాం. గవర్నమెంటుని మోసం చెయ్యబోయేవనే నేరంకింద నిన్ను జైల్లోకి తోసేశామనుకో. ఏడు సంవత్సరాలపాటు ఏ పూచీ, పేచీ లేకుండా గవర్నమెంట్ అన్ని ఖర్చులూ భరించి, నిన్ను పోషిస్తుంది. ఆ ఏర్పాటు చేసెయ్యమంటావా?''

యస్సై అలా అనేసరికి రాంబాబు మరింత కంపించాడు. సర్కిల్ ఇన్‌స్పెక్టరు మాత్రం అతన్ని జాలిగా చూసి ''చూడు రాంబాబూ, నీ చేత నీ నిరుద్యోగమే ఇలా చేయించిందన్న జాలితో వదిలేస్తున్నాను. మళ్ళీ ఎప్పుడూ ఇలాంటి ప్రయత్నాలు చెయ్యకు'' అంటూ హెచ్చరించి వదిలేశాడు.

ఆ తర్వాత రాంబాబు ఓ రియల్ ఎస్టేట్ ఏజెన్సీలో జాయినయ్యేడు. అతనికిచ్చిన ఉద్యోగం పేరు ఏజెంట్! కానీ, అందరూ అతన్ని ఇళ్లబ్రోకర్ అని పిలవడంతో రాంబాబుకంటే అతని తండ్రే ఎక్కువ ఫీలయిపోయి ''ఇంత చదువూ చదివి ఈ బ్రోకరు ఉద్యోగం చెయ్యడం ఏవిట్రా, మానెయ్ మానెయ్'' అన్నాడు. రాంబాబు కస్సుమంటూ లేచాడు. ''రెడీమేడ్ షాపులోనించి బట్టలు కొట్టేసి హాఫ్ రేటులో అమ్మేసుకున్నదానికంటే నేనుచేసేదేం చెడ్డపని కాదులే'' అంటూ తన ఉద్యోగానికి తనే గౌరవం పెంచుకున్నాడు. ఆ ఉద్యోగంలో రాంబాబు చెయ్యాల్సినవి రెండుపనులు. ఒకటి, వూళ్లో ఎక్కడ ఏ ఇల్లు ఖాళీగా వున్నా వాటి అద్దె ఎంత? ఎడ్వాన్సు ఎంత చెల్లించాలి? ఫామిలీలకే ఇస్తారా, లేక బ్రహ్మచారులకు కూడా ఇస్తారా? బ్రాహ్మిన్స్‌కే ఇస్తారా? లేక ఎవరికైనా ఇస్తారా, అనే వివరాలు తెలుసుకొచ్చి రిజిష్టర్లో నోట్ చెయ్యాలి. రెండవది, ఎవరైనా అద్దిల్లు కావాలని వచ్చినప్పుడు వాళ్లని తీసుకెళ్లి, ఆ ఇంటి ఓనరుతో మాట్లాడి, ఒప్పించాలి. అలా చేసినందుకుగాను, ఒక నెల అద్దె రియల్ ఎస్టేట్‌వాళ్లకి అద్దెకు దిగిన వ్యక్తి చెల్లించాలి. అలా వచ్చిన డబ్బులో, నూటికి పదిహేను రూపాయలు కమీషను రాంబాబుకిస్తారు. అది కాకుండా అతనికి నెలకి అయిదువందలు జీతం, ఊళ్లో ఇళ్ల ఇన్ఫర్మేషన్ సంపాదించే నిమిత్తం ఓ సైకిలు ఇస్తారు. నెలకు ముప్ఫైరోజులూ వర్కింగ్‌డేసే తప్ప సెలవులు, లీవులు అంటూ ఏవీ వుండవు. ఇదీ అతని ఉద్యోగం.

ఇళ్లబ్రోకరుగా పనిచేస్తూ అతను పొందిన మెప్పులంటూ ఏవీ లేవుగాని, ఒకటి రెండుసార్లు ఇంటి ఓనర్లచేత, అద్దెకు దిగిన పార్టీలచేత చీవాట్లు మాత్రం తిన్నాడు. ఓసారి ఓ పార్టీని ఓ ఇంట్లో అద్దెకు దించాడు. ఇంట్లో ఎంతమంది వుంటారని అడిగితే, ఒకభార్య, ఇద్దరు పిల్లలూ అని ఆ పార్టీ చెప్పేడు. రాంబాబు ఆ ఇంటి ఓనరుకి అలాగే చెప్పి ఆ ఇంట్లో దించాడు.

ఓ పదిరోజుల తర్వాత ఇంటి ఓనరు రాంబాబుని పిలిపించి ''ఆ పెద్దమనిషికి ఒక భార్య, ఇద్దరుపిల్లలని చెప్పేవు. కానీ అదంతా ఉత్త గాస్. అతనికి ఇద్దరు పెళ్లాలు, ఒక కూతురు వున్నారు. ఆ పెళ్లాలిద్దరూ రోజూ జుట్టూ జుట్టూ పట్టుకుని జెట్టీకి దిగడమే! ఆ గోల మేం పడలేం. ఇల్లు ఖాళీ చెయ్యమంటే చెయ్యనంటున్నాడు. నువ్వు వెంటనే ఖాళీ చేయించు'' అన్నాడు.

ఇల్లు కుదర్చడమే తన డ్యూటీ అని బాస్ చెప్పేడు తప్ప, దింపినవాళ్లచేత ఖాళీ చేయించడం కూడా తన డ్యూటీయేనని చెప్పలేదు. అయినా ట్రై చేద్దామని, ఆ ఇద్దరు పెళ్లాల ముద్దుల టెనంట్‌తో మాట్లాడాడు. ''మీకు ఇద్దరు పెళ్లాలు ఎందుకున్నారని నేను అడగడంలేదు. కానీ, ఇద్దర్నీ ఒకే ఇంట్లో పెట్టడంలో మీ ఉద్దేశం ఏమిటని అడుగుతున్నాను''

అన్నాడు రాంబాబు.

"ప్రత్యేకమైన కారణమంటూ ఏదీలేదండి. అద్దె కలిసొస్తుందని, టైము కలిసొస్తుందని పెట్టేను. ఇంట్లో ఇద్దరు పిల్లలుంటేనే అల్లరవుతుంది. అలాంటప్పుడు ఇద్దరు పెళ్లాలుంటే అల్లరవదా? నేను ఈ ఏడాదిలో ఇదే కారణంవల్ల నాలుగిళ్లు మారాను. నాలుగుసార్లు మీ బ్రోకర్లకి కమీషన్లిచ్చాను. ఇంక నాకు ఇళ్లు మారే ఓపికలేదు. నీకు చేతనైతే మా ఇద్దరాడవాళ్లమధ్య రాజీకుదుర్చు. అంతేగాని ఇల్లు మాత్రం ఖాళీచెయ్యమనకు" అంటూ ఖచ్చితంగా చెప్పేశాడు.

తనకు అనుభవం లేకపోయినా రాంబాబు ఆ ఇద్దరు పెళ్ళాల మధ్య రాజీచెయ్యడానికి ప్రయత్నించాడు. కానీ వాళ్ళు వినలేదు సరిగదా "మాకు ఇళ్లబ్రోకరుచేత బుద్ధి చెప్పిస్తావా" అంటూ అతనిముందే భర్తని కొట్టి సంతపని చేస్తే రాంబాబు బెదిరిపోయి పారిపోయాడు.

ఉద్యోగ నిర్వహణలో ఇలాంటి చిన్న చిన్న నలుసులు కంట్లో పడుతున్నా రాంబాబు సంతోషంగానే వున్నాడు. ఎప్పుడూ టెన్షన్ ఫీలవలేదు.

★ ★ ★

రాంబాబు ఆరోజు వంటచేసి, తండ్రికి, చెల్లెలికి భోజనాలు పెట్టాడు. వంటచెయ్యడం దగ్గర్నించి, చెల్లెల్ని కాలేజీకి పంపడంవరకు రాంబాబుదే డ్యూటీ! ఏ ఒక్కపనిలోనూ సాయపడకుండా, రాంబాబు చేసే ప్రతి పనిలోనూ వంకలు పెట్టడం చలపతి డ్యూటీ. ఆరోజు కోడి కుర్మా చెయ్యమంటే, చేపలపులుసు చేశాడని కొడుకుతో చలపతి గొడవపెట్టుకుంటున్న సమయంలోనే పోస్ట్‌మేన్ వచ్చి రాంబాబుకో కార్డు అందించి వెళ్లిపోయాడు.

అది ఇంటర్వ్యూ కార్డు! రమ్యా సోప్ ఇండస్ట్రీస్‌నించి వచ్చింది. రమ్యాసోప్ ఇండస్ట్రీస్ దేశవ్యాప్తంగా పేరుప్రఖ్యాతులు సంపాదించిన సంస్థ. వాళ్ళ బ్రాంచీని ఈమధ్యనే విశాఖపట్నంలో పెట్టేరు. దాన్లో ఉద్యోగాలకి అభ్యర్థులు కావలెను అని పేపర్లో ప్రకటిస్తే, ఓ అప్లికేషన్ పడేశాడు. ఆరునెల్ల తర్వాత ఇప్పుడు పిలుపొచ్చింది. ఇంకో రెండు రోజుల్లో ఇంటర్వ్యూ.

రోజూ ఇస్తున్నట్లే చలపతి కాలేజీ డౌన్‌లో నిలబడి తన మిత్రుల్తో ప్రపంచ రాజకీయాల గురించి లెక్చరు ఇస్తున్నాడు. అమెరికావాడి పాలసీ దగ్గర్నించి, విశాఖపట్నం మున్సిపల్ కార్పొరేషన్ కార్పొరేటర్లవరకు ఏ ఒక్కడి పద్ధతీ తనకి నచ్చలేదంటూ ఆవేశపడుతూ లెక్చరిస్తుండగా, దగ్గరలోవున్న ఓ లాడ్జినించి ఓ రూమ్‌బోయ్ వచ్చి మిమ్మల్ని అచ్యుతానందగారు అర్జంటుగా రమ్మంటున్నారని పిలిచేడు. మిగతా చర్చని రేపటికి వాయిదావేసి చలపతి లాడ్జి దగ్గరికి వెళ్లాడు.

లాడ్జి బయట ఓ బోర్డు, దానిమీద ఓ హస్తంబొమ్మ. దానికింద - "పువ్వు మీ అదృష్టం చెప్పును. మీ భూతభవిష్యత్ వర్తమానాల గురించి కూలంకషంగా తెల్సుకోడానికి జ్యోతిషరత్న అచ్యుతానందగార్ని సంప్రదించండి" అనే అక్షరాలు కనిపిస్తున్నాయి. నల్లటి ముఖంమీద తెల్లని గెడ్డం, సన్నటి శరీరం మీద లూజుగా వేళ్లాడే అంగరఖాతో, నుదుటిమీద కుంకుమబొట్టుతో చిత్రంగా కనిపిస్తున్న ఆ వ్యక్తే అచ్యుతానంద! అతని అసలు పేరు ఆవాల అప్పారావు. ఎన్నో సంవత్సరాల్నించి చలపతికి స్నేహితుడు. ఎన్నో వూళ్లు తిరిగి, ఎన్నో లాడ్జీల్లో రూములు తీసుకుని, ఎంతో మందికి జ్యోతిష్యం చెప్పినా ఎంతో ఎక్కువడబ్బు మిగుల్చుకోలేక పోయేడు అచ్యుతానంద. అతనికున్న బాధ్యతల్లా కూతురు చదువు, తర్వాత పెళ్లి. ఆమె పేరు అమల. ఇన్నాళ్లూ అమల విజయవాడలో వుంటున్న తన మేనత్త ఇంట్లోనే పెరిగింది. అక్కడే చదివింది.

చలపతి ఒకానొకప్పుడు సినిమా థియేటర్లో బుకింగు క్లర్కుగా పనిచేసినప్పుడు, ఈనాటి అచ్యుతానందగా పిలువబడుతున్న ఆనాటి అప్పారావు ఆ థియేటర్ ఎదుటనున్న ఓ టైలరింగ్ షాపులో టైలర్‌గా పనిచేసేవాడు. ఆ తర్వాత ఏం జరిగిందోగాని, ఓ రాత్రికి రాత్రి, ప్రాణమిత్రుడైన చలపతికి కూడా చెప్పకుండా అంతర్ధానమైపోయేడు. తర్వాత మూడున్నర సంవత్సరాలకి, ఓ తెల్లవారుజామున జ్యోతిషరత్న అచ్యుతానందగా అదే వూళ్లో సాక్షాత్కరించాడు. "ఏదో దైవశక్తి ప్రేరేపించగా నేను హిమాలయపర్వతాలకి వెళ్లిపోయి ఓ మహర్షి దగ్గర జ్యోతిష్యం నేర్చుకొచ్చేను" అని అచ్యుతా




నంద చెప్పడమైతే చెప్పేడుగాని, అందులోని నిజానిజాల గురించి ఎవరూ పట్టించుకోలేదు. ఇంట్లోనించి పారిపోయి, గెడ్డాల్తో తిరిగొచ్చిన ప్రతీవాడు హిమాలయాల పేర్లే చెప్తారంటూ కొందరు గొణుక్కున్నారు కూడా. చలపతి మాత్రం "గ్యారంటీగా డబ్బు వచ్చే టైలరింగ్ వదిలేసి, పొట్టకూటికి ఈ జ్యోతిష్యాన్ని నమ్ముకున్నావ్, దీంతో నీ బండి ఏం నడుస్తుంది చెప్పు" అని మందలించాడు.

అచ్యుతానంద చలపతిని ఓ చంటిబిడ్డలా చూసి "నేను వెధవనైపోయి, హిమాలయాలకెళ్ళి జ్యోతిష్యం నేర్చుకోలేదు. మనదేశాన్ని మన ప్రజల్ని బాగా స్టడీచేసే నేను రూటు మార్చేను. చెట్లుల్ని పుట్టల్ని పాముల్ని పశువుల్ని మన వాళ్లు పూజించినంతగా మరెవరూ పూజించరు. అందుకే మన ఊళ్లలో వున్నంతమంది దేవుడమ్మలు, స్వామీజీలు, బాబాలు, మంత్రగాళ్లు, భూతవైద్యులు మరే ప్రాంతంలోనూ లేరు. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చేక బానిసత్వం పోయినా, మూర్ఖత్వం పోలేదు. మనవాళ్లు చెప్పే చదువులు కూడా, ఉద్యోగాలు ఇప్పించడానికి పనికొస్తున్నాయి తప్ప, మూఢ నమ్మకాల్నించి దూరం చెయ్యడానికి పనికిరావడంలేదు. అందుకే పెద్ద పెద్ద చదువులు చదివి, గొప్ప గొప్ప ఉద్యోగాలు చేస్తున్నవాళ్లు కూడా ఇంకా తాయెత్తుల్ని, విభూదుల్ని నమ్ముతూనే వున్నారు. పిల్లి ఎదురొస్తే అపశకునం అనే నమ్మకంనించి, ఒంటిమీద బల్లిపడితే కలిగే ఫలితాల్నించి మనవాళ్ల మేధస్సు బయటపడలేదు. చంద్రమండలంలోకి మానవుడు అడుగుపెట్టి, అక్కడి రాళ్లు తెచ్చి, వూరూరా ఎగ్జిబిషన్లు పెట్టి చంద్రుడంటే ఇదీ అని నిరూపించినా, చంద్రుణ్ణి పూజిస్తూ కార్తీకపౌర్ణిమలు, అట్లతద్దెలు ఇంకా కొనసాగిస్తున్న దేశం ఇది. అంతరిక్షానికి రాకెట్‌ని పంపించగలిగే మేధావులు కూడా గోడమీద పటాల్లోను, వేలి వుంగరాల్లోను దేవుడి బొమ్మని పెట్టుకు పూజిస్తున్నారు. అంటే మనదేశంలో విజ్ఞానం, విజ్ఞానమే. దైవభక్తి దైవభక్తిగానే విడివిడిగా బ్రతుకుతున్నాయి. ఇలాంటి దేశంలో జ్యోతిష్యం బతక్కపోతే మరెక్కడ బతుకుతుందిరా?

ఎందుకు బతుకుతోందీ అంటే, మూర్ఖుడి దగ్గర్నించి మేధావివరకూ ఎవరికీ అంతుబట్టనిది భవిష్యత్తు ఒక్కటే!"

తన ఆలోచనకి అందని భవిష్యత్తుని తెల్సుకోవాలని నూటికి తొంభైమంది ఆసక్తి చూపిస్తారు. ఆ ఆసక్తినిబట్టే రోడ్డుపక్క ఫుట్‌పాత్‌మీద చిలకచేత చీటీలు తీయించేవాడి దగ్గర్నించి, ప్రపంచవ్యాప్తంగా ఆశ్రమాలు నిర్మించి, ఇంటర్నేషనల్‌గా కీర్తిగడించిన బాబాలు, స్వామీజీలు బతికేస్తున్నారు. వాళ్లని మేధావులు సైతం తమ గురువులుగా భావిస్తున్నారు. వారి ఆదేశాలకి కట్టుబడి తమ కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నారు. ఈ నమ్మకం మరికొన్ని శతాబ్దాలవరకు చావదనే నా నమ్మకం.

ఈ మాట ఎందుకు చెప్తున్నానంటే, బాబాలు దివ్యశక్తుల పేరిట సృష్టిస్తున్న వస్తువుల్ని చాలామంది మెజీషియన్లు మేజిక్ పేరిట సృష్టించి, ఇదంతా హస్తలాఘవమే తప్ప దివ్యశక్తులు కాదని, పిడికిట్లో పట్టని ఏ వస్తువునైనా సృష్టించమనండి చూద్దాం అని ఓ విధమైన ఛాలెంజ్‌లు చేసినా బాబాల విలువలు పడిపోలేదు. పూర్వకాలంలో అంటే, ప్రజల్లో చదువు సంధ్యలు, హేతువాదం, తార్కిక దృష్టి లేనిరోజుల్లో స్వామీజీలకి, బాబాలకి గౌరవాలు, ఆరాధనలు జరిగాయన్నా జ్యోతిష్యంమీద ఆసక్తి కలిగిందన్నా అదంతా ప్రజల మూర్ఖత్వం అనుకోవచ్చు. కానీ ఇప్పుడు ప్రెసిడెంటాఫ్ ఇండియాలాంటి పెద్దలు, మహామేధావులు గూడా బాబాల ఆశీర్వాదంకోసం స్వామీజీల శుశ్రూషకోసం ఆరాటపడుతున్నారంటే ఏమనుకోవాలి? ఈరోజుకిలా గడిచిపోయినా రేపయినా నా జీవితంలో ఓ కాంతిరేఖ ఉదయించి, సుఖయోగం కలుగుతుందేమోననే ఆశ మానవుడిలో వున్నంతకాలం జ్యోతిష్యం వుంటుంది. జ్యోతిష్యుడు బతుకుతాడు. కాకపోతే తిరుపతి వెంకటేశ్వరుడూ దేవుడే. అన్నవరం సత్యనారాయణ స్వామివారూ దేవుడే. సింహాచలం నరసింహస్వామీ దేవుడే. కానీ వెంకటేశ్వరుడికున్న గ్లామరూ, ఫాలోయింగు మరో దేవుడికి లేనట్టే, కొంతమంది ఇంటర్నేషనల్ జ్యోతిష్యులకుండే గిరాకీ, నాలాంటి చిన్న లాడ్జీల్లో వుండేవాళ్లకి వుండకపోవచ్చు. నేను కొండమీద వెలిసిన దేవుళ్ళా కాకపోయినా, పుట్టలో బతికే నాగరాజులాగైనా బతికెయ్యగలనన్న నమ్మకం నాకుంది" అన్నాడు.

అచ్యుతానంద జ్యోతిష్యం ఎంత నేర్చుకున్నాడో తెలీకపోయినా, ఈ మూడేళ్లలోనూ మాటలు మాత్రం బాగా నేర్చుకున్నాడనుకున్నాడు చలపతి. ఆ తర్వాత అచ్యుతానంద దగ్గరకి పొలోమంటూ జనం వచ్చిపడిపోనూలేదు. అలాగని, ఏ ఒక్కరోజూ అతనికి కష్టమర్లు రాక పస్తున్నదీలేదు. సాయంత్రమయ్యేసరికల్లా అతనికో క్వార్టరు బ్రాందీ కావాలి. ఇంటి ఖర్చులకో పాతికరూపాయిలు కావాలి. ఈ రెండూ వుంటే చాలు, నాఅంత గొప్పవాడు ఇండియాలోనే లేడనే సిద్ధాంతానికి ఏనాడో వచ్చేశాడు. పగలంతా కలిసినా, కలియకపోయినా, రాత్రయ్యేసరికి ఠంచన్‌గా డ్యూటీకొచ్చినట్టుగా హాజరైపోయి, మందు తాగటానికి కంపెనీ ఇవ్వడం చలపతికి అలవాటు. మునుపు బట్టలషాపులో పనిచేసేటప్పుడు చలపతే అచ్యుతానందని తీసుకుని బార్‌కెళ్లి తాగుతూ "మనకేంరా దిల్‌కుష్ రాజాలం. మనంత స్వేచ్ఛ, సంతోషం ప్రైమ్‌మినిస్టరాఫ్ ఇండియాకుందా?" అని ప్రశ్న వేస్కుని లేదుకాక లేదని జవాబు చెప్పుకుని సంబరపడిపోయేవారు.

చలపతి, లాడ్జీలో అచ్యుతానంద వుంటున్న రూమ్ దగ్గరకొచ్చేడు. తలుపులు దగ్గరగా మూసుకున్నాయి. "ఈరోజు సెలవుదినం" అనే అట్టబోర్డు తలుపుకి వేళ్లాడుతోంది. ఆదివారం కాకుండా ఈరోజు ప్రత్యేకంగా సెలవుబోర్డు తగిలించాడంటే ఏదో ముఖ్యమైన కారణం వుండే వుంటుందని వూహిస్తూ తలుపు తీసుకుని లోపలకెళ్లేడు. అచ్యుతానంద గెడ్డం నిమురుకుంటూ బ్రాందీ తాగుతూ కనిపించాడు. "ఏవిట్రా అచ్యుతం, దుకాణానికి సెలవు ఇచ్చేసి మరీ పూజలో కూర్చున్నావ్, ఏం జరిగింది?" అంటూ ఓ కుర్చీలాక్కుని కూర్చున్నాడు చలపతి. అతనిక్కూడా ఓ గ్లాసులో బ్రాందీ వేసి ఇచ్చేక "బెజవాడనించి మా అమల వచ్చేసిందిరా" అన్నాడు.

"అలాగా"

"రేపు ఇక్కడేదో సోప్ ఫ్యాక్టరీలో ఇంటర్వ్యూ వుందట. అందుకోసం వచ్చింది. ఆ ఉద్యోగానికీ సెలక్టయినా, కాకపోయినా ఈరోజునించి అది ఇక్కడే వుంటుంది" అచ్యుతానంద తన మీద ఏదో అనుకోని అదనపు భారం పడినట్టుగా ఫీలవుతూ చెప్పేడు.

"నీ కూతురు నీ దగ్గరకొచ్చెయ్యడం సంతోషించదగ్గ విషయమేకదరా, మరి, అంత ఇదిగా చెప్తావేం?"

"దానికి పెళ్లీడూ వచ్చింది. చదువు కూడా పూర్తయిపోయింది. ఇంతవరకు దాని చదువు, పోషణ, అంతా బెజవాడలో వున్న మా చెల్లెలే చూసుకుంది. రేపు దాని పెళ్లిఖర్చులు దాన్నే పెట్టుకోమంటే నన్నో దరిద్రుడ్లా చూస్తుంది. అలాగని, నేనే బాధ్యత వహించి దాని పెళ్లి చేద్దామంటే, నా దగ్గరేంవుందని, ఆ పెంకుటిల్లు తప్ప. ఇప్పుడు కట్నాల రేట్లు ఎలా పెరిగిపోయాయో నీకు తెలియందికాదు. ఉద్యోగంలేనివాడు గూడా పాతికవేలకి తక్కువ అడగడంలేదు. పైగా ఒంటిమీదకో నాలుగుతులాలైనా బంగారం సమకూర్చాలిగదా... ఎంతో మందికి చేతులు చూసి భవిష్యత్తు చెప్పిన నేను రేపు నా కూతురి భవిష్యత్తేంటో ఊహించలేకపోతున్నాన్రా" ఎప్పుడూలేంది అచ్యుతానంద కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

చలపతి చలించాడు. అతనికి ధైర్యం చెప్తూ "నువ్వేం భయపడకురా, నారు వేసినవాడే నీరూ పోస్తాడంటూ పాతసామెత చెప్పినా అచ్యుతానంద ఏడుపు మానలేదు.

"లేదు చలపతీ, ఆ పాతసామెత ఆడపిల్లల కట్నాలకి వర్తించదురా. వివాహాలు స్వర్గంలో నిర్ణయించబడినా అవి జరిగేవి ఇక్కడే... భూమ్మీదే. ఆడపిల్లలకి కట్నాలు ఇచ్చుకోవాల్సింది కూడా మనమేగాని, మీ అమ్మాయికి కట్నంకింద ఇవ్వరా అని ఆ దేవుడో డబ్బుమూటని మనింట్లో పడెయ్యడు" అంటూ అచ్యుతానంద తన బాధని, అశక్తతని వెల్లడిస్తూ, ఓ అరగంట తర్వాత సడన్‌గా "రేయ్ చలపతీ, రేపు నేనేమైనా అయిపోతే, నా కూతురి బాధ్యత నీదేసుమా" అన్నాడు. అచ్యుతానంద ఆ మాట అంటున్నప్పుడు చూసిన చూపులు అతను ఆత్మహత్యకి సిద్ధమవుతున్నాడని చెప్పకనే చెప్తున్నాయి. చలపతి కళ్లంట కూడా తెలియకుండానే నీళ్లొచ్చేస్తాయి. "ఛ... అవేం మాటలురా, నీ కూతురి పెళ్లి మరొకరు చెయ్యాల్సిన ఖర్మేం పట్టింది. నువ్వే చేస్తావంటూ భరోసా ఇచ్చేక తీవ్రంగా ఆలోచించాడు. బాటిల్ పూర్తవుతుందనగా చలపతికో మెరుపు లాంటి ఆలోచన వచ్చింది.




"నీ కూతుర్ని నేను కోడలిగా చేసుకుంటా న్రా" అన్నాడు. అచ్యుతానంద ఆశ్చర్యంగా చూశాడు. "ఔనురా, నేనీ మాట నిన్ను ధైర్యపర చడానికి అనడంలేదు. ఎన్నో ఏళ్ళుగా మనం స్నేహితులం. నాకు కొడుకున్నాడు. నీకు కూతురుంది. వాళ్ళకి పెళ్లి చేసేస్తే నీ సమస్యా తీరిపోతుంది. మన స్నేహం కూడా వియ్యంగా మారిపోతుంది. మనలో మనమే కాబట్టి, కట్నా లు, బంగారాల గొడవ వుండనే వుండదు. ఏమంటావ్?"

అచ్యుతానంద ఏమనగలడు? చావ సిద్ధంగావున్న వాడి గొంతులో అమృత బిందు వులు ఒలికేయి. అచ్యుతానందకొచ్చిన కొత్త వుత్సాహంవల్ల మరో బ్రాంది బోటిల్ తెప్పించా డు. "ఖర్చులు ఎక్కువ కాకుండా సింపుల్గా గుళ్ళో పెళ్ళి చేసేద్దాం. మరీ దగ్గర బంధువుల నుకున్న వారికోపూట భోజనం పెట్టేస్తాం. ఆ తర్వాత, అమ్మాయి, అబ్బాయి కూడా వుద్యోగా లు చేసుకుంటారు కాబట్టి, రెండు జీతాల్తో దిల్‌కుష్ రాజాల్లా బతికేస్తారు..." అంటూ చలపతి చెప్పుకుపోతున్నాడు. అచ్యుతానంద మనసు విహంగమై వినువీధుల్లో ఎగురు తుండగా, ఎందుకో ఆ విహంగం ఒక్కసారిగా ఠక్కున ఆగిపోయింది.

"మనం గాలిమేడలు కట్టెయ్యగానే సరా! ఈ కాలపు పిల్లలు ప్రేమలు, యిష్టాలు, అభి రుచులంటూ వారి ధోరణిలో వాళ్ళు వెళ్తున్నారే తప్ప పెద్దలు చెప్పినట్టు వింటున్నారా?" అన్నాడు అచ్యుతానంద సాలోచనగా గెడ్డం నిమురుకుంటూ.

అదీ ఆలోచించవలసిన విషయమేనని ఆమోదించాడు చలపతి. బ్రాందీతో తడిసిన బ్రైను అతనికో ఆలోచన అందించింది.

"ఆ ప్రేమేదో వాళ్లిద్దరిమధ్య మనమే పుట్టి స్తే?" అన్నాడు చలపతి.

"ఆలోచన బాగానేవుందిగాని, మనకి మనంగా పుట్టించడానికిదేం అప్పుకాదుగా"

చలపతి లక్కీడ్రాప్స్‌ని నాలికమీద ఒంపు కుంటూ, అతనికో వుపాయం చెప్పేడు.

★ ★ ★

మర్నాడు వుదయం.

రాంబాబు తన సర్టిఫికేట్స్ ఫైలుని దేవుడి పటంముందు పెట్టి భక్తిగా ఓ నమస్కారంచేశా డు. నా భారం యింక నీదే అని అననుగాని, వీలుంటే నా భారాన్ని కాస్త సాయంపట్టు అని దేవుణ్ణి రిక్వెస్టు చేస్తుండగా చలపతి దేవా లయం నించొచ్చాడు. నుదుటపెట్టిన కుంకుమ, చెవివెనక పెట్టిన పువ్వు అతన్నో మహాభక్తుడిలా చూపిస్తున్నాయి.

"నువ్వు ఇంటర్వ్యూలో తప్పకుండా సెలక్ట వాలని దేవాలయానికెళ్లి గంటస్తంభం దగ్గరకొ ట్టేశాన్రా" అంటూ రెండు కొబ్బరి చెక్కలు అందించాడు.

"గుడివరకు వెళ్ళిన వాడివి, గుళ్ళోకెళ్లలే దేం? రష్ ఎక్కువగా వుందా?" బూట్లు వేస్కుంటూ అడిగాడు.

"రష్ ఎక్కువగా వుండికాదురా. గుళ్లోకెళ్లి పూజారిచేత కొట్టిస్తే ఒక్కముక్కే నా చేతికిస్తా డుగదా! పైగా దక్షిణ వెయ్యకుండా వచ్చేస్తే నన్ను దరిద్రగొట్టు వెధవలా చూస్తాడు. ఎందు కొచ్చిన గొడవ యిదంతా! గర్భగుడిలోవున్న దేవుడు, గంటస్తంభం దగ్గర మాత్రం వుండడా అని అక్కడే కొట్టేశాను"

తండ్రితో వాదించడం రాంబాబుకి యిష్టంలేదు. దాంతోబాటు తండ్రి పెట్టిన ప్ర పోజల్‌కూడా అతనికిష్టం లేదు. ఎవరో అచ్యు తానంద చేత జ్యోతిష్యం చూపించుకోమని, ఎప్పుడూ అడగని విధంగా అడుగుతున్నాడు. రాంబాబుకి జ్యోతిష్యాలమీద నమ్మకమూ లేదు. అపనమ్మకమూలేదు. అంతా జాతకంలో రాసినట్టే జరిగింది సుమండీ అనేవారితోనూ ఏకీభవిస్తాడు. జాతకాలు, గీతకాలు ఏం లేవండి, మనకి సుడి అంటూవుంటే, మన పనులుగూడా అంత సక్సెస్‌ఫుల్‌గా జరిగిపోతా యండీ అనేవాడితోనూ ఏకీభవించేస్తాడు. ఇప్పుడు తండ్రి సంతృప్తి కోసమైనా వెళ్లాలను కున్నాడు రాంబాబు. అచ్యుతానంద తనకి స్నేహితుడన్న విషయం చలపతి రాంబాబుకి చెప్పలేదు. చెప్తే, అతనూ నీబోటి పోరంబోకేనా అని తిడతాడేమోనని భయం. తండ్రీ కొడుకు లు అచ్యుతానంద దగ్గరకొచ్చేరు. అక్కడ చల పతి, అచ్యుతానంద ఒకరికొకరు తెలియనట్టే ప్రవర్తించారు. సాధారణంగా జ్యోతిష్కులు అడి గినట్టు, యిష్టమైన పువ్వు పేరు, యిష్టమైన





రంగు, యిష్టమైన అంకె అడగడంతో పాటు యిష్టమైన దేశనాయకుడిపేరు, యిష్టమైన సినిమా హీరో పేరు కూడా అడిగి మరీ రాంబాబు చెయ్యిచూసి "నువ్వు చాలా అదృష్టవంతుడివయ్యా" అన్నాడు అచ్యుతానంద చిన్నగా నవ్వుతూ.

"అంటే, నాకు వుద్యోగం వస్తుందంటారా?" రాంబాబు చాలా ఆసక్తిగా అడిగాడు.

"వస్తుంది... ఒకవేళ యీ వుద్యోగంరాక పోయినా, దీన్నిమించిన మరో వుద్యోగం వస్తుంది. నేను చెప్పిన అదృష్టం నీవుద్యోగం గురించి కాదు"

"మరి దేన్ని గురించి?"

"నీకు యివాళ, తప్పితే రేపు, అంతకు మించి ఎక్కువటైము పట్టదు... ఒక అమ్మాయి పరిచయమవుతుంది. ఆ అమ్మాయి తెల్లగా, అందంగా వుంటుందే తప్ప నల్లగా, వికారంగా మాత్రం వుండదు. ఆ అమ్మాయి పేరు 'అ' అనే అక్షరంతో ఆరంభమవుతుంది. పుట్టిన తేదీ కూడా అయిదో నెంబర్ అయివుంటుంది. అంటే, ఖచ్చితంగా అయిదే కానక్కర్లేదు. పధ్నాలుగు కావచ్చు. ఒకటీ, నాలుగు కలిపితే అయిదే అవుతుందిగా. అలాగే యిరవై మూడు అయినా కావచ్చు. రెండు, మూడు కలిపినా అయిదేగా అవుతుంది"



రాంబాబు కొన్ని క్షణాలపాటు మాట్లాడకుండా, తర్వాత ఏదో వూహనించి తేరుకున్నట్టుగా తల ఆడించి'' ఆ అమ్మాయి ధనవంతురాలా?'' అని అడిగాడు.

''కాదు, ప్రస్తుతం నీబోటి మనిషే! కానీ, ఆ అమ్మాయి నీ జీవితంలోకి రావడంతో నీ దశ తిరుగుతుంది''

రాంబాబు ఆ మాట నమ్మేడో లేదోగాని, కొన్ని క్షణాలపాటు గాల్లో తేలాడు. కానీ ఇంటర్వ్యూకి టైమ్ అయిపోతోందన్న విషయం గుర్తొచ్చి, అక్కడనించి ఆఫీసుకి బయలుదేరాడు. అతని మీద తమ ప్రయోగం ఫలించినట్టుగా ముసలాళ్లు యిద్దరు సంతోషంగా షేక్‌హేండ్సు యిచ్చుకున్నారు.

''అన్నట్టొరేయ్, మీ అమ్మాయికి కూడా మా రాంబాబు సంగతి చెప్పేవా లేదా?'' అన్నాడు చలపతి.

''వుదయం చెప్పాకే యిక్కడకొచ్చి మీవాడికి చెప్పేను''

''నమ్మిందా?''

''నమ్మకేం చేస్తుంది? నేను చెప్పినా చెప్పకపోయినా, ఏనాటికైనా తనుగొప్పదాన్నవుతాననే దానినమ్మకం. కాకపోతే, దాని నమ్మకానికి నా జ్యోతిషం మరికాస్త బలాన్నిచ్చిందంతే''

ఇద్దరూ పగలబడి నవ్వుకున్నారు.



రమ్య సోప్ ఇండస్ట్రీస్ అధినేత రామారావు చాలా చిత్రమైన మనిషి! ఈ విషయం అతన్తో పరిచయంవున్న వాళ్ళందరికీ తెలుసు. అతను దేవుణ్ణి నమ్ముతాడు. కానీ, దేవుడి మీదే భారం వేసి బద్ధకస్తులుగా తిరిగే వాళ్ళను నమ్మడు. దేవుడిపేరిట వెలసిన మతాన్ని గౌరవిస్తాడుగాని, మతం పేరిట పెరుగుతున్న వున్మాదాన్ని, అమానుష చర్యల్ని అతను ఖండిస్తాడు. ఆత్మలు వున్నాయన్నా, కొన్ని ఆత్మలు దెయ్యాలుగా, భూతాలుగా మారుతాయన్నా అతను నమ్ముతాడుగాని, ఆ భూతాలపేరిట బతికే భూతవైద్యుల్ని, మంత్రగాళ్లని నమ్మడు. పురాణాన్ని భక్తితో కాకుండా, విచక్షణ, హేతువాదం, తార్కికజ్ఞానంతో చదవమని సలహాయిస్తాడు. ఓ విషయంలో శ్రీరాముడికంటే పరశురాముడే బెటరని ఆయన వుద్దేశ్యం. ''మీ పినతల్లికి మాటయిచ్చేనుకాబట్టి ఆ ప్రకారం నువ్వు అడవులకిపో'' అని తండ్రి చెప్పినప్పుడు రాముడు మారు మాట్లాడకుండా వెళ్లిపోయేడు తప్ప, అతనేం రీజనింగు తియ్యలేదు, తెలివితేటలుపయోగించి వాదించలేదు. పరశురాముడి తండ్రి, తన భార్య రేణుకని శిరచ్ఛేదం చెయ్యమని కొడుకుని ఆదేశించినప్పుడు, కుమారుడిగా అతను చాలా క్లిష్టమైన పరిస్థితిలో పడ్డాడు. తనకితల్లీ కావాలి, తండ్రీకావాలి! కానీ ఎలా? తల్లిని చంపగూడదు. అలాగని తండ్రిమాట ఎదిరించగూడదు. అందుకని ఓ గొప్ప టెక్నిక్ ప్లే చేసి, తండ్రి చెప్పినట్టు తల్లిని నరికేశాడు. అతని పితృవాక్ పరిపాలనకి మెచ్చి తండ్రి, ఏదైనా వరం కోరుకోమన్నప్పుడు నా తల్లిని బతికించండీ అన్నాడు. జమదగ్ని చచ్చినట్టు, రేణుకాదేవిని బతికించాడు. అక్కడ పరశురాముడు ప్రదర్శించిన ద్వంద్వ నీతిని రామారావు అభినందిస్తాడు. అతనికి బి.ఎ, బీకామ్, బియ్యేస్సీ డిగ్రీలతోపాటు, న్యాయశాస్త్రంలో కూడా పట్టా వుంది. వాటితోపాటు డిప్లమో ఇన్ ఏక్టింగ్ కూడా పాసయ్యేడు. ప్రతిమనిషి జీవితంలోనూ ఏదో ఒక సందర్భంలో నటించక తప్పదుగాబట్టి, ఏక్టింగ్‌లో కాస్త ట్రైనింగ్ అయితే మంచిదని, యూనివర్సిటీలో తర్ఫీదై, డిప్లమో పుచ్చుకున్నాడు.

కోర్టుల్లో సాక్షులచేత భగవద్గీత మీద ప్రమాణం చేయించడం ఆనవాయితీ! కానీ, భగవద్గీతమీద ప్రమాణం చేసి కూడా అబద్ధమాడితే, ఆ అబద్ధమాడినవాడికి ఏం అవుతుందట? చచ్చిన తర్వాత పుణ్యాలోకాలకి పోకుండా, నరకానికి పోతాడని చెప్తారు. కానీ

బతకనేర్చినవాళ్లు, బతుకుతున్నంతకాలం సుఖపడ్డానికి ప్రయత్నిస్తారుగాని, చచ్చింతర్వాత ఏలోకాలకి వెళ్తామనే పాయింట్ ఆలోచించరు. అంచేతవాళ్ళు భగవద్గీత నెందుకు గౌరవిస్తారు? భగవంతుడికెందుకు భయపడతారు? ఆ భయమే లేనప్పుడు ఎందుకు నిజం చెప్తారు? చెప్పరు! అంచేత మాయాబజార్ సినిమాలో చూపించిన సత్యపీఠంలాంటి పీఠాన్ని ప్రతి కోర్టులోనూ పెట్టాలని వాదిస్తాడు. ఆ పీఠం మీద నిలబడగానే, ఆ మనిషి తనకి తెలియకుండానే నిజాన్ని బైటపెట్టేస్తాడు. అలాంటి పీఠాలుంటే నేరస్థులు తప్పించుకోలేరు. అమాయకులు శిక్షించబడరు. అలాంటి పీఠాలు పురాణాల్లోనే తప్ప, యిప్పుడెక్కడుంటాయి సార్! అంటూ కొంతమంది అతన్ని వెటకారం చేశారు. "ఏం, ఎందుకుండవు? పురాణాల్లో లేని ఎన్నో వింత వస్తువుల్ని ఎలాక్ట్రానిక్సు వచ్చేక కనిపెట్టడం జరిగింది. అలాంటప్పుడు సత్యపీఠాన్ని కనిపెట్టడం పెద్దపనా? నేనేగనక సైంటిస్టునైవుంటే, ఆ పీఠాన్ని ఖచ్చితంగా కనిపెట్టుండేవాణ్ణి" అంటూ వాళ్ళతో గొడవకి దిగేడు. అలాంటి పీఠాల ఆవశ్యకత గురించి పరిశీలించమని సుప్రీమ్‌కోర్టుకి వుత్తరాలైతే రాసేడుగాని, అట్నుంచి యింకా జవాబురాలేదు.

పూర్వకాలంలో రాజులు మారువేషాల్లో దేశాటనంచేసి ప్రజల కష్టసుఖాలు తెల్సుకునేవారని పుస్తకాల్లో చదువుతున్నాం. కానీ యిప్పుడా పద్ధతిని ఎవర్నూ ఆచరణలో పెట్టకపోవడం ఆయనకి చాలా కోపాన్ని తెప్పించింది. జిల్లా కలక్టరుకి, ఎమ్మెల్యేలకి, ఎంపీలకి వుత్తరాలు రాస్తూ, కొన్ని ముఖ్యమైన కేసుల్లో నిజానిజాలు తెల్సుకోడానికి మీరెందుకు మారువేషాల్లో వెళ్ళకూడదూ అని రాశాడు. రాసి నాలుగైదు ఏళ్లు గడిచిపోయినా, ఎవర్నించీ యింకా రిప్లై రాలేదు. ఎప్పటికైనా తన సలహాపాటిస్తారనే ఆశ వుంది.

రామారావు అటువంటి చిత్రమైన మనిషికాబట్టే, యిప్పుడు జరగబోయే ఇంటర్వ్యూని కూడా చిత్రంగానే ఏర్పాటు చేశాడు. హాల్లోని గడియారం ఠంగ్‌ఠంగ్‌మని పది గంటలు కొడుతుండగా, రామారావు హాల్లోకొచ్చి, ఇంటర్వ్యూకొచ్చిన వాళ్లందరికీ తనే స్వయంగా పరిచయం చేస్కుని, అందరికీ రెండు చేతులతోనూ నమస్కరించాడు.

కేండిడేట్సంతా ఆశ్చర్యపోతే "దయచేసి ఆశ్చర్యపోకండి... ఈ కంపెనీకి నేను యజమాన్నే కావచ్చు, కానీ మీరింకా నా వుద్యోగస్థులుకారు. ఇంటర్వ్యూలో సెలక్టయినవాళ్ళు నా దగ్గర వుద్యోగానికొస్తారు. ఆ తర్వాత వాళ్ళు నమస్కారాలు పెట్టడం, నేను అందుకోవడం జరుగుతుంది. అప్పుడు మీకు నమస్కారాలు పెట్టే అవకాశం నాకుండదు కాబట్టి, యిప్పుడే నా నమస్కారాలు నేను పెట్టేస్తున్నాను" అంటూ ప్రారంభించాడు.

"ఇంక, అసలు పాయింట్‌కొస్తే, నేను ఇంటర్వ్యూలో ఏ ప్రశ్నలు అడిగేస్తానో అని మీరంతా ఆవకాయ తయారు చెయ్యడం దగ్గర్నించి అంతరిక్షయానం చెయ్యడం వరకు అన్ని రకాల పుస్తకాలు చదివేసుంటారు. కానీ, మీ శ్రమంతా వృధా! ఎందుకంటే నేను మిమ్మల్ని ఏ ప్రశ్నలూ అడగను. యజమాని ప్రశ్నలు అడగడం అభ్యర్థులు జవాబులు చెప్పడం అనేది కనిమ్కడికాలంనించీ జరుగుతున్నదే! అందుకే ఆ పాత పద్ధతుల్ని ఖండించి ఓ కొత్త పద్ధతిని ప్రవేశపెడుతున్నాను. క్రిందటి సారి హైదరాబాద్‌లో ఇంటర్వ్యూ చేసినప్పుడు ఇంటర్వ్యూకొచ్చిన ప్రతీకేండిడేట్‌ని వేమన పద్యాలు, సుమతీశతకంలోని పద్యాలు, భర్తృహరి సుభాషితాలు, ఒక్కోదానికి మూడేసి చొప్పున అప్పజెప్పమన్నాను. కానీ చాలామంది ఫెయిలయ్యేరు. కాన్వెంట్‌లో చదువుకొచ్చిన వాళ్లకైతే నేను చెప్పిన పేర్లే తెలియలేదు. మీరు ఆ పద్యాలు అప్పజెప్పక్కర్లేదు. నేను ఒకసారి చేసినట్టు మరోసారి ఇంటర్వ్యూ చెయ్యను. అది నా పోలసీకే విరుద్ధం! ఇప్పుడు జరగబోయే ఇంటర్వ్యూలో మీరు నన్ను ప్రశ్నలడుగుతారు, నేను జవాబులు చెప్తాను. నేను జవాబు చెప్పలేని ప్రశ్నలు ఎవరైతే అడుగుతారో, వాళ్లకే వుద్యోగం యిస్తాను. అయితే, ఒక విషయం ముందే చెప్పేస్తున్నాను. నేను బిఏ. బీకామ్, బియ్యస్సీ, బియల్. ప్లస్ డిప్లమో ఇన్ ఏక్టింగ్ పాసైనవాణ్ణి! నేను సమాధానం చెప్పలేని ప్రశ్నంటూ సాధారణంగా ఏదీ వుండదు. అంచేత జాగ్రత్తగా ఆలోచించి మరీ ప్ర

శ్నించండి. నేను ఓడిపోవాలని కోరుకుంటూ నా రూమ్‌లోకి వెళ్లిపోయి, మిమ్మల్ని పిలుస్తాను'' రామారావు తన రూమ్‌లోకి వెళ్లిపోయేడు.

ఇంటర్వ్యూకొచ్చిన వాళ్లెవరికీ అతని మనస్తత్వం ఏమిటో అర్థం కాలేదు. ఇలాంటి ఇంటర్వ్యూలు ఎక్కడా జరిగినట్టుగా ఎవరూ వినలేదు. ఏ పేపర్లోనూ చదవలేదు. అతను జవాబు చెప్పలేని ప్రశ్నలు వేయాలంటూనే తనకున్న డిగ్రీలలిస్టు చెప్పేడు. పైగా తనో మేధావినని ఎవరికీ శ్రమలేకుండా తనే చెప్పుకున్నాడు. అతన్ని ఏ సబ్జెక్టులో ప్రశ్నించాలి.

అందరి ఆలోచనా యిదే!

రాంబాబు ఆలోచనకూడా ఇదే! శతకోటి దరిద్రాలకి అనంతకోటి వుపాయాలంటారు. ముక్కోపికి ముఖస్తుతే మందంటారు. అలాగే మేధావులను ఓడించడానికి కూడా ఏదో పేచీల్ని పై పేచీల్ని ఆ భగవంతుడు సృష్టించే వుంటాడు. వాటిని వెదికి పట్టుకుంటేనే మన ప్రతిభ అనుకున్నాడు. అతని ఆలోచనలు రాకెట్ వేగంతో ప్రయాణం చేస్తున్నాయి.

అభ్యర్థుల్లో అమల కూడా వుంది. ఆమెక్కూడా రామారావు స్పీచ్ విన్నాక కంగారుపుట్టింది. ఏవైనా పొడుపుకథలు పొడిచి అతని నోరుకట్టేస్తే! కట్టించొచ్చుగాని, తనకి తెల్సిన పొడుపుకథలన్నీ అందరూ సులభంగా చెప్పగలిగేవే!

ఇంటర్వ్యూ ఆరంభమయింది.

రంగారావు అనే అబ్బాయిని పిలిచారు. వెళ్లినవాడు మూడునిమిషాల్లో బైటపడ్డాడు. లోపల బాగా చీవాట్లు తిన్నవాడిలా, ముఖమంతా ఎర్రబడింది. "ఏం అడిగారండి? ఏం అడిగారు?'' అందరూ ఆసక్తిగా అడిగారు. రంగారావు ఓసారి రుమాలుతో ముఖం తుడుచుకుని "మీ అమ్మగారు గొడ్రాలు కాదుసార్ అని నేనన్నాను'' అన్నాడు. భలేభలే ప్రశ్న వేశారు. దెబ్బకి నోరుపడిపోయివుంటుంది అన్నాడో అబ్బాయి.

"లేదండి... యిది ఖండించలేని విషయం కదానే నేనూ తెలివిగా అడిగాను. కానీ అతను మనం అనుకున్న దానికంటే తిక్కమనిషండి. మా అమ్మగారు నిజంగా గొడ్రాలే అన్నాడండి''

అందరూ ఆశ్చర్యపోయేరు. "యితన్ని కన్నాక ఆవిడ గొడ్రాలెలా అవుతుంది?'' అమల ఆశ్చర్యంగా అడిగింది.

"అతన్ని కన్నతల్లి ఎవరో అతనికే తెలియదట. ఆవిడ కనేసి, ఓ కుప్పతొట్టెలో పారేస్తే, ఏదో అనాథాశ్రమంలో పెరిగాడట. అక్కడనించి ఎవరో ధనవంతురాలు అతన్ని తీసుకెళ్లి పెంచుకుందంట. అంచేత ఆవిడే అతని తల్లిగాని, వీధిలో పారేసిపోయిన ఆ కసాయి మనిషి నాకు తల్లెలా అవుతుంది? అలాంటి వాళ్లని తల్లులుగా భావిస్తున్న నువ్వు అన్నం తింటున్నావా, గడ్డి తింటున్నావా అంటూ నన్ను బైటకి గెంటేశాడు'' అంటూ రంగారావు కళ్లంట నీళ్లు పెట్టుకున్నాడు. రంగారావు వేసింది మంచి ఇంటిలిజెంట్ క్వొశ్చనే! కాక పోతే రామారావుగారు అభినవకర్ణుడన్న విషయం రంగారావుకి తెలియక, ఆ ప్రశ్నడిగి, రామారావుకి కోపం తెప్పించాడు. జరిగిన సంఘటనతో అందరి ఆందోళన మరింత పెరిగింది. అసలే కొత్త రకం ఇంటర్వ్యూ! ఇలా అని తెలిస్తే రామారావు ఫేమిలీ హిస్టరీ ఏమిటో తెల్సుకునే వచ్చేవాళ్లంగా అనుకున్నారు. ఇప్పుడేం అడిగితే ఏం వస్తుందోనే భయం అందర్నీ ఆవరించింది.

పది నిమిషాల తర్వాత రాంబాబుని పిలిచేరు. రాంబాబు మనసులోనే ఏదో రిహార్సలు చేసుకుంటూ లోపలకి వెళ్లాడు. రామారావు గదిలోకెళ్లాక గెటప్ మార్చినట్టున్నాడు. మంకీ కేప్, తూరీగమీసాలు పెట్టుకుని పిట్టల దొరలా కనిపిస్తున్నాడు.

"కూర్చో''

రాంబాబు కూర్చున్నాడు.

"అడగవయ్యా... నేను జవాబు చెప్పలేని ప్రశ్న ఒక్కటి అడిగేవనుకో నీకు క్లర్క్ పోస్ట్ యిస్తాను. అలాంటివే రెండు ప్రశ్నలు అడిగేవనుకో, నువ్వు టైపు, షార్ట్‌హేండు పాసయ్యేవు కాబట్టి నీకు స్టెనోగ్రాఫర్ పోస్టుయిస్తాను, ఆరంభించు''

రాంబాబు ధైర్యం చిక్కబట్టుకుని అడిగాడు. "మీ పేరేమిటిసార్?''

"రామారావు''

"రామారావు అనే మాటకి అర్థం ఏమిటి



సార్?''

రామారావు పగలబడి నవ్వాడు. ''యింత చిన్న ప్రశ్నకి కూడా సమాధానం చెప్పలేననుకోవడం చూస్తుంటే, నీ మీద నాకు జాలేస్తోందయ్యా''

''దయచేసి నేను అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పండి సార్!''

''నా పేరు రామారావు... దాని అర్థం ఏమిటంటే... రామ అంటే శ్రీరాముడని అర్థం''

''కరక్టేసార్! కానీ... రావు అనే మాటకి అర్థం ఏమిటి?''

రాంబాబు అడిగిన మాటకి రామారావు వులికిపడ్డాడు. రావు అనే మాటకి అర్థం చెప్పడానికి చాలా ప్రయత్నించాడుగాని, చెప్పలేకపోయేడు. తన పేరు రామారావు. ఇంకా యీ లోకంలో చాలామంది రామారావులు, వెంకట్రావులు, అప్పారావులు, యింకా చాలాచాలా మంది రావులున్నారు. కానీ, రావు అనే మాటకి, తన బిఏ, బియ్యస్సీ, బీకామ్, బియల్, డిగ్రీలక్కూడా అర్థం తెలియలేదు. ఈ ప్రపంచంలోని ఎన్నోఎన్నో విషయాల్ని గురించి తెల్సుకున్న తను, తన పేరుకి అర్థం తెల్సుకోలేకపోవడం ఎంత సిగ్గు చేటు!

క్షణాలు గడుస్తున్నాయి.

రామారావు ముఖానికి చెమటలు పడుతున్నాయి తప్ప నోటంట మాట రావడంలేదు. లాభంలేదయ్యా, రావు అనే మాటకి అర్థం తెలియదని ఒప్పేసుకుంటున్నాను. నువ్వే జవాబు చెప్పు'' అన్నాడు.

''సారీసర్! నాకూ తెలీదు''

రామారావు గభీమని కుర్చీలో నించిలేచాడు. ''ఏం తమాషాగావుందా? నీక్కూడా తెలీని ప్రశ్నని నన్నెందుకడిగావ్?''

''క్షమించండిసార్, మీరు జవాబు చెప్పలేని ప్రశ్నల్ని మేం అడగాలని మీరు కండీషన్ పెట్టేరుగాని, ఆ ప్రశ్నకి సమాధానం మాకు తెలిసుండాలని మీరు షరతు పెట్టలేదుగా'' రాంబాబు యిచ్చిన జవాబు అతన్ని కాస్త చల్లబరిచింది. ఔను అదీ నిజమేనన్నట్టుగా తల వంకించి కుర్చీలో కూర్చున్నాడు.

''ఇంక నన్ను వెళ్లమంటారా సార్?''

''వెళ్లు''

అయినా రాంబాబు వెళ్లలేదు. కారణం అడిగాడు రామారావు. ''నాకు స్టెనోగ్రాఫర్ వుద్యోగం చేసే అవకాశం వున్నప్పుడు గుమస్తా వుద్యోగం ఎందుకు చెయ్యాలనిపిస్తోంది సార్?''

''అంటే నేను జవాబు చెప్పలేని మరో ప్రశ్న కూడా నువ్వు అడగ్గలననే అనుకుంటున్నావా?''

''అనుకోవడం లేదుగాని ట్రైచేద్దామనుకుంటున్నాను. మీరు వద్దంటే మానేస్తాన్లెండి''

రామారావు అతన్ని రెప్పార్పకుండా నిశితంగా చూశాడు. అతన్ని ప్రశ్న అడగొద్దంటే తను చేతకాని వాణ్ణని ఒప్పుకున్నట్టవుతుంది. పైగా రెండు ప్రశ్నలు అడిగి, గెలిస్తే స్టెనోగ్రాఫర్ వుద్యోగం యిస్తానని తనే ఆశపెట్టాడు.

''సరే అడుగు'' అన్నాడు.

''ఈసారి సరదాగా తెలుగు భాష గురించి ప్రశ్న అడుగుతాను సార్. అఫ్‌కోర్స్ తెలుగు భాషకాబట్టి మీరే గెలిచేస్తారనుకోండి''

''అనుకోండీ ఏమిటి? తప్పకుండా గెలుస్తాను. ఎందుకంటే నేను ఉభయభాషా ప్రవీణుణ్ణి, అడుగు''

''న' అనే ఒక్క అక్షరంతోనే, ఓ వాక్యాన్ని చెప్పాలి. ఆ వాక్యానికో అర్థం కూడా వుండాలి 'న' యొక్క గుణింతంలోని అక్షరాలన్నీ వుపయోగించొచ్చు''

రామారావు మళ్లీ ఖంగుతిన్నాడు. 'న' అనే ఒక్క అక్షరంతో ఒక వాక్యం చెప్పడమంటే సాధ్యమయే పనేనా? అని ఆలోచించబోతూనే సడన్‌గా అడిగాడు.

''దీనికైనా నువ్వు జవాబు చెప్పగలవా? లేకపోతే యిందాకట్లాగే లాజిక్ తీసి తప్పుకుంటావా?''

రాంబాబు నవ్వి జవాబు చెప్తానన్నాడు. రామారావు కాస్సేపు ట్రై చేశాక తన ఓటమిని ఒప్పుకున్నాడు. 'న' అనే అక్షరంతో అయిదారు వాక్యాలు చెప్పబోయినా మధ్యలో వేరే అక్షరాలు వచ్చేశాయి కాబట్టి ఒప్పుకోక తప్పలేదు.

రాంబాబు ఆ వాక్యాన్ని వివరించాడు.





"నిన్న నీ నాన్న నన్నునిన నేను నిన్ననినా"

రామారావు ఆశ్చర్యపోయేడు. ఏదీ మళ్లీ చెప్పు అంటూ ఓ కాగితం మీద రాసుకున్నాడు.

"నిన్న నీ నాన్న నన్నునిన నేను నిన్ననినా"

రామారావు రాసుకున్న దాన్ని రెండు మూడు సార్లు చదివాడు. సంతోషించాడు. రాంబాబుకి షేక్‌హేండ్ యిచ్చి అభినందించాడు.

"మరో ప్రశ్న అడగమంటారాసార్?" రాంబాబు వుత్సాహం పట్టలేక అడిగాడు.

"వద్దు రాంబాబూ వద్దు... ఈ మూడో ప్రశ్నకి నేను జవాబు చెప్పొచ్చు, చెప్ప లేకపోవచ్చు. నువ్వే గెలిచేవనుకో. నీకు యిప్పట్లో యివ్వడానికి నా దగ్గర ఏ పోష్టూ ఖాళీగాలేదు" అంటూ రాంబాబుని మరోసారి అభినందించి బయటికి పంపించాడు.

రాంబాబు వేసిన ప్రశ్నలు వినగానే బయట నున్నవాళ్ళలో కొందరు అతని మేధాసంపత్తిని ప్రశంసించారు. మరికొంతమంది అసూయపడ్డారు. మీరు మాటలగారడీ చేసి నెట్టుకొచ్చేసారుగాని, నిజానికి అవో ప్రశ్నలా? అంటూ ఒక యువకుడు వ్యంగ్యంగా మాట్లాడాడు. ఆ మాటకి రాంబాబుకంటే ఎక్కువ ఫీలయింది అమలే! "మనకి రాని విద్య మరెవరికొచ్చినా, ఆ వ్యక్తిని అభినందించడం మన సంస్కారం అనిపించుకుంటుంది మిస్టర్" అంటూ ఆ అబ్బాయికి రిటార్ట్ యిచ్చింది. నాతరవున మాట్లాడుతున్న యీ అమ్మాయి ఎవరా అని ఆశ్చర్యంగా చూసేడు తప్ప ఆమెతో మాట్లాడలేదు. ఆమెమాత్రం, యీ రాంబాబుని అడిగి, ఏదో తిరకాసు ప్రశ్న తెల్సుకుంటే తప్ప ఆ రామారావు దగ్గర నెగ్గుకురావడం కష్టమని మనసులోనే నిర్ణయించుకుంది. ఇంటర్వ్యూలో ఆమె నెంబరు యిరవైఎనిమిది. ఆ నెంబరు రావడానికి మరో గంట పట్టొచ్చు. "ఎక్స్‌క్యూజ్ మి, మీకు అభ్యంతరం లేకపోతే, అలా బయటకెళ్ళి కాఫీ తాగుదాం వస్తారా?" అని రాంబాబు దగ్గరకెళ్ళి ఎవరికీ వినబడకుండా మెల్లగా అడిగింది. రాంబాబు ఆమెనోసారి చూసి "పదండి" అన్నాడు.

★ ★ ★

హొటల్లో కూర్చుని అమల కాఫీ సిప్‌చేస్తూ "నా పేరు అమల" అంది.

వెరీ స్వీట్ నేమ్. అన్నట్టు, నాగార్జున యీ మధ్య అమలని పెళ్లి చేసుకున్నాడు తెలుసా?"

ఆమెనవ్వింది. అప్పుడు హొటల్లో వారిద్దరూకాక మరో నలుగురైదుగురుమాత్రం ఉన్నారు. వాళ్ళు కూడా దూరంగా వున్నారు. అందుకే అమల కాస్త బిగ్గరగానే మాట్లాడుతోంది.

"మీ పేరు రాంబాబు కదండి" అంది అమల

"మీకెలా తెల్సు?

"యిందాక ఆ పేరు పిలిస్తేనే మీరు లోపల కెళ్ళారు"

ఇద్దరూ నవ్వుకున్నారు. "రాంబాబు, సూరిబాబు అనేవి ఆంధ్రాలో చాలా పాప్యులర్ నేమ్సకదండి" మళ్ళీ అమలే అంది.

"ఔననుకుంటాను"

"మీరు నాకో సాయం చెయ్యాలండి"

రాంబాబు ఆమెనోసారి అదోలా చూసి జేబులోనించి పర్సుతీసాడు. "నా దగ్గర పధ్నాలుగు రూపాయిల అరవై పైసలున్నట్టు గుర్తు. బస్ ఛార్జికింద డెబ్బై పైసలుంచుకుని మిగతా పదమూడు రూపాయిల తొంభైపైసలూ యిచ్చేస్తాను"

అమల ఫక్కుమని నవ్వింది.

ఆమె మామూలుగా వున్నప్పటికంటే అలా నవ్వినప్పుడే ఎక్కువ అందంగా కనిపిస్తుందని మనసులో అనుకున్నాడు.

"మనిషినించి మనిషి కోరుకునే సాయం ఒక్క డబ్బేనటండి? నేను యీ ఇంటర్వ్యూలో తప్పకుండా సెలక్ట్ కావాలని జెన్రల్‌నాలెడ్జి బుక్కంతా బట్టీపట్టొచ్చేను. కానీ, ఆ రామారావుకి తిక్కో, పిచ్చో తెలీదుగాని, వెధవ కండీషన్లు పెట్టేడు. అతని నోరు మూయించడానికి ఏ ప్రశ్న అడగాలో నాకు అర్ధమై చావడంలేదు. నాకు హెల్ప్ చెయ్యగల మేధావి మీరు తప్ప మరెవరూ కనబడ్డంలేదు"

అమల ఆంతర్యం అర్థమైంది. ఓ అందమైన అమ్మాయి తనని ఓ సాయం కోరడం జీవితంలో యిదే ప్రధమం. తన బుర్రలో యింకా అలాంటి చిక్కు ప్రశ్నలు చాలా వున్నాయి. ఒక్కటి అప్పిచ్చినంత మాత్రాన తప్పేంలేదనుకుంటూ, ఓ ప్రశ్న చెప్పబోయి,

అంతలోనే ఏదో సందేహం వచ్చి ఆగి పోయేడు.

అమల అతని సంశయాన్ని యిట్టే గ్రహించింది "ఏం ఆగి పోయేరు? ఒకవేళ నేను ఇంటర్వ్యూలో సెలక్టయిపోతే, మీకు యివ్వాల్సిన పోష్టేదో నాకు యిచ్చేస్తారనా? అలాంటి ప్రమాదమేం వుండదులెండి. ఎందుకంటే, ఆడవాళ్ళకో పోష్టు, మగాళ్ళకి రెండూ వున్నాయి. ఈ విషయం మాత్రం నేను ముందే కూపీ లాగి వుంచేనులెండి" అంటూ మళ్ళీ ఫక్కుమంటూ నవ్వింది.

రాంబాబు తృప్తిపడ్డాడు. ఆమెకు ఓ చిక్కు ప్రశ్న చెప్పేడు.




రామారావు గదిలోకి ఒక్కొక్కరే ఆందోళన పడుతూ వెళ్తున్నారు. నిరాశ వ్యక్తంచేసే ముఖాలతో తిరిగి వస్తున్నారు. రామారావుని మాటల చమత్కారంతో ఓడించడం వారెవరివల్ల సాధ్యంకాలేదు. ఐ.ఏ.ఎస్. పరీక్ష అన్ని పరిక్షల్లోకి క్లిష్టమైందంటారుగాని, రామారావు పెట్టిన పరీక్ష నాలుగు ఐ.ఏ.ఎస్.లతో సమానమని ఓ అబ్బాయి కామెంట్ చేశాడు. క్షణాలు గడిచేకొద్దీ అమలలో ఆత్రం ఎక్కువ కాసాగింది. రాంబాబు చెప్పిన ప్రశ్న చూడ్డానికి సింపుల్‌గాను, వింటానికి మామూలుగానూ వున్నట్టనిపించే ప్రశ్న. కానీ, సమాధానంమాత్రం అందరూ చెప్పలేరు. ప్రశ్న వినగానే అమలకి అదే భావం కలిగి సంతోషించింది గాని, తనకంటే ఎక్కువ క్వాలిఫికేషన్స్ వున్నవాళ్ళు కూడా రామారావు చేతిలో ఓడిపోయి వచ్చేస్తుంటే క్రమంగా భయం పట్టుకుంది. నేను సెలక్ట్‌కాకపోతే? ఆ ప్రశ్నకి సమాధానం చెప్పుకోలేకపోయింది.

అమల పేరు, నెంబరు పిలిచాడు ప్యూన్.

అమల ధైర్యం చిక్కబట్టుకుని లోపలకెళ్ళింది. రామారావు కూర్చోమన్నాడు. కూర్చుంది. కాఫీ యిచ్చేడు కానీ తాగడానికి ఆమె సంశయించింది.

"ఫర్వాలేదు తాగమ్మా, యింకా నువ్వు నా సబార్డినేట్‌వీ కాదు, నేను నీబాస్‌నీ కాదు, తాగు"

అమల ధైర్యం చేసి తాగింది.

"నా ఇంటర్వ్యూ పద్ధతి గురించి, బైట మీ కేండిడేట్సంతా ఏమనుకుంటున్నారు?"

రామారావు రెండు క్షణాలు ఆగినా అమలకేం చెప్పాలో అర్ధంకాలేదు. ప్రశ్న అడిగినా, ఆమె జవాబు కోసం ఎదురుచూడకుండా జవాబు కూడా తనే చెప్పేడు. "యింతమందిమి కలిసి, ఆ రామారావు జవాబు చెప్పలేని ప్రశ్న ఒక్కటీ అడగలేకపోయేమే అని సిగ్గు పడుతున్నారు కదూ? ఇలాంటి మేధావిని యింతకు ముందు ఎక్కడా కనీ, విని, ఎరిగుండలేదని గుసగుసలాడుకుంటున్నారుకదూ? ఇలాంటి తెలివైనవాడు శతాబ్దానికొక్కడు కూడా పుట్టడు కాక పుట్టడని చెవులు కొరుక్కుంటున్నారు కదూ? పాపం అమాయకులు... నాకు ప్రపంచ చరిత్రంతా క్షుణ్ణంగా తెల్సునన్న సంగతి తెలియక, నయాగరా జలపాతం మీదనించి కిందకి పడుతున్నప్పటి దాని స్పీడెంత? నెహ్రూగారికి కూతుర్నిచ్చిన మామగారి పేరేవిటి? గాంధీగారి కొడుకుల్లో ఆఖరివాడి పేరేవిటి? అతని డేటాఫ్‌బర్తేవిటి? పుట్టుమచ్చల్లేని మనుమలుంటారా? అంటూ ఏవేవో ప్రశ్నలు వేశారు, రకీరకీమని జవాబులు చెప్పేశాను. అంతే! అందరూ గాలితీసిన బుడగల్లా చప్పబడిపోయి వెళ్ళిపోయేరు. అఫ్‌కోర్స్... వాళ్ళు అడిగినవి అందరూ చెప్పగలిగే ప్రశ్నలు కాదనుకో. కానీ, నేను అందర్లాంటివాణ్ణికాదుగా... అహ్హహ్హాహ్హా" అంటూ తనకి తనే కితకితలు పెట్టుకుని నవ్వుకునేవాడిలా పగలబడి నవ్వాడు.

ఆ నవ్వులో తనూ వంత కలపాలో లేదో అమలకి అర్ధంకాలేదు. అతని మెప్పుకోసం తనూ నవ్వొచ్చు. కానీ యిప్పుడు తనూ ఓడి




పోతే, అతను గేలి చేస్తున్న వాళ్ళలో తనూ ఒకరిగా చేరిపోతుందిగదా!

రామారావు టేబిల్ మీద పెన్సిల్‌తో కొట్టి చప్పుడు చేస్తూ ఆలోచనల్లో వున్న అమలని జాగృతపరిచాడు.

"చూడమ్మా, నేనెంత మేధావినో అర్థమైపోయేక, నన్ను ప్రశ్నించడానికి నీకు ధైర్యం చాలకపోవచ్చు, అందులోనూ ఆడపిల్లవి! అయినా ధైర్యం తెచ్చుకుని అడుగు" అంటూ ఆమెముందు మహామేధావిలా కనిపించడానికి ముఖాన్ని ప్రొఫైల్‌కి తిప్పి, బుగ్గమీద చెయ్యి వేస్కుని ఏదో దిగంతాలవైపు చూస్తున్నట్టుగా సీరియస్‌గా పోజు పెట్టాడు.

అమల ధైర్యం తెచ్చుకుని అడిగింది "ప్రశ్న అడగనా సార్?"

"అడగమనే చెప్తున్నాను. దేన్నిగురించి అడుగుతున్నావ్? ప్రపంచ రాజకీయాలగురించా?"

"అంత పెద్ద పెద్ద విషయాల గురించి అడగడానికి నాకు శక్తి చాలదుసార్! అందుకే, మీ ఫేమిలీ విషయాల్నే అడుగుదామనుకుంటున్నాను"

అమల చెప్పిందానికి రామారావు వులిక్కిపడ్డాడు. అమ్మాయి చక్కగా, చూడముచ్చటగా వుంది. తను, యిలాంటి తిరకాసు ఇంటర్వ్యూ పెట్టకుండా వుండుంటే, ఆమెకే తప్పకుండా వుద్యోగం యిచ్చుండేవాడు! కానీ, యిప్పుడీమె తన కుటుంబ వ్యవహారాలే అడుగుతానంటోంది.

వద్దంటే, తను ఓడిపోయినట్టవుతుంది!

తన ఆలోచనకి, తన సంస్కారంతో ఆనకట్ట వేస్తూ "నరే, అడుగు" అన్నాడు బింకంగా.

"మీనాన్నగారి పేరేవిటో చెప్పండిసార్"

రామారావు ఖంగుతిన్నాడు. మొట్టమొదట వచ్చిన రంగారావు అనే కేండేట్ని తను తిట్టి పంపించాడు. అతనుగాని, తన జన్మరహస్యాన్ని వీళ్ళందరికీ చెప్పేశాడా? ఏమైతేనేం, తన నమ్మకాల ప్రకారమే తను జవాబులు చెప్పాలి.

"నెహ్రూగారికి పిల్లనిచ్చిన మాంగారి ఫామిలీ పర్టిక్యులర్స్‌నే ఫట్‌ఫట్‌మంటూ చెప్పినవాణ్ణి మా నాన్నగారి పేరే చెప్పలేననుకున్నావా? మా నాన్నగారి పేరు వెంకట్రావుగారు"

"ఆయన తండ్రి పేరు"

"రాజారావుగారు"

"ఆయన తండ్రి పేరు?"

రామారావు రెండు మూడు క్షణాలపాటు ఆలోచించి, గుర్తుతెచ్చుకుని "మా ముత్తాతగారి పేరు సదాశివరావుగారనుకుంటాను... యస్... అయామ్ కరక్ట్... సదాశివరావు" అంటూ తన జ్ఞాపకశక్తికి మురిసిపోతూ తనే గర్వపడుతూ పగలబడి నవ్వేశాడు.

"ఓకేసార్... వారి తండ్రి పేరేవిటి?"

ఆ ప్రశ్న రామారావు నెత్తిమీదో సుత్తిదెబ్బ వేసింది. తన ముత్తాతపేరు ఏమిటాని బుర్రగోక్కుంటూ ఆలోచించాడు. సిగరెట్ వెలిగించి దమ్ము లాగుతూ ఆలోచించాడు. ఎలా ఆలోచించినా, అతని పేరేమిటో గుర్తురాలేదు. గుర్తు రాకపోవడం కాదు, అతని పేరెప్పుడూ తను వినలేదు. మరోవిధంగా తనకి ఆ పేరు అవసరం ఎప్పుడూ రాలేదు.

కొన్ని నిముషాలపాటు ఆలోచనల్ని వెనక్కీ ముందుకీ పరుగెత్తించాక సారీ, నాకు తెలీదంటూ ఒప్పేసుకున్నాడు.

"థేంక్యూ సార్! నేను ఇంటర్వ్యూలో సెలక్టయినట్టేనా?"

రామారావు ఆమెవైపు అభినందిస్తున్నట్టుగా చూసి, ఆమెకు షేక్‌హేండ్ యిచ్చేడు.

"సెలక్టవకేం చేస్తావమ్మా? గాంధీగారి ఫామిలీ గురించి, నెహ్రూగారి ఫామిలీ గురించి తెల్సుకున్నాను. వాళ్ళతో కాస్తో కూస్తో బంధుత్వం వున్న వాళ్ళందరి పేర్లు, వివరాలు కంఠతాపట్టేను. అంతెందుకు, తెలుగు వాఙ్మయానికి ఆదికవి అయిన నన్నయ భట్టారకుడు ఎక్కడివారు? ఎవరి తాలూకా అనే విషయాల్ని గురించి కూడా క్షుణ్ణంగా తెల్సుకున్నవాణ్ణి, నా కుటుంబ వివరాల గురించి నేను తెల్సుకోకపోవడం నా పొరపాటుగానే భావిస్తున్నాను. నన్ను పెంచినవాళ్లనే నా తల్లిదండ్రులుగా భావించినా, ప్రపంచ పరిజ్ఞానాన్నంతా పాకెట్లో పెట్టుకున్న నేను, నా కుటుంబ చరిత్రని తెల్సుకోకపోవడం, నాకు సిగ్గుచేటుగానే వుంది. తాబేలును చంపడానికి, దాని పైనున్న డిప్పమీద గునపాల్తో పొడిచినా ప్రయోజనం

వుండదు. ఎందుకంటే, ఆ డిప్ప అంత కఠినంగా వుంటుంది. కానీ, ఆ తాబేలునే వెల్లికిలా పడుకోబెట్టి, ఒక్క దెబ్బ కొడితే చాలు, అది చచ్చూరుకుంటుంది. ఈ విషయాన్ని ఎంతో మంది ఫ్రెండ్సుకి చెప్పి, నేను ఎంజాయ్‌చేసే వాణ్ణి. కానీ, యిప్పుడు నువ్వు, నన్నే ఆ తాబేలులా మార్చేసి, నా సొంత ఫామిలీ విషయాలడిగి నన్ను ఓడించేశావ్. ఇవాళ చేసిన ఇంటర్వ్యూలో రాంబాబు ఒక్కడే సమయస్ఫూర్తివున్న మేథావి అనుకున్నాను. కానీ, నువ్వు కూడా ఆ స్థాయిలోనే నన్ను ఆకట్టుకున్నావు. నిజం చెప్పాలంటే, యిప్పుడు నువ్వు ఆ రాంబాబు కంటే గొప్పగా కనిపిస్తున్నావు. ఎందుకంటే, అతను మగాడు, నువ్వు ఆడపిల్లవి! లోకజ్ఞానం తెల్సుకోడానికి, సాధారణంగా మగాడికున్నంత అవకాశం ఆడవాళ్ళకుండదు. అయినా నువ్వు గొప్పదనవనిపించావు. ఒకరు నా పేరు గురించి అడిగారు, యింకొకరు నా ఫామిలీలోని పూర్వీకుల గురించి అడిగారు. యిద్దరికిద్దరూ గొప్పవాళ్లే! అయినా, మీ యిద్దర్లో నువ్వే గొప్పదాన్లా కనిపిస్తున్నావు. ఎందుకంటే, నువ్వు ఆడపిల్లవై వుండికూడా, యింత చమత్కారాన్ని ప్రదర్శించావంటే, అబ్బో...'' అంటూ రామారావు ఒళ్ళూపై తెలియకుండా పొగిడేస్తుంటే అమలకి సిగ్గేసింది. అది స్త్రీ సహజమైన సిగ్గు కాదు! మరొకరి గొప్పతనాన్ని తనకి ఆపాదిస్తూ ఎవరైనా పొగిడినప్పుడు, పిడికెడు ఇంగితం, చిటికెడు సంస్కారం వున్న ఏ మనిషికైనా సహజంగా కలిగే సిగ్గు అది! ఈ అభినందనలన్నీ రాంబాబుకే చెందాలి అని మనసులోనే అనుకుంది.

రామారావు ఆమెను సెలెక్ట్ చేసినట్టుగా అక్కడికక్కడే ప్రకటించాడు! రాంబాబుకి తన కృతజ్ఞతలు చెప్పడానికి గబగబా బయటకొచ్చి అతనికోసం ఆత్రంగా వెదికింది. కానీ అతను కనబడలేదు. ఎవర్నైనా అడుగుదామనుకుంది. కానీ, అక్కడున్నవారంతా ఒకరికొకరు కొత్త! ఎవర్ని అడగడం!

★ ★ ★

రాంబాబు ఇంటర్వ్యూ అయిపోగానే యింటికొచ్చేసి వంట చేయనారంభించాడు. అతనికారోజు ఇంటర్వ్యూ వుండడంవల్ల రేఖ కాలేజి కేంటిన్లో భోంచేస్తానని చెప్పి వెళ్ళిపోయింది. చలపతి మాత్రం ఆ పూటకి బయట భోంచేస్తానని అనలేదు. నీ చేతివంటకి అలవాటు అయ్యేక బయట ఏ హొటల్లో తిన్నా డబ్బులిచ్చి గడ్డితింటున్నట్టుంటుందిరా అనడంవల్ల ఆరోజు కూడా వంటబాధ తప్పింది కాదు. చలపతి బయటనించి మొక్కజొన్న కండె నముల్తూ వచ్చి, ''వంట యింకా అవలేదా? నాకు వేళపట్టున భోజనం పడకపోతే, కడుపులో గేస్ ఎక్కువైపోతుందని నీకెన్నిసార్లు చెప్పను'' అంటూ చిరాకు ప్రదర్శిస్తూనే బట్టలు మార్చుకుని లుంగీ కట్టుకున్నాడు. వంట విషయంలో రాంబాబు ఎప్పుడూ తండ్రిమీద కోప్పడలేదుగాని, ఆరోజుమాత్రం కోపం వచ్చింది. తను ఇంటర్వ్యూకెళ్ళి తిరిగొచ్చేవరకు ఖాళీరోడ్లమీద తిరుగుతున్నాడేగాని, ఈరోజుకి కాస్త వంట చేసేద్దామన్న ధ్యాస లేకపోయింది.

''నాకు వంట రాదుకదరా'' చలపతి ఖచ్చితంగా చెప్పేశాడు.

''ఎందుకు రాదు? నా అంత బాగా కాకపోయినా నువ్వూ వండగలవు. కానీ, వండడానికి బద్ధకం?'' రాంబాబు గొణిగాడు. చలపతి, రాంబాబు నోటినించి అమల విషయం వస్తుందేమోనని ఎదురుచూసేడుగాని, అదేం జరగలేదు.

''ఆ జ్యోతిష్యుడు చెప్పింది ఎంతవరకూ నిజమైందిరా'' అంటూ రాంబాబువైపు ఓరకంట చూశాడు.

''ఒన్‌పర్సెంట్ కూడా నిజంకాలేదు''

చలపతి కంగుతిన్నాడు. కొంపదీసి అచ్యుతానందంగాడి కూతురు ఇంటర్వ్యూకి వెళ్ళలేదా? వెళ్ళిందని చెప్పేడే! ఒకవేళ ఆ అమ్మాయి వెళ్లిన ఇంటర్వ్యూ వేరు, వీడు వెళ్ళింది వేరూనా?

''ఇంటర్వ్యూకి ఆడవాళ్ళెవరూ రాలేదా?''

''రాకేం, వచ్చేరు''

''వాళ్ళల్లో, 'అ'కారంతో ప్రారంభమయ్యే పేరున్న అమ్మాయి ఎవరూ లేరా?''

''ఏమో... నాకు తెలీదు. నా గొడవేదో చూస్కుని యింటికొచ్చేశాను. వాళ్ళందరి పేర్లూ, ఎడ్రస్సులూ అడుగుతూ కూర్చుంటే యిక్కడ నీకు వంటెవడు చేస్తాడు?'' అంటూ వ్యంగ్యంగా మాట్లాడుతుండగానే, అమల గుర్తొ




చ్చింది.

ఆమె పేరు అమలని కదూ చెప్పింది! యస్... అమలే! నాగార్జున అమలని పెళ్ళిచేసుకున్నాడు తెలుసా అంటూ తను జోక్ చేశాడు కూడా!

"ఏంట్రా ఆలోచిస్తున్నావ్?"

"ఏంలేదు నాన్నా ఇందాక ఇంటర్వ్యూలో ఓ అమ్మాయితో పరిచయమైంది. ఆ అమ్మాయి పేరు..."

"అమల" చలపతి గభీమని నోరు జారేసి, నాలిక కరుచుకున్నాడు. ఆ మాట వినగానే రాంబాబు తండ్రివైపు తిరిగి ఆశ్చర్యంగా చూశాడు.

"నీకెలా తెలుసు?"

చలపతి తన తొందరపాటును కప్పిపుచ్చుకుంటూ, "యిందులో తెలియడానికేం వుందిరా! అమ్మాయి పేరు 'అ' కారంతో మొదలవుతుందని ఆ జోస్యుడు చెప్పేడుగదా. నీకు పరిచయమయిన అమ్మాయి పేరు అమలో, అరుణో, అంజలో, అచ్యుతవల్లో అయి వుంటుందనుకున్నాను. అమల అని మొదటి పేరు చెప్పగానే నువ్వు కంగారుపడి నావైపుకి తిరిగిపోయేవు. దానర్థం, ఆ అమ్మాయి పేరు అమలే అయివుంటుందని రూఢి చేసుకున్నాను. ఔనా?"

"ఔను నాన్నా... ఆ అమ్మాయి పేరు అమలే"

"అయితే ఆ జ్యోతిష్యుడి నోటంట ఆ భగవంతుడే ఆ మాట పలికించేడన్నమాట! అతను చెప్పినట్టు, అమలనే అమ్మాయి పరిచయం అయిందంటే మిగతా సగం కూడా నిజం అయిపోతుందేమోరా!" రాంబాబు ముఖంలో ఏదైనా సంతోషరేక కనిపిస్తుందేమోనని ఆసక్తిగా చూశాడు చలపతి. కానీ అతని ఆశ నిరాశయింది.

నిజానికి ఆ క్షణంలో అతను ఆలోచిస్తున్నది అమల గురించే! పాపం, రామారావుగారి తాత ముత్తాతల పేర్లు అడగమని అమలకి ఏదో చిట్కాలాంటి సలహా యిచ్చి వచ్చేశాడుగాని, ఆ తర్వాత ఏమైందో తెల్సుకోలేదు. కానీ, రామారావు వుద్దండపిండం. అతనికి తన పూర్వీకుల పేర్లు ఏమిటో తెల్సుకునుంటే, అమల ఫెయిలవుతుంది. ఆమెకు వుద్యోగం రాదు. రాకపోతే మళ్ళీ అమల తనకి కనిపిస్తుందో, లేదో! తను ఆమె ఎడ్రస్ కూడా అడగలేదు... అయినా, తను అమల గురించి ఎందుకింత సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు. జ్యోతిష్యుడు చెప్పింది నిజం కావాలని తను కోరుకుంటున్నాడా? ఏమో!

★ ★ ★

సరిగ్గా అదేసమయానికి అమల యింట్లో...

తండ్రీకూతుళ్ళమధ్య కూడా యిదే విషయంమీద చర్చ జరుగుతోంది. చలపతి, అచ్యుతానంద వేసుకున్న పథకం ప్రకారం, అమలకి 'ర' కారంతో పేరు ప్రారంభమయే వ్యక్తితో పరిచయమవుతుందని, ఆ పరిచయం ప్రేమగా మారి, పెళ్ళివరకు దారితీస్తుందని, ఆ తర్వాత ఆమె దశ తిరిగిపోతుందని అచ్యుతానంద నిన్ననే చెప్పేడు.

ఇవాళ రాంబాబు పరిచయమయ్యేడు!

తన తండ్రి చెప్పినప్రకారం ఈ పరిచయం పెళ్ళివరకు వెళ్తుందాని అమల ఒకటికి పదిసార్లు ఆలోచిస్తోంది. రాంబాబు అంత ధనవంతుడైతే, ఈ వుద్యోగానికెందుకు వచ్చినట్టు? ఈ ప్రశ్నకే ఆమెకు సమాధానం దొరకలేదు.

ఆ రాత్రి లాడ్జిరూంలో అచ్యుతానంద చలపతికోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. మందువేస్కునే టైము అయినా, ఆరోజు ఒక్క రూపాయి కూడా సంపాదన లేకపోవడంవలన, మందు సీసా చేతికి అందలేదు. చలపతి వస్తే, అతనే మందుసీసా తెప్పిస్తాడనే ఆశతో నిరీక్షిస్తున్నాడు. ఎనిమిదిన్నర అవుతూండగా చలపతి వచ్చేడుగానీ, జేబులో పైసా కూడా లేకుండా వచ్చేడు. దాంతో అచ్యుతానందకి మరింత నిరాశ పెరిగింది.

"మరి మనకి డబ్బులొచ్చే అవకాశమే లేదా?" అన్నాడు చలపతి చేత్తో పిక్కలు నొక్కుకుంటూ.

"సత్తిబాబని ఈ లైన్లో బట్టల దుకాణంలో ఎకౌంటెంటు, మనకో డబ్భై రూపాయలు యివ్వాలిగాని, యిందాక కబురుచేస్తే గాజువాక వెళ్ళేడని చెప్పేరు. అతనొస్తే డబ్బులొస్తాయి, కానీ యింతవరకూ రాలేదంటే, యిక రానట్టే"

అంతే! వాళ్ళిద్దరూ ఆహారపొట్లాలు కూడా అందని వరదబాధితుల్లా విలవిల్లాడిపోయే రు. ఓ అయిదారు నిమిషాలు భారంగా గడి పేక చలపతే అన్నాడు

"లాభం లేదురా బావా! మనకి మందు యోగం లేకుండా ఎవడో చేతబడి చేసినట్టు న్నాడు. ఇంక మనకి మందురానట్టే! మందులే దూ అనుకుంటే, మా చెడ్డబాధగా వుందికాబ ట్టి, ఆ బాధని మర్చిపోడానికి, నేనో వుపాయం ఆలోచించేను. ఈపూటకి మనం ఆరోగ్యం గు రించి మాట్లాడుకుంటే ఎలా వుంటుందంటావ్?"

"మంచి అయిడియానే చెప్పేవురా. ఆరో గ్యం గురించి మాట్లాడుకుంటే మందుమీద విరక్తి కలుగుతుంది. నువ్వే ఆరంభించు"

చలపతిరావు 'త్ఫూ" అంటూ నేలమీద వుమ్మి, "ఛీత్తిరకి! ఈ మందుని ఎవడు కనిపె ట్టేడోగాని, వాణ్ణి చెప్పు తీసుక్కొట్టాల్రా! ఈ మందు తాగి చెడిపోయినవాళ్ళే వున్నారుగాని, బాగుపడినవాళ్ళని ఒక్కణ్ణి, ఒక్కణ్ణి చూపెట్టు చూద్దాం. ఈ దిక్కుమాలిన మందువల్ల బ్రె యిన్ పాడు, హార్టు పాడు, లివర్ పాడు, కిడ్నీలు పాడు, మొత్తం నాలుగుపార్టులు పాడై పోతాయి. మనకి మందు అలవాటుంది కాబ ట్టి, మనం అరవైదాటకుండానే తోటకూర కాడ ల్లా వేళ్ళాడిపోయేం. అదే, మహానుభావుడు, మా మామయ్య వుండేవాడురా, చిత్రమని చీదకుండా నూటపధ్నాలుగు సంవత్సరాలు బతికేడు! చచ్చేవరకు కంటికి జోడులేదు, కాలికి జోడులేదు. తన నూటపదమూడోఏట మా మేనత్తని గర్భవతిని చేయడం ఆరోజుల్లో గొప్పగా పేపర్లో కూడా వేశారు. అతగాడి ఆరోగ్యా న్ని తల్చుకుంటే, యిప్పటికి ఓ దండం పెట్ట బుద్ధేస్తుంది" అంటూ గాలిలోనే తన మేన మామ కనిపిస్తున్నట్టుగా వూహించుకుని రెండుచేతుల్తో వినయంగా నమస్కారం చేశా డు.

అచ్యుతానంద కూడా అతనికంటే నాలుగు ఆకులు ఎక్కువ తిన్నట్టుగానే మాట్లాడాడు, "మా పెదనాన్న కూడా ఆషామాషీ మనిషేం కాదురా. నూటపదకొండు సంవత్సరాల ఆరునె లలు బతికేడంటే కారణం ఏమిటి? ఆ మహా నుభావుడికి మందుగాని, చుట్టగాని, బీడీగాని కాల్చే అలవాటు లేదు. రేపు చనిపోతాడనగా యివాళ ఇంట్లో నలుగురు నౌఖర్లున్నా సైకిల్ మీద పదకొండు మైళ్ళు వెళ్ళి, సంతనించి మాంసం కొని పట్టుకొచ్చి, మా పెద్దమ్మచేత వండించుకుతిన్నాడు... ఏమిటోరా, మహాను భావులంతా చచ్చిపోయి, మందుగాళ్ళం మనం మిగిలిపోయేం. ఈ మందు అలవాటు మాచెడ్డది సుమా! మనదేశంలో మందుని నిషే ధిస్తూ స్ట్రిక్టుగా ఆర్డరువెయ్యాలి. చాటుగా తాగే వాళ్ళకి యావజ్జీవ కారాగారశిక్ష విధించాలి. అప్పుడే దేశం బాగుపడుతుంది"

ఇలా మందు అలవాటుని ద్వేషిస్తూ యిద్ద రూ లెక్చర్లిస్తున్న సమయంలోనే, ఓ యిర వైఏళ్ళ అబ్బాయి గదిలోకొచ్చి "నేను సత్తిబా బుగారి అబ్బాయినండి. మా నాన్న యిప్పుడే గాజువాకనించి వచ్చేడు. మీకు డబ్బై రూపా యిలు యివ్వాలటగా, యిచ్చిరమ్మన్నాడు" అంటూ జేబులోంచి డెబ్భైరూపాయలు తీసి, వారిద్దరిమధ్యనున్న టీపాయ్‌మీద పెట్టి వెళ్ళి పోయేడు.

అంతే!

డబ్బుని చూడగానే యిద్దరి ముసలాళ్ళకి కాస్సేపు నోటంట మాటరాలేదు. ఒకర్నొకరు భావరహితంగా చూసుకున్నారు. తర్వాత కా స్సేపు తమ చూపుని డబ్బుమీద నిలబెట్టారు. తర్వాత చలపతే మెల్లగా గదిలో అటు ఇటూ తిరుగుతున్న మౌనాన్ని బయటికి తగలేస్తూ మాట్లాడాడు

"అంతే, యిప్పుడు మందు తాగడంవల్ల కొన్ని బాడ్ ఎఫెక్టులున్నమాట నిజమేగాన్రా బావా, మరీ అంత ప్రమాదం వుంటే, యింత మంది మేధావులు, యింతమంది రచయిత లు, యింతమంది ఏక్టర్లు, యింతమంది సైంటిస్టులు ఎందుకు తాగుతార్రా? అన్నట్టు చెప్పడం మర్చిపోయాను. చాలామంది డాక్టర్లు కూడా తాగుతున్నారు. అంటే, వీళ్ళందరికీ ఆ మందువల్ల వచ్చే ప్రమాదాలు తెలియవనా? వాళ్ళు మనకంటే తెలివైనవాళ్లేగదా! అయినా, ఎందుకు తాగుతున్నారంటే, దానికొక రీజ నుంది. ఇప్పుడేదో డబ్బులొచ్చేయి కాబట్టి, మాట మారుస్తున్నాననుకోకు. ఇందాక చె ప్పడం మర్చిపోయిన మాటని, యిప్పుడు చె




బుతున్నానంతే! ఈ డబ్బుతో, ఓ హాఫ్‌బాటిల్ కొనుక్కుని, చెరో క్వార్టరు తాగేమనుకో, అంత మాత్రానికే లివర్లు, హార్టులు పాడైపోతాయా? ఎంతమాత్రం చెడిపోవు. అదేగనక చెరో హాఫో, చెరో ఫుల్లో కొట్టేసేమనుకో, అప్పుడు చాలా డేంజర్లు కలుగుతాయి. మా మావయ్య నూట పద్నాలుగేళ్ళు బతికేడు. ఎవర్ని వుద్ధరించడా నికట. మందు అలవాటు లేకుండా బతకడం గూడా ఓ గొప్పేనా? కాకిలాగ కలకాలం బతికేబ దులు, ఆల్కహాలు తాగి రాజహంసలా ఆరునె ల్లు బతకడం మంచిదిగదా! అందుకే, మా మామయ్య అంటే నాకు మహా చిరాకు. త్ఫూ'' అంటూ తన మావయ్యని తిడుతూ నేలమీద వుమ్మేడు.

ప్లేటు తిప్పెయ్యడంలో అచ్యుతానంద చల పతికేమీ తీసిపోలేదు. ''మా పెదనాన్నంటే నాకూ చిరాకేరా! యింట్లో నలుగురు నౌఖర్లు న్నా తనే సైకిలు తొక్కుకుంటూ ఎందుకు సంతకెళ్ళాలి చెప్పు! అందరూ అతన్ని ఆరోగ్య వంతుడనాలని తపన! కానీ, అందరూ అతన్ని కక్కుర్తిమనిషనే పిలిచేవారు. నూటపదకొండే ళ్ళు మందూ గిందూ తాగకుండా బతికితేమా త్రం నూటపన్నెండో ఏట చచ్చిపోయేడుగా! డబ్బులు ఎలాగూ వచ్చేయి కాబట్టి, మనం వెంటనే ఓ హాఫ్‌బాటిల్ తెప్పించేసుకోవడం బెటరు, లేకపోతే దుకాణాలు కట్టేస్తారు'' అంటూ అచ్యుతానంద లాడ్జీలో పనిచేసే బోయ్‌ని పిలిచి ఓ హాఫ్‌బాటిల్ తెప్పించాడు.

ఆ తర్వాత, రాంబాబుకి, అమలకి ఎలాగూ పరిచయమయింది కాబట్టి వాళ్ళ మనసులు కూడా కలవడానికి తమ యథాశక్తి ప్రయ త్నించాలన్న నిర్ణయంతో ఆనాటి మందుకార్య క్రమాన్ని ముగించారు.

★ ★ ★

రెండురోజుల తర్వాత రాంబాబుకి, అమల కి ఇంటర్వ్యూలో సెలక్టయినట్టుగా, విడివిడిగా లెటర్సు వచ్చాయి.

అది రాంబాబు జీవితంలో మరువలేని రోజు, మహత్తరమయినరోజు! వుదరపోషణా ర్థం ఎన్ని దార్లు తొక్కినా, యిదీ నా వుద్యోగ మంటూ చెప్పుకునే వుద్యోగం ఈనాటికి దొరి కింది. అది గవర్నమెంటు వుద్యోగం కాకపోవ చ్చు, కానీ, నిరుద్యోగంకంటే మంచి వుద్యోగం! తెలివితేటలు ఉపయోగించి, కష్టపడి పనిచే స్తుంటే యిందులోనే వున్నతస్థాయికి చేరొచ్చు! జాయినింగ్ రిపోర్ట్ యిచ్చేక, రాంబాబు ప్రత్యే కంగా వెళ్ళి రామారావుకి ధన్యవాదాలు తెలిపా డు.

''వందరూపాయలు సంపాదించడంకంటే వాటిని భద్రపరచుకోవడం కష్టం. వుద్యోగం రావడం ఎంత కష్టమో, దాన్ని నిలబెట్టుకో వడం, దాన్ని పెంచుకోవడం చాలా కష్టం. విష్ యూ ఆల్ ది బెస్ట్'' అంటూ రామారావు దీవించాడు. ఆ గదిలోనించి రాంబాబు బయ టకొస్తుండగా, అక్కడ అతనికోసమే వెయిట్‌చే స్తూ అమల కనిపించింది. వుద్యోగాలు వచ్చి నందుకు, యిద్దరూ పరస్పరం అభినందించు కున్నాక, ''మీరు మన బాస్‌ని కలిసి థాంక్సు చెప్పడానికే నిలబడ్డారా?'' అన్నాడు రాంబా బు.

''థాంక్సు చెప్పడానికే వచ్చేను. కానీ, ఆ థాంక్సు మన బాస్‌కి కాదు... మీకు''

''నాకా? నేనేంచేశాను?''

''నాకు ఉద్యోగం యిచ్చింది ఆయనే అయినా, వచ్చింది మీవల్లేకదా''

''ఎలా?''

''ఆరోజు మీరా చిట్కాప్రశ్న నాకు చెప్పుండ కపోతే, నాకీ వుద్యోగం వచ్చుండేది కాదుగా''

''ఓహ్హొహ్హొ... అందుకా థాంక్సు చెప్తున్నా రు. చూడండి అమలగారూ... అలాంటి చిట్కా ప్రశ్నలు నాదగ్గర చాలా వున్నాయి. యింతవ రకూ వాటిని మా ఫ్రెండ్సర్కిల్లో చెప్పడం, వాళ్ళంతా చప్పట్లు కొట్టి శభాష్ అనడంవరకే పనికొచ్చాయి. కానీ, యిప్పుడు ఆ ప్రశ్నల్లో ఒకటి మీకు వుద్యోగం యిప్పించడానికి పనికొ చ్చిందంటే, నిజానికి మీకంటే నేనే ఎక్కువ సంతోషపడాలి''

అమలని ఎస్టాబ్లిష్‌మెంట్ సెక్షన్లో క్లర్కుగా వేశారు. రాంబాబుని రామారావుగారి పెర్సనల్ స్టెనోగా పోస్ట్ చేశారు. అందరు వుండేది ఒకే హాల్లో. స్టెనోగ్రాఫర్‌కి యింకా ప్రత్యేకమైన కా బిన్ అంటూ ఏదీ ఎలాట్ చెయ్యకపోవడంవ లన అతను హాల్లోనే అమలకి కాస్త దూరంగా ఓ మూల కూర్చుంటున్నాడు. అమల తల ఎత్తి చూస్తే రాంబాబు కనిపించేవిధంగా వుందా

సీటు. రాంబాబు పనిచేస్తున్నాడన్నమాటేగాని, అతని ఆలోచనంతా అమల పుట్టినతేదీ గురించే ఆలోచిస్తోంది. జ్యోతిష్యుడు చెప్పింది సగం వరకు కరక్టయింది. అతను చెప్పిందానికంటే అమల అందంగానే వుంది. ఆయన చెప్పినట్టు పుట్టిన తేదీ కూడా అయిదైవుంటే, ఆమె తన జీవితభాగస్వామిని అనుకోవచ్చు. ఆమె డేటాఫ్‌బర్త్ ఏమిటని అడిగితే? చెప్తుందా? ఆడదాని వయసు, మగవాడి జీతం అడక్కూడదంటారు. కానీ, ఆ సామెత వుద్యోగస్థులకి అన్వయించదు. ఎంచేతంటే, పెర్సనల్ రిజిస్టర్ చూస్తే డేటాఫ్‌బర్త్ తెల్సిపోతుంది. శాలరీ బిల్లు చూస్తే జీతం ఎంతో, పైసల్తోసహా తెల్సిపోతుంది. ఆమె పెర్సనల్ రిజిస్టర్ యివాళే ఓపెన్‌చేస్తారు. ఆమెను డైరెక్ట్‌గా అడిగి బాధపెట్టడంకంటే, ఆమెకు తెలియకుండా ఆమె పెర్సనల్ రిజిస్టర్ చూసేస్తే సరి! ఆ రిజిస్టర్ వుండేది ఎస్టాబ్లిష్మెంట్ సెక్షన్‌లోనే. ఎలా? మధ్యాహ్నం లంచ్‌బ్రేక్‌లో ఆమె డైనింగ్‌హాల్‌కెళ్ళినప్పుడు రాంబాబు గబగబా వెళ్ళి అక్కడున్న ఫైల్స్ తిరగేసి చూశాడు. అమల బయోడేటా వున్న పేపర్సు కనిపించాయి.

ఆమె డేటాఫ్‌బర్త్ చూస్తూనే అతని కళ్ళు మెరిశాయి. ఒళ్ళు దూదిపింజలా గాల్లో తేలింది.

అయిదోనెల, అయిదో తారీఖు!

డబుల్ ఫైవ్! మరీ అదృష్టం. ఆ జ్యోతిష్యుడు చెప్పింది ఖచ్చితంగా, ఖచ్చితంగా అమల గురించే! సందేహంలేదు. ఆనందం పట్టలేక విజిల్ వేద్దామని నోట్లో వేలుపెట్టేడు, కానీ, అంతలోనే అది ఆఫీసని గుర్తొచ్చి ఆ పని మానుకున్నాడు.

సాయంత్రం మూడుగంటలకి ప్రతీ మనిషిదగ్గరకొచ్చి, ఆఫీస్‌బోయ్ బ్రూకాఫీ అందించాడు. అది కంపెనీవాళ్ళు ఫ్రీగా ఏర్పాటుచేసిన కాఫీ! ఈ ఏర్పాటేదో బాగుందే అనుకున్నాడు రాంబాబు.

"ఏంబాగులెండి. ఇలా ప్రతిరోజూ ఓ కాఫీ ఫ్రీగా యివ్వడంతోపాటు ప్రతినెలా మన కంపెనీ తయారుచేసే సోప్స్ మూడు యిస్తుంటారు. అయినా, ఏంబాగులెండి. ఇంకాస్సేపట్లో మన యమధర్మరాజు, అదే, మన బాస్ యిక్కడకొచ్చి, ఏదో ఓ తలతిక్క ప్రశ్న అడుగుతాడు. దానికి జవాబేంటో యింటిదగ్గర ఆలోచించుకురండీ అంటూ మనకో హోమ్‌వర్క్ కూడా తగిలిస్తాడు. జీతాలు బాగుంటాయని జాయినయ్యేనుగాని, ఈ క్విజ్ కార్యక్రమాలు మాత్రం భరించలేపోతున్నామంటే నమ్మండి" అంటూ సోడాబుడ్డి కళ్ళద్దాల సీనియర్ క్లర్కు సోమేశ్వర్రావు మూలిగాడు.

అతని మాటలు పూర్తికాకుండానే రామారావుగారు హాల్లో ప్రత్యక్షమయ్యారు. అందరూ లేచి నిలబడ్డారు. అందర్నీ కూర్చోమని చెప్పి, తనో టేబిల్‌మీద మఠం వేస్కుని బుద్ధుళ్ళా కూర్చున్నాడు.

"కొత్తగా జాయినైనవాళ్ళకోసం మరోసారి చెప్తున్నాను. శరీరానికి వ్యాయామం లేకపోతే, అది ఎలా అనారోగ్యం చెందుతుందో, మెదడుకు కూడా సరైన వ్యాయామం లేకపోతే, అదీ మొండికెత్తేస్తుంది. చాలామంది చదువుకునేటప్పుడు బుర్ర వుపయోగిస్తారు. వుద్యోగాల్లోకొచ్చేవరకు బుర్ర వుపయోగిస్తారు. కానీ, ఓసారి ఉద్యోగంలో జాయినయేక, మెదడుమీదో దుప్పటి కప్పేసి, కేవలం మెకానికల్‌గా యంత్రాల్లా పనిచేస్తుంటారు. అదే నాకు యిష్టంవుండదు. అందుకే, డైలీ ఈ క్విజ్ కార్యక్రమం పెట్టేను. జవాబులు కరెక్టుగా చెప్పినవాళ్ళకి ఒకో ప్రశ్నకి ఒక్కో సోప్ చొప్పున అదనంగా లభిస్తుంది. ఈరోజు ప్రశ్న వినండి... మనిషి దేంతో తింటాడు?"

అందరూ అతన్ని వింతగా చూశారు. "మరోసారి చెప్తున్నాను... జాగ్రత్తగా వినండి. మనిషి దేంతో తింటాడు? విష్‌యూ ఆల్ ది బెస్ట్" అనేసి మళ్ళీ తన రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

"చెప్పేనుగదండీ... రోజూ యిదే చిత్రహింస! వెధవ... యిలాగే తలతిక్క ప్రశ్నలు అడిగీ అడిగీ ఏదో ఓరోజున మెంటల్ హాస్పటల్లో జాయినైపోతాడు, చూస్తుండండి" సోమేశ్వర్రావు మూలిగిన మూలుగుకి అమల, రాంబాబు చిన్నగా నవ్వేకున్నారు.

★ ★ ★

ఆఫీసు అయింతర్వాత రాంబాబు, అమల బస్‌స్టాపువైపు నడుస్తున్నారు.

"మీకు జ్యోతిష్యంమీద నమ్మకం




వుందాండి?'' అమల కావాలనే ఆ ప్రస్తావన తెచ్చింది.

''పూర్తిగా వున్నట్టూ కాదు, పూర్తిగా లేనట్టూ కాదండి! మీసంగతేమిటి?'' రాంబాబు కూడా చాలా ఆసక్తిగానే అడిగాడు.

''మొదట్లో నాకంత నమ్మకం వుండేది కాదండి. కాకపోతే, నా చిన్నతనంలో ఓ జ్యోతిష్యుడు మాయింటికొచ్చి, మా ఆస్తి, ఐశ్వర్యం మాకు దూరమై, మేం కొన్ని సంవత్సరాలపాటు కష్టాలనుభవిస్తామని చెప్పేడు. అతను చెప్పినట్టే కోటిరూపాయల విలువగల మా ఆస్తి కోర్టుపాలైపోయింది. ఆ కేసు సెటిలయేవరకూ నేనీ క్లర్కుజాబ్ చెయ్యకతప్పదు'' అమల కావాలనే వుదయంనించి తయారుచేస్కున్న అబద్ధాన్ని చాలా నేర్పుగా, తొణక్కుండా, బెణక్కుండా చెప్పేసింది. తన తండ్రి చెప్పిన జోస్యం ప్రకారం తనని పెళ్ళాడబోయేవాడు ధనవంతుడై వుండాలి. లేకపోతే, పెళ్ళయ్యేక తన దశ ఎలా తిరుగుతుంది? అతను చెప్పిన ప్రకారం రాంబాబు పరిచయమయ్యాడు. అతనితో తనో గొప్పింటి మనిషినని బిల్డప్ ఇవ్వకపోతే తనపట్ల ఆకర్షణ కలగదు. తను సాధారణమైన జ్యోతిష్యుడి కూతురిగానో, నెలకి పదిహేనువందలు తెచ్చుకునే గుమస్తాగానో పరిచయమైతే, జోగీజోగీ రాస్కుంటే బూడిద రాలినట్టు, తనో గుమస్తా అయివుండి, మరో గుమస్తాని కట్టుకుంటే ఏం ఒరుగుతుందని అతను అనుకోవచ్చు. అందుకే కావాలనే ఓ చిన్న ఆస్తికథ కల్పించింది. తను చెప్పిందాన్ని అతను నమ్మేడా, లేదాని అమల ఓరకంట అతన్ని చూసింది.

రాంబాబు ఆమె మాటల్ని నమ్మక తప్పలేదు. ఎందుకంటే, తనకి జ్యోతిష్యుడు ఏంచెప్పేడు? ఆమె ధనవంతురాలా అని తను అడిగినప్పుడు ''యిప్పుడు కాదు'' అని జవాబు చెప్పేడు. అంటే, అమల ఒకప్పుడు ధనవంతురాలు, యిప్పుడు కాదు, మళ్ళీ కోర్టుకేసు అయ్యేక ధనవంతురాలవుతుంది. యిప్పుడు కాదు అనే మాటకి అర్థం యిదన్నమాట! ఇప్పుడు తను ఓ గొప్పింటి బిడ్డనని చెప్పకపోతే, యిలాంటి ఆర్డినరీ క్లర్కుగాడితో నాకు ప్రేమేమిటని ఆమె దూరంకావచ్చు. కాబట్టి తనిప్పుడో బిల్డప్ యివ్వాలి! డబ్బు పోయేటప్పుడు, మర్యాద, ప్రాణాలు పోయేటప్పుడు అబద్ధాలాడ్డంలో తప్పులేదని శాస్త్రమే చెప్తోంది. ప్రేమించే అవకాశం పోయేటప్పుడు గూడా అబద్ధం ఆడొచ్చునని తనకి తనే నచ్చజెప్పుకున్నాడు.

''మీసంగతేమిటి'' అని అమల అడిగిన ప్రశ్నకి రాంబాబు వూహాల వుయ్యాల దిగి, నేలమీద కాలుపెట్టేడు.

''మా ఆస్తంతా కోర్టులో వుందంటే మీకు నమ్మకం కలగలేదా?'' అమలకింకా అనుమానం తీరక అడిగింది.

''భలేవారే! మీ ముఖంలో తాండవించే లక్ష్మీకళని చూసే మీరో గొప్పింటి బిడ్డని గ్రహించేశాను. కాకపోతే, ఆ కళ తాలూకు డీటైల్సు యిప్పుడు తెలిశాయి. అదేమిటోనండి, మీరు ఆస్తికి దూరమైపోయి, ఓ ఆఫ్టరాల్ మనిషిలా గుమస్తా వుద్యోగం చేస్తుంటే నాకు భలే ఆనందంగా వుందండీ''

అమలకి అర్థంకాలేదు. అప్పటికి యిద్దరూ బస్‌స్టాప్ దగ్గరకొచ్చేశారు. ''ఆనందం అంటే, మీరు ఆస్తికి దూరమయ్యేరని ఆనందించడం కాదు. పురాణాల్లోని పెద్దపెద్దవాళ్ళు, అంటే పాండవులు, హరిశ్చంద్రుడు, సీతారాములు వాళ్ళ రాజ్యాలు వదలుకుని, ఫారెస్టులంట తిరగటం, డబ్బుకోసం హరిశ్చంద్రుడు తన భార్యని అమ్మేయడం, చంద్రమతి ఓచోట, హరిశ్చంద్రుడు మరోచోట ఉద్యోగాలు చేయడంలాంటి సంఘటనలు పుస్తకాల్లో చదవడం, సినిమాల్లో చూడ్డం తప్ప అలాంటి మనుషుల్ని వాస్తవంగా చూడలేదు. ఇప్పుడు మీరు మీ ఐశ్వర్యమంతా వదులుకుని గుమస్తాగా జాయినవడం చూస్తుంటే, నాకా పురాణాలు గుర్తొస్తున్నాయి''

రాంబాబుకి నమ్మకం కలిగినందుకు ఆమె హమ్మయ్య అనుకుని సంతోషపడింది. వస్తున్న నవ్వుని, రుమాలు అడ్డం పెట్టుకుని ఆపుచేస్కుంటూ ''నా సంగతి అడిగేరుగాని, మీ సంగతి చెప్పలేదు'' అంది.

''నాదీ ఒకప్పుడు జమిందార్ల కుటుంబమేనండి. ఇప్పుడు జమీలు పోయినా, మా వంశానికుండే ఆ ఆచారాలు పోలేదు. మా వంశాచారంప్రకారం మా కుటుంబంలోని మగాళ్ళు చదువు పూర్తయి, పెళ్ళి చేసుకునేలోపల, ఓ రెండు సంవత్సరాలపాటు, మా ఆస్తిమీద




ఆధారపడకుండా, మా వంశం తాలూకు పలుకుబడిని వుపయోగించకుండా, స్వతంత్రంగా బతకాలి. నేను ఎక్కడున్నానో కూడా మావాళ్ళకి తెలియగూడదు. అంటే, దాదాపుగా అజ్ఞాతవాసం అనుకోండి. ప్రస్తుతం నేను ఆ ఉద్యోగపర్వంలోనే వున్నాను. లేకపోతే నేనేమిటి? పదిహేనువందల రూపాయలకి గుమస్తా వుద్యోగం చెయ్యడం ఏమిటి? ఇన్సల్ట్'

ఆ మాటలు అమల మనసులో అమృతవర్షం కురిపించేయి. తన మేనత్త చెప్పినట్టు తను అదృష్టవంతురాలే! నాన్న చెప్పిన జ్యోతిష్యం కూడా కరక్టేనని తృప్తిపడింది. ఆవిధంగా రాంబాబు, అమల ఒకర్నొకరు మోసగించుకుంటూ ప్రేమబాటలో నడవడం ఆరంభించారు.

★ ★ ★

అమల యింటికి రాగానే అచ్యుతానంద, రాంబాబుతో నీ పరిచయం పెరిగిందా? నీ అదృష్టం గురించి నేను చెప్పిన జోస్యం కరెక్టయిందా? అంటూ ప్రశ్నలవర్షం కురిపించాడు.

అతనే వుద్దేశంతో అడిగాడో గమనించి, అతన్ని అసహ్యంగా, తేలికభావంతో చూసింది. ''నాకు దొరికేవాడు నా పూర్వజన్మల సుకృతంబట్టి, నా అదృష్టరేఖ బట్టి దొరకాలితప్ప, నీ ప్రయోజకత్వంబట్టి కాదుగా'' అంటూ తండ్రి ముఖంమీదే అనేసింది.

అచ్యుతానంద లోలోపల బాధపడుతూనే, చెప్పులు తొడుక్కుని లాడ్జీకి వెళ్ళిపోయేడు.

తండ్రిమీద ఏనాడూ అమలకి సదభిప్రాయం లేదు. గౌరవం అంతకన్నా లేదు. అమల చిన్నతనంలోనే ఆమె తల్లి పోయింది. అప్పుడప్పుడే ఆమెకి వూహ తెలుస్తోంది. అచ్యుతానంద రెండో పెళ్ళి చేసుకోకపోయినా, మరో ఆమెతో సంబంధం పెట్టుకున్నాడు. ఆమె తరచుగా యింటికే వచ్చేది. ఆమెను అమ్మా అని పిలవమనేవాడు. అమలకి అలా పిలవడం యిష్టంలేదు. అంతేకాదు, తన తల్లి పడుకునే మంచంమీద ఆమె పడుకోవడం ఎంతమాత్రం సహించలేకపోయింది. ఆమె యింటికొస్తే నేను ఈ యింట్లో వుండనంటూ అమల ఓరోజు తెగేసి చెప్పింది. అచ్యుతానందకి ఏం చెయ్యాలో అర్థంకాలేదు. అలాంటి సమయంలోనే ఓరోజు విజయవాడనించి అచ్యుతం చెల్లెలు సుభద్ర ఆ యింటికొచ్చింది. ఆ యింటి పరిస్థితి గమనించింది. ఆమెకు సంతానం లేరు. అమలని నాతో పంపించెయ్. నాదగ్గరే వుండి చదువుకుంటుంది'' అంటూ ఆమే అమలని తీసుకుపోయింది. అచ్యుతానంద ఆనందించాడేగాని అభ్యంతరం పెట్టలేదు. తను మొండికేసినప్పుడు తన తండ్రి, తనకోసం, వుంచుకున్నావిణ్ని వదిలిపెట్టేస్తాడని అమల వూహించింది. కానీ, ఆమెకోసం తననే వదలుకుంటాడని అనుకోలేదు. ఆనాట్నించి ఆమెకు తండ్రిపట్ల గౌరవం పోయింది. స్కూలు రిజిస్టర్స్‌లో, తండ్రిపేరు రాయాల్సినచోట అతని పేరు రాయడంవరకే తండ్రితోవున్న అనుబంధం అవసరమయింది.

ఆమధ్య ఓసారి అచ్యుతానంద ఏదో తన పెర్సనల్ పనిమీద విజయవాడ వెళ్ళి, చెల్లెలి ఇంట్లో దిగాడు. తండ్రిని చూడగానే అమల సంతోషంగానే పలకరించింది. అతని చేతిలోని సూట్‌కేసు విప్పి తనకోసం ఏమైనా తెచ్చాడేమోనని ఆత్రంగా వెదికింది. కనీసం ఓ నేతచీరయినా తనకోసం తెస్తాడని ఆమె నమ్మకం. కానీ అందులో నేతచీర కాదుగదా, కనీసం ఓ జాకెట్టు ముక్కయినా లేదు. రెండురోజుల తర్వాత అతను తిరిగి వెళ్ళిపోతూ, ''వెళ్లొస్తానమ్మా'' అన్నాడుగాని, చేతిలో ఓ పాతిక రూపాయలయినా పెట్టలేదు.

రిక్షా ఎక్కబోతూ, ''అత్తయ్యా నిన్ను బాగా చూసుకుంటోందికదా'' అని అడిగాడు. అప్పుడు అమల తన సహనాన్ని కోల్పోయింది. పదిహేనేళ్ళుగా దాచుకున్న కోపం అప్పుడు కట్టలు తెంచుకుంది. ''అత్తయ్యా నన్నెందుకు బాగా చూడాలి నాన్నా? ఆవిడెవరు? నీ చెల్లెలేగాని, నా తల్లి కాదుగదా! తల్లి లేనందుకు, తల్లి బాధ్యత, తండ్రి బాధ్యత నువ్వే వహించాలి. కానీ, నువ్వు తండ్రిగా ఒక్క బాధ్యత గూడా నిర్వహించలేదు. ఆమె నన్ను పెంచుకుంటాననగానే సంతోషంగా ఒప్పేసుకున్నావ్‌గాని, నా బిడ్డ నాకు భారమా అని ఒక్క మాట కూడా అనలేదు. నన్ను అత్తయ్యా పెంచుకోవడంవల్ల నా పోషణకయ్యే ఖర్చు తగ్గుతుందనుకున్నావు. నీకు, నువ్వు వుంచుకున్నదానికీ నా అడ్డంకి తొలగిపోతుందనుకున్నావ్ తప్ప, కన్న కూతురు, ఒక్కగానొక్క కూతురు దూరమైపోతుందని నువ్వు ఒక్క క్షణం కూడా బాధపడలేదు. ఈ పదిహేనేళ్ళలో నువ్వు యిక్కడికెన్నిసార్లొచ్చేవో వేళ్ళమీద లెక్కపెట్టొచ్చు. వచ్చినప్పుడుగూడా, పావలా పెట్టి నాకు పువ్వులైనా కొనితెచ్చేవా? లేదు... పోనీ నీదగ్గర డబ్బు లేదని సరిపెట్టుకుందామంటే అదీ నిజంకాదు. నువ్వు తాగే బ్రాందీ, విస్కీలకి, మొన్నటివరకూ నువ్వు వుంచుకున్నదానికీ ఎంతెంత ఖర్చు చేశావో నీకే తెలును! ఇప్పుడేదో పనిమీద ఈ వూరొచ్చేవుగాని, నన్ను చూడ్డానిక్కాదు. ఏదైనా లాడ్జిలో దిగితే, డబ్బు ఖర్చవుతుందని నీ చెల్లెలి యింట్లో దిగేవు తప్ప, నామీద ప్రేమతో యిక్కడికి రాలేదు. నిన్ను చూసి నువ్వు సిగ్గుపడ్డం మానేసి, మీ అత్తయ్యా నిన్ను చూస్తోందా అని అడుగుతున్నావా? సరే, ఆవిడ నన్ను సరిగా చూడ్డంలేదు. నువ్వు నన్ను తీసుకుపోయి, అత్తయ్యకంటే బాగా చూడగలవా? అసలు, చూసే ఉద్దేశం వుందా? అత్తయ్యా నన్ను చాలా చాలా బాగా చూసుకుంటోంది. ఫలానా ఆయన మా నాన్న




అని చెప్పకుండా, ఫలానా ఆవిడ మా మేనత్త అని గర్వంగా చెప్పుకునేలా నా ఆలనా పాలనా చూస్తోంది''

వీధిలోని జనమంతా పోగయి, ఆ సంభాషణ వింటుంటే, అచ్యుతానంద సిగ్గుతో చచ్చిపోయి, రిక్షా ఎక్కి స్టేషన్‌కి వెళ్ళిపోయాడు. ఇప్పుడు కూడా అమల ఏక్షణంలో తనని మాటల్తో వుతికేసి, ఎండగడుతుందోనన్న భయంతోనే వున్నాడు. నిప్పుల గుండంమీద నిలబడి, ముళ్ళశయ్యమీద పడుకున్నట్టుగానే ఫీలవుతున్నాడు.



మర్నాడు ఆఫీసులో అమల అవసరం వున్నా లేకపోయినా రాంబాబు దగ్గరకి ఏదో నెపంపెట్టుకెళ్ళి మాట్లాడింది. ఆఫీసులో అందరూ ఆమెనే గమనిస్తున్నా ఆమె పట్టించుకోలేదు. మధ్యాహ్నం మూడుగంటలకి, అందరూ కాఫీ తాగుతుండగా రామారావు హాల్లోకొచ్చి నిన్న అడిగిన ప్రశ్నకి ఎవరైనా జవాబు చెప్పగలరా? అని అడిగాడు.

అమల ఆ ప్రశ్న విషయమే మర్చిపోయింది. గుర్తుంటే, తను జవాబు చెప్పగలనని కాదు, రాంబాబుని సలహా అడిగుండేది! యిప్పుడు తను జవాబు చెప్పకపోయినా ఎవరో ఒకరు చెప్పేస్తార్లే అని ధైర్యపడింది. కానీ, ఆ ధైర్యం ఎక్కువసేపు నిలబడలేదు. ఎందుకంటే, రామారావు మొదట ఆమెనే అడిగాడు.

''ఇంటర్వ్యూలో, నీ తెలివితేటల్తో ముగ్ధుణ్ణి చేశావు కాబట్టే, నిన్ను అడుగుతున్నాను, చమత్కారమైన జవాబు చెప్పి, నన్ను ఆశ్చర్యపరచు'' అన్నాడు. అమల కంగారుపడింది. ఇంటర్వ్యూలో రాంబాబు సాయంతో గట్టెక్కిపోయింది. కానీ, ప్రతిరోజూ ఈ తద్దినం వుంటుందని వూహించలేదు. మనిషి దేంతో తింటాడు అని అడుగుతున్నాడు.

''ఏ మనిషైనా నోటితోనే తింటాడు సార్''

''అందరూ ఘొల్లున నవ్వేరు. ''ఆ సమాధానం పసిపిల్లల్ని అడిగినా చెప్తారుగదా. ఎవరూ ఊహించని జవాబు చెప్పమనే బాస్‌గారు ఆ ప్రశ్న అడిగారు'' ఒకాయన వెటకారంగా అన్నాడు.

రామారావు ఆ వ్యక్తిని అడిగాడు. అతను తనదగ్గరున్న ఒకేఒక్క సమాధానం ''నాకు తెలీదు సార్'' అని చెప్పేశాడు. ఓ నబ్బు సంపాదించడానికి యింటిదగ్గర బుర్ర పాడుచేస్కోడం ఎందుకని, చాలామంది అదేసమాధానం చెప్పేశారు.

రామారావు సంతృప్తిపడలేదు. చిరాకుపడుతూ జుట్టు పీక్కున్నాడు. ''లాభంలేదు. పురుషులందు పుణ్యపురుషులు వేరయా అన్నట్టు, నా స్టాఫ్‌మొత్తంమీద రాంబాబే వేరయా అని ఈ ప్రశ్నకు రాంబాబే చమత్కారమైన సమాధానం చెప్తాడు. మీరంతా జాగ్రత్తగా వినండి'' అన్నాడు. దాంతో రాంబాబుమీదే ఆ బాధ్యత పడింది. అయినా, అతను కంగారుపడలేదు.

''తినడం అనేది నోటితోనేకాదు, యింకా చాలావిధాలుగా తినొచ్చు. అదెలాగో నోటితో చెప్పడంకాదు, డిమాన్‌స్ట్రేట్ చేసి చూపిస్తాన''ంటూ రాంబాబు, ఆఫీసు ప్యూన్ రజాక్‌ని పిలిచాడు. అతను దగ్గరకి రాగానే, వీపుమీద ఒక్క చరుపు చరిచాడు. అందరూ నివ్వెరపోయేరు. రామారావైతే కంగారుపడిపోయి, ''సమాధానం చెప్పమంటే వాణ్ణి చరిచావేం?'' అన్నాడు.

''ఆ చరుపులోనించే మీకు సమాధానం కూడా వస్తుందండి'' అంటూ రాంబాబు, రజాక్‌ని దగ్గరకి లాగి, ''రజాక్, అబద్ధం ఆడకుండా నిజం చెప్పు... నేనిప్పుడు నీకేం చేశాను?'' అన్నాడు.

''మీరు నన్ను దెబ్బకొట్టారండి''

''నువ్వేం చేశావ్?''

''నేనేం చేశానండి? మీచేత దెబ్బ తిన్నాను''

''దెబ్బ తిన్నానూ అంటున్నావ్... దేంతో తిన్నావ్?''

''మీ చేత్తో తిన్నానండి''

రాంబాబు చిన్నగా నవ్వుతూ, రామారావు వైపు చూసి ''విన్నారుకదా సార్. నాచేత్తో రజాక్ వీపుమీద దెబ్బతిన్నాడు'' అన్నాడు. అతను చెప్పిన జవాబు గూడా రామారావు అడిగిన తలతిక్క ప్రశ్నకి సరిపడినట్టే ఉందని అంద రూ సంతోషించి చప్పట్లు కొట్టేరు. రామారావు కూడా అందరితోపాటు చప్పట్లు కొట్టి ''సమయ స్ఫూర్తి, చమత్కారం అంటే ఇదీ! ఈరోజు ప్రశ్న వినండి, ''స్టెనోగ్రాఫర్లందర్లోకి మొట్టమొ దటివాడెవడు? దీనికి సరైన సమాధానం రేపు ఆలోచించుకురండి'' అనేసి వెళ్లిపోయాడు.

★ ★ ★

మర్నాడు కూడా రాంబాబే సరైన జవాబు చెప్పి, రామారావుని, ఇతరుల్ని మెప్పించాడు.

''ఈ లోకంలో మొట్టమొదటి స్టెనోగ్రాఫర్ బ్రహ్మదేవుడు. అతను షార్ట్‌హేండ్ రాసే కాగితా లు మానవుల హస్తాలు. ఆ హస్తాలమీద అత ను రాసే కోడ్‌భాషనే జ్యోతిష్యులు చదివి, మనకి చెప్తుంటారు''

రాంబాబు చెప్పిన సమాధానాన్ని అందరి కంటే ఎక్కువ లైక్ చేసింది అమలే! అతను ధనవంతుడు, అందగాడు మాత్రమేకాదు, లౌక్యం తెల్సిన గొప్ప మేధావి అనే అభిప్రాయా న్ని మరికొంచెం పెంచుకుంది. రోజులు గడు స్తున్నాయి. రామారావు తలతిక్క సమాధానాలు అడుగుతూనే వున్నాడు. రాంబాబు చమత్కా రంగా చెప్తూనే వున్నాడు. ఉదయం ఆఫీసుకి వెళ్లగానే ''నిన్న బాస్ అడిగిన ప్రశ్నకి సమా ధానం ఏవిటో ఆలోచించేరా?'' అని అడగడాని కి అమల రాంబాబు సీట్ దగ్గరకి వెళ్తూనే వుంది. రామారావు తలతిక్క పుణ్యమాని రాంబాబు, అమల కలుసుకుని, మాట్లాడుకోడా నికో అవసరం ఏర్పడింది. ''ప్రతిరోజూ మీరే జవాబులు చెప్పేస్తున్నారు. నేను ఒక్కరోజూ నోరు విప్పకపోతే ఆయనకి నా తెలివితేటల మీద సందేహం రావచ్చునని అమల సందేహ పడినప్పుడు, కొన్ని సమాధానాలు ఆమెచేత కూడా చెప్పించి ఆమెపట్ల రామారావుకున్న అభిమానాన్ని కరిగిపోకుండా రాంబాబు కాపా డాడు. నెల గడిచింది. జీతాలు అందాయి. రాంబాబుకి పదిహేనువందల జీతం చేతికొ చ్చింది. అంతకుముందు జీతాల పేరిట, లాభాలపేరిట అతను ఎంతోకొంత డబ్బు అందుకున్నా, ఓ కంపెనీలో స్టెనోగ్రాఫరుగా, జీతం పేరిట అందుకున్న డబ్బు ఇదే. రామా రావు దగ్గరకెళ్ళి తన ధన్యవాదాలు తెలియజే శాడు.

రామారావు అతని భుజం తడుతూ, తన సహజధోరణిలో, హితవులాంటి ఓ సలహా చె ప్పాడు. ''చూడు రాంబాబూ, ఈ లోకంలో అన్నింటికంటే సులభమైనది ఇతరులకి సల హాలివ్వడం, అన్నింటికంటే కష్టమైంది, ఆ సలహాల్ని ఆచరించడమేనని మహాభార తంలో ఏనాడో వ్యాసుడు రాసేశాడు. కానీ, నేను నీబోటివాళ్లకే సలహా ఇచ్చినా, దాన్ని నేను పాటించి, సత్ఫలితాలు సాధించాకే ఇస్తుంటా ను. ఈరోజుతో నీ సంపాదన ఆరంభమయింది. నీకింకా పెళ్లికాలేదు. జీవితంలో సుఖపడే విధానం చెప్తాను. జాగ్రత్తగా విను. డబ్బు విషయంలో తృప్తి, కీర్తి విషయంలో అసంతృప్తి వున్ననాడే నువ్వు సుఖపడతావ్, గొప్పవాడివవు తావు. నువ్వు జీవితంలో పెద్దవాడివి కావా లంటే నీకంటే పెద్దవాళ్లతో పోల్చుకోవాలి. అంటే, ఉదాహరణకి, నువ్వు ఇప్పుడో స్టెనోగ్రాఫ రువి. నువ్వు ఏ పెద్ద ఆఫీసర్‌తోనో పోల్చుకుని, అతన్లాగే నువ్వూ పెద్ద పెద్ద పరీక్షలు రాసి, పాసై నువ్వూ ఆయనంతటివాడివి కావాలని కృషి చేస్తే ఏదో ఒకనాటికి తప్పకుండా ఆ స్థాయికి చేరుకుంటావ్! అలాగే నువ్వు సుఖప డాలనుకున్నప్పుడు నీకంటే తక్కువ వాళ్లతో పోల్చుకోవాలి. అంటే మాటవర్సకి చెప్తున్నాను, నీ జీతం పదిహేనువందలు. మన ఆఫీసు ప్యూన్‌జీతం ఏడువందలు. వాచ్‌మెన్ జీతం, నాలుగువందలు. వాళ్లతో పోల్చుకుంటే నువ్వు గొప్పవాడివి, వాళ్లకంటే ఎంతో కొంత ఎక్కువ సుఖంగానే గడపొచ్చు. ఔనా? కాదా?''

''ఔను సార్''

''అంటే నిన్ను ఆ పదిహేవందల జీతంతోనే జీవితాంతం వుండిపొమ్మనడం లేదు. నువ్వు కృషిచేసి పెద్దవాడివయ్యేకొద్దీ నీ జీతం పెరుగుతూనే వుంటుంది. నువ్వు ఎంత సంపాదించినా సరే, నీకంటే తక్కువ జీతగా





డితో పోల్చుకుంటేనే నువ్వు సుఖపడతావ్. నీ జీతం పదివేలు అయినప్పుడు కనీసం తొమ్మిదివేలు సంపాదించేవాడితో పోల్చుకో. అంతేగాని నెలకి లక్షరూపాయలు సంపాదించేవాడితో పోల్చుకుంటే నీకు మనశ్శాంతి వుండదు. ఆ మనశ్శాంతి కరువయ్యాక నువ్వు కోట్లు సంపాదించినా నీకు సుఖంవుండదు. అలా మనశ్శాంతి కోల్పోయిన అనేకమంది కోటీశ్వరులు నాకు తెలుసు''

రామారావు చెప్పిన సలహా వేమనపద్యమంత భావగర్భితంగాను, సుమతీ శతకంలోని పద్యమంత నీతి బోధించేదిగానూ వున్నట్లనిపించింది. మరి కాస్సేపటితర్వాత, రామారావు తన డ్రాయర్ సొరుగులోనించి ఓ ఆల్బమ్ తీసి రాంబాబుకి అందించాడు. రాంబాబు లీఫ్స్ తిప్పిచూశాడు.

ఒకదానిమీద ఓ రిక్షావాడు బీడీ కాలుస్తున్న ఫొటో.

మరొకదానిమీద ఓ ముష్టివాడి ఫొటో!

ఇంకోదానిమీద ఓ బెస్తవాడు ఓ భుజంమీద వల, మరో భుజంమీద ఓ పెద్దసైజు చేపని మోస్తున్న ఫొటో.

''వీళ్లంతా ఎవరు సార్?'' రాంబాబు అయోమయంగా అడిగాడు. రామారావు పగలబడి, పగలబడి నవ్వాడు. తను ఏం జోకేశాడో, అతను ఎందుకలా కళ్లంట నీళ్లొచ్చేలా నవ్వుతున్నాడో రాంబాబుకేమీ అర్థంకాలేదు.

''వాళ్లెవరో చెప్పుకో చూద్దాం''

''నేనెప్పుడూ చూసిన ముఖాలు కాదు సార్''

అతను మళ్లీ నవ్వేడు. మరోసారి చూడు అన్నాడు రామారావు. అతను మళ్లీ చూశాడు. కానీ వాళ్లనెప్పుడూ చూసిన గుర్తు రాలేదు రాంబాబుకి.

''ఎవరు సార్? సస్పెన్స్‌ని నేను భరించలేను సార్. మీరే చెప్పెయ్యండి'' రాంబాబు నిజంగానే ఆసక్తి ప్రదర్శిస్తూ అడిగాడు.

''నేనేనయ్యా''

రాంబాబు ఆ మాటని నమ్మలేక మళ్లీ ఆ ఫొటోల్ని చూశాడు. నమ్మకం కుదరలేదు. ఒక్కో ఫొటోని అతని ముఖానికి దగ్గరగా పెట్టి ఫొటోని, ముఖాన్ని మార్చి మార్చి చూశాక అప్పుడు నమ్మకం కుదిరింది.

''ఇవి ఏమైనా నాటకాల్లో వేస్తున్నప్పుడు తీయించుకున్నవా సార్?''

''కాదు రాంబాబు. ఆ వేషాలన్నీ నిజజీవితంలోనే వేశాను. ఎందుకంటే కొన్ని ముఖ్యమైన విషయాలు తెల్సుకోవాలనుకున్నప్పుడు నేను మరొకరిమీద ఆధారపడను. వాళ్లు చెప్పింది నేను నమ్మను. నేనే మారువేషాలు వేసుకెళ్లి ఎన్ని కష్టాలైనా పడి, అసలు నిజం ఏవిటో నేనే తెల్సుకుంటాను. ఉదాహరణకి మా అమ్మాయికి గుంటూరు సంబంధం చూసినప్పుడు, ఆ అబ్బాయిలో దురలవాట్లు, అమ్మాయిల్తో తిరగడంలాంటి అలవాట్లు వున్నాయని మధ్యవర్తులు చెప్పారు. నేను నమ్మకుండా ఇలా రిక్షావాడి వేషం వేసుకెళ్లి ఆ అబ్బాయిని వెంబడించి అసలు రహస్యంతెలుసుకున్నాను. ఆ అబ్బాయికి రాఘవేంద్రరావనే పెద్దమనిషి తన కూతుర్నిచ్చి పెళ్లి చేద్దామనుకున్నాడు. కానీ ఆ అబ్బాయి, ఆ అమ్మాయిని ఏదోకారణంవల్ల చేస్కోనని తిరస్కరించాడు. ఆ పగతో ఆ పెద్దమనిషి ఆ అబ్బాయిమీద అలాంటి పుకార్లు లేవదీశాడు. మధ్యవర్తుల్ని పంపిస్తే వాళ్లకేవో లంచాలిచ్చి అతను అబద్ధాలు చెప్పించొచ్చు. ఎందుకొచ్చిన గొడవా అని నేనే మారువేషంలో వెళ్లి ఆ అబ్బాయి మేలిమి బంగారం అనే నిజాన్ని తెల్సుకొచ్చాను. మా అమ్మాయినిచ్చి పెళ్లిచేశాను. మిగతా రెండు వేషాలు కూడా మన బ్రాంచ్ మేనేజర్లమీద కంప్లయింట్లు వచ్చినప్పుడు రహస్యాన్ని పరిశోధించడానికి వేసినవే''

రాంబాబు చప్పట్లు కొట్టేడు. ''మీరు మామూలు మనుషులు కాదు సార్. మట్టిలో మాణిక్యం, మనుషుల్లో దేవుడు సార్'' అనేసి ఆ రూమ్‌నించి బయటకొచ్చేడేగాని, రామారావు చాలా దేవాంతకుడనే భయంనించి మాత్రం దూరం కాలేకపోయాడు. రేపు ఎప్పుడైనా తను పొరపాట్లు చేస్తే తననీ ఇలాగే మారువేషాల్తో పసిగట్టి మాడుపగలగొట్టేస్తాడేమో! అయినా అతను మారువేషాలు వేసి, తన రహస్యాన్ని బైటపెట్టాల్సినంత తప్పుడు నేరాలు తనేం చేస్తాడు? నెవ్వర్... తనకలాంటి అవసరమే రాదు.

★ ★ ★

రాంబాబు జీతం పట్టుకుని ఇంటికొచ్చేసరికి చలపతి రెండు కాళ్లూ సబ్బుతో శుభ్రంగా కడుక్కుని, తువ్వాలుతో తుడుచుకుని, ముక్కాలిపీటమీద కాళ్లుపెట్టి, నేలమీద కూర్చున్నాడు. రాంబాబు వచ్చి చూశాడు. ''ఏదైనా ఆసనం వేశావా ఇలా కూర్చున్నావ్?'' అని అడిగాడు.

''అదేం కాదురా, నువ్వు చూస్తే సెంటిమెంటల్ ఫెలోవి. ఇప్పుడు నువ్వు తొలిజీతం అందుకున్నావు. దాన్ని నా చేతిలో పెట్టి నిన్ను దీవించమంటూ నా కాళ్లకి నమస్కారం చేస్తావు కదా! అందుకని కాళ్లు కడుక్కుని రెడీ చేసుంచేను. నువ్వు నమస్కారం చేసి, డబ్బు నా చేతికిస్తే నిన్ను దీవించేసి, ఇంట్లో ఏ పనికి ఎంత ఖర్చుపెట్టాలో లెక్కలు చెప్పేస్తాను'' అన్నాడు చలపతి వెకిలిగా నవ్వుతూ. తండ్రిని చురచుర చూశాడు. ''నాకు దీవెనలేం అక్కర్లేదు నాన్నా. ఒకవేళ నేను నీ దీవెనలు తీసుకుంటే నేను కూడా నీ అంతటివాణ్ణి అయిపోతానేమోనని నా భయం'' రాంబాబు ముఖంమీదే అనేసిన మాటకి చలపతి ముఖం వివర్ణమైంది.

''నా బాధ్యతలు నాకు తెలును నాన్నా. వయసొచ్చిన కొడుకుని ఎప్పుడు, ఏ ఉద్యోగంలో పెట్టాలా అని మామూలు తండ్రి ఆలోచిస్తాడు. కానీ నా తండ్రిని ఎప్పుడు, ఏ గొడవల్నించి విడిపించాలా అని ఈ ఇంటి కొడుకు ఆలోచించాలి. ఎందుకంటే ఈ ఇంటి తండ్రి మామూలు తండ్రి కాదు. ఈ ఇంటికథ వేరు. నీకు చేతనైతే నీ వారసత్వం నాకు రాకూడదని దీవించు''

ఆ రోజంతా సంతోషంగా కాకుండా గంభీరంగానే గడిచింది. రాంబాబు చెప్పిన మాటల్తో సాధారణమైన ఏ తండ్రయినా పరివర్తన చెందుతాడు. కానీ చలపతి సాధారణమైన తండ్రులకోవకి చెందడు కాబట్టి కొడుకు చెప్పిన మాటలన్నీ దున్నపోతుమీద కురిసిన వర్షమే అయింది.

★ ★ ★

మర్నాడు అమల రాంబాబుని ఓ హోటల్కి పిలిచి టీపార్టీ ఇచ్చింది. ఆమెనించి పార్టీ తీసుకోడానికి మొహమాటపడినా, పిలుస్తున్నది అమల కాబట్టి రాంబాబు సంతోషపడ్డాడు. రోజులు గడుస్తున్నాయి. వారిద్దరి మధ్య పరిచయం ప్రేమగా మారింది. ముసలాళ్లిద్దరూ సంతోషించారు. వారి పెళ్లి జరగాలంటే వారి అభిజాత్యాలు బయటపడకూడదు. పెళ్లయ్యాక బయటపడినా, కొన్నిరోజులపాటు చిర్రు బుర్రులాడుకుంటారు. తర్వాత రాజీపడిపోతారు. హిందూ వివాహబంధంలో వున్న గొప్పతనమే అది. ఈనాటి కుర్రాళ్లు, అమ్మాయిలు పెళ్లి విషయంలో పెద్దవాళ్లు కాదన్నా భగ్నప్రేమికులుగా మారరు. పెద్దలని ఎదిరించైనా వాళ్లమాటనే నెగ్గించుకుంటారు. ఇవన్నీ చలపతి, అచ్యుతానందలు తమ పిల్లలపట్ల ఏర్పర్చుకున్న నమ్మకాలు. చిక్కబడుతున్న ప్రేమని, పెళ్లిపందిరిలోకి నడిపించడానికి వారిద్దరూ ఓ పథకం ఆలోచించారు.

రమ్యా సోప్ ఇండస్ట్రీస్‌లో పనిచేసే ప్రతి ఒక్కరికి పోస్టులో ఓ కరపత్రం వచ్చింది. ''రాంబాబు అమలల రాసక్రీడలు వినండి, చూడండి, చూసి తరించండి'' అంటూ ఓ పదివాక్యాల మేటరున్న కరపత్రం చూడగానే ఆఫీసులో గుసగుసలు, పకపకలు ఆరంభమయ్యాయి.

తమ గురించి అలాంటి పేపర్లు ఎవరు ప్రింట్ చేయించి, పోస్ట్ చేశారో రాంబాబుకిగాని, అమలకిగాని అర్థం కాలేదు. తమ శత్రువులెవరో చేసుండాలి. కానీ అలాంటి శత్రువులు ఎవరున్నారు. కొంతమంది వాళ్ల దగ్గరకొచ్చి ఎడ్వాన్సు కంగ్రాచ్యులేషన్స్ చెప్పారు. మధ్యాహ్నం లంచ్‌టైం దాటాక ప్రొప్రయిటరు రామారావు వారిద్దర్ని తన గదిలోకి పిల్చి ''ఏవిటిది?'' అని ఓ కరపత్రాన్ని చూపించాడు. ఇద్దరూ తెల్లమొహం వేశారు.

''నాకు కావల్సింది మీ తెల్లమొహాలు, నల్లమొహాలూ కావు. ఈ పేపర్లు ఎవరు వేయించారు? ఎందుకు వేయించారని నేను అడగడంలేదు. మీరు ఎందుకు ప్రేమించుకున్నారని కూడా అడగడంలేదు. మీరు ప్రేమించుకున్నారా లేదా అని అడుగుతాను. ప్రేమించుకోవడం నిజమైతే మీ పెద్దవాళ్లతో నేను మాట్లాడుతా. ఒకవేళ అబద్ధమైతే ఈ పేపర్లు వేయించిన పోరంబోకు ఎవడో కనుక్కోమని పోలీసులకి చెప్తాను. చెప్పండి, మీరు ప్రే




మించుకున్నారా, లేదా?'' రామారావు హుంకరించి అడిగేసరికి, తాము ప్రేమించుకున్నట్టే వుందని ఇద్దరికీ అనిపించి ''యస్సార్'' అన్నారిద్దరు.

''వెరీగుడ్, ప్రేమించి పెళ్లి చేస్కోవడం చాలా మంచి లక్షణం. నేనూ ప్రేమించే పెళ్లి చేసుకున్నాను. మీ పెళ్లి విషయం మీ పెద్దవాళ్లతో మాట్లాడే ధైర్యం మీకుందా? లేక నన్ను మాట్లాడిపెట్టమంటారా?''

''వద్దు సార్, మేమే మాట్లాడతాం'' ఇద్దరూ ఒకేసారి అన్నారు. ఆ మర్నాడు ఇద్దరూ ఎవరి తండ్రితో వాళ్లు మాట్లాడారు. కానీ, తమ పథకం ప్రకారం, ఏ తండ్రీ ఈ పెళ్లికి ఒప్పుకోలేదు. పడుచువాళ్లు ప్రాధేయపడ్డారు. ముసలివాళ్లు మొండికెత్తారు. అలా మొండికెత్తడంవల్ల ''సరే నాన్నా నేను ఈ పెళ్లి చేస్కోను'' అని ఇద్దరు పిల్లలు ఎక్కడ అనేస్తారోనని ఇద్దరు తండ్రులు లోలోపల భయపడుతూనే వున్నారు. అయితే మొదట్నించీ రాంబాబుకి, అతని తండ్రికి వున్న అనుబంధం నిప్పుమీద వేసిన ఉప్పులాగా చిటపటలాడేదే అవడంవల్ల రాంబాబు తండ్రిని గట్టిగానే ఎదిరించి, ఘాటుగానే మాట్లాడాడు. అమలకీ, ఆమె తండ్రికి మధ్యనున్న అనుబంధం కూడా, తామరాకు నీటిబొట్టు చందమే. ఆమె కూడా తండ్రితో ఘాటుగానే మాట్లాడింది. దాంతో పెద్దలు తెర వెనక్కి వెళ్లిపోయారు.

రామారావే దగ్గరుండి రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి జరిపించాడు. రిజిస్ట్రార్ ఆఫీసుగుమ్మం బయటే నిలబడి చలపతి, అచ్యుతానంద ఆనందభాష్పాలు రాల్చి, దూరంనించే తమ బిడ్డల్ని ఆశీర్వదించారు. నూతన దంపతుల శోభనాన్ని ఓ ఫైవ్‌స్టార్ హోటల్‌లో సూట్ బుక్ చేయించి మరీ రామారావే ఏర్పాటు చేశాడు.

ఏ ప్రేమకథయినా పెళ్లితో సుఖాంతమవడం అనవాయితీ! కానీ రాంబాబుది ఫక్తు ప్రేమకథ కాదు కాబట్టి అతనికొచ్చే ఇబ్బందులు, ఇరకాటాలు ఇక్కణ్నించే ఆరంభమయ్యాయి.

ఫైవ్‌స్టార్ హోటల్లో తమ శోభనం జరగడం జీవితాంతం మర్చిపోలేని ఓ అనుభూతని వాళ్లిద్దరు కాస్సేపు అనుకున్నారు తప్ప ఎక్కువసేపు అనుకోలేదు. వారిమధ్య పరిచయం వుంది గాబట్టి, తొలిసిగ్గులు మొగ్గలు వేయడానికక్కడ స్థలం లేకపోయింది. ఇద్దరూ ఆ రాత్రి ఇకమీదట తమ ఆదాయవ్యయాల గురించి వివరంగా డిస్కస్ చేసుకున్నారు.

''ఇద్దరి జీతాలూ కలిపి ఎంత వస్తుంది?''

''మూడువేలు''

''నా జీతంలోనించి అయిదువందలు తీసి మా నాన్నగారికి పంపించాలి'' అన్నాడు రాంబాబు.

''ఎందుకు? మీది రాయల్ ఫేమిలీకదా?''

''కాబట్టే పంపించాలి. అది మా వంశాచారం. నా సంపాదన స్టార్టయింది. కాబట్టి మా కులదేవత హుండీలో వెయ్యడానికి నేను ప్రతి నెలా పంపించాలి. నువ్వు ఎవరికీ పంపించక్కర్లేదనుకుంటాను''

అమల ఏదో అయిష్టమైన విషయం చెప్తున్నట్టుగా చెప్పింది.

''లేదండీ నాకో తద్దినం వుంది. మా కేసు చూస్తున్న లాయరుకి ఫీజుగా ఆ పెద్ద ఎమౌంటు ఒక్కసారి ఎలాగూ ఇవ్వలేనుగా. అందుకే నా సంపాదన ఆరంభమయిందగ్గర్నించి నెలనెలా అయిదువందల చొప్పున పంపిస్తానని ప్రామిస్ చేశాను''

ఆ తర్వాత ఇద్దరూ ఎవరికివారే ఆలోచనలో పడ్డారు. ఎంతో కొంత తమ తండ్రులకి ఇవ్వకపోతే వాళ్లెప్పుడైనా వీరిద్దరి మధ్యకీ వచ్చి ఏదైనా గొడవపెడితే, తాము అందంగా వేసుకున్న అబద్ధపు జలతారు తెర చిరిగిపోవచ్చు. రెండు అయిదువందలు తమ జీతాలనించి మైనస్ అయితే మిగిలేవి రెండువేల రూపాయలు. దాంతోనే జాగ్రత్తగా బడ్జెట్‌వేసి, తమ విలాసజీవితానికి ఎటువంటి ఇబ్బంది రాకుండా చూస్కోవాలని అమల ఆలోచించింది. అమలతో తన ఇంట్లో కాపురం పెడితే, తన బండారం అంతా బయటపడిపోతుంది కాబట్టి వేరే ఇల్లు అద్దెకు తీసుకోవాలని రాంబాబు అనుకుంటూనే వున్నాడు.

వారిద్దరికీ మరింత సంతోషం కలిగించే వార్త మరొకటి చెప్పాడు రామారావు. ''సుధా ఎపార్టుమెంట్సులో మన కంపెనీకో డబల్ బెడ్‌రూమ్ ఫ్లాట్ ఒకటి వుంది. ఎవరైనా గెస్టులు బయట ఊర్నించి వచ్చినప్పుడు దానిలో

వుంచుతాం. ప్రస్తుతం అందులో ఎవరూ లేరు. మరో రెండు మూడు నెలల్దాకా ఎవరూ వచ్చే అవకాశంలేదు. అంచేత కొన్నాళ్లపాటు మీరు అందులో వుండొచ్చు'' ఆ మాటతో అమల ఆనందానికి అవధులు లేకపోయాయి. చేతిలో మిగిలే రెండువేల్లోని ఇంటిఅద్దెకి ఎంత ఖర్చ యిపోతోందో అని భయపడుతోంది. కానీ ఇప్పు డు పైసా ఖర్చులేకుండా ఓ డబల్ బెడ్‌రూమ్ ఫ్లాట్ దొరికేసింది.

మర్నాడే రాంబాబు తన పాతింటికెళ్లి తను అమల తీసుకున్న నిర్ణయం గురించి చెప్పి, ఇకమీదట మీకు నెలనెలా అయిదువందల చొప్పున వస్తుంది. కొన్నాళ్లపాటు ఎలాగో మేనేజ్ అవండి. మరేం లెక్చర్లివ్వొద్దు'' అన్నాడు ఖచ్చి తంగా. రేఖ స్త్రీ సహజమైన బాధనే వ్యక్తంచే స్తూ ఏడ్చింది. ఆమెను సినిమాటిగ్గా గుండెలక ద్దుకోకుండా దూరంగా నిలబెట్టే రాంబాబు జవాబు చెప్పాడు. ''ఈ ఏర్పాటంతా ఓ.ఏడాది. తప్పితే రెండేళ్లవరకే. ఆ తర్వాత మీ వదినకి రావల్సిన ఆస్తంతా వచ్చేస్తుంది. అప్పుడు నీ పెళ్లిని వైభవంగా జరిపిస్తాను. ఈలోగా నీ డిగ్రీ పూర్తిచేయ్''

చలపతి ఎప్పుడూ లేని సిన్సియార్టీ చూ పిస్తూ- ''రేఖ విషయం నాకు వదిలేయ్‌రా. నాకు ఓ కర్రల అడితిలో పనొచ్చింది. నాకూ ఇకమీదట ఎనిమిదివందలు జీతం వస్తుంది. అదీ, నువ్విచ్చే డబ్బు కలిపితే మా ఇద్దరం బ్రహ్మాండంగా బ్రతికేస్తాం'' అన్నాడు. తన సమస్య అనుకున్నదానికంటే సులభంగానే తీరిపోయిందనుకున్నాడు రాంబాబు. అమల సమస్య అంతకంటే సులభంగా పరిష్కారమ యింది. అమల ఇస్తానన్న నెలవారీ అయిదు వందలు, అచ్యుతానంద వద్దన్నాడు. ''నేను కన్నానే తప్ప నిన్ను పెంచలేదు. ఏనాడూ నీకో పదిపైసలు కూడా పెట్టి పువ్వులు కొనలేదు. ఇంక నా బతుకంటావా? ఇన్నాళ్లూ ఎలా బ్రతికేశానో, ఇకమీదటా అలాగే బతికేస్తాను. ఎప్పుడైనా నాకు చెయ్యి ఆడనప్పుడే నిన్ను అడుగుతాన్లే'' అన్నాడు. ఆ ఒక్కమాట ఆమెకు వెయ్యివరాల పెట్టుగా కనిపించింది. అందుకే తండ్రిని రెండోసారి ఒత్తిడి చెయ్యలే దు. చేతిలో రెండువేలే మిగుల్తాయనుకుంది.

కానీ ఇప్పుడు మరో అయిదువందలు కలుస్తు న్నాయి. సో... తనకంటే అదృష్టంతులు ఏ కొద్దిమందో వుంటారనుకుంది.

ఇష్టపడిన అమ్మాయిని పెద్ద కష్టమేమీ లేకుండా పెళ్లి చేసుకున్నాను. పైగా ఒకటికి రెండుజీతాలు. నా అంత హాపీమేన్ ఈ ఊళ్లోనే వుండివుండడని తృప్తిపడ్డాడు రాంబా బు.

ముప్ఫయ్యేళ్లుగా స్నేహితులుగా బ్రతికిన వాళ్లం, ఈ పెళ్లి మూలంగా వియ్యంకులం కాగలిగేం అని ముసలాళ్లిద్దరు చంకలు గుద్దు కున్నారు.

★ ★ ★

ఇంతవరకు కథ చెప్పిన సీతారామదాసు, ఓ రెండు నిమిషాలు ఆగి బాత్రూమ్‌కెళ్లి వచ్చే డు. ''కథ అయిపోయిందాండి?'' అన్నాడు ఒకాయన.

''బంగారు లేడి, గింగారులేడి అంటూ ఏదోఏదో చెప్పేరు. ఆ బంగారులేడి ఏదీరా కుండానే కథకెలా ఫినిషింగ్‌టచ్ యిచ్చేశా రండి?'' అన్నాడు మరో ఆయన. సీతారామదా సుగారు, రెండు గుప్పిళ్ళతోను గెడ్డం పట్టు కుని పీక్కుంటూ ''నేను కడుపుబ్బిపోయి, బాత్‌రూమ్‌కెళ్ళాల్సొచ్చి కథకి చిన్న ఇంటర్వెల్ యిచ్చేను తప్ప, నేను కథ అయిపోయిందని మీకు చెప్పేనా? రాంబాబు జీవితంలోకి మరో లేడిపిల్లో, ఆడపిల్లో రాలేదయ్యా. నేను బంగా రులేడి అనే మాటకిచ్చే నిర్వచనం ఏమిటో తర్వాత తెలుస్తుంది. ఇంతవరకు ఎటువంటి టెన్షనూ లేకుండా, సాఫీగా సాగిపోయిన రాంబాబు జీవితం ఎలా ఒడిదుడుకుల పాల యిందో యిప్పుడు వివరిస్తాను వినండి'' అంటూ మళ్లీ కథ చెప్పనారంభించాడు.

★ ★ ★

రాంబాబుకిచ్చిన ఫ్లాట్‌కి, ఆఫీసుకి మధ్య పెద్దదూరమేమీ లేదు, సిటీ బస్సు ఎక్కితే రెండో బస్ స్టాప్‌లో దిగిపోవాలి. ఆ బస్‌స్టాప్ ఎదురుగానే ఆఫీసు. సరదాగా నడుచు కుంటూ వచ్చేస్తే పదినిముషాల్లో ఆఫీసుకి చే రుకోవచ్చు. 'ప్రేమయాత్రలకి బృందావనం, కాశ్మీరాలు ఏలనో అన్న పాట పాడుకుంటూ ప్రేమించుకుని పెళ్లి చేసుకున్న దంపతులు సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తూ




వెళితే వచ్చే ఆనందం, మూడు లక్షలు ఖరీదు చేసే కారులో వెళ్ళినా, పదిహేను లక్షలు ఖరీదు చేసే బస్సులో వెళ్ళినా రాదని గ్రహించి, రాంబాబు, అమల రోజూ నడిచే ఆఫీసుకి వెళ్తున్నారు. నడిచే వస్తున్నారు.. ఇంతవరకూ ఓకే! కానీ, తన తల్లిపోయిందగ్గర్నించి చేస్తున్న వంటపని, పెళ్ళాం వచ్చేక కూడా తప్పింది కాదు రాంబాబుకి. పెళ్ళయిన కొత్తలో తనకొచ్చిన విద్యల్ని భార్య ముందు ప్రదర్శించాలని అందరు మగాళ్ళూ అనుకుంటారో, లేక కొందరే అనుకుంటారో తెలీదుగాని, ఆ అందర్లోను, ఆ కొందర్లోను రాంబాబు వున్నాడు. తనకి వచ్చిన నాలుగయిదు ఆసనాల్ని వేసి చూపించాడు. ఆమె మెచ్చుకుంది. కాళ్ళు పైకెత్తి చేతుల మీద నడిచి చూపించాడు. ఆమె చప్పట్లు కొట్టింది. మౌత్‌ఆర్గన్ వాయించి ఆమె చేత శెభాష్ అనిపించుకున్నాడు. ఆ తర్వాత తనకి వంట చెయ్యడంలో వున్న ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తూ మటన్ కుర్మా, రసం వండి చూపించాడు. ఫెంటాస్టిక్ అంది. మర్నాడు మరో కాయగూరవండించింది. అందులోనూ అతను మార్కులు కొట్టేశాడు. తర్వాత మరొకటి మరొకటి చొప్పున నాలుగు రోజులు వండి చూపించాడు. అంతే!

"ఇక మీదట వంట చేసే ఛాన్స్ మీకేయిచ్చేస్తున్నాను. ఎందుకంటే మీరు బ్రహ్మాండంగా వంట చేస్తారు. ఆ వంట నాకు నచ్చడం ఒక కారణం అయితే, రెండో కారణం మరొకటుంది. నావంట పరమ ఛండాలంగా వుంటుంది. మొదట్నించీ నేను చాలా గొప్ప ఫేమిలిలో పెరిగిందాన్నికదా! అంచేత నాకు వంట సరిగా రాదు. మొదట్నించి రుచికరమైన వంటలు తింటానికి అలవాటు పడిన మిమ్మల్ని నా దరిద్రగొట్టు వంటల్తో బాధపెట్టడం యిష్టంలేకనే నేను వంట చెయ్యనంటున్నాను"

రాంబాబు భలే యిరకాటంలో పడ్డాడు. అటు ఆఫీసుపని, దానికి ముందు, తర్వాత గూడా వంట పని. ఆఫీసుకైతే ఆదివారాలు, శెలవుదినాలు వుంటాయి, కానీ వంటపనికి అదీవుండదు. అయితే, తను పడాల్సిన శ్రమ కంటే, తన వంట గురించి అమల చేసిన ప్రశంస అతనికి వుత్సాహాన్నిచ్చింది. అలా అమల, రాంబాబు సంతోషంలో మునిగితేలుతున్న తరుణంలో, ఒకరోజు హారిక కనిపించింది.

హారిక!

కరాచీవాలా డిపార్ట్‌మెంటల్ స్టోర్‌లో అమల, రాంబాబు ఏవో సామాన్లు కొంటున్న వేళ... అమల భుజం మీద ఓ చెయ్యివడింది. అమల ఎవరా అని వెనక్కి తిరిగి చూసింది.

హారిక!!

తన స్నేహితురాలు... కాదు, అంతకు మించి తను విజయవాడలో వున్నప్పుడు తమ మేనత్త యింట్లో అంట్లుతోముకునే రంగమ్మ కూతురు వరహాలమ్మ. కానీ, యిప్పుడు యింత గొప్పగా వుందేమిటి? కొంపదీసి యీమె, ఆ వరాలమ్మకాదా? "ఏమే నన్ను గుర్తుపట్టలేదా? నేనే, హారికని" అంది ఆమె నవ్వుతూ.

"నువ్వు గుర్తురాకేం? వచ్చేవు, కానీ నీ పేరు హారిక ఏమిటే? వరహాలమ్మ కదా"

అలా అనడంలో అమల గొంతులో అహం, హారికపట్ల న్యూనతాభావం ధ్వనించేయి. అయినా హారిక ముఖంలో నవ్వు మాయమవలేదు.

"వరహాలమ్మనేది మా అమ్మ పెట్టినపేరు. హారిక అనేది మా ఆయన గారు పెట్టుకున్నపేరు"

ఆమె గొంతులో ఎంతో సంస్కారం, మార్దవం కనిపించేయి. హారికని అమల అప్పుడు పరీక్షగా చూసింది. ఆమె కట్టు, బొట్టు, జుట్టు, అన్నీ ఆధునికతకి, ధనిక జీవితానికి ప్రతీకలుగా కనిపిస్తున్నాయి.

"ఆమె నీ స్నేహితురాలా? సినిమా స్టార్ దివ్యభారతిలావుందికదూ?" అన్నాడు రాంబాబు అమలకి మాత్రమే వినిపించేటట్టుగా.

అతనివైపోసారి గుర్రురిమి చూసి, తన అక్కసుని వ్యక్తం చేస్తూ హారికని పరిచయం చేసింది.

"ఇది, వరహాలమ్మ అని, నేను విజయవాడలో వున్నప్పుడు, మా యింట్లో అంట్లుతోమే పనిమనిషి రంగమ్మ కూతురు. పాపం, అప్పట్లో నాలుగైదు యిళ్ళల్లో అంట్లుతోమడం, పాచి పనులు చేస్తే తప్ప, వీళ్ళకి ఒక్కపూట గడిచేది

కాదు. వీళ్ళ నాన్న పక్కా తాగుబోతు, తిరుగుబోతు! లారీ ఏక్సిడెంటులో నడిరోడ్డుమీద దిక్కుమాలిన చావుచచ్చేడు. అన్నట్టు వరాలూ, నువ్వుగూడా మీ అమ్మకి ఒంట్లో బాగులేనప్పుడు మా యింటికొచ్చి అంట్లుతోమి, మా బట్టలుతికేవుగదూ''

హారిక ముఖంలో నవ్వు మాయమవలేదు. ''ఔను అమలా, నేను నీ బట్టలుతికినప్పుడు నీ లంగా చిరిగిపోతే నువ్వు నన్ను కొట్టేవుగూడా! గుర్తుందా?''

''వుంది... ఇప్పుడు మీ అమ్మేం చేస్తోంది?''

''అమ్మ పోయి రెండు నెల్లయింది''

''నువ్వెక్కడైనా పని చేస్తున్నావా?''

''లేదు... మా ఆయనొక్కరే పని చేస్తున్నారు''

''అంటే మీ ఆయన ఒక్కరి జీతం మీదే నెట్టుకొస్తున్నావన్న మాట. పాపం, మీ లేబర్ మనుషుల జీవితాలు అంతేనే!'' అమల జాలి పేరుతో హారికని అవమానించడం, హారిక పక్కనున్న సర్వెంటు ఎంతో సేపట్నించి సహిస్తూ నిలబడినా, యింక సహించలేక అనేసింది. ''చూడండమ్మా... మీరు మా మేడమ్ గారి స్నేహితురాలే కావచ్చు. ఒకప్పుడు అమ్మగారు బీదరికంతో బతికుండొచ్చు, కానీ యిప్పుడావిడ ఎవరో తెలుసా? నెలకు పదిహేను వేల రూపాయిలు సంపాదించే తేజేశ్వర్రావుగారి భార్య''

అమల వగలబడినవ్వింది ''పదిహేను వేలా? సంవత్సరానికా?'' అంది నవ్వుతూనే.

హారిక మాత్రం ఏమీ ఫీలవకుండా ''సంవత్సరానికి కాదులేవే, నెలకే! మా ఆయన భారత్ ఇంటర్నేషనల్ టైర్స్ కంపెనీకి జనరల్ మేనేజర్'' అంటూ తన హేండ్‌బేగ్‌లో నించి ఓ విజిటింగ్ కార్డుతీసిచ్చింది.

కె.తేజేశ్వర్ అన్న పేరుతోపాటు బోలెడన్ని డిగ్రీలు ఆపేరు పక్కన కనిపించడంతో అమల ముఖంలో కత్తివాటుకి నెత్తురుచుక్క లేకుండాపోయింది. రాంబాబు పరిస్థితీ అదే అయింది.

ఆ షాపు బయటనున్న కారు దగ్గరకి హారిక నడిచింది. డ్రైవరు ఎంతో వినయంగా డోర్ తెరిచిపట్టుకున్నాడు. కారు ఎక్కబోతూ హారిక అడిగింది ''నా గురించే అడిగేవు తప్ప నీ గురించి చెప్పలేదేం అమలా. మీవారేం చేస్తుంటారు?''

''అసిస్టెంట్ మేనేజర్. ఈ ఏడాదిలో బ్రాంచ్‌మేనేజర్ అయిపోతారు'' అమల అప్రయత్నంగానే అబద్ధమాడేసింది. రాంబాబు కంగారుపడ్డాడు. అతను ఏ కంపెనీలో అసిస్టెంటు మేనేజరని అడగకుండా ''నువ్వూ పని చేస్తున్నావా?'' అని మాత్రం హారిక అడిగింది.

''ఏదో కాలక్షేపం కోసం నేనూ రమ్యాసోప్ ఇండస్ట్రీస్‌లో పనిచేస్తున్నాన్లే''

''వెరీగుడ్... మీరోసారి వీలు చూస్కొని మా బంగళాకి రండి... ఫోన్ నెంబరు ఆ కార్డులో వుంది. వచ్చేముందు ఫోన్ చేస్తే మీ యింటికి కారు పంపిస్తాను'' అంటూ ఆమె కారు వెనక సీట్లో కూర్చుంది. పని మనిషి ఫ్రంట్ సీట్లో కూర్చుంది.

''నువ్వు కారు పంపక్కర్లేదులే. మా కారులో మేం వస్తాం. ఇవాళ దానికేదో రిపేర్ వస్తే గేరేజీకి పంపించాం'' అమల కావాలనే అబద్ధం చెప్పింది. ''తప్పకుండా రండి'' అంది హారిక టాటా చెప్తూ. డ్రైవరు కారు స్టార్ట్ చేశాడు.

అమలని ఆరోడ్డు మీదే దులిపేద్దామనుకున్నాడు రాంబాబు, కానీ యింటికొచ్చేవరకు తమాయించుకున్నాడు.

''నాకు అసిస్టెంటు మేనేజరువుద్యోగమా? ఏ కంపెనీలో అని ఆవిడ అడక్కపోబట్టి సరిపోయిందిగాని, అడిగుంటే నేనేమయ్యేవాణ్ణి?''

''అదేంటోనండి, మా యింట్లో అంట్లుతోమిందాని కూతురు, తన భర్త జనరల్ మేనేజర్ అనేసరికి నేనూ వుండబట్టలేక అలా అనేశాను'' అమల హారికని చూసిన మూడ్ నించి యింకా బయటపడలేదు.

''మనకి కారుందా? మనకి మోటర్ సైకిల్ కూడా లేదే, అలాంటిది కార్లు విమానాలు వున్నాయిని ఎందుకుకోత కొయ్యాలి? కొయ్యగానే సరిపోయిందా? రేపువాళ్లింటికెళ్లినప్పుడు మీకారేదీ అని అడిగితే ఏం చూపిస్తాం? అప్పుడు కూడా మన కారు రిపేర్లోవుందని చెప్తావా?





మరీ అంత తొందరపాటు పనికిరాదు అమలా?''

''తొందరపాటేవిటండీ... తొందరపాటు. ఆఫ్టరాల్ మాయింట్లో అంట్లు'' రాంబాబు ఆమెను మాటపూర్తి చెయ్యనివ్వలేదు ''ఎంత సేపూ ఆవిడ గతాన్ని గురించి మాట్లాడతావే గాని, ఆవిడ అదృష్టం గురించి మాట్లాడవేం? ఆవిడ ఎలావుందో చూసేవా? సినిమా స్టార్‌లు సిగ్గు పడేటంత అందంగావుంది. . ఆవిడ అందం చూసి ఎవరో పెద్ద ఆఫీసరు ప్రేమించి, పెళ్ళి చేసుకునుండొచ్చుగా! ఆవిడ గతం ఒక్కటే ఆలోచిస్తే, నేను మాత్రం గతంలో వీధుల్లో బట్టలు వేలం పాట పాడ లేదా?''

అమల ఛర్రుమంటూ లేచింది. ''ఛీఛీ, మీరుదాంతో పోల్చుకోడం ఏమిటండీ? అదెంత నికృష్టంగా బతికిందో నాకు తెలుసు. అలాంటి దానికీ, వంశాచారం ప్రకారం కష్టపడి బతుకు తున్న ధనవంతులు మీకూ పోలికా? దాన్నెవ డూ ప్రేమించి వుండడు. అదే ఎవడో అమాయికుణ్ణి చూసి గేలం వేసుంటుంది. లేకపోతే మెట్రిక్యులేషన్ కూడా పాసవని దాని బతుక్కి ఓ కారు, ఓ బంగళా, పది హేను వేలు జీతం తెచ్చుకునే మొగుడా?''

అమల బట్టలయినా మార్చుకోకుండా కాస్సేపు అలాగే మంచం మీద కూర్చుని గతాన్ని తల్చుకుని, తల్చుకుని మరీ హారికని తిట్టింది. ఆ తర్వాత రెండు రోజులు గడిచాయి. వారిద్ద రిమధ్య హారిక టాపిక్‌మళ్ళీ రాలేదు. అమల కోర్టుకేసు తీర్పుకొచ్చేసి, మళ్ళీ ఆవిడ ఆస్తి ఆవిడ చేతికొచ్చేవరకు, హెూదా వెలగబెట్టే వార్ని చూస్తే యిలాగే వులికిపడుతుంది. ఔను మరి, ఆవిడ నాలాగ పేదరికంలో పుట్టి బీద తనం అనుభవించిన మనిషి కాదాయె, అని రాంబాబు అనుకున్నాడు.

మూడో రోజు, అంటే ఆదివారం మధ్యాహ్నం, భార్యాభర్తలిద్దరూ యింటి దగ్గరవున్న పుడు రాంబాబు కంగారుపడిన సంఘటన ఒకటి జరిగింది. శంకరనారాయణ అనే ఓ నలభై ఏళ్లాయన ఆ యింటికొచ్చి, అమలకి మాత్రం విష్ చేసి ''మాట్లాడేనమ్మా... ముప్పై రెండు వేలకైతే తెగ్గొట్టేస్తానని చెప్పమన్నారమ్మా'' అన్నాడు. ఆ తెగ్గొట్టేదేవిటో రాంబాబుకి అర్థం కాలేదు.

''నేను అనుకున్న ఫిగరు కూడా అదేలే. మిగతా విషయాలు మేం వచ్చి మాట్లాడతామని చెప్పు'' అంది అమల. ఆయన వెళ్ళి పోయాడు.

''ఎవరతను?''

''కారు డ్రైవరు? మన వీధి చివర గులాబీ రంగుమేడవుందిగా. దాని యజమాని వెంకటాద్రిగారు ఏదో డబ్బు అవసరంవచ్చి వాళ్ల ఫియట్ కారు అమ్మేస్తున్నారని తెల్సింది. కారు సెకెండ్ హేండ్‌దే అయినా మంచికండీషన్లోనే వుంది. యాభై వేలుకి తగ్గనన్నాడు. పాతిక వేలకిస్తే, చెప్పండీ అన్నాను. డబ్బు అవసరంలోవున్నాడేమో ముప్పై రెండు వేలకిస్తానని డ్రైవరుతో కబురు చేశాడు''

రాంబాబుకి గొడవేమిటో అర్థం కాలేదు. తనకి తెలియకుండా యీ రెండు రోజుల్లోను అమల యీ బేరసారాల్ని ఎలా నడిపించిందో అంతకంటే అర్థంకాలేదు. అర్థమైందల్లా ఒక్కటే! అమల కారుకొనే ప్రయత్నం చేస్తోంది.

''మనకి కారెందుకు?''

''ఆ హారికకి కారు ఎందుకుంది?''

''ఆవిడకో స్టేటస్‌వుంది కాబట్టి''

''ఏం మనకి లేదా స్టేటస్? మీరు కూడా ఓ గొప్పింటి మనిషై వుండి అలా మాట్లాడతారేమిటి? ఇవాళ కాకపోతే రేపైనా మీరు మీ తండ్రిగారిదగ్గరకి వెళ్ళిపోతారుగా. అప్పుడు తనకి మాత్రం రాదా స్టేటస్?'' అమల అన్నీ ఎదురు ప్రశ్నలేవేసింది.

''మనకా స్టేటస్ ఎప్పుడొస్తే అప్పుడే కొనుక్కోవచ్చుగా''

''అంతవరకు నేనా హారిక దగ్గర తల దించుకు నిలబడాలా? మనకో కారుందని ఎలాగూ నోరు జారేశాను. ఇప్పుడా మాటని నిజం చెయ్యకపోతే, మా పనిమనిషి కూతురు ముందు నాకు తలకొట్టేసినట్టవుతుంది. అది మాత్రం నేను భరించలేనుబాబూ''

మరో పావుగంట వాదన తర్వాత అమల తీసుకున్న నిర్ణయాన్ని తను మార్చలేననే నిర్ణయానికొచ్చేశాడు. ఆ తర్వాత తనూ కారు

గురించి ఆలోచించాడు. ఆమెతో స్నేహం చెయ్యడానికి తనూ రాయల్ ఫేమిలీనించి వచ్చేశానని కోతకోసేడు. అది తన తప్పు! తనో కంపెనీలో అసిస్టెంటు మేనేజరు వుద్యోగం వెలగబెడుతున్నాడని అమల కోత కోసేసింది. దాంతోపాటు ఓ కారు కూడా వుందని అబద్ధమాడేసింది. ఇప్పుడా అబద్ధాన్ని నిజం చెయ్యడానికి నిజంగానే కారు కొనాలంటోంది. ఆలోచించి చూస్తే అమల చేస్తున్నది తప్పుకాదేమో! పెళ్ళికి ముందు లాడ్జిలోవున్న జ్యోతిష్యుడేం చెప్పేడు? అమల తన జీవితంలో కొచ్చేక తన దశతిరిగి పోతుందన్నాడు. బహుశా నా దశ తిరగడం, యీ కారు కొనడంతో ఆరంభమవుతుందేమో? కారు కొన్న వేళావిశేషాన్నిబట్టి కోర్టులో పాతుకుపోయిన అమల ఆస్తి కేసు సెటిలైపోతే, అమల చెప్పినట్టు మా స్టేటస్కేం తక్కువ? రాంబాబు యిలా పదే పదే ఆలోచించి, తననితాను సమాధానపరుచుకున్నాడు. ఇప్పుడు పరిష్కరించాల్సిన సమస్య ఒక్కటే!

"కారుకొంటానికి ముప్పై రెండువేలు ఎక్కడినించితెస్తాం?"

మన ఆఫీసులో మోటర్ సైకిల్ కొనుక్కోడానికి లోన్సు యిస్తున్నారుగా. ఇద్దరం ఎప్లయ్ చేస్తే రెండులోన్స్ వస్తాయి" అమల అంతక్రితమే ఆ అయిడియా ఆలోచించి రెడీ చేసినట్టుగా చాలా సులభంగా చెప్పేసింది.

"యిద్దరికీ రెండు లోన్స్ యిస్తారంటావా?" రాంబాబు అనుమానంగానే అన్నాడు.

"ఎందుకివ్వరండి? ఎంతమంది ఆడవాళ్లు మోటర్ సైకిల్స్ తొక్కడంలేదు?"

"తొక్కడం వేరు, భార్యాభర్తలిద్దరికీ రెండు లోన్స్ యివ్వడం వేరనుకుంటాను"

"అదేంలేదు. యిద్దరికీ రెండులోన్స్ యివ్వనప్పుడు, యిద్దరికీ వుద్యోగాలు ఎందుకిచ్చేరట?"

రాంబాబు మరేం మాట్లాడలేదు.

★ ★ ★

రెండు అప్లికేషన్సు చూసి, రామారావు రాంబాబు దంపతుల్ని తనరూమ్కి పిలిచాడు.

"మీరు మోటర్సైకిల్ లోన్ కోసం రెండు అప్లికేషన్స్ పెట్టేరేమిటి? మనిషికో లోన్ యివ్వాలని రూల్సున్నా మీలాంటి భార్యభర్తలిద్దరూ ఒకే ఆఫీసులోపనిచేస్తున్నప్పుడు, మీరిద్దరూ ఒక్క మనిషికిందేలెక్క. జీతాలు రెండు యిచ్చినా యిలాంటి ఎడ్వాన్సులు మాత్రం ఒక్కటే యిస్తారు. పైగా, మీరిద్దరూ వచ్చేది ఒక యింట్లోనించే, ఒక ఆఫీసుకే కాబట్టి, మీకు రెండు బళ్ళు ఎందుకు? ఒక బండిమీద ఇద్దరు రావడానికిట్రాఫిక్ రూల్సు కూడా ఒప్పుకుంటున్నాయి. ఒకవేళ, మీ యిద్దరికీ చెరో మోటర్ సైకిల్ ఎడ్వాన్సు యిచ్చే వీలున్నాసరే, మీరిద్దరూ విడివిడిగా చెరోబండి మీద రావడం నేను చూడలేను" రామారావు చెప్పిందానికి అమల ఆర్గ్యూచేస్తుందేమోనని రాంబాబు అనుకున్నాడుగాని, ఆమె నోరు ఎత్తలేదు.

లోన్గా పన్నెండు వేలుయిచ్చేరు.

లోన్ పుచ్చుకోగానే సరికాదు. అది దేనికోసం యిచ్చేరో, దాన్ని ఆ వాహనం కొంటానికే వుపయోగించాలి. తత్సంబంధమైన పేపర్సుని ఆఫీసులో సబ్మిట్ చెయ్యాలి. అయితే యీ సీటు వ్యవహారాలు చూస్తున్న రామచంద్రరావు అనే గుమస్తా మందుప్రియుడు. గొంతులో ఓ హాఫ్ బోటిల్పోసి యింటికి పట్టుకెళ్లమని ఓ ఫుల్ బోటిల్ చేతిలో పెట్టేస్తే ఆ పేపర్సు అక్కర్లేకుండా ఓ ఆరునెల్లదాకా మేనేజ్ చేసేస్తాడని అమల తెల్సుకుంది. డబ్బు చేతికి అందిన రాత్రే రాంబాబు అతనికి ఆల్కహాలుతో అభిషేకం చేసేశాడు. తర్వాత సంగతి ఆరు నెల్ల తర్వాత కదా, అప్పుడు చూసుకుందాం అనుకున్నారు.

ముప్పై రెండు వేలకి పన్నెండు వేలు సమకూరితే, యింకా యిరవై వేలు కావాలి. ఎలా? అమలకి వాళ్ళ మేనత్త పెట్టిన అయిదు తులాల గొలుసుంది. దాన్ని అమ్మేసింది. పధ్నాలుగు వేలొచ్చేయి. మార్వాడీ దగ్గర అయిదువేలు ప్రోనోటు మీద అప్పు తీసుకున్నారు. నూటికి అయిదు రూపాయలవడ్డీ! నెలకి రెండు వందలయాభై వడ్డీ చెల్లించాలి. ఆఫీసులో లోను తీసుకున్నందుకు నెలకి రెండు వందలు మినహాయిస్తారు. అంటే, వస్తున్న రెండువేల అయిదువందల జీతంలోనూ నాలుగువందల యాభై యికమీదట తగ్గు

 

తుంది. అయినా సరే, హారికతోపాటు తనకీ కారుందని సగర్వంగా చెప్పుకుంటూ పొందే సంతోషం ముందు యీ నాలుగువందల యా భై ఏపాటిదనే అమల భావించింది. ఆమె భావనే రాంబాబు భావనా అయింది.

కారు కొనేశారు. మరి డ్రైవింగు మాటేమిటి? డ్రైవింగ్ స్కూల్లో నేర్చుకుంటాను అన్నాడు రాంబాబు.

"ఎందుకుసార్? అక్కడైతే నెలకి ఆరేడు వందలు ఫీజుకింద తీసుకుంటారు. నాకో మూ డు వందలు యిచ్చెయ్యండి. మీకు నేర్పేస్తా ను"అన్నాడు కారుతోపాటు వచ్చిన డ్రైవరు శంకరనారాయణ.

"యిది బాగానేవుంది. నేనూ నేర్చుకుంటా ను" అంది అమల.

"వద్దులే... నీకో మూడువందలు, నాకో మూ డు వందలు ఎందుకు దండగ? నేను నేర్చుకు న్నాక నీకు నేర్పుతానని" రాంబాబు ఓ గొప్ప అయిడియా యిచ్చేడు.

రెండు రోజులపాటు రాంబాబు నేర్చుకు న్నాక అమలకి మరో ఆలోచనొచ్చింది. శంకర నారాయణకి వేరే చోట యింకా వుద్యోగం దొరకలేదు. అతని చేత కారు డ్రైవ్ చేయిస్తూ హారికయింటికెళ్ళి, అతను మా డ్రైవరని చెప్తే మరింత గొప్పగా, హుందాగా వుంటుందని పించింది. ఆఫీసునించి అమల హారికకి ఫోన్ చేసి 'వచ్చే ఆదివారం మీ యింటి కొస్తున్నాం' అని చెప్పింది. కారులో దర్జాగా వెళ్తున్నప్పుడు ఒంటిమీద మరీ నగలు లేకపోతే ఎలా? వున్న ఒక్క గొలుసు అమ్మేసింది. రోల్డ్‌గోల్డ్ షాపుకెళ్ళి రెండు జతల గాజులు, ఓ నెక్లెస్, చెవులకి రెండు రింగులు తీసుకుంది.

★ ★ ★

హారిక వుంటున్న బంగళా చాలా ఆధునాత నమైంది. ఆకర్షణీయంగా కనిపిస్తోంది. దాన్ని అంత అందంగా వుంచడానికి హారిక తీసుకు న్న శ్రద్ధ ప్రతి అంగుళంలోనూ కనిపిస్తోంది. మా ఆయన తన తండ్రిగారితో కల్సిపోయిన మర్నాడే యిలాంటి బంగాళాలు కొనెయ్యాలి. వీలుంటే యీ బంగళానే ఏదో ఓ రేటుకి అడిగెయ్యాలి అని మనసులోనే అనుకుంది అమల. రాంబాబు మాత్రం ఆ బంగళాని చూడగానే, అందులో ప్రవేశించడానికి తగిన విధంగా ఉన్నాయో లేదోనని ఓసారి తన బట్టల్ని చూసుకున్నాడు. హారిక, ఆమె భర్త తేజేశ్వర్ వారిద్దర్ని సాదరంగా ఆహ్వానించేరు. తేజేశ్వర్ కూడా ఎర్రగా, స్లిమ్‌గా బెంగాలీ హీరోలా కనిపిస్తున్నాడు. వుద్యోగరీత్యానే కాదు, స్వతహాగా కూడా అతను ధనవంతుడేనని పించింది.

హారిక అమలని, రాంబాబుని తన బంగళా అంతా తిప్పి చూపించింది. స్టేటస్ సింబల్స్ అని చెప్పదగ్గ గ్రైండరు, మిక్సీలు, వాషింగ్‌మె షిన్లు, ఫ్రిజ్, కలర్‌టీవీ, వీసిఆర్‌లు యివన్నీ ఆ బంగళాలో వున్నాయి. ఆమె ఒక్కొక్కటి చూపిస్తుంటే, అమల వూరుకోకుండా "నువ్వు యీ కంపెనీది కొన్నావా? నేను డయొనారా కంపెనీది తీసుకున్నాలే" అంటూ అక్కడవున్న కంపెనీలు కాకుండా వేరే కంపెనీల పేర్లు చెప్పింది. అమల అలా ఒక్కొక్క దాన్ని గు రించి ఒక్కో అబద్ధం చెప్తుంటే, రాంబాబు గుండెల్లో ఒక్కొక్కరాయిపడి, భోజనాల సమ యానికి, రాంబాబు గుండె ఓ రాళ్ళగుట్టలా తయారైపోయింది.

అయిదు కూరలు, నాలుగు రకాల పిండి వంటలు, రసాలతో భోజనం ఏర్పాట్లు భారీ గానే చేసింది హారిక. అన్నీ రుచిగానేవు న్నాయి. "మీ వంట మనిషి వంటల్లో పద్మ శ్రీలా వుంది. అన్ని పదార్థాలూ అదరగొట్టే సింది" అన్నాడు రాంబాబు చికెన్ జాయింటు తింటూ.

"ఆ పద్మశ్రీ మరెవరో కాదండి యీవిడే" అంటూ హారికని చూపించి నవ్వాడు తేజేశ్వర్. ఆమె అందానికే కాదు, యింటి పనులకి, వంటపనులకి కూడా హీరోయిన్ అని మనసు లోనే హారికని అభినందించాడు రాంబాబు.

వాళ్ళమ్మ అంట్లు తోమడంతోపాటు కొన్ని ఇళ్లల్లో వంటపని కూడా తగలెట్టేదిగా, దాని వారసత్వం దీనికి రాకేం చేస్తుందని అమల మనసులోనే గొణుక్కుంది.

భోజనాలయ్యేక హాల్లో అందరూ కూర్చుని వక్కపొడి నములుతూ రాంబాబుతో "మీరూ ఎం.బి.ఏ. పాసైవుంటే బావుండేది. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ప్రైవేటుగా చదవొ చ్చు" అన్నాడు తేజేశ్వర్.

''చదవడమా? అబ్బో! ఆఫీసునుంచి ఇంటి కొచ్చి భోంచేసేసరికి కళ్లు మూతలు పడిపోతా యండి. మరి, మీరు ఇన్ని డిగ్రీలు ఎలా చదివేరోగాని నేనేదైనా వారపత్రిక పట్టుకున్నా సరే, అదే నాకు జోలపాట పాడేస్తుంది'' అంటూ రాంబాబు ఏదో పేల్చినట్టుగా పగలప డినవ్వాడు. అమల అతన్ని గుర్రుగా చూ సింది.

తేజేశ్వర్ తను అమెరికాలో చదువుతున్న ప్పుడు ఎలా ఒంటరి జీవితాన్ని అనుభవించా డో, తను ఇక్కడ లేనప్పుడు హారిక, ఆమెతల్లి ఎలా బితుకుబితుకుమంటూ గడిపారో వివ రించాడు. ''ఎందుకంత బాధపడ్డారు. మీతోపా టు మీ మిసెస్‌గారిని కూడా అమెరికా తీసుకెళ్లి పోయుంటే బావుండేదేమో'' అన్నాడు రాంబాబు ఏదో అద్భుతమైన సలహా ఇస్తున్న ట్టుగా.

''వాళ్లమ్మ హార్ట్ పేషెంటుగా మంచాన పడివుందప్పుడు. ఆవిడని చూసుకుంటూ, ఎమ్మే పరీక్షకి చదువుతూ హారిక ఇక్కడే వుండి పోవాల్సివచ్చింది. హారిక ఎమ్మే పాసై అమ్మని పోగొట్టుకుంది'' తేజేశ్వర్ చెప్పిందానికి అమల ఉలిక్కిపడింది. హారిక మెట్రిక్యులేషన్ పానవ లేదనుకుంది. కానీ, ఎమ్మే పాసై ఏడ్చిందన్న మాట అని గొణుక్కుంది.

''ఏమైతేనేం, అప్పుడు కష్టాలు అనుభ వించేమేమో, ఇప్పుడు సుఖపడుతున్నాం'' అంటూ తేజేశ్వర్ తన సంతృప్తిని వ్యక్తం చేశాడు.

''కరక్టేలెండి. సింపుల్‌గా చెప్పాలంటే మీది పరుగెత్తి పాలుతాగే టైపు, నాది నిలబడినీళ్లు తాగేటైపు''

రాంబాబు మాటకి హారిక, తేజేశ్వర్ ఫక్కున నవ్వేరు.

అమల మాత్రం నవ్వలేదు. ''అలా ఎందు కనుకోవాలి? మనది, నిలబడే పాలుతాగేటైపు అనుకోవచ్చుగా'' అంది.

ఆ మాటకి ఎవరూ నవ్వలేదు. అక్కడ వున్నంతసేపు రాంబాబు ఎక్కడా తన మాటల్లో తన అసిస్టెంటు మేనేజరు ఉద్యోగ విషయం రాకుండా, వాళ్లు తేకుండా జాగ్రత్తపడ్డాడు.

అమల ఇంటికి బయలుదేరబోతుంటే హారిక వారిద్దరికి రెండు బట్టలపేకట్లు అందించింది. ఇద్దరూ అయిష్టం, మోహమాటం నటిస్తూనే తీసుకున్నారు. వారిద్దరూ కారులో కూర్చున్నాక హారిక ''నన్ను మీ ఇంటికి రమ్మనకుండానే వెళ్లిపోతున్నావేమే'' అంది.

''అలా అంటున్నారుగాని, మీలాంటి వాళ్లు మాలాంటివాళ్ల ఇళ్లకొస్తారా?'' అనేశాడు రాంబాబు. హారిక చూడకుండా అమల తన మోచేత్తో ఒక్క పోటు పొడిచి, తిరిగి నవ్వుతూ హారికతో అంది. ''నేను చెప్దామనుకుంటుండ గానే నువ్వే అనేశావ్. నీకు వీలున్నప్పుడోసారి తప్పకుండా రావే''

''థేంక్యూ. వచ్చేనెల్లో ఆయన జర్మనీ వెళ్తు న్నారు. ఆయన తిరిగొచ్చేవరకూ ఖాళీయే. అప్పుడు నువ్వు వద్దన్నా రోజూ వచ్చేస్తాను'' అంది హారిక.

కారు బయలుదేరింది.



**ఇం**టికి తిరిగొచ్చేక, అతిగా తినడంవల్ల రాంబాబు కడుపులో ఇబ్బంది ప్రారంభమ యింది. హారిక అంతస్తు, హోదా అమల ఇప్పుడు స్వయంగా చూడ్డంవల్ల ఆమె మనసు లోని ఆలోచనలు ఆమెను ఇబ్బంది పెట్టేస్తు న్నాయి. ఏనాట్నించో కనబడని హారిక, ఇప్పు డు తను తక్కువ పొజిషన్లో ఉన్నప్పుడు కనబ డింది. అదేగనక మా ఆయన తన సిరిసంపద ల్తో తులతూగినప్పుడు కనబడివుంటే బావుండుననుకుంది.

హారికని తను పిలవకపోయినా, తనే వస్తా నంది. నిజంగా వస్తుందా? వస్తుంది వస్తుంది. తన వైభవం చూపించడానికి తన ఇంటికి




నన్ను పిలిచింది. అలాంటిది నేనెంత బ్రతుకు బ్రతుకుతున్నానో చూడ్డానికి అది మాత్రం ఎందుకురాదు?

రాంబాబు మంచంమీద వెల్లకిల్లా పడు కుని భుక్తాయాసంతో అటూ ఇటూ దొర్లుతూనే "నీకు రోజురోజుకి నోటిజోరు ఎక్కువైపోతోంది అమలా. ఆవిడ తన ఇంట్లో వున్న వస్తువులన్నీ చూపిస్తుంటే, అంతకంటే ఖరీదైనవి, కంపెనీ పేరుల్తోసహా మనింట్లో వున్నాయని కోసేశావ్ అవన్నీ కొనాలంటే మాటలా? పైగా మీలాంటి వాళ్ళు మాలాంటివాళ్ళ ఇళ్ళకొస్తారేవిటండీ అని దాటేసెయ్యబోతుంటే, నువ్వేమో ఆవిణ్ణీ ఆహ్వా నించేశావు" అన్నాడు.

అమల ఆలోచనలో పడింది. నిజమే, తను తొందరపడి నోటికొచ్చినట్టు వాగేసిందిగాని, ఆ వస్తువులన్నీ తను ఎక్కడనించి తెస్తుంది. అవేవీ ఇంట్లో లేకుండా హారికని ఆహ్వానిస్తే, తనో అబద్ధాలకోరుగా ఆమె దృష్టిలో మిగిలిపో తుంది. ఇప్పుడెలా?

రాంబాబు ఆమెను గమనించి, ఆమెకేదో వూరడింపు కలగించకపోతే ఆ మూడ్‌లోనించి ఆమె మరో నెలదాకా బయటికిరాదని గ్ర హించి "సరే, ఏదో నోరు జారేశావ్‌గా. ఆవిడొచ్చే సరికి నువ్వు చెప్పినవన్నీ సరికొత్తవి ఇంట్లో పెట్టే ఏర్పాటు నేను చేస్తాను. ఆ సంగతి నాకొదిలెయ్" అన్నాడు. అమల సడన్‌గా ఎంతో ఉత్సాహాన్ని తెచ్చుకుంది. "అంటే, మీ నాన్నగార్నో రెండు లక్షలు అడిగి తీస్కొచ్చి ఆ వస్తువులన్నీ కొనేస్తారా?"

"అలా మధ్యమధ్యలో లక్షా రెండు లక్షలు అప్పు తెచ్చుకోడానికి మా వంశాచారం ఒప్పుకో దు. మొన్నోసారి ఈ ఊళ్లో ఓ సినిమా షూటింగు జరిగినప్పుడు ఓ బంగళాని అలంక రించడానికి వాళ్లేం చేశారో తెలుసా?

ఫ్రిజ్జులు, గ్రైండర్లు వగైరా వగైరాలన్నీ షాపులోనించి అద్దెకు తీసుకొచ్చేరు. నేను కూడా మనింట్లో షూటింగు జరుగుతోందని చెప్పి, వాటిని తెచ్చేస్తాను. హారిక వెళ్లగానే తిరిగి ఇచ్చేస్తాను. ఎలావుంది మన అయిడియా?" నిజానికి అమలకీ అయిడియా నచ్చలేదు, కానీ అంతకంటే గత్యంతరంలేదు కాబట్టి ఒప్పుకుంది.

★ ★ ★

లోభికి ఖర్చెక్కువనే సామెత, గొప్పలకోసం అప్పులు చేసేవాళ్లక్కూడా వర్తిస్తుందేమో. కారు ప్రహసనం ముగిసిందని రాంబాబు, అమల సంబరపడ్డారు. కారులో వెళ్లడం, రావడం, వాళ్లని అసూయగా చూసేవాళ్లని చూసి నవ్వు కోవడం అంతా వాళ్లకి ఆనందంగానే వుంది. కారుని ఆఫీసుకి తీసుకువెళ్తే, కారు కొన్న విషయం అందరికీ తెల్సిపోతుంది. పార్టీ ఇమ్మని అడుగుతారు. ఇవ్వడానికేం అభ్యంత రంలేదు. కానీ అలాంటిపనులు చెయ్యడంవ ల్ల ఆఫీసు బాస్‌కి కారు విషయం తెలిసిపో తుంది. దాంతో మోటర్‌సైకిల్‌కి లోన్ తీసుకుని, కారు ఎందుకు కొన్నారని అడగొచ్చు, లేదా మీకిప్పుడు కారెందుకూ అని మందలించవ చ్చు. అందుకని కారుని ఆఫీసుకి కాస్త దూ రంలో ఓ పక్కన ఆపేసి, అక్కడనించి నడు చుకుంటూ ఆఫీసుకొస్తున్నారు. తిరిగి వెళ్లేట ప్పుడు కూడా అందరూ వెళ్లిపోయేవరకు ఆఫీ సులోనే ఆగి, ఓ పదినిమిషాల తర్వాత వెళ్లడం ఆరంభించారు.

అయితే ఈ దొంగాట ఎక్కువరోజులు అడ క్కరలేకపోయింది. అందుక్కారణం రామారా వుగారు కొన్నాళ్లపాటు హైదరాబాద్ వెళ్తుండ డమే.

ఓరోజు రామారావు ఆఫీసు హాల్లో నిలబడి హైదరాబాద్ హెడ్డాఫీసులో చాలా అవకతవక లు జరుగుతున్నట్టుగా కంప్లయింట్స్ వచ్చే యని, వాటిని సరిచేయడానికి తను వెళ్తున్నా నని తిరిగి రావడానికి ఆరునెలలు పట్టొచ్చు లేదా ఇంకా ఎక్కువకాలమే పట్టొచ్చునని చె ప్పాడు, అతను వెళ్లడంవలన, ప్రతిరోజూ క్విజ్ ప్రోగ్రామ్‌కి బలిఅయ్యే దురదృష్టం తప్పు తుందని చాలామంది సంతోషించారు. ఆరోజు మధ్యాహ్నం రాంబాబుని పిల్చి- "నా సీట్లోకి ఇన్‌ఛార్జిగా విజయవాడనించి గంగా ప్రసాద్ గారనే ఆఫీసరు వస్తారు. ఆయనకిక్కడ ఇల్లూ అదేంలేదు. ఆయన్ని మీ ఫ్లాట్‌లో వుండమని చెప్పాను. మీరు వారం పదిరోజుల్లో ఏదైనా అద్దిల్లు చూస్కుని, ఆ ఫ్లాట్‌ని ఖాళీచె య్యండి" అన్నాడు రామారావు. "ఓయస్. దాందేంవుంది సార్" అన్నాడు రాంబాబు చాలా యధాలాపంగా.

కానీ ఆరోజు రాత్రి అమల కాగితం

కలంతీసి బడ్జెట్ లెక్కవేసి చూపిస్తే తప్ప, ఆ ఫ్లాట్ వదిలెయ్యడంవల్ల ఎంత అదనంగా ఖర్చయ్యేదీ రాంబాబుకి తెలిసింది కాదు. ఇప్పుడు అందుతున్న జీతం రెండువేల అయిదువందలు! అందులో రెండువందలు మోటర్‌సైకిల్ లోన్‌కి, రెండూయాభై మార్వాడీ వడ్డీకి, కారు పెట్రోల్‌కి ఆరువందలుపోతే పధ్నాలుగువందల యాభై మిగులుతున్నాయి. ఇందులో ఇంటద్దె అస్సలులేదు. ఇప్పుడు



కొత్తగా ఇల్లు అద్దెకు తీసుకోవాలంటే అద్దె ఎంతవుతుంది? దానికి ఎడ్వాన్సు ఎంతడుగుతారు? ఏదో ఓ డ్రాయింగ్‌రూమ్, ఓ బెడ్‌రూమూ వున్న ఇల్లు అయితే వారిద్దరికీ సరిపోతుందిగానీ, కారు మెన్‌టైన్ చేసేవాళ్లు అంత చిన్న ఇంట్లో వుంటే, ఎంత నామోషీ? పైగా హారిక తన ఇంటికొస్తానంది. ఆవిడొచ్చినప్పుడు తను అంత చిన్నింట్లో వుంటే, ఇన్నాళ్లూ తను చెప్పినవన్నీ డబ్బా కబుర్లని కనిపెట్టేస్తుంది.



అలా జరిగితే ఇంకేమైనా వుందా? ఓ పనిమనిషి కూతురిముందు తన పరువంతా పోతుంది. భలే చిక్కొచ్చిపడిందే" అనుకుంటూనే ఇల్లుకోసం వెదకనారంభించారు. కారులో వెళ్లి అడుగుతుంటే కొందరు చెప్పవలసిన అద్దెకంటే, ఓ వంద, రెండువందలు ఎక్కువ చెప్పారు. అదీగాక కారులోనించి దిగివెళ్లాక తమ జీతాలు రెండూ కలిపి, మరీ మూడువేలని చెప్తే బాగోదని అమల ఇద్దరికీ కలిపి ఆరువేల జీతమని చెప్పింది. దాంతో వెయ్యిరూపాయిలకి దొరికే ఇంటికి కూడా పదిహేనువందలు అద్దె చెప్పనారంభించారు. ఇళ్ల బ్రోకరుకి ఈ పని అప్పజెప్పేస్తే మనకి ఈ తిరుగుడు తప్పుతుందేమో అంది అమల ఓ ఇరవై ఇళ్లు చూశాక. రాంబాబు గతంలో ఆ ఇళ్లబ్రోకరు పని చేసివున్నాడు కాబట్టి వాడికో నెల అద్దె ఎందుకు అర్పించాలి? అసలే మన బడ్జెట్ టైట్‌గా వుందన్నాడు రాంబాబు. అమలతో కలిసివెళ్తే ఇల్లు దొరకడం కష్టమని,

మర్నాటినుంచీ ఆమెను వద్దని ఆఫీసు అవగానే రాంబాబు ఒక్కడే కార్లో వెళ్లి వెదకనారంభించాడు. నాలుగురోజుల తర్వాత కార్లో వెళ్తే అనవసరంగా పెట్రోల్ అయిపోతోందని, కారు వదిలేసి కాలినడకన వెళ్లడం ఆరంభించాడు. పదమూడువందల్లో రెండు ఇళ్లు కనిపించాయి. అన్ని వసతులున్నాయి. కానీ ఆ ఇంటి ఓనర్సు కూడా అక్కడే వుంటున్నారు. నాన్‌వెజిటేరియన్ తినకూడదట. రాత్రి ఎనిమిది అయ్యేసరికల్లా మైన్‌గేట్ మూసేస్తారట. ఇలాంటి షరతులు చాలా పెట్టేసరికి "అంత డబ్బూ ఇస్తూ, మీ షరతులకి లోబడి మేమెందుకు బతకాలనుకుంటూ, ఆ రెండిళ్లూ వదిలేశాడు. వారం గడిచింది. ఇల్లు అయితే కుదరలేదుగాని రాంబాబుకి మెరుపులాంటి అయిడియా వచ్చింది. తాము ఫ్లాట్‌లో వుండగానే హారికని భోజనానికి పిలిచేస్తే! ఆ ఆలోచన అమలకి ఎంతో బాగా నచ్చింది. ఆఫీసుకి వెళ్లగానే హారికకి ఫోన్‌చేసి మాట్లాడింది. "నేనూ మావారు రేపొస్తాం" అంది హారిక.

హమ్మయ్య, ఓ సమస్య తీరిపోయింది. హారిక వచ్చి వెళ్లిపోయేక, మనం ఏ ఇంట్లో వున్నా గొడవుండదు. నేను ఇప్పుడే వెళ్లి గ్రైండర్లు అవీ అద్దెకు తెచ్చేస్తాను" అంటూ రాంబాబు కారులో వెళ్లి కావల్సిన సామాన్లన్నీ లిస్టుచెప్పి, రేపు ఉదయానికి ఫలానాచోట వుండాలని చెప్పాడు. ఈమధ్య విశాఖపట్నంలో షూటింగులు ఎక్కువవడంవల్ల సామాన్లు అద్దెకివ్వడానికి కొన్ని షాపులవాళ్లు పోటీపడుతున్నారు. కాకపోతే ఓ పాతికవేలు డిపాజిట్ కట్టమన్నారు. రాంబాబు గతుక్కుమన్నాడు.

"చూడండి సార్! మనిషిమీద మనిషికి నమ్మకం వుండాలిగాని, ఈ డిపాజిట్లేం చేస్తాయండి? ఒకవేళ, మేం మీ సామాన్లు ఎత్తుకుపోయామే అనుకోండి. వాటి విలువ ఎంతలేదన్నా దగ్గర దగ్గర లక్షరూపాయిలుంటుంది. అప్పుడు మేం కట్టిన పాతికవేల డిపాజిట్టు మీకు ఏ మూలకొస్తుంది. చెప్పండి. అదీగాక, మేం తీస్తున్నది గాంధీగారి చరిత్ర. అటువంటి దేశభక్తి ప్రధానమైన సినిమా తీస్తున్నప్పుడు మీరు కూడా డిపాజిట్టు విషయంలో కాస్త దేశభక్తి చూపించాలిగదండి" అంటూ ఏదో మాటలగారడీ చేయబోతుంటే, ఆ షాపు ప్రొప్రయిటరు తెలివిగానో, అమాయకంగానో ఓ ప్రశ్న అడిగాడు.

"గాంధీగారి కథని సినిమా తీస్తే, ఈ టీవీలు, వి.సి.ఆర్.లు, గ్రైండర్లు ఎందుకండి? ఆయనగారి కాలంలో ఇవేవీ లేవుగా"

దెబ్బతినేశాననుకున్నాడు రాంబాబు. అయినా వెంటనే ఓ అబద్ధాన్ని పుట్టించేశాడు.

"మీ పాయింటు కరక్టే సార్. కానీ, మేం గాంధీగారు బ్రతికున్నప్పటి కథని సినిమా తీయడంలేదు. గాంధీగారు మళ్లీ పుట్టేరు అనే కథని తీస్తున్నాం. అంటే గాంధీగారు మళ్లీ పుడితే ఈ గ్రైండర్లని చూసి ఎలా గాబరాపడతారు? టీవీల్ని చూసి ఎలా తెల్లమొహం వేస్తారు? అనే పాయింట్లన్నీ వెరైటీగా చూపిస్తాం" ఇలా రాంబాబు ఎంత చెప్పినా వాళ్లు వినలేదు. చివరకి రాంబాబు తను సామాన్లు ఇచ్చేవరకు తన కారుని వాళ్ల అధీనంలో వుంచుకోమని చెప్పి, కారుని అక్కడే ఆ షాపు ముందుంచి సామాన్లని వాళ్ల వేన్‌లోనే ఎక్కించుకెళ్లాడు. అన్ని వస్తువులకి కలిపి ఒకరోజు అద్దె నాలుగువేలు. బాబోయ్ అని గుండెలు బాదుకుంటే వాళ్లు అయిదువందలు తగ్గించారు.

సామాన్లన్నీ ఇంటిలో సర్దేసింది అమల.




మర్నాడు ఇద్దరూ ఆఫీసుకి సెలవుపెట్టి వంటకి పూనుకున్నారు. కానీ ఓ అరగంట గడిచీ గడవకముందే రాంబాబుకో సందేహం వచ్చింది. "ఆరోజు హారికగారు వండిన వంటలు రుచిచూశాక మన వంటలు ఎందుకూ పనికిరావనిపించింది. ఇప్పుడు నా వంట, నీ వంట రుచి చూపించి, వాళ్లతో ఎందుకు విరోధం తెచ్చుకోవాలి చెప్పు. ఈ పూటకి ఏ డాల్ఫిన్‌నించో స్పెషల్ అయిటమ్స్ తెచ్చేసి, వాటిని మనమే వండామని అబద్ధం చెప్పేస్తే సరి. మనం ఎలాగూ ఇప్పుడు అబద్ధాల్లోనేగా బ్రతుకుతున్నాం.

అమల అభ్యంతరం పెట్టలేదు.

ఎరువుతెచ్చిన సామాన్లకి అద్దె, ఇప్పుడవుతున్న చిల్లరఖర్చులు, రేపు కొత్తింట్లో దిగేటప్పుడు కట్టాల్సిన ఎడ్వాన్సు... ఇవన్నీ కలిసి పదివేలయినా అవుతాయని లెక్కకట్టేడు రాంబాబు. మార్వాడీ దగ్గర కెళ్లి 'ఇహ్హిహ్హిహ్హి' అంటూ నవ్వి పదివేలు అప్పు కావాలన్నాడు. అతను ఎటువంటి నవ్వు నవ్వకుండా పదివేలు ఇచ్చి ప్రోనోటుమీద సంతకం చేయించాడు. మార్వాడీలకి కావల్సింది నమ్మకంగా వడ్డీ చెల్లించేవాళ్లు. అడగ్గానే అసలు మొత్తం ఇచ్చేసేవాళ్లు. అమల, రాంబాబు ఇద్దరూ ఉద్యోగస్థులే కాబట్టి అప్పుమీద అప్పు ఇచ్చినా తిరిగి తీర్చగలరన్న నమ్మకమే, మార్వాడీచేత రెండో అప్పు ఇప్పించింది. పేమెంట్స్‌లో తేడా వస్తే డైరెక్టుగా బాస్ దగ్గరకెళ్లి అప్పు తీసుకున్న వాళ్ల గురించి కంప్లయింట్ ఇవ్వడం, ఆ మార్వాడీకి అలవాటే. గతంలో ఆయనిచ్చిన కంప్లయింట్ల మూలంగా కొన్ని కంపెనీల్లో కొంతమంది ఉద్యోగస్థుల్ని సస్పెండ్ చేయడం వగైరాలు జరిగాయి. తన దగ్గరకి అప్పుకోసం వచ్చే ఉద్యోగస్థులకి, తను సాధించిన ఆ ఘనకార్యాల గురించి తమాషాగా వివరించి వాళ్లలో ఓ చిత్రమైన భయాన్ని రేపుతాడు. దాంతో వాళ్లు జాగ్రత్తపడతారని అతని నమ్మకం.

మధ్యాహ్నం పన్నెండుగంటలకి రాంబాబు ఆటోలో డాల్ఫిన్స్ హోటల్‌కెళ్లి భోజన పదార్థాలన్నీ తెచ్చేశాడు. అమల కూడా తనకున్న చీరల్లో మరీ బాగున్న చీరతీసి కట్టుకుని రెడీ అయింది. ఇంక హారిక రావడమే తరువాయి. కానీ ఒంటిగంట, ఒంటిగంటన్నర రెండు దాటేస్తున్నా హారిక, ఆమె భర్త రాలేదు. ఎందుకు రాలేదో కారణం వూహించలేకపోయింది అమల. "వాళ్లు ఈ ఆదివారం వస్తానన్నారా, లేక వచ్చే ఆదివారం వస్తానన్నారా? అంటూ రాంబాబు వెలిబుచ్చిన సందేహం అమలకి మరింత కోపాన్ని తెప్పించింది. రాంబాబు బయటకొచ్చి ఓ షాపులోనించి హారిక ఇంటికి ఫోన్ చేశాడు.

రింగ్ అవుతున్నా ఎవరూ లిఫ్ట్ చెయ్యలేదు. ఏం జరిగిందో తెలియక, అక్కడినించే ఓ ఆటో తీసుకుని హారిక ఇంటికి వెళ్లాడు. "ఆటోలో వచ్చేరేం, మీ కారు ఏమైందని హారిక అడిగితే, ఎవరో స్నేహితుడు తన చెల్లెలి పెళ్లికోసం అడిగితే ఎరువు ఇచ్చానని చెప్పడానికి రాంబాబు ఓ అబద్ధాన్ని రెడీ చేసుకునే వుంచాడు. హారిక ఇల్లు తాళం వేసుంది. గేట్‌కీపరు రాంబాబుని చూడగానే అమ్మగారు ఇమ్మన్నారంటూ కాగితం అందించాడు.

అమలా!

దయచేసి నన్ను క్షమించు. మా మావయ్యగారికి, అంటే మా ఆయనగారి చిన్నాన్నగారికి సడన్‌గా హార్ట్‌ఎటాక్ వచ్చి హాస్పటల్లో జాయినయ్యారని హైదరాబాద్‌నించి ఫోన్ రాగానే వెంటనే ఫ్లైట్‌కి బయలుదేరాల్సివచ్చింది. నీకు ఫోన్‌చేసి మన ప్రోగ్రామ్‌ని పోస్ట్‌పోన్ చేద్దామనుకున్నాను. కానీ నీ ఫోన్‌నెంబర్ నాకు తెలీదు. మీ ఆఫీసుకి ఫోన్ చెయ్యడానికివాళ ఆదివారం. పోనీ, మీ ఇంటికొచ్చి చెప్దామంటే మీ ఇల్లెక్కడో నాకు తెలీదు. నేను అడగనూలేదు. నువ్వు చెప్పనూలేదు. కాబట్టి నీకు చెప్పకుండా వెళ్తున్నందుకు నన్ను క్షమించు. తిరిగి రాగానే నిన్ను ఎలాగైనా కాంటాక్ట్ చేస్తాను. వుంటామరి, నీ- హారిక!"

ఉత్తరం చదవగానే రాంబాబుకి కళ్లు బైర్లు కమ్మినట్టయింది. హారిక ఊరికి వెళ్లడంవల్ల అయిదువందలు ఖర్చుచేసి తెచ్చిన భోజనమంతా వేస్టు. అంతకుమించి గ్రైండర్లు వగైరాలు అద్దెకు తేవడంవలన మూడువేల అయిదువందల అద్దె... మొత్తం నాలుగువేలు ఉత్త పుణ్యానికి ఖర్చయిపోయింది. ఇవన్నీకాక, మళ్లీ హారిక ఎప్పుడైనా వస్తానన్నప్పుడు మరో

నాలుగు వేలు ఖర్చు, బాబోయ్. ఫాల్స్ ప్రెస్టేజి ప్రదర్శించడంవలన చాలా కష్టాలు. వేలకువేలు ఖర్చు. అనుకుంటూ గుండెలు బాదుకున్నాడు. అద్దెకు తెచ్చిన సామాన్లు తిరిగి ఇచ్చేస్తూ మూడువేల అయిదువందలు చెల్లిస్తున్నపుడు అతని కళ్లంట నీళ్లొచ్చాయి.

★ ★ ★

'మరో రెండు రోజులకి ద్వారకానగర్‌లో ఓ ఇల్లు కుదిరింది. అందంగా అన్ని వసతులతో వున్న ఇల్లు కాబట్టి పదిహేనువందల అద్దె , అయిదువేల ఎడ్వాన్సు అడిగారు. అడగడం భావ్యమే అయినా, ఇవ్వడానికే అమలకి ఇబ్బందనిపించి బేరమాడింది. కిందపెట్టి, మీదపెట్టి మాట్లాడగా, మాట్లాడగా చివరికి పదకొండువందలకి సెటిలయింది. ఎడ్వాన్సు మాత్రం తగ్గించనని ఓనరు చెప్పేశాడు. నెలకి చేతికి అందేది పద్నాలుగువందల యాభై కాగా, అందులో పదకొండువందలు ఇంటద్దెకు పోగా మిగిలేది మూడువందల యాభై. మొన్న మార్వాడీ దగ్గర తీసుకున్న పదివేలకి వడ్డీ అయిదువందలు ఈ నెలనించి కట్టాలి. అంటే బడ్జెట్ నూటయాభై మైనస్‌లో వుంది. కారుని వాడకుండా కేవలం ఇంటిముందు అలంకారంగా పెట్టుకుంటే దానికయ్యే పెట్రోల్ ఖర్చు అరువందలు మిగులుతుంది. ఆదా చెయ్యడానికి అదొక్కటే కనిపిస్తోంది. ఇదీ ఆ భార్యాభర్తలు ఆ ఇంట్లో దిగగానే తయారుచేసిన బేలన్స్ షీట్.

వాళ్ల అదృష్టంకొద్దీ ఆఫీసులో ఆడిట్ చెక్ తగలడంవల్ల ఓ రెండునెలలపాటు ఇద్దరికీ ఓవర్‌టైమ్ చెయ్యాల్సిన వనితగిలింది. అందువల్ల ఇద్దరికీ చెరో నాలుగువందల చొప్పున అదనంగా వస్తాయి. పోన్లే వడ్డీ కట్టడానికైనా పనికొస్తాయని సంతోషపడ్డాడు రాంబాబు. కానీ అమల సంతోషించలేదు. చిన్న చిన్న చింతాకుల్తో విస్తరాకు కుట్టలేం. ఈ ఓవర్‌టైమ్ ఎన్నాళ్లుంటుంది? రెండునెలలు. ఆ తర్వాత మళ్లీ మామూలే. పర్మినెంటుగా ఓ పదివేలు అదనపు ఆదాయం వచ్చేమార్గం కనిపిస్తే బావుణ్ణనుకుంది. ఆ విషయం గురించే ఆఫీసులో వున్నప్పుడు, లేనప్పుడు, నిద్రపోతున్నప్పుడు ఆలోచించనారంభించింది. అయినా ఏ అయిడియా తట్టలేదు.

ఓ ఆదివారంనాడు ఇద్దరూ ఇంట్లో వున్నప్పుడు ఆ ఇంటికి పాలుపోసే నారాయణమ్మ వచ్చి "రాజరత్నమ్మ సడన్‌గా సచ్చిపోయిందమ్మో" అంది బాధగా.

రాజరత్నమ్మెవరు? అంది అమల. ఉదయం ఆఫీసుకిపోయి, అక్కడ పొద్దుపోయిందాకా ఓవర్‌టైమ్‌చేసి, రాత్రి తొమ్మిదిగంటలకి ఇల్లు చేరుకునే అమలకిగాని, రాంబాబుకిగాని ఆ వీధిలో ఎవరితోనూ పరిచయం కాలేదు. అందుకే ఆ ఏరియా అంతటికీ చీటీల రాజరత్నంగా పేర్గాంచిన మనిషి గురించి ఏమీ తెలియలేదు.

నారాయణమ్మ వీధి గుమ్మం దగ్గరే కూర్చుని చెప్పింది. "రాజరత్నం అంటే, చీటీపాటల! రాజరత్నం అమ్మగారూ! ఆవిడ ఇంటి పేరేమిటో ఎవరికీ తెల్దు. చీటీపాటలు పాడుతాది గాబట్టి, ఆ మాటే ఆవిడగారి ఇంటి పేరైపోయింది. సదువూసందెలు ఏటీ లేకపోయినా, ఉత్తనోటిలెక్కలమీద ఏడెనిమిది లచ్చల చీటీలు ఎత్తేది. ఇవన్నీ సాలక వూరగాయలు, అప్పడాలు, వడియాలు, ఒక్కటేటి వద్నాలుగురకాల పచ్చళ్లు తయారుచేసి అమ్మేది. పెద్ద పెద్ద ఆఫీసర్లంతా ఆవిడ దగ్గర చీటీ ఏసేవాళ్లు. ఏనాడూ ఒక్కపైసా తేడారాకుండా గత పదిపన్నెండేళ్లనించి చీటీలు ఎత్తుతున్నది. ఓ మనిషి ఆవిణ్ణి వేలెత్తి చూపెట్టకుండా ఒకటోరకం మనిషిలాగా బతికింది. నాకు తెల్సినంతమట్టుకు ఆవిడకేరోజూ జలుబుగాని, జ్వరంగాని రావడం జరగలేదు. మరి అలాంటి మనిషి ఇంత సడన్‌గా ఎందుకు సచ్చిపోయిందంటారు? ఆవిడగారికి ఒక్కతే కూతురు. ఆ పిల్లని కాలేజీలో సదివిస్తుంటే ఆవిడగారు ఎవడో బెంగాలీ కుర్రాణ్ని ప్రేమించి అతగాణ్ణే తప్ప మరొకణ్ని చేసుకోనూ అని పట్టుబట్టింది. అలా చేసుకోవడానికి వీల్లేదుకాక వీల్లేదని ఈవిడ పట్టుబట్టింది. అంతే! ఆ పిల్ల చేతికి అందిన బంగారం, డబ్బు నంచిలో ఎట్టేసుకుని ఆ కుర్రాడితో లేచిపోయింది. ఈవిడకి గుండెనెప్పి వచ్చి రాత్రికి రాత్రి సచ్చిపోయింది. ఇకమీదట ఈ వీధిలో రాజరత్నమూ వుండదు. చీటీ పాటలూ వుండవు. ఆ ఇంటికి వచ్చీపోయే జనమూ




వుండరు'' అంటూ నారాయణమ్మ ఓ పదినిమిషాలపాటు చెప్పి, ఏడుస్తూ ముక్కుచీదుకుంటూ వెళ్లిపోయింది.

రాజరత్నంతో ఎటువంటి పరిచయమూ లేకపోవడంవలన ఆమె మరణానికి రాంబాబుగాని, అమలగాని స్పందించలేదు. రాంబాబు అయితే నారాయణమ్మ వెళ్లిన వెంటనే ఆ విషయాన్ని మర్చిపోయేడు. కానీ, అమల అంత సులభంగా మర్చిపోలేకపోయింది. నారాయణమ్మ చెప్పిన మాటల్ని పదే పదే గుర్తు చేసుకుంటోంది. అయితే ఆమె గుర్తు చేసుకుంటున్నది చనిపోయిన రాజరత్నం గురించిగాని, లేచిపోయిన ఆవిడ కూతురు గురించిగానీ కాదు! ఆవిడ నిర్వహించిన చీటీల గురించి!

'రాజరత్నం చదువు, సంధ్యాలేని మనిషైనా భారీఎత్తున చీటీలు నిర్వహించేది. తను, రాంబాబు బాగా చదువుకున్నవాళ్ళు! తామెందుకు ఆ చీటీలు నిర్వహించలేం?' నాలుగురోజులపాటు యిదే ప్రశ్న వేసుకుంది.

ఈ ప్రశ్నకి సమాధానం అమలే తనకి తానుగా చెప్పుకుంది. వివరాలు తెల్సుకుంటే ఓ నిర్ణయానికి రావచ్చు. రాజరత్నం ఇల్లు ఆ వీధి చివర్నే వున్నా అక్కడకి నడిచి వెళ్తే నామోషీగా వుంటుందని, కారులో ఓ లీటరు పెట్రోలు వేయించి దాన్ని తనే డ్రైవ్ చేస్కుంటూ వెళ్ళింది.

ఆ యింట్లో అప్పుడు రాజరత్నానికి సంబంధించిన దూరపు బంధువులే వున్నారు. వాళ్ళంతా ఆవిడ ఆస్తుల్ని పంచుకోడానికొచ్చి, లెక్కలు చూసుకుంటున్నారు. అమల తనని తానే పరిచయం చేసుకుంది. కారులో వచ్చిన చదువుకున్న ఆడదాన్ని చూడగానే, చదువుల్లేని ఆ బంధువర్గమంతా చాలా మర్యాదచేశారు. అమల రాజరత్నంగురించి నాలుగైదు సానుభూతి వాక్యాలు పలికినా, తర్వాత పలికినవన్నీ ఆమె నిర్వహించిన చీటీల గురించే! వాళ్ళు గూడా ఆ చీటీల గురించి తమకు తెల్సినమేరకి, అన్ని విషయాలు దాపరికం లేకుండా చెప్పేశారు. రత్నం దగ్గర చీటీలు వేసేవాళ్ళ పేర్లు, ఎడ్రస్‌లున్న పుస్తకాల్ని గూడా చూపించారు. వాటిని, ఓ గంటసేపు అడిగి తీస్కుని, వాటిని ఫోటోస్టాట్స్ తీయించి, వాటిని తిరిగి ఇచ్చేసింది. ఇచ్చేస్తూ అమల ఓ ప్రశ్న అడిగింది. ''ఆవిడ నిర్వహించిన చీటీపాటల్ని మీరు కొనసాగిస్తారా?''

''మాకంత ఓపికలూ లేవు, ఆవిడకున్నన్ని తెలివితేటలూ లేవమ్మా! ఆవిడ కాబట్టి, యింటింటికీ ఓపిగ్గా తిరిగి చీటీల డబ్బు వసూలు చేసుకొచ్చేది. యివ్వనివాళ్లని, నడిరోడ్డుమీద నిలదీసేది. ఎగ్గొట్టేవాళ్ళని రౌడీలచేత తన్నించేంది. ఆ పనులు చెయ్యడానికి మేం సరిపోం తల్లీ! ఆవిడతోనే ఆ చీటీ పాటలూ పోయేయని ఓ దండం పెట్టేశాం'' దాదాపుగా ఆ బంధువులంతా అదేమాట చెప్పారు.

అమల యింటికొచ్చి రాంబాబుతో చీటీపాటల విషయం డిస్కస్ చేసింది. రత్నానికి యిదే పని కాబట్టి, అన్ని చీటీలు నిర్వహించింది. కానీ, మనకిది పార్ట్‌టైం జాబ్ కాబట్టి మనం ఓ రెండులక్షల చీటీ నిర్వహిస్తే ఎలా వుంటుంది? అని అడిగింది. అతని సమాధానం, అనుమతికోసం అమల అలా ప్రశ్నించలేదు. ఇదీ నా నిర్ణయం అనే మాటని అలా వ్యక్తంచేసింది.

''ఇందువల్ల మనకి కలిగే లాభం ఏమిటి?'' రాంబాబు అడిగాడు.

''ఏమిటీ అని మెల్లగా అడుగుతారేమిటండి? రెండులక్షల చీటీ మనం కండక్ట్‌చేస్తే, రూలుప్రకారం రెండోచీటీ మనకే అందుతుంది. దానికెవరూ పోటీ తగలరు కాబట్టి, అచ్చంగా రెండులక్షలూ మనచేతికే వచ్చేస్తాయి. ఆ రెండులక్షల్ని మనం అయిదు రూపాయిల వడ్డీకి తిప్పినా నెలకి పదిహేనువేలు వడ్డీ వస్తుంది. మన ఇద్దరి జీతాలూ కాకుండా, నెలకి పదివేలు చొప్పున ఆదాయం వస్తే మనకంటే గొప్పవాళ్ళు ఎవరుంటారండి?''

''నిజమే! ఈ అయిడియా అద్భుతంగా వుంది. అమల తన జీవితంలోకొచ్చాక తన దశ తిరిగిపోతుందని జ్యోతిష్యుడు చెప్పేడు. ఆ దశ తిరిగిపోయే టైము దగ్గరపడిపోయింది. కాబట్టే, నెలకి పదివేలు వస్తూ, తమకంటూ రెండులక్షల ఆస్తి వచ్చే అయిడియా అమలకొచ్చింది. అయితే, అంతలోనే రాంబాబుకో సందేహం పుట్టుకొచ్చింది.

"వుద్యోగాలు చేసేవాళ్ళు యిలాంటి చీటీ పాటలు నిర్వహించొచ్చా?"

రాంబాబు వెలిబుచ్చిన సందేహానికి అమల విరగబడి నవ్వింది. ఆ తర్వాత అతన్ని లోకజ్ఞానం తెలియకుండా పెరిగిన టార్జన్ లాగా జాలిగా చూసి "చూడండి, రూల్సు అనేవి పుస్తకాల్లో వుండడానికేతప్ప, వాటిని అక్షరాలా పాటించాలనే రూలేం లేదండీ. కోర్టులో నిజమే చెప్పాలనే రూలుంది. కానీ అక్కడంతా నిజమే చెప్తున్నారా? భగవద్గీత మీద ప్రమాణం చేసి మరీ అబద్ధం చెప్తున్నారు. ఫుట్‌పాత్‌లమీద మనుషులు నడవాలని రూలు. కానీ, ఆ ఫుట్‌పాత్‌లమీద చిల్లరదుకాణాలు పెడుతున్నారు. వాళ్ళదగ్గర లంచాలు తీస్కుని, పోలీసులే రూల్సుని అధిగమిస్తున్నారు. ఈలోకమనే మార్కెట్లో, ఎవరిలాభాలు వాళ్ళు చూసుకోవాలండీ. మనం చీటీపాటలు నిర్వహిస్తున్న విషయం మన ఆఫీసర్లకి తెలియకుండా, జాగ్రత్తపడితే సరి. పైగా మన తిక్కశంకరయ్య రామారావు ప్రస్తుతం ఈ వూళ్ళోనే లేనప్పుడు, ఎవడుమాత్రం మనల్ని ఏంచెయ్యగలడు? మీరు మరీ పెద్దింటినించి వచ్చేరు గాబట్టి, మీకు యిలాంటి విషయాలు తెలియవుగాని, ఈమధ్య గవర్నమెంటు వుద్యోగస్థులు చాలామంది యిలాంటి చీటీలు కండక్ట్ చేస్తున్నారు. లాంగ్‌లీవ్‌లు పెట్టేసి ప్రైవేట్ కాంట్రాక్టులు చేస్తున్నారు, సినిమా డిస్ట్రిబ్యూషన్ ఆఫీసులు నడుపుతున్నారు తెలుసా? పైగా యిది రెండులక్షల రూపాయిలు ఒకేసారి చేతికందే వ్యవహారం. మీరు మీ పెద్దవాళ్ళతో కలిసిపోడానికి ఎలాగూ యింకొంత టైము పడుతుందిగా. ఈలోగా యిలాంటి వుపాయం ఏదో చెయ్యకపోతే, మనం ఓ హోదాలో బతకలేం"

అమల చెప్పిందంతా పొట్లం విప్పి పకోడీ చేతికిచ్చినట్టుగా వుందిగాని, ఆఖరున వాడిన వాక్యమే రాంబాబుకి కంగారు పుట్టించింది. తను ధనవంతుణ్ణని ఆడిన అబద్ధం ఎప్పుడు బయటపడుతుందో, అప్పుడు అమల ఏ ఉపద్రవం తెస్తుందోనని ఆలోచించేడుగాని, అతని వూహకి అందలేదు.

రెండోరోజులు ఆఫీసుకి శెలవు పెట్టి, కారులో బయలుదేరి రాజరత్నమ్మ దగ్గర చీటీలు వేసే వాళ్ళలో చాలామంది యిళ్ళకి వెళ్ళి, వాళ్ళని కల్సుకున్నారు. రెండులక్షల చీటీపాట నిర్వహిస్తామని, ఆర్గనైజేషన్లో ఎటువంటి లోపాలుండవని భరోసా యిచ్చేరు. వారిద్దరూ కారులో రావడం, యిద్దరూ చదువుకున్నవాళ్ళు, వుద్యోగస్థులు కావడంవలన, వాళ్ళ సామర్థ్యాన్ని ఎవరూ శంకించలేదు. కొంతమంది శంకించినా అమలకి కావల్సింది అరవైమంది.

అయిదు సంవత్సరాల టైము పెట్టి, రెండు లక్షల చీటీ నిర్వహిస్తే అది అందరికీ సులభంగా వుంటుంది. ఆమె కోరుకున్నవిధంగా అరవైమందిని సమకూర్చుకోగలిగింది. ప్రతి నెల, పదవ తారీఖున పాట జరుగుతుంది. పదిహేడు, యిరవై తారీఖులమధ్య ఆ చీటీ డబ్బు యివ్వబడుతుంది. చీటీ పాటలో కలిసినవాళ్ళలో ఎక్కువమంది వుద్యోగులు, కొందరు వ్యాపారస్థులు, మరికొంతమంది కంట్రాక్టర్లు కాబట్టి డబ్బు వసూలు చేయడానికి పెద్దగా శ్రమపడనక్కర్లేదనుకున్నాడు రాంబాబు. రాజరత్నమ్మ దగ్గర చీటీల వసూళ్ళ కార్యక్రమంలో సహాయకురాలిగా పనిచేసిన పొట్టిబుల్లెమ్మని పిల్చి, రాజరత్నానికి చేసినట్టే నాకూ సాయం చేస్తే నీకు ఆవిడ యిచ్చిందానికంటే ఓ పాతిక రూపాయలు ఎక్కువిస్తాను అంది. పొట్టిబుల్లెమ్మ మొగుడు ఆవిణ్ణి ఒదిలేసి, మరో లేడీతో లేచిపోయేడు. అందుకే అమల అడగ్గానే ఆనందంగా ఒప్పుకుంది.

మొదటి నెల చీటీ సజావుగానే సాగింది. రాంబాబు,అమల ఉదయం ఆఫీసుకి వెళ్ళడానికి మునుపటికంటే రెండుగంటల ముందుగా కారులో బయలుదేరి అందరిదగ్గర చీటీడబ్బు వసూలు చేస్తున్నారు. అలాగే సాయంత్రం ఆఫీసు అయిపోగానే మళ్ళీ డబ్బువసూళ్ళకే బయలుదేరి, రాత్రి పొద్దుపోయేక యిల్లు చేరుకుంటున్నారు. అంచేత రాంబాబు వంట చెయ్యడానికి వీలుపడ్డంలేదు. ఓ వంటమనిషిని కుదుర్చుకున్నారు. కాబట్టి వంటపని రాంబాబుకి తప్పింది. ఉదయం లేచిందగ్గర్నించి రాత్రి పడుకునేవరకు, ఒక్క ఆఫీసు అవర్సులో మినహా అంతా చీటీ పాటల లెక్కలే చూసుకుంటున్నారు.

అలా బిజీగా వుండేరోజుల్లోనే ఒకరోజు అమల ఆఫీసులో వుండగా హారిక దగ్గర్నించి ఫోన్ వచ్చింది. తను ఈ ఆఫీసులో వున్నట్టు దాని




కెలా తెల్సింది, నేను నా ఫోన్ నెంబరు యివ్వలేదనుకుంటూనే, ఫోన్ వున్న టేబిల్ దగ్గ రకెళ్ళి ఫోన్ అందుకుంది.

''ఈరోజు నువ్వు మీ ఆఫీసులోకి వెళ్తుండగా మా డ్రైవరు చూసేడట. నేను హైదరాబాద్ నించి వచ్చిందగ్గర్నించి, నువ్వు ఫోన్ చేస్తావే మోనని చూస్తున్నాను. ఇప్పుడైనా మా డ్రైవరు నిన్ను చూడబట్టి, టెలిఫోన్ డైరెక్టరీలో మీ ఆఫీసు నెంబరు వెదికి నీకు ఫోన్ చేస్తున్నాను. మావారు జర్మనీకి వెళ్ళి రెండురోజులయింది. ఇంట్లో ఒకటే బోర్‌కొట్టేస్తోంది. మీ ఇల్లు ఎక్కడో చెప్పు. ఏదో ఒకరోజు ఢన్‌మంటూ వచ్చేస్తాను'' హారిక నవ్వుతూనే చెప్తున్నా అమలమాత్రం చిరాగ్గానే వింటోంది.

''నువ్వు ఏదో ఒకరోజు ఢన్‌మని వచ్చేస్తేకా దే, నేనేం నీలాగ యింట్లో కూర్చున్న మనిషిని కాదుగా, ఆఫీసుకి శెలవు పెట్టుకోవాలి''

''నాగురించి నువ్వు శెలవు వేస్ట్ చేస్కో కుండా, ఏదో ఓ ఆదివారం వచ్చేస్తాను''

''అదిగో మళ్ళీ, ఏదో ఓ ఆదివారం అంటావ్ గాని, ఏ ఆదివారమో ఖచ్చితంగా చెప్పకపోతే, నేను మిగతా ఏర్పాట్లు ఎలా చేసుకుంటాను?''

''మిగతా ఏర్పాట్లంటే, వంట ఏర్పాట్లేగా! నాకోసం ప్రత్యేకమైన ఏర్పాట్లేవీ చెయ్యొద్దు లేవే, మీరు తినే చారు, అన్నం, ఓ వూరగాయ ముక్కో, అప్పడమో వుంటే చాలు'' అంది హారిక తన నిరాడంబరత్వాన్ని, అమలతో వున్న చనువుని ప్రదర్శిస్తూ. కానీ అమల ఆ మాటల్ని అపార్థం చేస్కుని తన సహజధోర ణిలో పెడసరంగా జవాబు చెప్పింది.

''అక్కడికి నువ్వేదో అయిదుకూరల్తో అన్నంతినేదానివి, నేనేదో అప్పడాలు, ఊరగా యముక్కల్తో గడిపేస్తున్నట్టు అలా మాట్లాడ కే''

''అయ్యయ్యో... నా ఉద్దేశం అదికాదే, నన్నో గెస్టులా ట్రీట్ చెయ్యొద్దూ అని''

''ఎలా ట్రీట్‌చేసినా, యింటికొచ్చినవాళ్ళకి నా లెవెల్‌కి తగ్గట్టుగా నేనూ మర్యాదలు చె య్యాలిగా. యింతకీ నువ్వెప్పుడొస్తావో కరెక్టుగా చెప్పు''

''వచ్చే ఆదివారం రానా?''

''రా, మిస్‌కొట్టకు'' అంటూ తన ఎడ్రస్ చెప్పి, ఫోన్ పెట్టేసింది అమల. వచ్చేనెల చీటీ తమకే వస్తుంది కాబట్టి, ఆ రెండులక్షలు చేతికొచ్చేక హారిక తన యింటికొస్తే బావుండు ననుకుంటున్నాడు రాంబాబు. అప్పుడైతే కలర్ టి.వి., గ్రైండర్లాంటి వస్తువులన్నీ అద్దెకు తెచ్చే అవసరం లేకుండా, ఏకంగా కొనేస్కుని యింట్లో పెట్టొచ్చు. కానీ, హారిక వచ్చే ఆదివా రమే వచ్చేస్తానంటోంది. మళ్ళీ నాలుగు వేలు ఖర్చు! ఏజన్మలో ఆ షావుకారుకి బాకీవున్నానో గాని వుత్తపుణ్యానికి అప్పుడో మూడువేల అయి దువందలు అర్పించేశాను, యిప్పుడో మూడు వేల అయిదువందలు... మొత్తం ఏడువేలు! ఒక గ్రైండరు, ఓ మిక్సీ గూడా ఆ డబ్బుతో వచ్చేసేదంటూ రాంబాబు తనమీద తనే జాలి పడ్డాడు.

ఆదివారం వచ్చేసింది!

హారిక ఈ సారిమాత్రం మిస్‌కొట్టకుండా చూడు భగవంతుడా అనుకుంటూనే రాంబా బు షాపులోనించి సామాన్లు తెచ్చాడు. హోటె ల్నించి భోజనపదార్థాలు తెచ్చేడు. హారిక వచ్చేక తన ఇంట్లోని సామాన్లన్నీ చూ పించింది. ''చూడ్డానికేం వుందిలేవే'' అన్నా అమల ఒప్పుకోలేదు. తన వంటమనిషిని, పాట్టి బుల్లెమ్మని చూపించింది. హారిక వున్న ప్పుడు చీటీల విషయం ఎత్తొద్దని వారిద్దరికీ పదేపదే చెప్పింది. హారిక యింటికి వెళ్ళినప్పు డు ఆమె తన పెర్సనల్ సెక్రటరీగా ఎవర్నీ పరిచయం చేయలేదు. కానీ అమల బుల్లె మ్మని చూపించి, ''దాదాపుగా యీవిడ నా పెర్సనల్ సెక్రటరీ'' అని పరిచయం చేసి, మనసులో గర్వపడింది. హారికకి తన చీటీల విషయం తెలియకూడదని ఎంత జాగ్రత్తప డినా, తెల్సిపోయింది. భోజనాలు ముగించి ఏదో లోకాభిరామాయణం మాట్లాడుతుండగా, ఓ పెద్దమనిషొచ్చి, ఆ నెల చీటీడబ్బులు యిచ్చి, ''ఈ నెల కాస్త ఆలస్యమైపోయింది, ఏమనుకోకండి'' అన్నాడు.

''ఏవే, నువ్వు చీటీలు కండక్ట్ చేస్తు న్నావా?'' అంది హారిక కళ్ళి నములుత్తూ. అమల ఏదో స్మగ్లింగ్ వ్యాపారం చేస్తూ పోలీసులకి దొరికిపోయిందాన్లా ఫీలవుతూ, ''అదేనే... ఈ ఏరియాలోని పెద్దమనుషులంతా వచ్చి బతి

మిలాడితేనూ... వాళ్ళ సంతృప్తికోసం...'' అంది.

''ఏదో తప్పు, నేరం చేసిందాన్లా అలా మాట్లాడతావేమే! నువ్వు చీటీలు కండక్ట్ చేస్తున్న విషయం చెప్పుంటే నేనూ సరదాగా రెండు చీటీలు కలిపుండేదాన్నిగా'' అంటూ హారిక చీటీల వివరాలు అడిగింది. అమల చాలా యిబ్బందిపడుతూనే జవాబులు చెప్పింది. హారిక వెళ్ళబోయేముందు ''మావారు లేకపోవడంవల్ల యింట్లో నేను ఒక్కదాన్నీ అయిపోయి భలే బోర్ కొట్టేస్తోందే. అఫ్‌కోర్స్... మా లేడీస్ వెల్ఫేర్ ఎగ్జిక్యూటివ్ మెంబరుగా నా పనులు నాకూ వున్నాయనుకో. కానీ అవి గూడా ఎంతసేపు, కొన్నిపనులు ఫోన్లమీద నడిపించేస్తానుకో, అయినా బోర్ కొట్టేస్తోంది. సో, నాకు ఎప్పుడు ఖాళీ దొరికితే అప్పుడు వచ్చేస్తాను''

అంతే! రాంబాబు గుండెల్లో చిన్నసైజు పిడుగుల వాన కురిసింది. హారిక నిజంగా అలా చీటికీ మాటికీ వచ్చేస్తే, ఆమె వచ్చినప్పుడల్లా తను అంత డబ్బిచ్చి సామాన్లన్నీ అద్దెకు తేవాలి. ఆలెక్కన రేపు తమకొచ్చే రెండులక్షలు, ఈ సామాన్ల అద్దెకింద జమకట్టెయ్యాలి కాబోలు అనుకుంటూ అమల రివరివలాడిపోయింది. పైగా, ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడే వచ్చేస్తానంటోంది. ఒకసారి వున్న సామాన్లు మరొకసారి లేకపోతే, అది మరీ అవమానం. పైగా, తమ అద్దెసామాన్ల భాగోతం బయటపడిపోయే ప్రమాదం కూడా వుంది.

''నీకు ఫోన్ వుంటే బావుండునే, ఎంచక్కా రోజూ ఫోన్‌లో మాట్లాడుకునేవాళ్ళం'' అంది హారిక నవ్వుతూ.

''ఫోన్‌కోసం ఎప్లయ్ చేశానే, యీ నెల్లో వచ్చెయ్యొచ్చు'' అంటూ అమల అలవాటుప్రకారం తడుముకోకుండానే జవాబు చెప్పేసింది.

హారిక వెళ్ళిపోయింది.

''నీ నోటిదురద తగ్గడానికి ఏదైనా మందు వుందేమో కనుక్కోవాలి. అప్పుడు గ్రైండర్లు వగైరాలు మనకీ వున్నాయి అని కోశావు. అది మనకో అంబాజీపేట ఆవదంలా తయారయింది. యిప్పుడు మళ్ళీ ఫోన్ వచ్చేస్తుందని కోశావు. యిప్పటికిప్పుడు ఫోన్ అంటే మాటలా?'' అన్నాడు రాంబాబు, చిరాగ్గా.

''మాటలో పాటలో నాకు తెలీదు. మొత్తంమీద మనకో ఫోన్ అర్జంటుగా కావాలి. మొగుడు వూళ్ళో లేడు కాబట్టి, అది ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడే వచ్చేస్తుందట. అది వచ్చినప్పుడల్లా మనమెక్కడ వేలకు వేలు పోసి సామాన్లు అద్దెకు తెస్తాం? ఆబదులు ఓ పదివేలు పారేసి ఓ ఫోన్ వేయించుకుంటే సరి! దాంతో ఫోన్‌లోనే మాట్లాడేస్తుంటే, అదింక మన యింటికొచ్చే అవసరం వుండదు. ఒకవేళ వచ్చినా, మనక్కూడా ఫోన్ వుంది కాబట్టి, ముందుగా మనకి ఫోన్ చేస్తుంది. మనం కూడా దాన్ని రమ్మని చెప్పి, అదొచ్చే టైముకి, యింటికి తాళంవేసి, ఏ సినిమాకో పోతాం. తర్వాత, అర్జంటు పనిమీద బయటకెళ్ళాల్సొచ్చిందని సారీ చెప్పేస్తాం. అలా నాలుగుసార్లు చేశాం అనుకోంతే, అప్పుడు దానికే సిగ్గొచ్చి రావడం మానేస్తుంది. చూసేరా, ఒక్క ఫోనువల్ల ఎన్ని ఉపయోగాలున్నాయో'' అంటూ నవ్వింది.

అంతా విన్నాక రాంబాబు, ''ఓర్నాయనో, దీనికెన్ని తెలివితేటలు భగవంతుడిచ్చాడో'' అంటూ ఆశ్చర్యపోయాడు. అర్జంటుగా ఫోన్ కావాలంటే ఏం చెయ్యాలి? ఓవైటీ ఫోన్ కావాలంటే, పదివేలు కట్టాలి. కట్టినా, ప్రస్తుతం వున్న ఫోన్ల డిమాండ్స్‌వల్ల అది కూడా వెంటనే రాదు. కనీసం ఓ ఆర్నెల్లయినా పడుతుంది. మెడికల్ ఫోన్‌కోసం ఎప్లయ్ చేస్తే వెంటనే వస్తుందని ఓ మిత్రుడు సలహా యిచ్చేడు. మర్నాడే ఓ డాక్టరు దగ్గరకెళ్ళి వందరూపాయలు ఫీజు యిచ్చి, తనకు గుండెజబ్బుందని, ఏక్షణంలోనైనా డాక్టరుతో అవసరం వుంటుంది కాబట్టి, తన యింటికో ఫోన్ ఏర్పాటు చెయ్యండి మహాప్రభో అని మొరపెట్టుకోడానికి వీలుగా ఓ మెడికల్ సర్టిఫికెట్ తీసుకున్నాడు. దాన్ని జతచేస్తూ టెలిఫోన్ ఎక్స్చేంజ్‌లో ఓ అప్లికేషన్ పెట్టేడు. అయితే, అలాంటి ఫోన్ల కోసం చాలా అప్లికేషన్లు వచ్చేయి కాబట్టి దానికి గూడా చాలా టైము పడుతుందని చెప్పేరు. ఇప్పుడేం చెయ్యడం? హారిక ఏక్షణంలో పరిచయమయిందోగాని, ఆవిడ మా యిద్దరికీ, ఓ తలనెప్పిలా తయారయిందని వినుక్కుంటున్న తరుణంలో, ఆ వీధిలో వుంటున్న రంగనాయకులనే పెద్దమనిషి ఆ యింటికొచ్చి, ''మీకు ఫోన్ కావాలని తెల్సింది.

నేను ట్రాన్స్‌ఫర్‌మీద విజయవాడ వెళ్ళిపోతు న్నాను. నా ఫోన్ నాపేరుమీదనే ఉంది. టెలి ఫోన్ ఎక్ఛేంజిలో నాకు తెల్సినవాళ్ళున్నారు. వాళ్ళకేదో యిచ్చేసి ఫోన్‌ని లోపాయికారిగా మీ యింట్లో ఫిక్స్‌చేయిస్తాను. బిల్లులు నాపేరు మీద నా పాతింటి ఎడ్రస్‌కే వస్తాయి. మీరా బిల్లులు తీస్కుని కట్టేస్తుండండి. మీరు నాకు ఫోన్‌నిమిత్తం ఓ మూడువేలు యిస్తే చాలు'' అన్నాడు.

అమలకీఏర్పాటు ఎంతో బాగా నచ్చి వెంటనే ఒప్పేసుకుంది. మర్నాటి ఉదయానిక ల్లా ఫోన్ షిఫ్ట్ అయిపోయింది. ఫోన్ వచ్చిన వెంటనే అమల మొదటగా ఫోన్‌చేసి మాట్లా డింది హారికతోనే!



రాంబాబు పాతయింటికి ఒకసారి వెళ్ళక తప్పలేదు.

పెళ్ళైందగ్గర్నించి రాంబాబు ఆ యింటికి కూడా వెళ్లకుండా నెలనెలా అయిదువందల రూపాయలు లోకల్ మనియార్డరు చేస్తున్నా డు. ఎకనాలెడ్జిమెంటు తన యింటికిగాని, ఆఫీసుగ్గాని వస్తే తన తండ్రి విషయం అమ లకి తెలిసిపోయే ప్రమాదం వుందని, ఫ్రమ్ ఎడ్రస్‌గా తన స్నేహితుడి ఎడ్రస్ యిచ్చేసి రాంబాబు జాగ్రత్తపడ్డాడు. అందువల్ల ప్ర స్తుతం ఆ యింట్లో ఏం జరుగుతున్నదీ అతని కి తెలియదు. ఇంక చలపతి విషయానికొస్తే, అతను తాగడంలో మార్పు రాకపోయినా, తాగే పద్ధతిలో మార్పు వచ్చింది. ఇప్పుడు యింటి బాధ్యతంతా అతనిదే కాబట్టి, ఆ బాధ్యతనీ సక్రమంగానే నిర్వహిస్తున్నాడు. రేఖ కాలేజీకి వెళ్తోంది, వస్తోంది. ఇంటిదగ్గరా శ్రద్ధగానే చదు వుతోంది. అప్పుడప్పుడు కాలేజీనించి ఆల స్యంగా వస్తోంది. చలపతి ఆమెకంటే ఆల స్యంగా వస్తున్నాడు గాబట్టి, ఆమె ఎప్పుడు యింటికి వస్తున్నదీ అతను గమనించే అవ కాశం కలగలేదు. అలాంటి తరుణంలోనే ఒక సారి ప్రశాంతంగా, నిశ్చలంగా వున్న మడు గులో దభ్‌మంటూ ఓ బండరాయి పడి, కల కలం చెలరేగినట్టు, ఆ యింట్లో ఓ అలజడి పుట్టింది. రేఖ సడన్‌గా వాంతి చేసుకుంది. ఏదో అజీర్తి చేసుంటుందనుకున్నాడు. మళ్ళీ వాంతయింది. డాక్టరుదగ్గరకి వెళ్ళక తప్పలే దు. ఆ డాక్టరు రేఖని చెకప్‌చేసి ఆమె నెలతప్పిందని చెప్పింది. అంతే! పక్కలో బాంబు పేలినట్టు అదిరిపడ్డాడు. లబోదిబో మంటూ గుండెలు బాదుకుంటూ అరవబోయా డు. కానీ, అలా అరవడంవల్ల ఈవిషయం అందరికీ తెల్సిపోయి, పరువు పోతుందేతప్ప, సమస్య పరిష్కారం కాదన్న విషయం గుర్తొచ్చి, ఆ ప్రయత్నాన్ని మానుకున్నాడు.

'ఎలా జరిగిందిది?' అంటూ యింటికొచ్చేక కూతుర్ని నిలదీసి అడిగాడు. రేఖ మాత్రం పందొమ్మిది వందల యాభై రెండునాటి అమ్మా యిలా భోరుమని ఏడవలేదు. అరవైరెండు నాటి అమ్మాయిలా భయపడలేదు. తొంభై రెండునాటి అమ్మాయి కాబట్టి, ధైర్యంగానే జవాబు చెప్పింది, ''నేనూ విజయభాస్కరూ అన్నయ్యా, వదినలు ప్రేమించుకున్నట్టే ప్రే మించుకున్నాం. వాళ్ళు చేసుకున్నట్టే మేవూ పెళ్ళిచేస్కోవాలనుకున్నాం. కానీ ఈలోగా యిలా జరిగిపోయింది''

చలపతికి అరికాలిమంట నెత్తికెక్కి, కూతు ర్ని నిలువునా చీరెయ్యాలనుకున్నాడు. కానీ అంతలోనే అతని వివేకం అతన్ని ఆవేశాన్ని ఆపు చేసింది. కొట్టినందువల్ల ప్రయోజనం ఏం వుంది? ఈ కాలపుపిల్లలు చాలామంది పెద్దలు కాదనగానే లేచిపోతున్నారు. రేఖ మీదా అలాగే చేస్తే మొత్తం పరువుపోతుంది. పైగా, రాంబాబు యింటి బాధ్యత నిర్వహిస్తు న్నప్పుడు జరగలేదు. రేఖ బాధ్యత తను వహిస్తుండగా జరిగింది. ఈ సంగతి తెలిస్తే రాంబాబు, యిదంతా తన అశ్రద్ధ వల్లే జరి గిందని తిడతాడు. రేఖ సమాధానం చెప్తూ నేనూ అన్నయ్యలాగే ప్రేమించేను అంది.




అంటే రాంబాబు ప్రేమించి, తండ్రిని ఎదిరించి, పెళ్ళి చేస్కుని వేరు కాపురం పెడితే, నువ్వేం చెయ్యగలిగేవు? అనే ప్రశ్న ఆమె సమాధానంలోవుంది. రాంబాబు విషయంలో నేను కావాలనే ఒప్పుకోనట్టు నటించేనని యిప్పుడు చెప్పినా ప్రయోజనం లేదు. ప్రేమించిన వాడితో పెళ్ళి జరిపించెయ్యడమే మంచిదని నిర్ణయించుకుని, ఆ అబ్బాయి పేరు, వివరాలు అడిగాడు. ఆ అబ్బాయి నర్సయ్య కొడుకని వినగానే చలపతి ఆందోళన చెందాడు.

ఏనుగు ఎంత బలమయిందైనా, నీట్లోవున్న మొసలికది లోకువే! ఏనుగుల్లాంటి మనుములు కూడా వడ్డీ షావుకారు అప్పల్నర్సయ్య దగ్గర అప్పు తీస్కుంటే మొసలి నోట్లో పడిన ఏనుగుల్లా గిలగిల్లాడి పోవాల్సిందే! ఈ విషయం అందరికీ తెల్సు! విశాఖపట్నంలో వుక్కు ఫ్యాక్టరీ గురించి ఎంతమందికి తెలుసో, యారాడకొండ గురించిఎంతమందికి తెలుసో, ఆంధ్రాయూనివర్సిటీ గురించి ఎంతమందికి తెలుసో, అప్పల్నర్సయ్య అత్యాశ గురించి, పిసనారితనం గురించి కూడా అంతమందికీ తెలును. అతని పిసనారితనం గురించి తెనాలి రామలింగడి కథల్లా కొన్ని కథలు, ప్రహసనాలు విశాఖపట్నంలో వాడుకలో వున్నాయి గూడాను.

ఓసారి ఓ గంగిరెద్దులవాడు నర్సయ్యగారి కక్కుర్తిబుద్ధి తెలియక ఆ యింటికొచ్చి, గంగిరెద్దుని ఆడిస్తూ దానకర్ణుడికి దండం పెట్టు, ధర్మరాజుకి దండం పెట్టు, భోజరాజుకి దండంపెట్టు, కాళిదాసుకి దండంపెట్టు'' అంటూ రాగాలు తీస్తుంటే నర్సయ్య అతన్ని చెప్పుతీసుక్కొట్టబోయేడు. ''వెధవా, నా దగ్గరకొచ్చి నన్ను పొగడకుండా, ఎవడో ధర్మరాజుకి, కాళిదాసుకి దండాలు పెట్టిస్తే నేనెందుకు నీకు డబ్బివ్వాలి'' అంటూ ధాంధూంలాడేడు. దాంతో వాడు కంగారుపడిపోయి ''క్షమించండి మహాప్రభో! నేను పొగిడింది మిమ్మల్నే. ఆనాటి ధర్మరాజు, దానకర్ణుడు, భోజరాజు, కాళిదాను చచ్చిపోయి, వాళ్ళు నలుగురూ కలిసి, మళ్ళీ మీరూపంలో పుట్టేరని, నా అభిప్రాయం'' అన్నాడు. ఏ మాటకి, ఎప్పుడూ పొంగిపోని నర్సయ్య ఆరోజు మాత్రం ఆ పొగడ్తకి వుబ్బితబ్బిబ్బయ్యేడు. ''నీకు వెయ్యి నూటపదహారు రూపాయిలు యిస్తున్నానురా'' అన్నాడు. గంగిరెద్దులవాడు ఎగిరిగెంతేసి ''తమరు నాకు పావలో అర్ధో పడేస్తారనుకున్నాను. కానీ యింత గొప్ప బహుమానం ప్రసాదిస్తారనుకోలేదు'' అంటూ డబ్బు కోసం చెయ్యిచాపేడు. నర్సయ్య పగలబడి నవ్వుతూ ''యింకా ఏం యివ్వాల? యిచ్చేశాను గదా, నువ్వుగొప్ప గొప్ప వాళ్ళతో పొగిడి నా చెవులకి ఆనందం కలిగించేశావు. అలాగే నేనూ వెయ్యి నూటపదహార్లు యిస్తానని చెప్పి, నీ చెవులకీ ఆనందం కలిగించేశా గదా. ఆ ఆనందానికి యీ ఆనందం చెల్లు. యింక నువ్వెళ్ళు'' అంటూ వాడిని తగిలేశాడు.

నర్సయ్యకి లక్షలకి లక్షల ఆస్తివున్నా ఎప్పుడూ చవకరకం చొక్కా, మరీ చవకరకం పంచె కడుతుండడం చూసి కొంతమంది ''చచ్చేటప్పుడు మనం కట్టుకుపోయేదేం లేదుగదండి. బతికున్నప్పుడైనా మంచి బట్టలు కట్టుకోవచ్చు గదా''ని సలహాయిచ్చేరు. ''కట్టుకుని విప్పేసే దానికి ఏ చొక్కా అయితేనేంలెండి'' అంటూ సమాధానం చెప్పేడు. దిక్కుమాలిపోయిన నులక మంచం మీద పడుకోవడం గురించి అడిగినప్పుడుగూడా ''పడుకుని లేచిపోయేదానికి యింతకంటే మంచి మంచం ఎందుకయ్యా, డబ్బుదండగ'' అని చెప్పేడు. దసరా పండగ వస్తుందనేసరికి అతని మనసులో బెంగప్రవేశిస్తుంది. దసరా మామూళ్ళ కోసం, పోలీసులు, ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంటువాళ్ళు, పోస్ట్‌మేన్లు, మున్సిపాల్టీవాళ్ళు వగైరా వగైరాలు వస్తారని తెలిసి ఓ పది రోజుల ముందు నించి గెడ్డం పెంచేసి, జుట్టుకి నూనె రాయకుండా చింపిరిచింపిరిగా చెరిపేసి, అసలే ముష్టిబట్టల్లా కనిపించే చొక్కాకి, పంచెకి రెండుమూడు అతుకులు వేసుకుంటాడు. వాళ్ళు దసరా మామూలు అడగ్గానే, భోరుమంటూ ఏడ్చేసి, ''బాబూ, నా పరిస్థితి మీకంటే అధ్వాన్నంగావుంది. అప్పు తీసుకున్న వాళ్ళంతా ఐపీలు పెట్టేసి చేతులు ఎత్తేశారు. మొన్ననే దొంగలు పడి యిల్లంతా వూడ్చేశారు. కట్టుబట్టల్తో నిలబడి పోయేను. నన్నూ మీతో పాటే తీసుకుపోతే, మీతోపాటేనేనూ నాలుగుచోట్ల దసరా మామూళ్ళు అడుక్కుని, యీ నెలంతా ఏదో యింత చారు, అన్నం తిని

బతికేస్తాను'' అన్నాడు. వాళ్ళంతా అతన్ని అసహ్యించుకుంటూ ''నీలాంటి నికృష్టపు వెధవని వెంట తీసుకు వెళ్తే మాకిచ్చే మామూళ్ళు కూడా మాకివ్వరు. నువ్వు మాతో రాకుండా వుండడానికి యీ అయిదు రూపాయిలూ యిస్తున్నాం'' అంటూ ఓ అయిదు రూపాయిలు అతని మొఖాన కొట్టి, త్పూ అంటూ వుమ్మేసి వెళ్ళిపోయేరు. నర్సయ్యా గురించి చెప్పుకోడానికలాంటి వుదంతాలు ఎన్నెనావున్నాయి.

అలాంటి మహానీచనికృష్టుడి కొడుకుని తన కూతురు ప్రేమించడం, అంతటితో ఆగకుండా గర్భవతికావడం... చలపతికేం చెయ్యాలో అర్థం కాలేదు. ఎవర్నయినా సంప్రదించి, సలహా అడగడానికి వీల్లేని సమస్యయిది. ఈరోజు కాకపోయినా రేపయినా అడక్కతప్పదుకదాని, తెగించి మర్నాడు నర్సయ్యా యింటికి బయలుదేరాడు. తను ఎవరో పరిచయం చేసుకున్నాక చలపతి చెప్పవలసిందంతా చెప్పి, ఆఖర్న ''యీ పెళ్ళి ఎలాగైనా జరిపించండి, యివి చేతులు కాదు కాళ్ళనుకోండి'' అంటూ నర్సయ్యా చేతులు పట్టుకున్నాడు. నర్సయ్యా చేతులు వదిలించుకుని, అక్కడున్న ఓ చిత్తు కాగితం ముక్కని తీసి యిదేమిటని అడిగాడు. చిత్తు కాగితం అన్నాడు చలపతి. ''అంతేగాని యిది రూపాయి నోటు కాదుగదా'' అన్నాడు.

''కాదండి'' అన్నాడు చలపతి.

''ఈ కాగితం ముక్కని చూపించి, దీన్ని రూపాయినోటనుకోమంటే నువ్వేమనుకుంటావు? నేనో వెర్రివెధవననుకుంటావు. ఔనా? అలాగే నా చేతులు పట్టుకుని, వాటినే కాళ్ళనుకోమంటే, నేనూ నీ గురించి అలాగే అనుకుంటాను''

నర్సయ్యా మాటలకి చలపతి బిక్కచచ్చిపోయేడు. వెంటనే అతని భుజం మీద దబదబమని బాదుతూ, పగలబడి నవ్వుతూ, ''కాబోయే బావగారితో హాస్యమాడేనండి'' అన్నాడు. హమ్మయ్యా పెళ్ళికి ఒప్పేసుకున్నాడని చలపతి సంబరపడుతుండగా, నర్సయ్యా తన మనసులోని మాటని తన ధోరణిలో వెల్లడించి చలపతి నోటికి తాళం వేశాడు.

''చూడండి కాబోయే బావగారూ! అబ్బాయీ, అమ్మాయి ఒకర్నొకరు ప్రేమించుకున్నాక కాదనడానికి మనకేం హక్కుందండి? వయసొచ్చిన కూతురికి పెళ్ళిచెయ్యాలి. పోనీ అప్పుడు కాకపోయినా కడుపొచ్చేకైనా పెళ్ళి చెయ్యాలి గదా! కన్నతండ్రిగా మీ భాదేమిటో అర్థం చేస్కోలేని ఎదవని కాదుగదా! ఆడదెప్పుడూ హారతికర్పూరమే. మగాడెప్పుడూ నిప్పులమంటే! మరి, కర్పూరాన్ని నిప్పుని ఒక్కచోట పెట్టినప్పుడు, కర్పూరం భగ్గుమనడంలో ఆశ్చర్యమేం వుంటాది? వుండదు. సరే, యింతదాకా వచ్చేక నేను మాత్రం కాదనేదేంవుంది. నేను కాణీ కట్నం అడగను''

''ఎలాగైనా తమరు విశాలహృదయులు సుమండీ'' అన్నాడు చలపతి, తను నర్సయ్యా గురించి విన్నదానికి, యిప్పుడు చూస్తున్నదానికి ఎటువంటి సంబంధమూ లేదే అని ఆశ్చర్యపోతూ.

''నేను విశాలహృదయుణ్ణి కాబట్టే మావాడికి రూపాయి ఖర్చున్న చోట వంద రూపాయలు ఖర్చు చేసి మరీ పెంచేను. మావాడిని పెంచడం నిమిత్తం ఏవో చిల్లర ఖర్చులయేయి. అవి నా మొహానపారేసి, వాడిని తీసుకుపోయి నీ కూతురి మెడలో మూడు ముళ్ళే వేయించుకుంటావో, ఒళ్ళంతా తాళ్ళేకట్టించుకుంటావో నీ యిష్టం''

''ఆ చిల్లరంతా కలిపి ఎంతయిందో చెప్పండి బావగారూ''

''నేను చెప్పడం ఎందుకు? యిదిగో యీ పుస్తకమే చెప్తుంది. మా ఆవిడ కడుపులో మా భాస్కరంగాడు పడినప్పుడు, ఓక్ అని డోక్కుంటే, మంత్రసాని మంగమ్మని పిలిపించేనే, అప్పుడు యిచ్చిన రిక్షాచార్జి ముప్పావలా దగ్గర్నించి, నిన్న సాయంకాలం వాడు ఫస్టు షో సినిమా కెళ్ళినప్పుడిచ్చిన అయిదు రూపాయలదాకా యిందులో వివరంగా రాసున్నాయి. ఆ డబ్బుమీద నేను తీస్కునే రేటులో వడ్డీ కడితే నలుగురూ యింత గడ్డి ఎడతారని, కోపరేటివ్ బాంకురేట్ కట్టేను. అంతా కలిపి నాలుగు లక్షల, డబ్బై రెండువేల, ఆరు వంద పధ్నాలుగు రూపాయల యాభై పైసలయింది. ఆ యాభై పైసలు మీరేం యిస్తారుగాని, మిగతా సొమ్ము నామొఖాన పారెయ్యండి''

నర్సయ్యా డబ్బు విషయంలో యిలాంటి [illegible] ఊహించి




వచ్చినా, మరీ నాలుగున్నర లక్షలకి టెండరు పెడతాడని మాత్రం వూహించలేదు. "అమ్మాయి, అబ్బాయి పరస్పరం ప్రేమించుకున్నప్పుడుగూడా మీరిలా డబ్బు అడగడం ఏమైనా భావ్యంగా వుందా బావగారూ!" అంటూ చలపతిగొణిగేడు.

"మావాడికి చదువుతప్ప మరే పనీ చేతకాదు. సెకెండ్‌షో సినిమాకెళ్ళి ఒంటరిగా రాలేడు. అలాంటి వెధవ, మీ అమ్మాయిని కష్టపడి ప్రేమించి, నెల తప్పించేడన్న సంతోషంతోనే నేను నిన్ను కాణీ కట్నం అడగలేదు. నువ్వు యీ చిన్నచిన్న ఖర్చులు కూడా యివ్వకపోతే ఎలాగయ్యా? కోతి చేత గెంతులు వేయించి, సాయిబుగాడు డబ్బులు దండుకుంటాడు గదా, అలాంటిది కొడుకుని పెంచి, చదివించి న్నేను, వాడి మీద యీ ఖర్చులు గూడా తిరిగి పొందకపోవడం న్యాయమా చెప్పు"

నర్సయ్యని మాటల్తో గెలవలేమని భావించి చలపతి కాళ్ళబేరానికి దిగిపోయేడు. నర్సయ్య కొడుకుగూడా యీ సంబంధం కాదంటే నేను ఏ రైలు కిందో తలపెట్టి చచ్చిపోతానని బెదిరిస్తే తప్ప నర్సయ్య ఆఖరు మాటగా లక్ష రూపాయిలకి దిగలేదు. మర్నాడు చలపతి రేఖ పెళ్ళి విషయం రాంబాబుకి ఫోన్ చేసి చెప్పేడు. ఆ సంభాషణలో ఎక్కడా రేఖకొచ్చిన గర్భం విషయం ప్రస్తావించలేదు. మనం ఆ కట్నం డబ్బు ఆలస్యం చేస్తే ఆ నర్సయ్య తన కొడుక్కి వేరే సంబంధం చేసే ప్రమాదం కూడా వుందని హెచ్చరించాడు. రాంబాబు యీ లక్ష రూపాయల కట్నం గురించి సీరియస్‌గా తీస్కోలేదు. ఎందుకంటే, ఎప్పుడైనా రేఖ పెళ్ళి తను చెయ్యాల్సిందే! పైగా వచ్చే నెల రెండు లక్షలు చేతికిరానే వస్తుంది. నెలగడించింది. చీటీడబ్బు రెండు లక్షలు చేతికందింది. పోటీగా మరో మనిషెవరూ ఆ నెల చీటీ పాడకుండా, రెండు లక్షలు చీటీపాట నిర్వహించే వాళ్ళకే దక్కుతుంది. ఆ లాభం కోసమే ఎవరైనా చీటీ పాటనిర్వహిస్తారు. చేతికి అందిన రెండు లక్షల్ని ఏం చెయ్యాలి? బాంకులో ఫిక్స్‌డ్ డిపాజిట్‌గా వేస్తే? పెద్దగా కాకపోయినా, కొద్దిగానైనా వడ్డీ వస్తుంది. కానీ, బాంకులోవున్న డబ్బు వైట్ ఎమవుంట్‌గా గుర్తించబడుతుంది. ఇన్‌కమ్‌టేక్సు పడుతుంది. రెండు లక్షల్తో ఏవైనా నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్స్ కొంటే? అయిదు సంవత్సరాల తర్వాత నాలుగు లక్షలు అవుతుంది. కానీ, అయిదు సంవత్సరాలు ఆగాలి. ఆగినా, అది కూడా వైట్ ఎమవుంట్‌గానే చూపించాలి. అప్పుడు గూడా ఇన్‌కమ్‌టేక్సు కట్టాలి. ఎవరికైనా అప్పు యిచ్చి అయిదు రూపాయిలకంటే తక్కువకాని వడ్డీ నిర్ణయిస్తే, బోలెడంత లాభం వస్తుంది. పైగా నెలనెలా వడ్డీ వస్తుంది.

అమల, రాంబాబులు యీ నిర్ణయం తీసుకుంటుండగా, కాలింగ్‌బెల్ మ్రోగింది. వంట మనిషి వెళ్ళి తలుపు తీసింది.

హారిక వచ్చింది. ఆమె వెంట మరో పద్దెనిమిదేళ్ళ యువకుడు లోనికివచ్చేరు. అతన్ని తన మరిదిగా పరిచయం చేసింది. "వీళ్ళ నాన్నగారికి హార్ట్ ఎటాక్ వచ్చినప్పుడే, మీ యింటికి వస్తానని, రాకుండా మేం హైదరాబాద్ వెళ్ళాం. ఆయన పోయేరు. ఆయన వారసుడైన మా మరిది మీద అప్పులవాళ్ళు ఒత్తిడి చేశారు. రెండు రోజుల్లోగా కోర్టులో రెండు లక్షలు కట్టాలి. లేకపోతే ఆస్తంతా జప్తు చేస్తారు. మా వారు వూర్లోవుంటే, ఆయనే ఏదో ఏర్పాటు చేసేవారు. నేనున్నా ప్రస్తుతం నా దగ్గర అంత డబ్బు లేదు. నువ్వే ఏదో విధంగా ఎడ్జస్ట్ చేస్తావన్న ఆశతో వచ్చేను"

హారిక చెప్పిన మాటలు అటు రాంబాబుకిగాని, అమలకిగాని ఒకంతట మింగుడు పడలేదు. తాము చీటీ వేస్తున్న విషయం హారికకి తెల్సిపోయిందిగాబట్టి, యీ నెల్లోతమకి రెండు లక్షలు అందుతాయన్న విషయం ఆమెకు తెలియడంలో ఆశ్చర్యం లేదు. కానీ, ఆ డబ్బుని అప్పు అడుగుతోంది. ఇవ్వొచ్చు, కానీ వడ్డీ అడిగితే భావ్యంగా వుండదు. మొహమాటంపడి, అడక్కపోతే, బోలెడంత నష్టపోవాల్సి వస్తుంది. ఆమె సంశయాన్ని హారిక సరిగానే అర్థం చేసుకుంది. "నువ్వు వడ్డీకే యివ్వు అమలా, నువ్వు అనుకుంటున్న వడ్డీకే యివ్వు. వడ్డీ లేకుండా యిమ్మని నేనూ అడగడం లేదు. వేరెవరి దగ్గర తీసుకున్నా వడ్డీ యివ్వాల్సిందే గా" హారిక చెప్పిన మాటలకి రాంబాబు, అమల కన్విన్స్ అయేరు.

"నువ్వు తీసుకున్నట్టుగా నోట్ రాస్తావా?" అడిగింది అమల.

"అలా రాయకూడదు. వాళ్ళ వ్యాపారాల

మీద వాళ్ళే సంతకాలు చేసి, ఎకౌంట్స్ చూపించుకోవాలిగదా. మా చినమావయ్యగారి వ్యాపారాల్లో మామూడో మావయ్య భాగస్థుడు. ఆయనే సంతకం చేసి తీసుకుంటారు. రేపే ఆయన్ని మా యింటికి పిలిపించి, యీ రాత కోతలు పూర్తి చేయిస్తాను. రేపు మీరిద్దరూ ఆ డబ్బు తీసుకురండి''

ఒప్పందం కుదిరింది. మర్నాడు వుదయం హారిక యింట్లో ఆమె మూడవ మామగారు ప్రోనోటు మీద సంతకం చేశారు. హారిక మరిదిని కూడా సంతకం చేయమన్నాడు రాంబాబు. ''అతనికింకా మైనార్టీ తీరలేదు. మరో మూడు నెలలదాకా అతని సంతకం పనికిరాదు'' అంది హారిక.

''వడ్డీ వసూలు చేసి మాకిచ్చే పూచీ నీదే సుమా'' అంది అమల నవ్వుతూనే

''మీ యిద్దరికీ శ్రమలేకుండా, నేనే స్వయంగా మీ యింటికొచ్చి వడ్డీ చెల్లిస్తాను'' అన్నాడు మైనార్టీ తీరని అబ్బాయి.

హమ్మయ్య, వచ్చే నెలనించి నెలకి పదివేలు వడ్డీగా వస్తుంది కాబట్టి, యిక మీదట ఆనందమే ఆనందం అని రాంబాబు, అమల మహదానందం చెందారు.

★ ★ ★

అప్పు యిచ్చేటప్పుడు మొదటి నెల వడ్డీ మినహాయించుకునే యిస్తారు కాబట్టి అమలకి ఆ నెల పదివేలు చేతిలోనే వున్నాయి. వాటితో మార్వాడీ భాకీ పదివేలు తీర్చేస్తే అయిదు వందల వడ్డీ మిగులుతుంది కదాని సలహా యిచ్చేడు రాంబాబు. ''వద్దండీ, యిప్పుడు మనం ముష్టి అయిదు వందల గురించి ఎందుకూ చూస్కోడం? యిక మీదట హారిక చీటికీ మాటికీ రావచ్చు. ఎందుకంటే దాని పిలక నాచేతికి చిక్కిందిగా, అంచేత యీ నెల్లో మనం టీవీ కొనేద్దాం. వచ్చేనెల మరో రెండు మూడు సామాన్లు కొనేద్దాం'' అంటూ తన నిర్ణయాన్ని చెప్పింది. రాంబాబు కాదనలేకపోయేడు. ఆయింటికి కలర్‌టీవీ సమకూరింది గాని, ఆ నెల మార్వాడీకి కట్టాల్సిన ఏడు వందల యాభై వడ్డీ బకాయిపెట్టేరు.

ఆఫీసులో అందరూ సంతోషించే వార్త ఒకటి వినిపించింది. అంత వరకూలేని హౌస్ బిల్డింగ్ సదుపాయం యిప్పుడు ఆ ఆఫీసుకీ వచ్చింది. ఒక్కో వుద్యోగికి లక్ష రూపాయల చొప్పున ఎడ్వాన్సు యివ్వబడుతుంది. ఆ డబ్బుతోనే స్థలం కొనుక్కోవాలి, యిల్లు కట్టుకోవాలి. సులభవాయిదాల మీద ఆ డబ్బు వడ్డీతో సహా వసూలు చేయబడుతుంది. చాలా ప్రైవేటు సంస్థలకి లేని యీ సదుపాయం తమ ఆఫీసుకి వచ్చినందుకు అందరూ సంతోషించారు. కానీ, అమల మాత్రం పెదవి విరుస్తూ కామెంట్ చేసింది ''ఈ రోజుల్లో ముష్టి లక్ష రూపాయలకి స్థలం, యిల్లు ఎక్కడొస్తుందండి? సిటీలో ఏమూల చూసినా గజం వెయ్యిరూపాలకి తక్కువలేదు. ఆ లక్షరూపాయలకి వంద గజాల స్థలం కూడా రాదు. పైగా రిజిస్ట్రేషను ఖర్చులు కూడా మనవే పెట్టుకోవాలి. వంద గజాల స్థలంలో ఏదో లక్కపిడత లాంటి యిల్లు కట్టాలి తప్ప, లగ్జరీగా వుండే యిల్లేం కడతాం!''

ఆమె మాటలకి సరోజినీ అనే ఓ సీనియర్ క్లర్కు జవాబు చెప్తూ ''ఈ సదుపాయం లేనంత కాలం లేదని గోల పెట్టేం. యిప్పుడు వస్తే, ఆడబ్బు చాలదని విమర్శిస్తున్నామా? మన మిడిల్‌క్లాసువాళ్ళని ఆ భగవంతుడు కూడా సంతోషపెట్టలేడు సుమండీ! యీ ఫెసిలిటీ లేనివాళ్ళకంటే మనం ఎంత బెటరోనని మీకెందుకనిపించలేదండి?'' అంది.

''సరే, అనిపించిందే అనుకోండి, లక్ష రూపాయల్తో మీరు ఎక్కడ యిల్లు కడతారు? ఎంత పెద్దయిల్లు కడతారో చెప్పండి'' అమల ఆఫీసు పని మానేసి ఆమెతో వాదనకి దిగింది. ఆమె కూడా వూరుకోకుండా వాదించింది.

''ఎంతపెద్దయిల్లని కాదండి, ఏదో ఒక యిల్లు కడతాంగదా. యిప్పుడు మాత్రం మనం అంతకంటే పెద్దయిళ్ళల్లో బతికేస్తున్నామా? ఏదో ఓ యిల్లంటూ సొంతంగా కట్టుకుంటే, అద్దె కట్టాల్సిన బాధ తప్పుతుందిగా''

''అద్దె కట్టాల్సిన అవసరంలేకపోయినా, నెలనెలా ఎడ్వాన్సు కింద నాలుగైదు వందలు జీతంలోనించి రికవరీ చేస్తారుగదా''

మిగతా ఆడవాళ్ళు కూడా వారి వాదనలో జాయినయ్యేరు. మధ్యమధ్యలో తమ అభిప్రాయాన్ని కూడా వ్యక్తం చేస్తున్నారు.

''ఆఫీసులో డిడక్ట్ చేస్తున్నదే గతంలో




మనం చెల్లిస్తున్న అద్దె డబ్బులని భావించు కుంటే, కొన్ని సంవత్సరాల తర్వాతయినా, ఆ యిల్లు మన సొంతమైపోతుందిగా'' ఒకామె చెప్పింది.

''ఏమైనా మన బాస్‌కి మనం థాంక్స్ చెప్పాలి సుమండీ'' అంది మరో కళ్ళద్దాల అమ్మాయి.

''చెప్దాం... కానీ, యిప్పుడు కాదు, ఇల్లు కట్టుకోడానికి కనీసం అయిదు లక్షలయినా యిచ్చినప్పుడు, అప్పుడు చెపుదాం'' ఇది అమల వ్యక్తీకరించింది.

''ఆశకి అంతుండాలండీ... అయినా మన కంపెనీ వాళ్ళు మనకిచ్చింది యిల్లు పూర్తిగా కట్టుకోడానిక్కాదుగా! మనకి కొంత ధన సహాయం చేస్తున్నారు. మిగిలింది మనం పెట్టుకోవాల్సిందే. అమలగారు... ఏ భరోసా చూస్కుని, యీ హౌస్‌బిల్డింగ్‌లోన్‌ని తేలిక చేసి మాట్లాడుతున్నారోగాని మా బోటివాళ్ళకి మాత్రం యిదో పెద్ద వరం కిందేలెక్క'' సరోజినీ, అమల మీద కాస్త ఈసడింపు వ్యక్తం చేస్తూనే అంది.

''మనవంటే ఒక్క జీతంతో గడుపుకోవాలికాబట్టి, యీ లోన్‌ని ఓ వరంగా భావిస్తున్నాం. కానీ, అమలగారికి రెండు జీతాలుగా. అందుకే లక్ష రూపాయలలోనూ ఆమెకు లక్ష్యం లేకుండాపోయింది'' అంటూ జలజాక్షి అమలకి కనిపించకుండా మూతి తిప్పుతూ దెప్పిపొడిచింది. అమల కూడా వూరుకోకుండా రిటార్టు యిచ్చింది.

'' మేమిద్దరం యిక్కడే పని చేస్తున్నాం కాబట్టి, మీ కంటికి మారెండు జీతాలు కనిపిస్తున్నాయి. మీకు మాత్రం రెండు జీతాల్లేవా? మీరిక్కడ పని చేస్తుంటే, మీ మగాళ్ళు ఏ పనీ చెయ్యకుండా బలాదూర్‌గా తిరుగుతున్నారా? వుద్యోగమో, వ్యాపారమో ఏదో ఒకటి వెలగబెడుతున్నారుగా! ఆ మాత్రందానికి నన్ను ఆడిపోసుకోడం దేనికి?''

''మేమేం ఆడిపోసుకోవడం లేదండి. మీ భార్యభర్తలిద్దరూ ఒకే ఆఫీసులో పని చేస్తున్నారు కాబట్టి. మీరు యిల్లంటూ కట్టించుకుంటే మీకు రెండు లోన్లు యిస్తారుకదా అని...'' జలజాక్షి అలా అంటుంటే విమల అనే స్థూలకాయురాలు ఆ మాటల్ని నవ్వుతూనే ఖండించింది.

''అలాంటి ఆశలు పెట్టుకుని రెండిళ్ళకి పునాదులు తవ్వించేసేరు సుమండీ. ఒక ఫామిలీలోని మనుషులు ఒక్కరు పని చేసినా, యిద్దరు పని చేసినా, మొత్తం ఫామిలీలో వాళ్ళంతా పనిచేసినా, యిచ్చే లోను ఒక్కటే.''

అక్కడినించి వారివాదన ఎన్ని లోన్లు యిస్తారనే విషయం మీద కొనసాగింది.

''మోటర్ సైకిల్ ఎడ్వాన్సులు మనిషికొకటి చొప్పున యిస్తున్నప్పుడు హౌస్ బిల్డింగ్ లోను మాత్రం రెండెందుకివ్వరు?'' అమల సిన్సియర్‌గానే ప్రశ్నించింది.

''యివ్వరండీ యివ్వరు. వాహనం అనేది ఒక వ్యక్తికి సంబంధించింది. కానీ, యిల్లు అనేది ఓ వుద్యోగస్తుడి మొత్తం కుటుంబానికి సంబంధించింది. భార్యాభర్తలిద్దరూ ఒకే ఆఫీసులో పని చేసినప్పుడు యిద్దరికీ మోటర్ సైకిల్ ఎడ్వాన్సులివ్వొచ్చు. ఎందుకంటే, భర్తకి యిచ్చి, భార్యకి యివ్వలేదనుకోండి. మా ఆయన శెలవులో వున్నప్పుడో, వూళ్ళో లేనప్పుడో, నేనెలా ఆఫీసుకి వచ్చేది? కాబట్టి, నాకూ ఓ లోను నా మొహాన పారెయ్యండని అడగొచ్చు. కానీ, యిల్లు విషయం అలా క్కాదుగా. భార్యాభర్తలిద్దరూ ఒక్క కొంపలోనేవుండాలి''

వాదన సాగుతోంది. ఆఫీసు పని ఆగిపోయింది. ఆఫీసుబోయ్ అందరికీ కాఫీలు అందించాడు. కాఫీలు తాగుతూ మరింత వుత్సాహంగా చర్చించారు.

''భర్త ఆఫీసుకి శెలవు పెట్టినప్పుడు, భార్య అదేమోటర్ సైకిల్ మీద రావొచ్చుగదాని ఆఫీసువాళ్ళు రీజనింగ్ తీస్తే...?''

''మీరు తీసే లాజిక్కుగాని మన బాస్ వింటే వున్న ఆఫెసిలిటీని కూడా కేన్సిల్ చేసెయ్యగలడు? టాపిక్ మార్చండి, టాపిక్ మార్చండి'' అంటూ జలజాక్షి నవ్వుతూనే హెచ్చరిక చేసింది.

మళ్ళీ వారివాదన హౌస్ బిల్డింగ్ ఎడ్వాన్సు మీదకే మళ్ళింది. ఆరోజు అంతా అదే టాపిక్కు చర్చలోవుంది. చేతిలో రెండు లక్షలు న్నాయనే ధీమా వల్ల అమల ఆ లక్ష రూపాయల గురించి పెద్దగా ఆసక్తి కనబరచలేదు.

★ ★ ★



కాలం గడుస్తోంది.

మరునటి నెల వడ్డీ అమల చేతికి అందింది.

మధ్యలో ఓసారి చలపతి, రాంబాబుకి ఫోన్ చేసి రేఖ పెళ్ళి సంబంధం సంగతి ఏం చేశావురా, మనం యీ నెల్లో చెప్పకపోతే, వాళ్ళు మరో సంబంధం చూసుకునేలావున్నారు. అసలే ఆ నర్సయ్య డబ్బుకి పడి చచ్చే మనిషి'' అని చెప్పాడే తప్ప, రేఖకి గర్భం వచ్చిందన్న విషయం యిప్పుడు కూడా చెప్పలేదు. రాంబాబు ''చేద్దాం చేద్దాం, తొందరపడకు'' అని భరోసాయిచ్చేడు తప్ప, తను గూడా పెద్దగా తొందరపడలేదు.

మూడోనెల కూడా గడిచి, నాలుగోనెలలో ఆ దంపతులు నిర్వహిస్తున్న చీటీపాట ముళ్లపొదల్లో పడింది. మొదటినెల చీటి పాడుకున్నది నాగేంద్రకుమార్ అనే సెంట్రల్ గవర్నమెంట్ ఆఫీసరు. మూడోచీటీ పాడుకున్నది ఓ ఇంజనీరుగారు. ఆ నెల చీటీడబ్బు వసూలు చేయడానికి రాంబాబు, అమల కారులో వెళ్లారు. కానీ ఆ ఇంట్లో నాగేంద్రకుమార్ లేడు. వేరే మళయాళీ ఫేమిలీవుంది. ఆ ఇల్లు నాలుగురోజుల క్రితం ఖాళీ అయితే తాము రెండురోజుల క్రితమే దిగేమని ఆ ఇంటి యజమాని ఇంగ్లీషులో చెప్పాడు. బహుశా ఇల్లు మారివుంటాడనుకున్నారు. అతను ఎక్కడకి షిఫ్ట్ అయ్యేడో చెప్పగలరా? అంది అమల. ''తెలిస్తే చెప్పగలను. కానీ, నాకు తెలియదు కాబట్టి చెప్పలేను. మీరు అడగకపోయినా ఈ ఇంటి ఓనరు ఎడ్రస్ చెప్తాను. మీరు వెళ్లి అడగ్గానే ఆయన మీకు ఎడ్రస్ చెప్పొచ్చు''. అంటూ ఆ మళయాళీ సీరియస్‌గా మాట్లాడి, ఓ చీటీమీద ఎడ్రస్ రాసిచ్చాడు. ఆ ఓనర్ ఇల్లు అగనంపూడిలో వుంది. చచ్చాం అనుకున్నారు. అంత దూరం వెళ్లిరావడానికి సుమారు ఏడెనిమిది లీటర్ల పెట్రోలు అవుతుంది. అతనికి ఫోన్ లేదని మళయాళీయే చెప్పాడు. కార్లో పదిలీటర్లు పెట్రోలు పోయించుకుని బయలుదేరారు.

ఓ పదినిమిషాల వెదుకులాట తర్వాత ఆ ఇంటిని పట్టుకున్నారు. ఆ ఓనరుగారు డబ్బయ్యేళ్లు దాటిన ముసలాయన. ఆరోజు ఆయనకి మౌనవ్రతమట. ఏం అడిగినా రాసే చూపిస్తాడుగాని చచ్చినా మాట్లాడడట. తామెందుకు వచ్చిందీ చెప్పారు. ''రేపు దయచేయండి. వివరంగా మాట్లాడుకుందాం'' అని చీటీమీద రాసి చూపించాడు. రాంబాబు అతని దగ్గరే ఓ చీటీ తీసుకుని, తాము ఎంతదూరంనించి ఎందుకొచ్చిందీ నాలుగు వాక్యాల్లో రాసి చూపించాడు. ''నాకంటే మౌనవ్రతం, మీరు మాట్లాడ్డానికేం వచ్చింది? అని మళ్లీ రాసిచూపించాడు. అతనికి సారీ నోటితో చెప్పేడు. ఆ ముసలాయన రాసి చూపించిన ప్రకారం, నాగేంద్రకుమార్‌కి శంభల్‌పూర్ ట్రాన్స్‌ఫరైపోయిందని చెప్పి ఇల్లు ఖాళీ చేశాడు. అక్కడికి వెళ్తూ వెళ్తూ, దారిలో తన నేటివ్‌ప్లేస్‌కెళ్లి అక్కడనించి శంభల్‌పూర్ వెళ్తాడట. అతని నేటివ్‌ప్లేస్ ఏమిటో ఆయన చెప్పలేదు. నేను అడగలేదు. అయినా ఆ వివరాలు అడగాల్సిన అవసరం నాకేవిటట? అంటూ ఆ ముసలాడు బొక్కిపళ్లు ఆడిస్తూ నవ్వాడు. వాళ్లు కూడా నవ్వాలనుకున్నారుగాని నవ్వురాలేదు. నాగేంద్రకుమార్ ఒక్క మాటయినా చెప్పకుండా ఎందుకు వెళ్లిపోయాడు? మిగతా అరవైమూడునెలల చీటీ అతను కడతాడా? కట్టడా? ఇవే ఆలోచనల్తో ఇల్లు చేరుకున్నారు. మర్నాడు రాంబాబు ఆఫీసుకి సెలవుపెట్టి నాగేంద్రకుమార్ పనిచేసే ఆఫీసుకి వెళ్లి, శంభల్‌పూర్‌లో అతని ఎడ్రస్సేవిటో కనుక్కున్నాడు. ''అక్కడ మాకు రెండు టౌన్‌షిప్పున్నాయి. ఆ రెండింట్లో ఆయనకి ఏ క్వార్టరు ఎలాట్ చేస్తారో తెలీదు. అసలాయన క్వార్టర్సులో దిగుతాడో, లేక వేరే ఇల్లు అద్దెకు తీసుకుంటాడో మేం చెప్పలేం. ఎందుకైనా మంచిదని, ఈ నాలుగు ఎడ్రస్సులూ, ఈ ఆరు ఫోన్‌నెంబర్లూ ఇస్తున్నాం. ట్రై చెయ్యండి'' అంటూ ఓ చీటీమీద రాసిచ్చారు. థేంక్సు చెప్పి రాంబాబు బైటకి రాబోతుండగా అతనికో సందేహం వచ్చి మళ్లీ వెనక్కి వెళ్లి అడిగాడు.

''సార్, ఆయనకి సడన్‌గా ట్రాన్స్‌ఫరైందా?''

''ఇందులో సడనేం వుంది? ఇది ఆరునెల్లనించి అనుకుంటున్న ట్రాన్స్‌ఫర్. అది కూడా ఆయన కావాలని రిక్వెస్ట్ చేస్తేనే జరిగింది.''

రాంబాబు నాలికమీద తడి ఆరిపోయింది. ఏ క్షణాన్నైనా ట్రాన్స్‌ఫర్ అయిపోయే మనిషి అయిదు సంవత్సరాలపాటు సాగే చీటీ పాటలో ఎందుకు జాయినయ్యాడు? జాయినవ్వడమే కాకుండా యాభైవేల నష్టానికి చీటీ ఎందుకు పాడేశాడు? మమ్మల్ని మోసం చెయ్యడానికేనా?'' రెండురోజులు ఆగింతర్వాత శంభల్‌పూర్‌కి ఫోన్‌చేసి అతన్తో మాట్లాడవచ్చనుకున్నాడు. బహుశా ప్రతినెలా అక్కడనించి చెక్కుగాని, డి.డి.గాని పంపించే ఉద్దేశంలో వున్నాడేమో... అనుకుంటూ భార్యాభర్తలిద్దరు తమకి తాము ధైర్యం చెప్పుకుని మిగతా వాళ్లనించి చీటీడబ్బు వసూలు చేసుకునే ప్రయత్నం చేశారు.

గత మూడునెలలు ఠంచన్‌గా తన బావమరిదిచేత తమ ఇంటికే డబ్బు పంపించేసిన రఘుపతి అనే ఇంజనీరు ఈ నెల్లో ఇంకా డబ్బు పంపించలేదు. రాంబాబు అతనికి ఫోన్‌చేసి మాట్లాడాడు. ''మీరోసారి మా ఇంటికి రండి, మాట్లాడదాం, చెల్లాయ్‌ని కూడా తీసుకు రండి. సరదాగా ఈపూట మా ఇంట్లో భోంచేసినట్టుంటుంది'' అన్నాడు ఎంతో ఆప్యాయత ప్రదర్శిస్తూ. ఎంతైనా ఇంజనీర్లు చూపించే మర్యాదే వేరు అనుకుంటూ కారులో బయలుదేరారు. పెద్దవాళ్ల ఇంటికెళ్లేటప్పుడు ఉత్తచేతుల్తో వెళ్లకూడదని, దారిలో ఓ స్వీట్‌స్టాల్ దగ్గర ఆపి, ఓ కేజీ మిఠాయి కొన్నారు. వాళ్లని సాదరంగా ఆహ్వానించాక ''రెండు పెగ్గులు వేస్కోండి'' అంటూ బీరువాలోనించి బాటిల్ తీశాడు. కానీ అందులో ఓ పెగ్గుకంటే ఎక్కువ లేదు. అరే, చూస్కోలేదే అంటూ తన నౌఖర్ని పిల్చి ఓ హాఫ్‌బాటిల్ తెమ్మని డబ్బు ఇవ్వబోయాడు. కానీ రాంబాబు అతన్ని ఆపుచేసి తనే ఓ వందనోటిచ్చి నౌఖర్ని పంపించాడు. రఘుపతి ఇది మర్యాదకాదు రాంబాబుగారూ అంటున్నా రాంబాబు వినలేదు ''మనం మనం ఒకటి అనుకున్నాక మీరు ఇస్తేనేం నేను ఇస్తేనేం'' అనేశాడు రాంబాబు. సీసా ఖాళీ అయింది. కడుపులు బరువెక్కాక చీటీడబ్బు ప్రస్తావన తెచ్చింది అమల.

''నేను వారంరోజుల క్రితమే ఉద్యోగంనించి సస్పెండ్ అయ్యాను చెల్లెమ్మా. ఆఫ్‌కోర్స్ నేను మళ్లీ జాబ్‌లో కొచ్చేస్తాననుకో. కానీ, అందుకు




ఏడాది పడుతుందా? నాలుగేళ్లు పడుతుందా? అనే విషయం వాడే చెప్పాలి'' అంటూ ఆకాశంవైపు చూపించాడు.

''మరి మా చీటీ డబ్బు?'' అమల ఆత్రంగా అడిగింది. దానిక్కూడా ఆకాశంవైపే చెయ్యి చూపించి, ఆకాశానికో సమస్కారం చేశాడు. ఆయన భార్య అమల దగ్గరకొచ్చి కాస్త బాధపడుతూ అంది.

''ఇకమీదట మా కొచ్చే సగం జీతంతో మా ఇల్లు గడవడమే కష్టం. ఇలాంటప్పుడు ఆయనకి పై రాబళ్లూ రావు. అలాంటప్పుడు నెలకి మూడువేల చిల్లర చీటికి కట్టడమంటే అది జరిగేపనేనా ఆలోచించు''

కొన్నిక్షణాలపాటు గదినిండా నిశ్శబ్దమే ఆవరించుకుంది. ''పోనీ, మీరు పాడుకున్న ఆ లక్షాడబ్భైఅయిదువేలు మాకు ఇచ్చెయ్యండి''

''ఇంకా ఆ డబ్బు ఎక్కడుందమ్మా? మా అమ్మాయి పెళ్లి చెయ్యాలనేగదా పాతికవేలు నష్టానికి పాడేశాం''

''మరి మిగతానెలలకి మీరు డబ్బు కట్టరా?'' రఘుపతి మళ్లీ ఆకాశంలోని దేవుడి వైపు చూపించాడు. ''అంటే మీ డబ్బు ఆ దేవుడు కడతాడంటారా?'' అమల ఆవేశాన్ని తమాయించుకోలేకపోయింది.

''ఏమోనమ్మా, జైల్లో పడిన రామదాసు తరపున శ్రీరామచంద్రుడు తానీషాకి బాకీ చెల్లించలేదా? అలాగే ఏ దేవుడో నామీద దయదల్చివస్తే నెలనెలా వాడే మీ చీటీడబ్బు కట్టేస్తాడు. లేదంటే, మీరు కూడా నాలాగే దండం పెట్టండి'' అంటూ మళ్ళీ ఆకాశానికి నమస్కారం చేశాడు.

రాంబాబుకి తనమీద తనకే కోపం వచ్చింది. ''వీడు ఈ చావుకబురు చెప్పడానికే, భోజనానికి పిలిచాడా? నేనేమో వెర్రివెంగళప్పలా ఓ కేజీమిఠాయి కొనుక్కొచ్చింది చాలక, వాడు తెప్పిస్తానన్న మందు బాటిల్ని కూడా నేను తెప్పించెయ్యాలా? ఛీ... నేను ఏది తలపెట్టినా చేతిచమురు వదిలిపోవడమే అని స్వగతం పలుక్కుంటూనే అమల చేసిన హెచ్చరికతో కొంత సంతృప్తిపడ్డాడు.

''చూడండి, రఘుపతిగారూ. మీరు రెండు లక్షల చీటీ సొమ్ముని రెండుచేతుల్లో అందేసుకుని, ఇప్పుడు ఆకాశంవైపు చెయ్యి చూపించగానే అయిపోలేదండి. మీరు సంతకంచేసిన ప్రోనోటు మా చేతిలో వుంది. దాన్ని పట్టుకుని మిమ్మల్ని కోర్టుకీడ్చి, అసలు వడ్డీలతోసహా వసూలు చేస్తాను''

అంత వార్నింగు ఇచ్చాక కూడా రఘుపతిలో మార్పురాలేదు. ''ఆ పైవాడి దయవల్ల నువ్వలా కోర్టుకి ఎక్కితే, ఏడెనిమిదేళ్లవరకూ నాకు ఏ గొడవా వుండదు. వెంటనే ఆ పని చూడు చెల్లెమ్మా'' అంటూ ఆమెను దీవిస్తున్నట్టుగా ఆమె తలమీద కుడిచెయ్యి వుంచాడు.



ఆ రాత్రంతా రాంబాబుకీ నిద్రపట్టలేదు, అమలకీ నిద్రపట్టలేదు. పైగా ఏడుస్తూ కూర్చుంది. ఇప్పుడేం చెయ్యాలి? దేవుడిమీద భారంవేసేసి తన భారాన్ని దించేసుకున్న రఘుపతిని ఏం చెయ్యాలి? నాగేంద్రకుమార్ శంభల్పూర్ చెక్కేశాడు. ఇలా చీటీలు పాడేసిన వాళ్లంతా, ఆ తర్వాత చీటీలు కట్టకుండా ఎగ్గొట్టేస్తుంటే మనమేం చెయ్యాలి? మర్నాడు ఉదయం తన అసిస్టెంట్ రాగానే ఇలాంటి సందర్భాలు ఏర్పడినప్పుడు రాజరత్నమ్మ ఏం చేసింది? ఎలా వసూలు చేసింది? అని ఆత్రంగా అడిగింది. ''ఆవిడ ఆడమనిషన్న పేరేగాని, ఉత్తరౌడీ మనిషమ్మా. ఆవిడకి జడిసి ఎవరూ ఎగ్గొట్టేవారుకాదు. ఓసారి కిరాణా కొట్టు అప్పలమూర్తి చీటీ పాడేసుకున్న తర్వాత, ఇకమీదట నీకు చీటీలు కట్టను, నీదిక్కున్నచోట చెప్పుకో అంటూ మొండిమాటలాడితే ఇద్దరు రిక్షావాళ్లని తీసుకెళ్లి దుకాణం తలుపులు మూయించి, లోపలే అతగాణ్ణి చావ

గొట్టేసిందమ్మా. దాంతో అప్పలమూర్తి బెదిరిపోయి, ప్రతినెల ఫస్టుతారీఖుల్లా డబ్బులు పంపించేసేవాడు'' అంటూ ఆమె ఆ సంఘటన తల్చుకుంటూ పగలబడి నవ్వింది.

రాజరత్నమ్మ చేసిన దౌర్జన్యం తమకి ఆచరణ యోగ్యంకాదు. ఎందుకంటే నాగేంద్రకుమార్ ఈ ఊళ్లోను, ఈ రాష్ట్రంలోనే లేడు. ఇంక వాణ్ణి కొట్టే ప్రసక్తేలేదు. రఘుపతిని కొట్టించినా, నాలుగు తన్నులు తినేసి మళ్లీ ఆకాశంవైపు చెయ్యిచూపిస్తే? లేక తాము దౌర్జన్యం చేశామని పోలీసు రిపోర్టిస్తే? ఆ పీకులాట పంచాంగమంతా ఎవడు పడతాడు? రెండురోజులు ఆగి శంభల్‌పూర్‌కి, నాగేంద్రకుమార్ ఆఫీసులో ఇచ్చిన ఫోన్‌నెంబర్లకి ట్రంకాల్స్ బుక్ చేశారు. కాల్ వచ్చింది. నాగేంద్రకుమార్ గారు కావాలండీ అన్నాడు రాంబాబు బిగ్గరగా ఫోన్‌లో. అవతలనించి మాట్లాడుతున్న వ్యక్తి కాస్త వచ్చీరానీ తెలుగులో మాట్లాడుతున్నాడు, అదీ కొంతవరకు అదృష్టమే అనుకున్నాడు.

''మీకు ఏ నాగేంద్రకుమార్ కావాలి? పొడవుగా సన్నంగా వున్న నాగేంద్రకుమార్ కావాలా? పొట్టిగా లావుగా వుండే నాగేంద్రకుమార్ కావాలా? లేక చామనఛాయగా, మరీ అంత ఎత్తుగాను, మరీ అంతపొట్టిగానూ వుండని నాగేంద్రకుమార్ కావాలా?'' అన్నాడా వ్యక్తి. అతని గొంతులో ధ్వనిస్తున్న వెటకారాన్ని బట్టి, అతను కావాలనే అలా మాట్లాడుతున్నాడని రాంబాబు గ్రహించాడు.

''ఏవిటండీ మేం ఇంతదూరంనించి, ఇంత డబ్బు ఖర్చుపెట్టి ఇంత సీరియస్‌గా మాట్లాడుతుంటే, మీరు వెటకారంగా మాట్లాడుతున్నారు? తప్పుకాదూ?'' అంటూ రాంబాబు కసిరాడు. అవతలవ్యక్తి చేతిలోనించి మరెవరో పెద్దమనిషి తీసుకున్నట్టుంది. అతను చాలా మర్యాదగా మాట్లాడుతున్నాడు, కానీ హిందీలో మాట్లాడుతున్నాడు. చచ్చేం, నాకు హిందీ పొడిపొడిముక్కలు వచ్చు తప్ప ధారాళంగా మాట్లాడ్డంరాదు. ఆ వచ్చిన నాలుగు హిందీముక్కలు కూడా టి.వి.లో రామాయణం, మహాభారత్ చూసి నేర్చుకున్నవే. ఆ ముక్కల్తోనే మాట్లాడానికి ప్రయత్నించాడుగాని తను అడగదల్చుకున్న ప్రశ్నలకి, ఆ టి.వి. హిందీ చాలదని వెంటనే తెల్సిపోయింది. పక్కనే వున్న అమల హిందీలో విశారద పాసయినట్టుగా ఎప్పుడో చెప్పినట్టు గుర్తు. అది జ్ఞాపకం వచ్చి ఆమెను మాట్లాడమన్నాడు, ఈలోగా త్రీ మినిట్స్ ఓవర్ అంటూ టెలిఫోన్ ఆపరేటర్ హెచ్చరించాడు. ఎక్స్‌టెండ్ అని చెప్పి ఫోన్‌ని అమల చేతికిచ్చేడు. ''నాకు హిందీ రాయడం, అర్థం చేసుకోవడం తప్ప పెద్దగా మాట్లాడ్డం రాదండి'' అంది అమల. వాడు చెప్పిందేవిటో అర్థం చేస్కో అన్నాడు. ''ముందు నేను అడగాలిగా'' అంటూ బేలమొహం పెట్టింది అమల. రాంబాబు చిరాగ్గా ఫోన్ అందుకుని, నాగేంద్రకుమార్ గురించి ఇంగ్లీషులో అడిగాడు. అవతల వ్యక్తి మాత్రం జవాబుని హిందీలోనే చెప్పాడు. ఇక్కడ నలుగురు నాగేంద్రకుమార్లున్నారు, అందులో మీకు ఎవరు కావాలి అని. ఆంధ్రానించి ట్రాన్స్‌ఫర్ అయివచ్చిన నాగేంద్రకుమార్ కావాలన్నాడు రాంబాబు. ఆంధ్రానించి ముగ్గురు వచ్చారు, అందులో మీకు ఎవరు కావాలి? రాంబాబుకి చిరాకు వచ్చింది. విశాఖపట్నంనించి ఈ మధ్యనే ట్రాన్స్‌ఫరైవచ్చాడు, అతను కావాలి అని అరిచాడు. విశాఖపట్నంనుంచి ఇద్దరు ట్రాన్స్‌ఫరై వచ్చారు. అందులో మీకు ఎవరు కావాలి?'' రాంబాబుకి సహనం చచ్చిపోయింది. సెక్షన్ సూపర్నెంటు నాగేంద్రకుమార్ కావాలండి అన్నాడు. ''ఓహ్ అతనా? తెల్లగా పొడుగ్గా వుంటాడు, అతనేకదా? కళ్లద్దాలు పెట్టుకుని ఎప్పుడూ సఫారీ సూట్‌లు వేసుకుంటాడు అతనేనా?''

''అతనే అతనే'' అంటూ అరిచాడు రాంబాబు, లోలోపల నాగేంద్రకుమార్ దొరికేడన్న ఆనందం పొందుతూ.

''కుడిచేతికి వాచీ పెట్టుకుంటాడు, అతనేనా?''

''అతనేసార్, అతనే దయచేసి అతన్ని ఫోన్ దగ్గరకి పిలవండి'' సిక్స్‌మినిట్స్ ఓవర్ అంటూ టెలిఫోన్ ఆపరేటరు మరోసారి జ్ఞాపకం చేశాడు. ఎక్స్‌టెండ్ అని అసహనంగా చెప్పి, మళ్లీ ఫోన్‌లో ''దయచేసి అతన్ని పిలవండి సార్'' అన్నాడు.

''వుంటే పిలిచేవాడినే, కానీ అతని ట్రాన్స్‌ఫర్ ఆర్డరు కేన్సిలయింది''

''అంటే, మళ్లీ విశాఖపట్నం వచ్చేస్తాడా?''




''రాదు''

''అయితే ఏవూరికి ట్రాన్స్‌ఫర్ చేస్తారట''

''తెలీదు''

''ఎవర్నడిగితే తెలుస్తుంది?''

''తెలీదు''

రాంబాబు విసురుగా ఫోన్ పెట్టేయబోతూ మళ్లీ అడిగాడు.

''మీ పేరేవిటి సార్?''

''తెలీదు'' అంటూ ఆ వ్యక్తే ఫోన్ పెట్టేశాడు. ఆ వ్యక్తి తెలీదు తెలీదు అన్నందుకే రాంబాబు విసుక్కున్నాడు తప్ప. అంతవరకు ఫోన్‌లో మాట్లాడింది, నాగేంద్రకుమారేనన్న విషయం రాంబాబుకి అసలు తెలియదు. ఆరోజంతా రాంబాబు, అమల ఇప్పుడేం చెయ్యాలనే విషయంమీద విడివిడిగా ఆలోచించినా, ఎవరికీ ఏమీ తట్టలేదు. మర్నాడు ఉదయం తనకి తెలిసిన లాయరు దగ్గరకి భార్యా సమేతంగా వెళ్లాడు. అతను యాభైఏళ్లు దాటిన ఏనుగులా కనిపిస్తున్నాడు.

వారిద్దరూ నమస్కారం చెయ్యగానే, ప్రతినమస్కారంగా ఏనుగుదంతాల్లాంటి పళ్ళు బైట పెట్టి నవ్వాడు. పిండిమర ఆడుతున్న శబ్దం వచ్చింది. శబ్దం ఎలా వున్నా పనిజరిగితే చాలనుకుని, తాము వచ్చిన విషయమంతా వివరించాడు. అంతా విన్నాక అతను ఓ నిమిషందాకా ఏమీ మాట్లాడకుండా అక్కడ గోడకి తగిలించిన లాయరుగౌను వేసుకుని ''నేను కోర్టులోనే కాదు, ఎక్కడ ఎవర్ని ఏ ప్రశ్నలడిగినా ఈ గౌను తొడుక్కునే అడుగుతాను'' అంటూ ఆ గదిలో అటూ ఇటూ తిరుగుతూ కొన్ని ప్రశ్నలు అడిగాడు. అందులో కొన్ని ముఖ్యమైనవి ఇవీ.

''చీటీ పాటలు ఎవరు నిర్వహించారు?''

''మేమే''

''మీరిద్దరూ ఉద్యోగస్థులు కదూ?''

''ఔనండి''

''ఉద్యోగస్థులు ఇలాంటి చీటీ పాటలు కండక్ట్ చెయ్యకూడదని తెలీదా? చేసినట్టయితే మిమ్మల్ని ఉద్యోగాల్లోనించి డిస్మిస్ చేస్తారని తెలీదా? ఒకవేళ మీరు మీ మెంబర్సుకి డబ్బు ఎగ్గొట్టేస్తే వాళ్లు పోలీసు కంప్లయింట్ ఇస్తే మిమ్మల్ని జెయిల్లో పెడతారని తెలీదా? మీరు చీటీలు కండక్ట్ చేసినప్పుడు మరొకరిపేర్న ఆ చీటీలు కండక్ట్ చెయ్యాలని తెలీదా? రాజరత్నమ్మ చేసిందికదాని, ఆవిడ పోగానే ఆవిడ చేసినపనికి మీరూ తలపడిపోయారు గాని, ఆవిడ గవర్నమెంటులోగాని, ప్రవేటు సంస్థలోగాని ఉద్యోగస్థురాలు కాదని తెలీదా?''

అతను తెలీదా? తెలీదా? అంటూ అడిగే ఒక్కో ప్రశ్నకి వాళ్లకి ఒక్కో గ్లాసుడు చెమటలు పట్టేశాయి. ఆ చెమటల్తో చేతిలోని రుమాళ్లేకాదు, ఒంటిమీద బట్టలన్నీ తడిసిపోయాయి. ఇరుకున పడిపోయాం, సలహా చెప్పండి మహాప్రభో అని వస్తే ఇతను ఇలా బెదరగొట్టేస్తున్నాడేవిటా అని కంగారు పడిపోయారు.

''చీటీలు పాడేసి, ఎగ్గొట్టేసిన ఆ ఇద్దర్నీ మేం ఏమీ చెయ్యలేమా?''

''ఏమీ చెయ్యలేరు''

''వాళ్లు సంతకాలు చేసిన ప్రోనోట్లున్నాయిగా. వాళ్లమీద కేసు వెయ్యడానికవి పనికిరావా?''

''పనికొస్తాయి... నాలిక గీసుకోడానికి. నేను మీ హితోభిలాషిని కాబట్టి నిజం మాట్లాడుతున్నాను. నేను మాట్లాడేది నిజం కాబట్టి అబద్ధంలా తియ్యగా వుండదు. చేదుగా వుంటుంది. మీరు ఆ ప్రోనోట్ల ఆధారంగా వాళ్లమీద కేసు పెట్టొచ్చు. కానీ మీకా రెండు లక్షల డబ్బు ఎక్కణ్ణించొచ్చిందీ అని కోర్టులో అడుగుతారు. చీటీలు కండక్ట్ చెయ్యడంవల్లా అని మీరు చెప్తారు. ఉద్యోగస్థులుగా అలాంటి ప్రైవేటు చీటీలు కండక్ట్ చెయ్యడం నేరంగా భావిస్తారు. పోనీ, ఆ రెండు లక్షలూ మరోవిధంగా వచ్చేయని చెప్పొచ్చు. పోనీ అలా రెండు లక్షలు వచ్చే సోర్స్ ఏమైనా వుందా? వుంటే ఆ రెండు లక్షల్ని మీరు గవర్నమెంటుకి చూపించి, టేక్సు కట్టేరా అని అడుగుతారు. కోర్టు విషయం మీకు తెలియదు, నాకు తెలుసు కాబట్టి చెప్తున్నాను. కోడిగుడ్డుని చూపిస్తే, దానికి ఎన్ని వెంట్రుకలున్నాయని వెదుకుతారు. ఒక లాయరు నూటతొంభై వున్నాయని చెప్పి, నలుగుర్ని సాక్ష్యం వేస్తే అతనే గెలుస్తాడు. అంచేత నేను చెప్పేదేవిటంటే, మీరు వెంటనే చీటీపాటలు మానేసి, మీ ఉద్యోగాల్ని కాపాడుకోండి, లేదంటే మీకు ఎగ్గొట్టేసిన ఆ



ఇద్దరి చీటీలు మీరే కట్టేస్తూ గప్‌చిప్‌గా కండక్ట్ చెయ్యండి. అదీ కష్టమనుకుంటే మరో ఇద్దర్ని ఆ ఇద్దరి స్థానంలో మెంబర్లుగా జాయిన్ చేసుకోండి'' అతను సలహా ఇచ్చేడో, వార్నింగ్ ఇచ్చేడో ఆ దంపతులకి అర్థం కాలేదు. థేంక్సు చెప్పి వెళ్లబోతుంటే ఓ వంద రూపాయలు ఫీజులు ఇవ్వండి'' అన్నాడు గజేంద్రుడు.

''ఎందుకండీ, మేం కేసుపెట్టడం లేదు గదా'' అన్నాడు రాంబాబు.

''పెట్టడంవల్ల ప్రయోజనం వుండదని సలహా ఇచ్చానుకదా, అందుకు'' అంటూ మళ్లీ నవ్వాడా గజేంద్రుడు. రాంబాబుకి అతన్తో ఆ ఫీజు విషయమై వాదించడం ఇష్టంలేకపో యింది. ఒకవేళ వాదించినా, తనతో వాదించి నందుకు మరో అయిదువందలు అడిగినా అడుగుతాడని అనుమానపడి వందరూపాయ లూ అందించి, బయటపడ్డాడు.

★ ★ ★

కోతిపుండు బ్రహ్మారాక్షసి అవడమనే మాటని రాంబాబు చాలాసార్లు విన్నాడు తప్ప అలాంటి ప్రమాదకరమైన అనుభవాల్ని అత నెప్పుడూ చవిచూడలేదు. ఆ లోటు గూడా ఇప్పుడిప్పుడే తీరనారంభించింది.

నాగేంద్రకుమార్, రఘుపతి చీటీ పాటల నించి తప్పుకున్న విషయం, మిగతా మెంబర్ల కిఎలా తెల్సిపోయిందోగాని, వాళ్లంతా కలవర పడ్డారు. కొందరు రాంబాబు ఇంటికి ఫోన్‌లు చేసి మాట్లాడారు. ఇంకొందరు ఇంటికొచ్చి అడిగారు. మరికొందరైతే డైరెక్టుగా ఆఫీసుకొ చ్చే అడిగారు. అలా ఆఫీసుకి రావడమే రాంబాబుకి కంగారు పుట్టించింది. వాళ్ల రాకతో తమ చీటీపాటల విషయం ఆఫీసులో అందరి కీ తెల్సిపోతుందని వచ్చేవాళ్లందర్ని ఎదు రుగా వున్న హోటల్‌కి తీసుకెళ్లి కాఫీలు ఇప్పించి, తనూ కాఫీలు తాగి వాళ్లతో మాట్లాడే డు. అందరితోనూ చెప్పిన విషయం ఒక్కటే.

''వాళ్లిద్దరూ చీటీలు ఎగ్గొట్టడం లేదండి. అలా అని ఎవరు చెప్పారు? భలేవారే. వాళ్లిద్ద రూ పెద్దమనుషులు. వాళ్లెందుకలా చేస్తారు? అయినా ఎగ్గొట్టాలని ప్రయత్నిస్తేమాత్రం మేం వూరుకుంటామా? వాళ్ళు సంతకాలు చేసిన ప్రోనోట్లు మాదగ్గరున్నాయిగా. వాటితో వాళ్ళ పిలక ఝాడించెయ్యమూ'' అంటూ ఏడవలేక నవ్వుతూ వాళ్ళందరికి భరోసా యిచ్చి పంపించేడు.

పగలంతా వచ్చిన ప్రతీ ఒక్కరితోనూ ఒక్కో కాఫీ తాగడంవల్ల, రాత్రయ్యేసరికి కడుపు కాఫీ టేంకులా తయారై వుబ్బిపోయింది. అందరికీ చెప్పినమాటే చెప్పీ చెప్పీ నోరు అలిసిపో యింది. బుర్రనిండా ఆందోళన, ఆలోచనల్తో, మెదడు వాచిపోయింది. యివన్నీకాక, ఎగ్గొట్టిన మోసగాళ్ళని, పబ్లిగ్గా మోసగాళ్ళని కూడా చెప్పుకోలేకుండా, వాళ్ళు చాలా పెద్దమనుషు లని చెప్పడంతో అతని అంతరాత్మ అతని మీద అలిగి, లోపల్నించి గిల్లనారంభించింది.

రెండురోజులపాటు మెంబర్ల దగ్గర్నించి ఫోన్లుగాని, మనుషులు యింటికి రావడంగాని, ఆఫీసుకి రావడంగాని జరగలేదు. హమ్మయ్య, నా వాక్చాతుర్యంతో వాళ్ళందర్ని ఒప్పించగలి గేను అని సంతోషిస్తున్న తరుణంలో, అంతే మూడోరోజు సాయంత్రం ఓ బాంబు పేలింది. ఈ మూడురోజులూ ఆ మెంబర్సంతా ఎక్క డైనా మీటింగు పెట్టి నిర్ణయం తీసుకున్నారో, లేక, ఫోనుల్లో మాట్లాడుకున్నారో, మరెలా కూడ బలుక్కున్నారోగాని వాళ్ళంతా ఓ నిర్ణయానికొ చ్చేసి, రాంబాబు యింటికి ఓ పదిహేను మంది వచ్చేరు. వాళ్ళు మిగతావారికి ప్రతిని ధులట. అందులో ఒకాయన మాజీ కౌన్సిలరు, ఎన్నోసార్లు ఎమ్మెల్యే సీటుకి పోటీచేసి, అన్నిసా ర్లూ డిపాజిట్లు పోగొట్టుకున్న రాజకీయ నాయ కుడు. అతనిపేరు తమ్మయ్యలింగం. అతని వాగ్ధాటి ఎక్కువని, వచ్చినవారందరి తరఫున అతనే మాట్లాడాడు.

''చూడండి రాంబాబుగారూ, మన భారత దేశం భవిష్యత్తుని, జాతీయ సమైక్యతని దృ ష్టిలో పెట్టుకుని మాట్లాడుకుందాం. మనలో మనకి అల్లర్లుగాని, గొడవలుగాని, పేచీలుగాని వద్దు. మీరు యికమీదట చీటీపాటలు కండక్ట్ చెయ్యొద్దు. మేం చీటీలు కట్టొద్దు. చీటీలు పాడేస్కున్నాక మరో రాష్ట్రం పారిపోయినవాణ్ణి, లంచాలు తీస్కుని సస్పెండ్ అయిపోయి, యికమీదట కట్టబోయే చీటీడబ్బులకి ఆకా శంలోని దేవుణ్ణి చూపించేవాణ్ణి మీరు పెద్దమ నుషులని చెప్పొద్దు. ఆ మాటలు మేం నమ్మో




ద్దు. అంచేత, శాంతియుతంగా, క్రమశిక్షణ పాటిస్తూ, ఈ చీటీపాటని రద్దుచెయ్యమని మేం పెట్టిన ప్రతిపాదనని మీరు కాదని చెప్పొద్దు. మేం యిప్పటివరకూ కట్టిన డబ్బుని తిరిగి మాకు యిచ్చెయ్యండని అడగడానికొచ్చాం కాబట్టి, ఆ డబ్బంతా యివ్వలేమని చెప్పొద్దు. అలా యివ్వకపోతే మేవంతా మీ ఆఫీసుకొచ్చి, మీ యిద్దరిమీద ప్రతీఒక్కరం కంప్లయింట్ యిచ్చే అవసరం తేవద్దు. మా కంప్లయింటులమీద ఏక్షన్ తీస్కుంటూ, వాళ్ళు మిమ్మల్ని వుద్యోగాల్లోంచి డిస్మిస్ చేసే దురవస్థని మేం కళ్ళారా చూసే దురదృష్టాన్ని మాకు కలిగించొద్దు. అంతేకాదు, యింత మందిని చీట్ చేశారనే నేరంకింద పోలీసులు మిమ్మల్ని అరెస్టు చేసి, జైలుకి పంపే పాపకార్యాన్ని మాచేత చేయించొద్దు. జై జవాన్, జై కిసాన్, మేరా భారత్‌మహాన్'' అంటూ ఆయన ఆ దంపతుల గుండెల్లో మందుపాతర్లు పేల్చాడు.

సగం మాటలు అవుతుండగానే అమల భోరుమంటూ ఏడుపు లంకించుకుంది. ఆమెను ఓదార్చేసరికే రాంబాబుకి పావుగంట పట్టేసింది. ''బాబూ... ఆవిణ్ణి మేం వెళ్ళాక తీరిగ్గా ఓదార్చండి. ముందు మాకేం చెప్తారో చెప్పండి'' అన్నాడో ముసలాయన.

''మీరిలా సడన్‌గా వచ్చి, అంత ఎమౌంట్ ఒకేసారి కట్టమంటే ఎలా కట్టమంటారు చెప్పండి'' అంటూ బిక్కమొహం వేశాడు రాంబాబు. మళ్ళీ రాజకీయనాయకుడు ఆరంభించాడు.

''మేమందరం ఒకేసారి యిలా కట్టకట్టుకు రావడం తప్పని మీరు చెప్పొద్దు. ఇది మా అందరి సమస్యా అయినప్పుడు అందరం కట్టకట్టుకుని రావడమే సమైక్యత అనిపించుకుంటుందిగాని, ఒక్కొక్కరే రావడం వేర్పాటు ధోరణికి చిహ్నం అనిపించుకుంటుంది. మీదగ్గర డబ్బు లేదని చెప్పొద్దు, ఆ మాటల్ని మేం నమ్మొద్దు. మీకు చీటీలో వచ్చిన రెండులక్షలూ అప్పుడే ఖర్చయిపోయేయని అబద్ధం చెప్పొద్దు''

రాంబాబుకి, అమలకి వేరే సమాధానం చెప్పి, వాళ్ళని ఒప్పించలేమని తెల్సిపోయింది. అప్పు యిచ్చిన రెండు లక్షలూ తిరిగి తీసుకుని, వాళ్ళకి యిచ్చేస్తే తప్ప, తమ వుద్యోగాలు నిలబడవు. వుద్యోగాలు పోతే కూర్చున్న కొమ్మని నరుక్కున్నట్టు, ప్రయాణం చేస్తున్న పడవకి మనకి మనమే రంధ్రం పెట్టుకున్నట్టవుతుంది. ''మేం ఆ రెండు లక్షల్ని అప్పు యిచ్చేం. కానీ, యిప్పుడు ఆ ఎమౌంట్‌ని వెంటనే యిచ్చెయ్యమంటే యివ్వకపోవచ్చు కాబట్టి, మాకో నెల గడువు యిప్పించండి'' అని రాంబాబు ప్రాధేయపడ్డాడు. అమల ఆ మాటల్ని నోటితో అనకపోయినా, ఆమె కళ్ళలోని బేలతనం అదే భావాన్ని వ్యక్తంచేసింది. వచ్చినవాళ్ళంతా మరీ పెద్దమనుషులు కాకపోయినా, మరీ చిన్నమనుషులు కారు కాబట్టి, రాంబాబు చేసుకున్న విన్నపాన్ని ఆమోదించారు.

''నెల గడిచాక మాకాడబ్బు అందలేదని చెప్పొద్దు. మమ్మల్ని మీ ఆఫీసుకి రప్పించి, మీకు అసహ్యాకరమైన అనుభవాలు కలిగించే అవసరాన్ని కలిగించొద్దు'' అంటూ రాజకీయ నాయకుడు మరోసారి హెచ్చరించి, మిగతావారిని తీసుకు వెళ్ళిపోయాడు. అమల దుఃఖం ఆపుకోలేక లోపలకెళ్ళి మంచంమీద పడిపోయి భోరుమంటూ ఏడ్చింది. ఆమె ఆ పనిలో వుండగానే వంటమనిషొచ్చి, ''బిర్యానీ తయారైపోయింది. వడ్డించెయ్యమంటారా?'' అంది.

అమల ఛర్రుమంటూ లేచి, తలగడని ఆమెమీదకి విసిరింది. ''ఇల్లుకాలి ఒకడేడుస్తుంటే, బొగ్గులేరుకోడానికొకడు బుట్టపట్టుకొచ్చేడని, రెండులక్షలు తగలడిపోతున్నాయని నేను ఏడుస్తుంటే, నువ్వు బిర్యానీ తయారుచేస్తావా? అసలు నిన్ను బిర్యానీ ఎవడు తయారు చెయ్యమన్నాడే?'' అంటూ వంటమనిషిమీద భద్రకాళిలా లేచింది.

''యిది మరీ బాగుందమ్మా, అయ్యగారు తయారుచెయ్యమన్నప్పుడు తయారు చెయ్యొద్దా?'' అంటూ విసురుగా వెళ్ళిపోయింది. అమల ఆ గదిలోనించి డ్రాయింగురూంలోకొచ్చి రాంబాబు ఏం చేస్తున్నాడో చూసింది. అతను ఓ క్వార్టరు బాటిల్ దగ్గర పెట్టుకుని విస్కీ తాగుతున్నాడు. ఆ దృశ్యం ఆమెకు అరికాలిమంటని నెత్తికెక్కించింది.



"నిండా మునిగిపోయి నేనేడుస్తుంటే మీరు విస్కీలు తాగుతూ బిర్యానీలు వండించు కుంటారా? మీకు ఎలా తాగబుద్ధవు తుందండీ" అంటూ అక్కడే మరో కుర్చీలో కూర్చుంది.

"బిర్యాని చెయ్యమని నేను పొద్దుటే చెప్పేశాను. ఈలోగా మన మెంబర్సంతా వచ్చి యిలా వార్నింగ్ యిచ్చి వెళ్తారని నేను ఊహించలే దు. యింక, ఈ మందు అంటావా? నేనేం ఒళ్ళు కొవ్వెక్కి తాగడంలేదు. విచారాన్ని తమాయించుకోడానికి తాగుతున్నాను" రాంబాబు చెప్పిన సంజాయిషీ అమలకి మరింత కోపం తెప్పించింది.

"విచారం మర్చిపోడానికి మందు ఒక్కటే మందయితే, మా ఆడోళ్ళమంతా ఏంతాగాలట? తాటిచెట్టు ఎందుకు ఎక్కేవంటే దూడగడ్డికోసం అని చెప్పినట్టుంది మీ సంజాయిషీ"

"విచారం గురించి ఒక్కటే కాదులే, ఈ అపాయంనించి తప్పించుకునే ఉపాయం గురించి కూడా ఈ మందు వేస్తున్నాను"

"ఆ విషయం ఆలోచించడానికి నలభై రూపాయలు ఖర్చు చేసి మందు తాగాలా? రేపు వెళ్ళి హారికతో మాట్లాడి, ఆ డబ్బు తిరిగి తెచ్చేసి, వాళ్ళ మొఖాన కొట్టేస్తే సరి"

"ఒక పెగ్గు పడగానే, కరక్టుగా నాకూ అదే అయిడియా వచ్చింది"

"ఆ అయిడియా వాళ్ళే యిచ్చి వెళ్ళేరుగా" అంటూ బెడ్రూమ్‌లోకి వెళ్ళి భోంచెయ్యకుండా పడుకుంది. రాంబాబు వెళ్ళి కాస్త బిర్యాని తినమని ప్రాధేయపడ్డాడు. ఈ సమస్య తీరేవరకు నాకు అన్నం సహించదని చెప్పేసింది. "తినడం మానేస్తే కష్టాలు తీరిపోతాయా? రేపా డబ్బు తెచ్చేసి, ఏనాడో ఆ రఘుపతిగాడికి, నాగేంద్రకుమార్‌కి బాకీవున్నాం అనుకుని ఓ దండం పెట్టేస్తే మనకింక ఏ సమస్యా వుండదు. హాయిగా కార్లో ఆఫీసుకి వెళ్ళి వచ్చేస్తుండొచ్చు"

రాంబాబు సముదాయింపుకి అమల కాస్త తేలికపడింది. కానీ కష్టాలనేవి ఎప్పుడూ కట్టకట్టుకొస్తాయనే సామెత వారిపట్ల మరోసారి నిజమైంది.

మర్నాడుదయం హారిక యింటికి వెళ్ళడానికి రాంబాబు, అమల బయలుదేరుతూ, కారు డోర్ తెరిచారు. తెరిచినవాళ్ళు తెరిచినట్టే వుండిపోయేరు. అందుక్కారణం లోపల కనిపించిన వ్యక్తి.

అతను... మార్వాడీ గోకుల్‌దాస్!

అతన్ని చూడగానే అతని దగ్గర తీసుకున్న పదిహేను వేలు, యీమధ్య అతను కొన్నాళ్ళుగా అతనికి వడ్డీ కూడా కట్టని విషయం వాళ్ళకి గుర్తొచ్చింది. వారిద్దరూ అతనికి నమస్కరించడానికి ముందే, అతనే నవ్వుతూ నమస్కారం చేశాడు.

"ఆ భగవంతుడు మీకు చాలా చాలా కష్టాలు తెచ్చిపెట్టేడని విన్నాం సాబ్! దాంతో మా మార్వాడీ గుండె, నిప్పులమీద పెట్టినవెన్నమాదిరి కరిగిపోయింది సాబ్! మీరిద్దరూ చిన్నవాళ్ళు. మీ లేతభుజాలమీద యిన్ని కష్టాలు పెట్టడం ఆ భగవాన్ శ్రీకృష్ణకి న్యాయం కాదు. అయినా పెట్టేశాడు. ఆ కష్టాలవల్లే నాకు వడ్డీ కూడా కట్టలేకపోయేరని నేను గ్రహించేనండి" అంటూ రుమాలుతో కళ్ళు ఒత్తుకున్నాడు. అతని జాలిగుండె చూసి, ఆ దంపతులు ఆశ్చర్యంగా ఒకర్నొకరు చూసుకున్నారు.

"మీరు చాలా మంచివారు, దయార్ద్ర హృదయులు కాబట్టి మీలాంటివారు మా బాధల్ని అర్థంచేస్కుని ప్రత్యేకంగా పరామర్శించడానికొచ్చేరు. మీలాంటివారు దేవతల్లో వుంటారేమోగాని, మార్వాడీల్లోను, కాబూలీవాలాల్లోనూ వుండరనుకుంటా" అన్నాడు రాంబాబు చాలా ప్రేమ వ్యక్తంచేస్తూ.

"మా మిగతా షావుకార్లు కూడా నా గురించి అలాగే అంటుంటారు సాబ్. మీరు నా అప్పు యింత వేగంగా చెల్లించకండి సాబ్. వడ్డీ కూడా కట్టొద్దు సాబ్. రెండులక్షల సమస్య మిమ్మల్ని బాధపెడుతున్నప్పుడు, మీరేం నా బాకీ చెల్లించగలరు. ఓ మూడునెలలు టైమ్ తీస్కోండి"

"థేంక్సండి, మెనీ మెనీ థేంక్సు"

"ఈ కారుని మీరిప్పుడు మెయిన్‌టైన్ చేయడం కూడా కష్టమే కాబట్టి ఈ కష్టం కూడా మీకు వుండకుండా దీన్ని నేను తీసుకువెళ్తున్నాను"




## బుల్లినేస్తాలు

ఇంగ్లండ్‌కి చెందిన క్లేర్‌ఎల్స్‌కి, నత్తల్లా కన్పించే 'ట్రీక్రాబ్స్'కి ఏవేవో ముద్దుపేర్లు పెట్టుకుని పెంచుకోవడం హాబీ. తీరుబడివేళల్లో వాటితో ఆడుకోవడం, వాటిని తన బుగ్గలమీద షికార్లు చేయించడం ఆమెకిష్టం. ఇలాంటి ప్రాణులు ఆమె దగ్గర ఎనిమిదివరకూ ఉన్నాయట. ఫొటోలో కన్పించే దానిపేరు విలియం. "విలియమ్" అని పిలువగానే గుల్లలోంచి తల బయటపెట్టి చూస్తుందట ఈ గడుసు పిండం.

సచిత్ర విచిత్రం

రాంబాబు, అమల అదిరిపడ్డారు.

"మూడునెల్లపాటు దీన్ని నా యింటి ముందే పెట్టుకుంటాను. ఎలాగూ, ఆ గడువు లోగా, నా బాకీ, వడ్డీ యిచ్చి దీన్ని విడిపించు కుపోతారనుకోండి. ఒకవేళ ఆ కృష్ణభగవాన్ మీకింకా కష్టాలు పెడితే, మూడునెల్ల తర్వాత నేనే దీన్ని వాడుకుంటాను. మరీ... దీన్ని వాడకుండా నెలలతరబడి వుంచేస్తే యిది పాడైపోతుందిగదా"

ఆ దంపతులు ఆశ్చర్యంనించి తేరుకోక ముందే, ఆ మార్వాడీ రాంబాబు చేతిలోని తాళం తీస్కోవడం, కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోవడమూ జరిగిపోయింది. మెత్తమెత్తగా, చల్లచల్లగా మాట్లాడుతూనే మార్వాడి తమకి ప్రియాతిప్రియమైన కారుని లాక్కుపోయేడే అని రాంబాబు బాధపడిపోయేడు. అమల కూడా అతన్తో సమానంగా బాధపడుతూనే, అదనంగా మరికొంత బాధపడింది. అదేమిటంటే, సరిగ్గా హారిక యింటికి వెళ్ళేటప్పుడే ఆ మార్వాడీ కారు లాక్కున్నాడు. ఏ వ్యక్తిదగ్గరైతే తను గొప్పలు ప్రదర్శించడానికి కారు కొన్నదో, సరిగ్గా ఆ వ్యక్తి యింటికి వెళ్లేటప్పుడే కారు లాక్కోవాలా? సరే... ఆటోలో వెళ్ళి తమ కారు మధ్యదారిలో ఆగిపోయిందని చెప్పొచ్చులే అనుకుంటూ యిద్దరూ ఆటోలో బయలుదేరారు.

హారిక ఆ దంపతుల్ని సాదరంగా రిసీవ్ చేసుకుంది. టిఫిను, కాఫీ యిచ్చి సత్కరించిందేతప్ప, కారులో రాకుండా ఆటోలో వచ్చేరేమని ఆమె అడగనూలేదు, అమల ఫలానా కారణంవల్ల వచ్చేం అని చెప్పనూలేదు. చీటీపాట విషయంలో వచ్చిన కొండంత యిబ్బందిగురించి చెప్పకుండా మాకు అర్జంటుగా డబ్బు అవసరం వచ్చింది. ఓ రెండుమూడువారాల్లో మా రెండులక్షలూ మాకు తిరిగొచ్చే ఏర్పాటు చెయ్యమనిమాత్రం, వీలున్నంతగా నవ్వుతూనే అడిగింది.

"అలాగే చెప్పిచూస్తాను" అంటూ తన చినమావయ్య గారింటికి ఫోన్ చేసింది. ఎవరితో మాట్లాడిందోగాని, "వెంటనే ఓసారి మేనేజర్ని తీస్కుని రా" అన్జెప్పి ఫోన్ పెట్టేసింది.





పావుగంట తర్వాత ఆమె మరిది, తన మేనేజర్ని తీస్కుని కారులో వచ్చేడు. హారిక మూడోమామగారుమాత్రం రాలేదు. అమల ఏం చెప్పిందో తన మరిదికి హారిక తెలియజేసింది. ఆ అబ్బాయి తన మేనేజరువైపు చూశాడు. అతనికింకా బిజినెస్ విషయాలు బుర్రకెక్కలేదుకాబట్టి, ఆ విషయాల్లో మేనేజరు బుర్రే మాట్లాడుతుంది.

"ఇచ్చేద్దాం మేడమ్" అన్నాడు మేనేజరు వినయంగా.

"ఇచ్చేద్దామంటే కాదు, అమలకి ఆ డబ్బుతో చాలా అవసరం వుందట. రెండుమూడు వారాల్లో కావాలంటోంది" అంది హారిక సిన్సియర్‌గా.

"యింత వేగం యివ్వడానికి అవకాశం లేదు మేడమ్. ఆ డబ్బుని బిజినెస్‌లో పెట్టేం. ప్రస్తుతం బిజినెస్సు చాలా నష్టంలో నడుస్తోంది. పైగా, షేర్‌మార్కెట్లో మనం పెట్టిందాంట్లో పాతిక ముప్పైలక్షలదాకా నష్టం వచ్చింది"

మేనేజరు వినయంగానే చెప్తున్నా అమలకి మాత్రం ఒళ్ళంతా కంపరం పుట్టుకొచ్చింది.

"యిప్పుడు వీలుకాకపోతే ఎప్పుడు యివ్వగలరో చెప్పండి. వచ్చేనెల మొదటివారం యివ్వగలరా?" రాంబాబు అసహనంగా అడిగాడు.

"కుదరదండి. ఓ పదినెలలయినా ఆగాలి"

రాంబాబు మేనేజరుమీద కస్సుమంటూ లేచాడుగాని, హారిక అతన్ని శాంతపరిచి, మేనేజరుతో మాట్లాడింది.

"మరీ పదినెలలు ఎందుకండి?"

"ఏంచెయ్యమంటారు మేడమ్. మీ చిన మావయ్యగారు బతికుండగా చాలా అప్పులు చేసేరు. వాళ్ళంతా కోర్టుకెళ్ళి డిక్రీ తీసుకొచ్చేరు. ముందు వాళ్ళ అప్పు తీర్చాలిగదా"

"అంటే, కోర్టుకెళ్లినవాళ్ళ అప్పులు ముందు తీరుస్తారన్నమాట. అలాగైతే మేమూ కోర్టుకి వెళ్తాం" అమల ఆవేశపడుతూ అంది.

"మీరు కోర్టుకెళ్ళడంవలన ప్రయోజనం వుండదు" మేనేజరు అదే వినయం ప్రదర్శిస్తూ చెప్పేడు.

"ఎందుకుండదు?"

"మీకు రాసిన ప్రో నోటు చెల్లదు"

"ఏం, ఎందుకు చెల్లదు?" ఈ ప్రశ్న హారిక అడిగింది.

"వీళ్ళ ప్రోనోటుమీద సంతకం చేసింది మీ మూడో మావయ్యగారు మేడమ్. ఆయనకి గత ఆరేడునెల్లుగా మతి చలించి, మెంటల్ హాస్పటల్లో వున్నారు కదండి. మతిస్థిమితం లేనివాళ్ళ సంతకాలు చట్టప్రకారం చెల్లవు మేడమ్"

రాంబాబు, అమలల నెత్తిమీద రెండు వందల బాంబులు ఒకేసారి పడినట్టుగా అదిరిపడ్డారు. 'ఇదంతా తెలిసే ఆయనచేత సంతకం చేయించేవా?' అన్నట్టుగా యిద్దరూ హారికవైపు చూశారు.

ఇప్పుడు హారిక కంగారుపడింది. "నాకా సంగతే తెలియదు అమలా! వరసకి ఆయన నా మూడో మామగారుగాని, వాళ్ళతో మాకు రాకపోకలవేం లేకపోవడంవల్ల ఆ యింట్లో ఏం జరుగుతుందో వాళ్ళూ చెప్పరు, మా ఆయనా అడగరు" అంటూ మళ్ళీ మేనేజర్ని రెట్టించి అడిగింది, "ఆయన హాస్పటల్లో వుంటే ఆరోజు సంతకం చెయ్యడానికెలా తీసుకొచ్చేరు?"

"అప్పుడు ఒంట్లో కాస్త నయంగా వుండడం ఒక కారణం మేడమ్. రెండోకారణం ఏమిటంటే, ఆ ముందురోజే మీ చిన్నత్తగారి వర్ధంతి. ఆ కార్యక్రమం కాస్త ఆయన చేతుల మీదుగానే చేయించాలని, మీ మావయ్యగారి కొడుకు చెప్తే నేనే హాస్పటల్నించి తీసుకొచ్చేను. కానీ, ఆ మర్నాడే ఆయన పిచ్చి ముదిరేసరికి మళ్ళీ హాస్పటల్లో వేసేశాం"

ఆ సంజాయిషీ విని హారిక మ్రాన్పడిపోయింది. కానీ, ఆమెకు తెలిసే యిదంతా జరిపించిందని అమల భావించింది. కావాలనే యిలా చేసి, నన్ను కష్టాల్లో యిరికించేవ్ అంటూ చాలా ఆవేశంగా, నిష్టూరంగా మాట్లాడింది.

"నువ్వు నన్ను అపార్థం చేసుకున్నావ్! వాళ్ళకి ఎక్కడైనా రెండులక్షలు అప్పుకావాలి. ఆ డబ్బు నీదగ్గర వుందని తెల్సింది. ఆ వడ్డీ ఏదో నువ్వే పొందితే బావుణ్ణని, నీచేత యిప్పించేనే గాని, నిన్ను మోసంచెయ్యాలని కాదు. అయినా, నీడబ్బు ఎక్కడికీ పోదు. కాస్త ఆలస్యమైనా నీడబ్బుని నేను యిప్పిస్తాను"

"ఎప్పుడు యిప్పిస్తావ్? మా యిద్దరి ఉద్యోగాలు పోయినప్పుడా? మేమిద్దరం జాయింటుగా జైలుకెళ్ళినప్పుడా?" అంటూ అమల దుఃఖావేశాల్తో మాట్లాడింది. అలా మాట్లాడటంలో, తాము పడిన యిరకాటం గురించి కూడా చెప్పేసింది. ఓ అరగంటసేపు వాదోపవాదాలు, ఏడుపులు, పెడబొబ్బలమధ్య, హారిక డబ్బువిషయంలో మరోసారి భరోసా యిచ్చాక ఆ అధ్యాయం ముగిసింది.

"పోనీ ఈ నెల వడ్డీ అయినా మా ముఖంమీద కొట్టండి" అన్నాడు రాంబాబు. కనీసం ఆ పదివేలయినా వస్తే మార్వాడీకిచ్చి, మిగిలిన అయిదువేలు తొందర్లోనే యిస్తామని చెప్పి కారు తెచ్చుకోవచ్చుకదా అని అతని ఉద్దేశం.

"క్షమించండి, ఈ నెల వడ్డీ కట్టడానిక్కూడా మాదగ్గర కేష్ బాలెన్స్ లేదు" ఆ మాట చెప్పిన మేనేజర్ని రాంబాబు కొట్టబోయి ఆగిపోయాడు.



ఎవడిచేతనైనా తన్నులు తిన్నట్టుగా కలవస్తే, ఆ కల గురించి ఎవడూ యితరుల్తో చెప్పుకోలేడు. ప్రస్తుతం రాంబాబు, అమల పరిస్థితి కూడా అలాగే తయారయింది. తమ కష్టాన్ని యితరులకి చెప్పుకుని సానుభూతి పొందితే, బరువెక్కిన మనసుకింత వూరటకలిగి తేలికపడుతుంది. కానీ, యిది ఎవరికీ చెప్పుకోలేని కష్టమైకూర్చుంది.

ఏమిటీ యిలా జరిగింది? ఒక్కటి కాదు,

రెండు కాదు. మనం తలపెట్టినవన్నీ యిలా తగలడిపోయాయేమిటి? నాగేంద్రకుమార్, రఘుపతి చీటీడబ్బు లక్షల్లో అందుకుని దగా చేసి వెళ్ళిపోవడం ఏమిటి? వాళ్ళకి మనమేం అపకారం చేశాం? మిగతా మెంబర్సు జరిగిందంతా తెల్సుకుని మనమీద జాలిపడకుండా, ఖచ్చితంగా డబ్బు జమకట్టమని అంతలా ఒత్తిడి చేయడమేమిటి? డబ్బు కట్టకపోతే వుద్యోగాలు తీయించేస్తామని బెదిరించడమేమిటి? పిచ్చివాడని తెలియక అతనికి రెండులక్షలు అప్పిస్తే, వాళ్ళు తిరిగి సమయానికివ్వకపోవడం ఏవిటి? అసలా డబ్బు తిరిగొస్తుందో రాదో! హారికమీద నమ్మకంతో వస్తుందని అనుకోవాలి తప్ప రాకపోతే మనం చెయ్యగలిగిందేమీ లేదు. ఇలా జరగడానికి మనమీద ఎవరైనా చేతబడిలాంటిదేమైనా చేశారా? దేవుడికి మొక్కిన మొక్కు ఏదైనా మర్చిపోతే, ఆ కీడు ఇలా కొట్టిందా? పోనీ యిలా అనుకోడానికైనా తమకి చేతబడి చేయించేటంత శతృవులు ఎవరున్నారు? అంత ద్రోహం ఎవ్వరికీ చెయ్యలేదే? ఏదేవుడికీ ఎప్పుడూ మొక్కుకోలేదు కాబట్టి, ఆ మొక్కును మర్చిపోయేమన్న ప్రసక్తే లేదు!

ఇలా ఆ దంపతులు దేవుడి గురించి, మొక్కల గురించి, పిశాచాల గురించి, చేతబడుల గురించి పరిపరి విధాల ఆలోచించేరుగాని, యిలా జరగడానికి, తాము చేసిన తప్పు ఏమైనా వుందా అని ఆత్మపరిశీలన చేస్కోలేదు. తమ ఆశలు అంచులు దాటడంవల్ల, అక్కరకురాని ఆలోచనలు చేసి, అనవసరమైన ఆర్భాటాలు చేసేమేమోనని ఒక్కక్షణం గూడా ఆలోచించలేదు.

అమల ఆవిధంగా ఆందోళన చెందుతున్న సమయంలోనే, పొట్టిబుల్లెమ్మ వచ్చి, ఆ నెల జీతం అడిగింది. అమల ఆమెను తిట్టబోయి తమాయించుకుని "నీ జీతం తర్వాత యిస్తాను" అంది. ఆమె ఒప్పుకోలేదు. ఈ నెల్లో యిప్పటికే చాలా లేట్ అయిపోయింది. పైగా యిప్పుడా డబ్బుతో అర్జంటు పనుందని ఆమె రెట్టించి అడిగేసరికి అమలకి సహనం చచ్చిపోయి ఇంగ్లీషులో తిట్టి, ఆవిడకివ్వాల్సిన డబ్బు తీసి ముఖానకొట్టి, నేను చీటీ పాట స్టాప్‌చేసేశాను. రేపట్నించి నువ్వు పనిలోకి రానక్కర్లేదు అని కటువుగా చెప్పింది. "చూడండమ్మగారూ, మీరు తిట్టినంతమాత్రంచేత మీరు పెద్దోళ్ళయిపోలేదు. నేను చిన్నదాన్నయిపోలేదు. అయినా, మీకీ చీటీ లెందుకమ్మా? పులిని చూసి నక్క వాతలెట్టుకున్నట్టు, ఆ రాజరత్నమ్మని చూసి మీరు చీటీలు ఆరంభించారు. కానీ, యిప్పుడేమైంది? హాయిగా వుద్యోగాలు చేస్కోడం మానేసి..."

"పటప్ అండ్ గెటవుట్" అమల అరిచిన అరుపుకి పొట్టి బుల్లెమ్మ భయపడిపారిపోయింది. ఛీ, చివరకి బుల్లెమ్మకూడా నాకు నీతులు చెప్పేదైపోయింది అంటూ తనని తనే తిట్టుకుంది. వంట మనిషిని పిల్చి, రేపట్నించి నువ్వూ పనిలోకి రావద్దని చెప్పేసింది. రాంబాబు, అమల మంచంమీద పడుకున్నారుగాని, యిద్దరకీ నిద్ర పట్టలేదు. చీకట్లో నిశ్శబ్దంగా రెక్కలు చాచుకు తిరుగుతున్న ఫేన్‌ని చూస్తూ వుండిపోయి, తెల్లవారుఝామున ఎప్పుడో పడుకున్నారు. వుదయం ఎనిమిది దాటేక అమల నిద్ర లేచింది. కళ్ళు మండడంతోపాటు ఒళ్ళు కూడా కాలుతున్నట్టనిపించి, లీవ్‌లెటర్ రాసి రాంబాబుకిచ్చి మళ్ళీ నిద్రపోయింది. రాంబాబు కూడా సెలవుపెట్టి యింట్లోనే వుందామనుకున్నాడుగాని యింట్లో వుంటే ఒకర్నొకరు చూసుకుంటూ బాధపడ్డం తప్ప చేసేదేమీలేదని ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

ఆరోజు ఆఫీసులో ఎక్కువగా పనిలేదు. పైగా రాత్రంతా నిద్రలేకుండా ఆలోచిస్తూ గడపడంవల్ల రాంబాబుకి కాస్త తల నెప్పిగా వున్నట్టనిపించి, ఓ గంట ముందుగానే యింటికి బయలుదేరాడు. లోపలకెళ్ళబోతుండగా, లోపలనించి అమల ఎవరిమీదో బిగ్గరగా కేకలు వేయడం వినిపించి, గుమ్మంలోనే ఆగిపోయేడు. లోపల ఎవరో మగవ్యక్తే మాట్లాడుతున్నాడు. ఆ గొంతు కూడా ఎప్పుడో, ఎక్కడో విన్నట్టే అనిపించిందిగాని, కరక్టుగా గుర్తురాలేదు. ఓ నిమిషం గడిచేక, అమల తన తండ్రితోనే గొడవ పడుతోందని గ్రహించాడు.

"అప్పుడు నువ్వు నెలకి అయిదు వందలు యిస్తానన్నా వద్దన్నాను. ఇప్పుడు చేతిలో డబ్బు ఆడక అడుగుతున్నాను" అంటూ ప్రాధేయప




డుతున్నాడు తండ్రి! "నువ్వు ఏ కారణంతో అడుగుతున్నా సరే, నా దగ్గర యిప్పుడు డబ్బులేదు. రేపు జీతాలు అందేకైనా, నీకు ఒక్క రూపాయి కూడా యివ్వడానికి వీలవదు. ఆఫీసునించి ఆయనొచ్చే టైమయింది, నువ్వెళ్ళు నాన్నా" అంటోంది అమల కర్కశంగా. అలాంటి సమయంలో తను లోపలకెళ్తే యిద్దరూ యిరకాటంలో పడతారని గ్రహించి రాంబాబు గబగబా నడుచుకుంటూ ఆ వీధిలో వున్న ఓ కిళ్ళీ దుకాణం దగ్గరకి వెళ్ళి నిలబడ్డాడు.

ఓ అయిదు నిమిషాల తర్వాత అచ్యుతానంద ఆ యింట్లోనించి బయటకొచ్చి, యిటువైపే రాసాగాడు. రాంబాబు అతన్ని సులభంగానే గుర్తుపట్టేడు. అతనొకప్పుడు తనకి జ్యోస్యం చెప్పిన అచ్యుతానంద! అంటే... అతనే అమల తండ్రా? రాంబాబు మస్తిష్కంలో ఆలోచనలు రేసుగుర్రాల్లా పరుగులు తీశాయి.

అమలని తను పెళ్ళిచేస్కోవాలని, కావాలనే ఆనాడు అలా జోస్యం చెప్పేడా?

అందుకేనా, అమల తన ఆస్తంతా కోర్టులో వుందని అబద్ధమాడింది? అచ్యుతానంద కిళ్ళీ కొట్టుని దాటుకుని వెళ్తుండగా, రాంబాబు, తన ఆవేశాన్ని అదుపులో పెట్టుకుని, వ్యంగ్యంగా పలకరిస్తూ, రెండుచేతుల్తోనూ నమస్కారం చేశాడు.

"నమస్కారం గురువుగారూ"

అచ్యుతానంద ఆగాడు. రాంబాబుని చూసి ఖంగుతిని, గబగబా వెళ్ళబోయేడుగాని, రాంబాబు అతన్ని చెయ్యిపట్టుకుని ఆపుచేశాడు.

"ఏమిటి గురువుగారూ, అలా చూసి వెళ్ళిపోతున్నారు. నేను గుర్తులేనా? నేనండీ రాంబాబుని! నాకు 'అ'కారంతో పేరు ప్రారంభమయే అప్సర్సతో ముడిపడుతుందని, ఆ తర్వాత నా దశ తిరిగిపోయి శ్రీకృష్ణదేవరాయల్లా చక్రం తిప్పేస్తానని చెప్పేరు, గుర్తుందా? మీరు చెప్పినట్టే అమలనే అమ్మాయితో పరిచయమూ అయింది, పెళ్ళీ అయింది. కాకపోతే మా ఆవిడకి ఓ కోటి రూపాయిల ఆస్తి కోర్టులో వుండి పోయిందట. అదెప్పుడొస్తుందో మీనోటితో చెప్పేస్తే, చేత్తో తిప్పడానికి రేపే ఓ చక్రం కొనేస్తాను" అంటూ రాంబాబు అతన్నే సూటిగా చూస్తూ మాట్లాడుతుంటే, అతనికి అసలు విషయం తెల్సిపోయిందని గ్రహించి, అచ్యుతానంద నేరస్థుడిలా తలదించుకుని "నన్ను క్షమించు బాబూ" అన్నాడు.

"దేనికీ క్షమించడం? మీ టైము బాగులేక యీ వూర్లో వుండిపోయేరుగాని, మీకున్న జ్యోతిషశక్తికి ఢిల్లీలో ఏ ఫైవ్‌స్టార్ హోటల్లోనో వుంటూ ఏ ప్రైమ్‌మినిస్టరుకో జోస్యంచెప్పాల్సిన వారు గదండి! మా యిల్లు యిక్కడికి దగ్గర్లోనే వుంది. రండి, నా దశ తిప్పేసిన భాగ్యలక్ష్మిని మీకు చూపిస్తాను" అంటూ చెయ్యి పట్టుకుని తీసుకెళ్ళబోయేడు. అచ్యుతానంద తన చేతిని విడిపించుకుని, రాంబాబు రెండు చేతులు పట్టుకుని, నన్ను క్షమించుబాబూ అంటూ జరిగిందంతా వివరించాడు. అందులో చలపతి పాత్ర ఎంత వున్నది కూడా చెప్పేసి "మేం తప్పుచేస్తే క్షమించుబాబూ! నేను కట్నాలు యిచ్చి పెళ్ళి చెయ్యలేని ఆడపిల్ల తండ్రిని. నా అశక్తతే నా చేత అబద్ధం ఆడించింది. వెయ్యి అబద్ధాలాడి ఓ పెళ్ళి చెయ్యమన్న సామెతను నేనూ ఆశ్రయించక తప్పలేదు. ఏదో ఒక ఆశ చూపిస్తే తప్ప నువ్వూ, మా అమల ఒకర్నొకరు యిష్టపడరని అలా జ్యోసం చెప్పేనే తప్ప, మా ఆస్తులేవో కోర్టులో వున్నాయని అమలతో నేను చెప్పించలేదు. అది, దాని స్వయం కృతాపరాధమే! నా అశక్తతని గమనించి మీ నాన్నే యీ దారి చూపించి, నన్ను వుద్ధరించాడు. దయచేసి అతన్నేమీ అనకు" ఆ మాటలు పూర్తిచేసేసరికి అతని కళ్ళు వర్షిస్తున్నాయి.

రాంబాబుకి ఆవేశం తగ్గింది. అచ్యుతానంద మీద జాలి కలిగింది.

"మీరేం బాధపడకండి... వివాహాలు దైవనిర్ణయం ప్రకారం జరుగుతాయని నమ్మేవాళ్ళలో నేనూ ఒకణ్ణి! భగవంతుడి నిర్ణయం ఏమిటో తెల్సుకోకుండా, అంతా మన యిష్టప్రకారమే జరుగుతోందని భ్రమపడ్డం కేవలం మూర్ఖత్వమేనని, నా విషయంలో మరోసారి నిరూపణయింది. మీ అమ్మాయికి పెళ్ళి చెయ్యలేని అశక్తత మీచేత నాకు అబద్ధపు జ్యోతిషం చెప్పించింది. మీకూ మీకూ వున్న స్నేహాన్ని వియ్యంగా మార్చుకోవాలనే సదుద్దే

శ్యంతో మానాన్న మీచేత కావాలనే అలా చేయించాడు. ఆలోచించి చూస్తే మీవరకూ మీరు కరక్టే! ఎటొచ్చీ, మీ అమ్మాయి తనకేవో ఆస్తులున్నాయని అబద్ధం చెప్పడం తప్పు! ఆవిడ మాటలు విని, నేనూ రెచ్చిపోయి అబద్ధాలాడ్డం నా తప్పు! అసలు, మా నోటి దురదే మాకిన్ని కష్టాలు తెచ్చిపెట్టింది'' అంటూ రాంబాబు సిన్సియర్‌గా బాధపడుతూనే చెప్పాడు.

''కావాలంటే, మీ యింటికొచ్చి, అమ్మాయి సమక్షంలో మరోసారి క్షమాపణ చెప్తాన''న్నాడు అచ్యుతానంద ''వద్దులెండి... సంవత్సరంపాటు ప్రేమగా పెంచుకున్న ఓ అబద్ధపు పూల మొక్కని, ఒక్క క్షమాపణతో పీకకూడదు. దానిక్కూడా ఓ పద్ధతి వుంది'' అంటూ అతన్ని పంపేసి, రాంబాబు యింటికి వెళ్ళాడు.

రాంబాబు వెళ్ళేసరికి అమల మంచంమీద పడుకుని ఏదో వీక్లీ చదువుతోంది. అతను బట్టలు మార్చుకుంటూ, చాలా యధాలాపంగా అడిగాడు.

''మీ కేసు వాదిస్తున్న లాయరు పేరేమిటన్నావ్?'' అమల దిగ్గుమని లేచి కూర్చుంది.

''ఎందుకు?''

''ఎందుకేమిటి? కోటి రూపాయిల ఆస్తి కోర్టులో ముక్కిపోతుంటే నువ్వు ఎన్నాళ్ళని వెయిట్‌చేస్తావు? ఓసారి ఆ కేసు పొజీషన్ ఏమిటో కనుక్కుందామని''

పెళ్ళయింతర్వాత రాంబాబు ఎప్పుడూ కేసు గురించిగాని, ఆస్తి గురించిగాని అడగలేదు. అలాంటిది, యిప్పుడెందుకు అడుగుతున్నాడు? అమలకేం అర్థంకాలేదు. అసలు, తనే యివాళ అతని అజ్ఞాతవాసం ఎప్పుడు పూర్తవుతుందని అడగాలనుకుంది. కానీ, యీలోగా అతనే ఆస్తి టాపిక్ ఎత్తాడు. ఏమైనాసరే, యివాళాసంగతి తేల్చుకోవాలి. లేకపోతే రెండు లక్షలు సంపాదించడానికి మరో మార్గమేం కనబడ్డంలేదు.

''మీ అజ్ఞాతవాసం ఎప్పుడు పూర్తవుతుంది?''

''నేను అడిగింది నీ కోర్టు కేసు గురించి''

''నా చిన్నప్పటించీ ఆ కేసు అలా సాగుతూనే వుంది. యిప్పుడు దాన్ని గురించి ఎందుకు? మీరు మీ పెద్దవాళ్ళని ఎప్పుడు కల్సుకుంటారో చెప్పండి''

రాంబాబు సోఫాలో వెల్లికిలా పడుకుని, కాలుమీద కాలు వేసుకుని, వూపుతూ మాట్లాడుతున్నాడు.

''మా నాన్నగారు యివాళ ఆఫీసుకి ఫోన్ చేశారు. మీ ఆవిడకా కోటి రూపాయిలూ రాగానే, ఆ మూట పట్టుకొచ్చెయ్యండి, ఆ మూటలోనే మన ఆస్తి నాలుగు కోట్లూ వేసేసి మొత్తం మూట మీ నెత్తికెత్తేస్తానూ అన్నారు. అందుకే నీ కోర్టు కేసు గురించి అడుగుతున్నాను''

అదంతా అబద్ధమని అమల పసిగట్టింది. ''వేళాకోళం కాదు. నేను సీరియస్‌గా అడుగుతున్నాను. మీ అజ్ఞాతవాసం ఎప్పుడు పూర్తవుతుంది?''

''మరో రెండేళ్ళు పోయేక''

''మొదట్లోనూ రెండేళ్ళే అన్నారుగదా''

''అలా అన్నానా? లేదు అమలా, నాలుగేళ్ళనే అన్నాను''

''నో, నాకు బాగాగుర్తు. రెండేళ్ళనే అన్నారు. యిప్పుడు మన పెళ్ళయ్ ఏడాది కావస్తోంది. యింకా ఎన్ని రోజులు ఆగాలి?''

''మరో రెండేళ్ళు ఆగక తప్పదు. నిజానికి నా అజ్ఞాత వాసం రెండేళ్ళే! కానీ, మా నాన్నగారి యిష్టానికి వ్యతిరేకంగా నిన్ను పెళ్ళిచేసుకున్నాను గదా! అలా చెయ్యడం మా వంశాచారానికి విరుద్ధమట. అంచేత, మా నాన్నగారు మరో రెండేళ్ళు పొడిగించారు''

అతను అబద్ధం ఆడుతున్నాడని అమల గ్రహించేసింది. అతను ఆమె ముఖంలో వస్తున్న మార్పుల్ని గమనిస్తూనే చెప్పుకుపోతున్నాడు.

''పోన్లే అమలా! వంశాచారానికి కట్టుబడి, ఆస్తికి ఆశపడి, మా నాన్నగారు సెలక్ట్ చేసిన అమ్మాయిని చేస్కునేబదులు నాకు నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకున్నానన్న తృప్తి మిగిలింది. ఈసారి మా నాన్నగారు ఫోన్‌చేస్తే, నాకు మీరు వద్దు, మీ ఆస్తీ వద్దని చెప్పేస్తాను. ఇవాళకాకపోతే రేపయినా, నీ ఆస్తి కోటి రూపాయిలూ మనకొస్తాయిగా. అది చాలదామనకి?''




అమల ఆవేశం పట్టలేక అతన్ని నిలదీసింది. వాదన పెరిగింది. అబద్దాలు గాల్లో కలిసిపోయి, కళ్ళముందు నిజం నాట్యమాడింది. అమల కంటికి, తన అదృష్టసౌధం పగిలిపోయి, శిథిలశకలాలు గాల్లో ఎగురుతున్న భయంకర దృశ్యం కనబడుతోంది!

"అయితే నన్ను మోసగించేరా?" అమల వుక్రోషంగా, వుద్వేగంగా అడిగింది.

"నువ్వు చేసిందాన్నేం అంటారు? నువ్వో గొప్పదాన్నని నాతో చెప్పేవు. నేనూ గొప్ప వాడిని కాకపోతే నాతో స్నేహం చెయ్యవని నేనూ అబద్ధం చెప్పేను. సరిపోయిందిగా! మోసమంటూ జరిగితే, ఆ పని యిద్దరమూ చేసేం. కాకపోతే ఆరంభించింది నువ్వు, కంటిన్యూ చేసింది నేను! అందువల్ల మనం మన పెద్ద వాళ్ళకి దూరమయేం. నేను మా నాన్నకి చెల్లెలికి దూరమైనా వాళ్ళకి నెలకో అయిదు వందలు పంపిస్తున్నాను. నువ్వు ఆ పనీ చెయ్యడం లేదుగా! నేనేదో ఘనకార్యం చేసేనని చెప్పడం లేదు. నువ్వు ఆడిన అబద్ధంవల్ల, మీ నాన్న గూడా డబ్బుకి యిబ్బంది పడుతున్నాడు. మీనాన్నెవరో నాకు తెల్సింది కాబట్టి, యిప్పటికైనా మనం కప్పుకున్న రంగుల పరదాలు తీసేసి, నిజం మాట్లాడుకోవడం మంచిది. మనిద్దరం తేలు కుట్టిన దొంగలమే"

రాంబాబు ఆపకుండా ఓ పావుగంటసేపు చెప్పిన మాటలతో అమల బుఱ్ర తిరిగిపోయింది. ఆమె మనసులో కొలువున్న రంగు రంగు బొమ్మలన్నీ కరిగిపోతున్నాయి. ఎక్కడో ఆకాశపుటంచులమీద, అప్సర్సల సన్నిధిలో నిలబడిన తనని ఎవరో కిందకి తోసేసినట్టుగా వణికింది. నింగినించి, నిశీధి పర్వతాలమీద జారుకుంటూ సుడిగుండంలో పడినట్టు వుక్కిరి బిక్కిరయింది.

రెండు లక్షలు ఎలా సంపాదించాలన్న బాధకంటే, వెయ్యి రెట్లు బాధ కలిగించిందా నిజం!

అదీ అమల ఏనాడూ కోరుకోని దినం!

వంచన చేసి బాగుపడిన వారున్నారేమో గాని, ఆత్మవంచనకి దిగి సుఖపడేవాళ్ళెవరూ వుండరని మరోసారి నిరూపించిన దినం!

★ ★ ★

చీకటి తెరలు ఎగిరిపోయి, వాటిస్థానంలో వెలుగురేఖలు వుదయించేయి. భ్రమల పొరలు తొలగిపోయి, వాస్తవాన్ని చూడ్డానికి అమల కళ్ళు తెరిచింది. కాలకృత్యాలు పూర్తయిందగ్గర్నించి, డబ్బు వేటకి పరుగులు తీసారా దంపతులు. ఇద్దరూ కలిసి తిరిగారు. అప్పు పుట్టలేదు. ఇద్దరూ విడివిడిగా తిరిగారు. అయినా అప్పు పుట్టలేదు. వాళ్ళ అవసరాలు తీరకపోయినా ప్రకృతి తన ధర్మాన్ని వదలలేదు. పగలు వెళ్ళి చీకట్లో కల్సిపోయింది. రాత్రి ఎనిమిది గంటల వేళ, రాంబాబు యింట్లో ఫోన్ మోగింది. అట్నుంచి చలపతి మాట్లాడుతూ "నీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి. నువ్వెప్పుడు ఒంటరిగా దొరుకుతావు?" అన్నాడు.

"యికమీదట నేను ఒంటరిగా దొరకనవసరంలేదు. మమ్మల్ని కలపడానికి మీ ముసలాళ్ళు చెప్పిన పిట్టకథలు, మేం ప్రేమించుకోడానికి ఆడుకున్న కట్టు కథలు అన్నీ నిన్నటితో కంచికో, కాశీకో వెళ్ళిపోయేయి. యిప్పుడు నువ్వు మా యింటికి రావచ్చు, వస్తావా?" అన్నాడు చాలా తాపీగా. చలపతి రెండుక్షణాలు ఆలోచించి "నేనొద్దు రేపు నువ్వే పదినిమిషాలు మనింటికే వచ్చెళ్ళు" అన్నాడు.

రాంబాబు తన పాత యింటికొచ్చేడు. జరిగింది చెప్పేడు. రాంబాబు ఆవేశం పట్టలేక రేఖని కొట్టడానికి అక్కడున్న ముక్కాలి పీట అందుకున్నాడు. కానీ రేఖ అప్పుడు యింట్లోలేదు. చలపతి, కొడుకుని తమాయించుకోమని చెప్తూ నిదానంగా అన్నాడు. "తప్పు చేసిందాన్ని కొట్టడం చంపడం మామూలేరా! అలాగయితే నేను నా యాభైఅయిదేళ్ళ జీవితంలో అయిదు వందల యాభైసార్లయినా చచ్చుండాలి. నిన్న నీతో ఫోన్‌లో మాట్లాడాక మీ మావయ్య అచ్యుతానందం దగ్గరకెళ్ళి మాట్లాడేను. జరిగిందంతా తెల్సుకున్నాను. రేఖని నేను సమర్ధించి మాట్లాడ్డంలేదు. అది తప్పే చేసింది. కానీ, నేనూ, నువ్వు, అమల చేసిన తప్పులకంటే అది చేసింది పెద్ద తప్పుగా నాకేం కనిపించలేదు. రెండు లక్షల రూపాయిలకోసం మీరు చేస్తున్నవేట గురించి అచ్యుతానందం చెప్పేక, నువ్వు యింత వేగం మీ చెల్లెలి పెళ్ళి చెయ్యలేవని నిర్ధారించుకున్నాను. నేను అస్సలు చెయ్యలేననుకో! చెల్లెలి

పెళ్ళికి ఓ లక్షరూపాయలు తీస్కురా అని నీమీద ఒత్తిడి తేవడం యీ సమయంలో బాగోదని గ్రహించే, నిన్న రాత్రి రేఖకి ఎబార్షన్ చేయించేను. శారదా క్లినిక్‌లో వుంది. సాయంకాలం వచ్చేస్తుంది. నీకు వీలు పడిన ప్పుడే ఆ నర్సయ్యా కొడుకుతో దాని పెళ్ళి జరిపించు. తండ్రిగా నీ యిబ్బందుల్లో నేను పాలు పంచుకోలేకపోయినా, నీ మీద పడ బోయే ఒత్తిడిని తాత్కాలికంగానైనా వాయిదా వెయ్యగలిగాను''

ఆలోచించి చూస్తే తన తండ్రి చేసింది సబబుగాను, సమయోచితంగానే తోచింది. ప్రస్తుత పరిస్థితుల్లో తనైనా యిలాగే చేసుండేవాడేమో! యింతకంటే మరోలా చెయ్యడానికి తన దగ్గర డబ్బేది? ఇప్పుడు తను సంపాదించవలసింది రెండు లక్షలు కాదు, మూడు లక్షలు! రాంబాబు చెల్లెల్ని చూడ్డానికి శారదా క్లినిక్కి వెళ్లామనుకున్నాడు గాని, వెళ్ళడం వలన ఆమెకు ఓదార్పు లభించకపోగా, తనని చూసి భయపడుతుంది, ఏడుస్తుంది. అది కాదు తనకి కావల్సింది. రాంబాబు ఆఫీసుకి బయలుదేరాడు.

ఆఫీసులో జలజాక్షికి హౌస్‌బిల్డింగ్ ఎడ్వాన్సు శాంక్షన్ చేసిన ఫైలు టైప్ చెయ్యడానికి రాంబాబు దగ్గరకొచ్చింది. ఆ ఫైల్ చూస్తూనే రాంబాబు మెదళ్ళో ఓ అయిడియా మెరిసింది

ఇల్లు కట్టుకోడానికి లోన్ పెడితే?

లక్షరూపాయలు వస్తాయి.

రెండులోన్సు పెట్టుకుంటే?

రెండు లక్షలు వస్తాయి!!

అతని ఆలోచన అక్కడితో ఆగిపోయింది. హాఫ్‌డే సెలవుపెట్టి యింటికొచ్చి, ఆలోచించ నారంభించాడు. రెండు లక్షలు కావాలంటే రెండు లోన్లు పెట్టాలి. కానీ భార్యాభర్తల్లో ఒక్కరికే లోన్ యిస్తారు. భార్యా భర్తలు విడివిడిగా పెట్టుకుంటే... రెండు లోన్లు యివ్వరు! మంచం మీద అటూఇటూ దొర్లుతూ ఆలోచించాడు. సాయంత్రం అయిదు గంటలవుతుండగా మెదళ్ళో ఓ అద్భుతమైన ఆలోచన వచ్చింది.

విడాకులు తీస్కుంటే?!

భార్యాభర్తలు ఎవరికివారుగా, విడివిడిగా వుండిపోతారు. అప్పుడు యిద్దరూ చెరో లోన్ పెట్టుకోవచ్చు. దానికి రూల్సు ఒప్పుకుంటాయి. అమల ఆఫీసునించి యింటికి రాగానే యీ అయిడియా చెప్పాడు. ఆమె క్షణంపాటు షాకై వుండిపోయింది. అయిడియా బాగున్నట్టుగా అనిపించినా, యిది హౌస్ బిల్డింగ్ లోన్ కోసం వేస్తున్న అయిడియా? లేక, తన వెనక ఆస్తి పాస్తులేవీ లేవని తెలిసిపోయింది కాబట్టి, తనని వదిలించుకోడానికి యీ పథకం వేస్తున్నాడా? ఏమో...! మగవాడి బుద్ధిని నమ్మలేం. తను జాగ్రత్తపడాలి.

''నో... యీ అయిడియా చాలా ఛండాలంగా వుంది'' అనేసింది. రాంబాబు చిన్నగా నవ్వుతూ, ఆమెను తదేకంగా చూస్తూ మంచంమీద కూర్చోబెట్టాడు.

''నా అయిడియా ఛండాలంగా లేదు బ్రహ్మాండంగా వుందని నీకూ తెలుసు. కాకపోతే బావుందని ఒప్పుకోడానికి నీ స్త్రీ సహజమైన భయం నీకు అడ్డొస్తోంది''

''నాకు భయమేమిటి?'' అమల గొంతులో ఆతృతే తప్ప, స్పష్టతే ధ్వనించలేదు.

''చూడు అమలా, గాలి పటం ఎంత మీదకి ఎగిరినా, దానికి ఆధారమైన దారం తెగిపోతే, అది నింగినించి జారుకుంటూ, ఏ తీగలకి చుట్టుకుంటుందో, ఏ బురద గుంటలో పడుతుందో దానికే తెలియదు. ఆడదాని జీవితమూ అంతే! అందులో చదువుకుని, వుద్యోగం చేస్కునే ఆడదానికి గూడా మినహాయింపులేదు. నేను మగాణ్ణి కాబట్టి, పురుషహంకారంతో యీ మాట చెప్పడం లేదు. నేను పురుషుణ్ణి, నువ్వు స్త్రీవి అయినా, సంపాదన పాయింటు వచ్చేసరికి యిద్దరం సమానస్థాయిలోనే వున్నాం. కాబట్టి, నేను నీకంటే అధికుడిగా మాట్లాడ్డం లేదు. నిజం చెప్పాలంటే నేను చెప్పిన అయిడియా నీకు బాగా నచ్చింది. అసలు, యీ అయిడియా నీకు రావాలి. కానీ నాకు వచ్చింది. ఈ అయిడియా నెపం పెట్టి నిన్ను వదిలేస్తానని నువ్వు భయపడుతున్నావ్. కానీ, అది నిజం కాదు. మనకొచ్చిన చీటీల గండంనించి బయటపడ్డానికి యిదొక్కటే మార్గంగా కనిపించింది కాబట్టి నీకు చెప్పేను.

ఈ అయిడియా పాటించకపోతే మనం బాకీలు చెల్లించలేం. చెల్లించకపోతే మనం నిరుద్యోగులుగా మారిపోతామో, జైల్లో ఖైదీలుగా మిగిలిపోతామో నా వూహకి అందడంలేదు. అంచేత మనం విడాకులు పుచ్చుకోవాలి. నిజంగా పుచ్చుకోం. పుచ్చుకున్నట్టు నటిస్తాం. నటిస్తూ అందర్నీ నమ్మిస్తాం. లోన్ పుచ్చుకుని, మనం ఆపదనించి గట్టెక్కింతర్వాత మళ్ళీ కలిసిపోతాం''

ఆ మాటలతో అమలకి రాంబాబు మీద నమ్మకం కుదిరింది. డబ్బు సంపాదించడానికి అన్ని దారులు మూసుకుపోయినప్పుడు, యీ విడాకుల నాటకం ఒక్కటే శరణ్యమయింది. కానీ, యీ నాటకాన్ని సక్రమంగా ఆడగలమా అని ఆమెకు సందేహం వచ్చింది. అదేవ్యక్తం చేసింది.

రాంబాబు పగలబడి నవ్వేడు. మరొకప్పుడైతే నాకూ యీ సందేహం వచ్చుండేది. కానీ, ప్రాణాలు తియ్యడానికి రౌడీలు వెంబడించినప్పుడు కుంటివాడు కూడా ఒలింపిక్ ఛాంపియన్‌కంటే జోరుగా పరుగెడుతాడు అమలా! అదీగాక, మన పరిచయం, ప్రేమ, పెళ్ళిగూడా అంతా నాటకీయంగానే జరిగింది. మనం కూడా ఒకరితో ఒకరు పోటీపడి మరీ యీ సంవత్సరమంతా నటించేశాం. కాబట్టి, యీ నాటకాన్ని గూడా సక్సెస్‌ఫుల్‌గా ఆడగలమనే నమ్మకం నాకొచ్చేసింది. మన పెళ్ళయి రేపటికి సరిగ్గా సంవత్సరం అవుతుంది. సాధారణంగా అందరూ మొదటి మేరేజిడేని సెలబ్రేట్ చేసుకుంటారు. కానీ రేపు మనం విడాకులు పుచ్చుకోడానికి చెరో లాయరు దగ్గరకి వెళ్తాం. సంవత్సరంపాటు కాపురం చేశాం కాబట్టి, విడాకులు పుచ్చుకోడానికి మనకి సంపూర్ణమైన అర్హత వచ్చేసినట్టే. మనిద్దరిలో ఒకరు విడాకులు కావాలనడం, మరొకరు అభ్యంతర పెట్టడం జరిగితే కేసు జటిలమవుతుంది. కానీ, యిద్దరం విడాకులు కావాలని కేసు పెట్టుకుంటే, బుకింగులో టిక్కెట్లు యిచ్చినంత సులభంగా విడాకులు యిచ్చేస్తారు. పైగా యిలాంటి కేసులకి కొమ్ములు తిరిగిన లాయర్లక్కర్లేదు. కేసుల్లేని ఏ చెట్టుకింద ప్లీడరయినా చాలు. మనం డబ్బు యివ్వాల్సిన మెంబర్నుని రేపే కలుసుకుని మాట్లాడి కాస్త గడువుయిమ్మని రిక్వెస్టు చేస్తాను''

కోరలు పీకేసిన పాము గత్యంతరం లేక మంత్రగాడి నాగస్వరానికి తల ఆడించినట్టు అమల రాంబాబు చెప్పిందానికి తల ఆడించింది.

★ ★ ★

చీటీ పాట మెంబర్సంతా, మాజీకౌన్సిలరు తమ్మయ్యలింగంద్వారానే డబ్బు విషయం అడిగించారు కాబట్టి రాంబాబు సరాసరి అతనింటికే వెళ్ళాడు. అతని మెడలో దండవేసి, తనే చప్పట్లుకొట్టి, అతని రెండుచేతులూ తీసుకుని కళ్ళకి అద్దుకున్నాడు.

"వద్దు, నాకీ దండొద్దు" అంటూ తమ్మయ్యలింగం దండ తీసెయ్యబోయేడు.

రాంబాబు అతన్ని వారిస్తూ, అతని ధోరణిలోనే మాట్లాడాడు, "వద్దు, దండ తీసెయ్యొద్దు. కాస్సేపలా వుంచండి" అన్నాడు.

"నాకు దండ ఎందుకు వేశారు?"

"మీకే కాదండి. మీ ప్రజాసేవాతత్పరత గురించి విన్నాక, మీ ఫొటోకి గూడా దండ వేద్దామనుంది. కానీ, యిప్పుడప్పుడే వెయ్యడం భావ్యంగా వుండదని వెయ్యడంలేదు. నిజానికి మాదగ్గర చీటీ పాట మెంబర్నుగా జాయినైన ప్రతి ఒక్కరికీ దండ వెయ్యాలనే వుంది గానీ, మీకు వేస్తే వాళ్ళందరికీ వేసినట్టేనని భావించి మీకు మాత్రమే వేశాను. ఈశ్వరుడి చుట్టూ మూడుసార్లు తిరిగితే విశ్వమంతా మూడుసార్లు తిరిగేసినట్టే అని దేవతలు చెప్తారు. మీదగ్గరకి వెళ్తే మెంబర్సందరి దగ్గరికి వెళ్ళినట్టేనని మీ వార్డు ప్రజలు చెప్పారు. మిమ్మల్ని ఎమ్మెల్యేగా ఎన్నుకోకపోవడం విశాఖ ప్రజల బేడ్‌లక్‌గాని, మీ దురదృష్టం కాదు. మీరుగనుక ఎమ్మెల్యే అయితే, మినిస్టరవడం ఖాయం. మినిస్టరయితే ముఖ్యమంత్రి అయిపోవడం గ్యారంటీ అని మీ ప్రతిపక్షంవాళ్ళు భయపడి, ఎలక్షన్లో రిగ్గింగ్ చేయించి మిమ్మల్ని ఓడించారని నిన్నరాత్రే తెల్సింది, రాత్రంతా అలోమంటూ ఏడ్చేను. మీ అందరి బాకీ కింద నేను వుంటున్న యిల్లు యిచ్చేద్దామనుకున్నాను. కానీ ఆ యింటి ఓనరు ఒప్పుకోడని వెనకాడేను. అన్నింట్లోకి మెత్తనిది వెన్నపూస అని చెప్తే, ఆయనెవరో మీ అభిమానట, నన్ను ఫెడీమంటూ లెంపకాయ కొట్టేడు. వెన్న




కంటే మెత్తనైంది మా తమ్మయ్యా లింగంగారి మనసురా పూల్ అని చెప్పేడు. పైగా విశాఖప ట్నానికి ఉక్కుఫాక్టరీ రావడానికి మీరే కారణ మని, ఆంధ్రా యూనివర్సిటీలో యింతమంది చదువుకుని పాసవడానికి, విశాఖపట్నం పోర్టు యింత పెద్దదవడానికి మీ సలహాలే కారణ మని విని నేను ఆనందంతో పొంగిపోయేను. అంత మేధావులైన మీరేగనక ఎమ్మెల్యే పదవి లోకెళ్ళుంటే, వైజాగ్‌లో మరో రెండు సముద్రా లు తవ్వించి, రెండు హార్బర్లు కట్టించివుండే వారని నేనూహించాను...'' అంటూ రాంబాబు ఎక్కడా గేప్ యివ్వకుండా పొగిడేస్తున్నాడు. తమ్మయ్యాలింగానికి ఆనందంతో చెమటలు పట్టి, తడిసి ముద్దైపోయేడు.

అదే అదనుగా భావించి రాంబాబు తను వచ్చిన పనిని వివరించాడు. తను అప్పిచ్చిన వ్యక్తి యింతవేగం ఆ డబ్బు తిరిగి యివ్వలేన న్నాడు గాబట్టి, వేరే ఏర్పాటు చేసి ఆ డబ్బు సర్దుబాటు చేస్తానని, అందుకు కాస్త గడువు యిమ్మని అడిగాడు.

''కాస్త గడువు అంటే ఎంత గడువు కా వాలి?''

''నేను డబ్బు యిచ్చే వరకూ ఆగితే చాలు''

''మిగతావాళ్ళకి చెప్పిచూస్తాను''

''పరమేశ్వరుడు చెపితే నందీశ్వరుడు నో అంటాడా చెప్పండి? వాళ్ళంతా మీ అగ్గిపెట్టె లోని పుల్లల్లాంటివాళ్ళు. మీరు వెలిగిస్తేనే వాళ్ళు వెలుగుతారు'' రాంబాబు ప్రయో గించిన కాకాబాణాలు ఫలించాయి. ''వీలు న్నంత తొందరగా చెల్లించే ఏర్పాటు చూ డండి'' అన్నాడు తమ్మయ్యాలింగం.

రాంబాబుకి ఒక సమస్య తీరిపోయింది. తర్వాత యిద్దరు చెట్టుకింద ప్లీడర్లని కలుసు కున్నాడు. ఒకర్ని అమల తరపున నియ మించి, మరొకర్ని తన లాయరుగా పెట్టుకు న్నాడు. తన పాత యింటి ఎడ్రస్ యిచ్చి, అమలకి ఆఫీసు ఎడ్రస్‌కి నోటీసు వెళ్లేలా ఏర్పాటు చేశాడు.

రాంబాబు, అమల విడాకులు తీసుకుంటు న్న విషయం ఆఫీసు అంతటికీ తెల్సిపో యింది. ఆ తెలిసిపోవడం గూడా ఎవరివల్లనో కాదు, రాంబాబే తెలిసేలా చేశాడు. అదెలా గంటే... పుదయం పదకొండు గంటలకి ప్యూన్ రజాక్ కాఫీ తెచ్చి, అతని టేబుల్‌మీద పెట్టి వెళ్ళబోయాడు. అతన్ని ఆపి, కావాలనే సీరి యస్‌నెస్ నటిస్తూ, ''ఏమిటీ, ఎప్పుడూ లేంది చల్లారిపోయిన కాఫీ తెచ్చేవ్? అంటే... భార్యకి విడాకులిస్తున్నానుకదాని, నీకూ నేను లోకువైపో యేనా?'' అన్నాడు.

''అయ్యబాబోయ్, మీరు మీ భార్యగార్కి విడాకులు యిస్తున్నారాండి'' అంటూ రజాక్ ఆశ్చర్యపోయాడు.

''నేనేకాదు, ఆవిడ కూడా నాకు విడాకులి స్తోంది. ఈ సంగతి ఎవ్వరితోనూ చెప్పకు'' అన్నాడు రాంబాబు.

అంతే! రజాక్‌ద్వారా ఆఫీసు అంతటికి విడాకుల వార్త తెల్సిపోయింది. ఆడవాళ్ళు అమలదగ్గరకొచ్చి ప్రశ్నించారు. నిజమేనని ఒప్పుకుంది. అలాగే రాంబాబు కూడా తనని అడిగినవాళ్ళదగ్గర ఆ విషయం ఒప్పుకున్నా డు. అమల, రాంబాబు యిద్దరూ ఆఫీసులో మాట్లాడుకోవడం మానేశారు. సాయంకాలం ఆఫీసునించి వెళ్లేటప్పుడు కూడా కలిసి వెళ్ళ కుండా విడివిడిగా వెళ్ళి యింటిదగ్గర కలుసు కున్నారు. ఇదో కొత్త అనుభూతి, భలేగా వుందే అనుకున్నారు. అయితే భలేగా వుందను కుంటున్న అనుభూతి భడేల్‌మంటూ మర్నాడే బద్దలైంది. ఆఫీసుకి రామారావుగారు హైదరా బాద్‌నించి వచ్చేస్తున్నారన్న విషయం మర్నా డు ఆఫీసుకి వెళ్ళగానే తెల్సింది. ఆయన వస్తే విడాకుల నాటకం వీధిభాగోతం అయిపో తుందని యిద్దరూ కంగారుపడ్డారు. ఆ కంగా రులోనించి బయటపడేలోగా ఆరోజు గడిచిపో యింది.

మర్నాడు రామారావుగారు ఆఫీసుకొచ్చేశా రు.

సరిగా ఆరోజే రాంబాబు, అమల తమ హౌస్ బిల్డింగ్ లోన్ అప్లికేషన్లు పెడుతున్నా రు, పెట్టేశారు.

మధ్యాహ్నం రామారావు దంపతులిద్దర్ని తన రూములోకి పిలిచాడు. గదిలో వున్న ప్యూన్‌ని బయటికి పంపించి, వారిద్దర్ని కూర్చో బెట్టి అడిగారు,

''మీరు విడాకులు తీసుకుంటున్నారా?''

''ఔనండి'' అన్నారు యిద్దరూ.



"మీరు ప్రేమించుకున్నారు, నేను దగ్గరుండి పెళ్ళి జరిపించేను. ఇంతలోనే మీకేం వచ్చిందని విడాకులు తీసుకుంటున్నారు? నువ్వే కారణంవల్ల ఈ నిర్ణయానికొచ్చేవు అమలా?"

అమల తన భయాన్ని బలవంతాన అణచుకుంటూ జవాబు చెప్పింది. "ఆయన ప్రతి రాత్రీ విపరీతంగా తాగొచ్చి నన్ను దారుణంగా తిడుతున్నారు. భయంకరంగా కొడుతున్నారు సార్. ఆ రీజన్‌తో ఒక భార్య, తన భర్తనించి విడాకులు తీసుకోవచ్చు కదండి"

రామారావు శుష్కమందహాసం చేసి "అలాగని మీ లాయరు చెప్పేడా?" అన్నాడు.

"కాదండీ, విడాకులు ఏయే కారణాలవల్ల తీస్కోవచ్చో, కొంతమంది విడాకులు తీస్కున్న వాళ్ళని అడిగి తెల్సుకున్నానండి"

రామారావు బాధగా నిట్టూర్చి నీ సంగతేమిటయ్యా అన్నట్టుగా రాంబాబువైపు చూశాడు.

"నా అనుమతి లేకుండా నా భార్య క్రిష్టియన్ మతం పుచ్చుకుంటోందండి. భర్త అనుమతి లేకుండా భార్య వేరే మతంలోకి మారితే ఆ రీజన్తో భర్త భార్యనించి విడాకులు తీసుకోవచ్చని, మా లాయర్ చెప్పేరండి"

ఇద్దరూ సమాధానాల్ని సిద్ధం చేసుకునే వుంచుకున్నారు కాబట్టి, రామారావు అడగ్గానే ఏదో పద్యం అప్పజెప్పేసినట్టుగా అప్పగించేశారు.

"మీ ఆయన మందు అలవాటు మానేస్కుని, నిన్ను తిట్టకుండా, కొట్టకుండా వుంటే నువ్వు విడాకుల్ని ఉపసంహరించుకుంటావా?"

"లేదండి... ఆయన పూర్తిగా చెడిపోయారు. ఆయన మారరు. నా నిర్ణయమూ మారదు" అమల జంకూ గొంకూ లేకుండానే చెప్పింది.

"మీ ఆవిడ మతం మార్చుకోకుంటే.."

"నోనో! ఆమె ఎన్నోసార్లు మన హిందూమతాన్ని దూషించింది. ఆ మతంలో పుట్టడం పాపం అంది. అలాంటి మతవిద్వేషి తన మతం మార్చుకుని మన అభిమతం ప్రకారం నడుచుకోదు. నాకు భార్యకంటే నా హిందూ మతం ముఖ్యం"




రామారావు చాలా సీరియస్‌గా గదిలో అటూ యిటూ తిరిగాడు. కొన్ని నిమిషాల తర్వాత గత్యంతరంలేని పరిస్థితిలో గరళాన్ని మింగిన గంగాధరుళ్ళా ఫోజుపెట్టి అన్నాడు,

"హిందూమతంమీద నీకున్న గౌరవానికి నేను పొంగిపోతున్నాను. కానీ హిందూమత నమ్మకాల ప్రకారం వివాహమనేది ఏడుజన్మల బంధం. కానీ, ఆ బంధాన్ని ఒక్క జన్మవరకూ కాదుగదా, ఒక్క ఏడాదైనా నిలుపుకోకపోవడం నాకు చాలా బాధగా వుంది రాంబాబూ"

"మా పెళ్ళయి ఏడాది దాటేసి మూడురోజులు గడిచిపోయేయి. ఏడాదిపాటు కాపురం చేస్తేగాని విడాకులు పుచ్చుకునే అర్హత వుండదు సార్" రాంబాబు' చాలా సీరియస్‌గా అన్నాడు.

"ఏడాది దాటలేదు అని మాటవరసకన్నానయ్యా, ఏదైనా విషయం పదిమందికీ తెల్సిపోయిందీ అని మాటవర్సకంటాం. అంటే, దానర్థం కేవలం పదిమంది మనుషులకే తెల్సిందనా? పైగా విడాకులు తీస్కోడానికి సంవత్సరం కాపురం చెయ్యాలి సార్ అని నాకు చెప్తావేంటి? నాకు బిఏ, బియ్యేస్సీ, బీకామ్ డిగ్రీలతోపాటు బి.యల్ డిగ్రీ కూడా వుందని నువ్వు మర్చిపోయేవా? మీ యిద్దరి పెళ్ళి చేసింది నేను కాబట్టి, నా కళ్ళముందే మీరు విడిపోతుంటే కాస్త ఫీలవుతూ మాట్లాడుతున్నాను. అర్థంచేస్కో. మీరిద్దరూ విడాకులు కోరుకుంటున్నప్పుడు ఏ కోర్టయినా మీకు విడాకులు మంజూరు చేస్తుందని, లా డిగ్రీ వున్న నాకు తెలుసు. అదిసరే, మీకు విడాకులు యింకా మంజూరు చెయ్యకుండానే, అప్పుడే యిద్దరూ విడిపోయినట్టుగా విడివిడిగా హౌస్ బిల్డింగ్‌లోన్లు పెట్టుకున్నారేమిటి?"

అమలకి వెంటనే జవాబు తట్టలేదు. రాంబాబే ధైర్యంగా జవాబు చెప్పాడు,

"విడాకులు ఖచ్చితంగా యిచ్చేస్తారని మీరే చెప్తున్నారుగదండి. ఆ ఆర్డర్సు వచ్చేలోగా వూళ్ళోని స్థలాల రేట్లు పెరిగిపోతాయన్న ముందుచూపుతో ఎప్లయ్ చేశానండి" తన మాటలు రామారావుమీద ఎలా పనిచేస్తున్నాయోనని రాంబాబు ఓరకంట చూశాడు.

"నిజమే, నీ ముందుచూపు ప్రశంసనీయమయిందే! మొన్న ఫైనాన్స్ మినిస్టరుగారు చెప్పినప్రకారం, యికమీదట విదేశాల్నించి,

ఒక్కొక్కరూ అయిదేసి కేజీల బంగారం తెచ్చుకుంటే, ముందుముందు బంగారం ధర తగ్గే ఛాన్సుంది. కానీ, ఫైనాన్స్ మినిస్టరు కాదుగదా, ప్రెసిడెంటాఫ్ ఇండియా పూనుకున్నా విదేశాల్నించి భూములు తెచ్చి, మనదేశంలో కలిపే ఛాన్సే లేదు కాబట్టి, భవిష్యత్తులో భూముల ధర తగ్గే ఛాన్సే లేదు'' అంటూ వ్యంగ్యంగా మాట్లాడి, మాట్లాడి సడన్‌గా ఓ ప్రశ్న అడిగాడు,

''మీరిప్పుడు కలిసి వుంటున్నారా? లేక విడివిడిగా వుంటున్నారా?'' ఇద్దరూ ఒక్కక్షణం కంగారుపడినా, అమలమాత్రం వెంటనే ధైర్యంగా జవాబు చెప్పింది,

''మనసులు, మతాలు కలవకపోవడంవల్లనే కదండి విడిపోయేం. మేం ఒకింట్లో ఎలా వుండగలం సార్? విడివిడిగానే వుంటున్నాం''

రామారావు ఎటువంటి భావాన్ని వ్యక్తం చెయ్యకుండా, ''సరే, మీరు వెళ్ళండి'' అన్నాడు.




రామారావు రూమ్‌లోనించి బయటపడగానే అమల 'హమ్మయ్య' అనుకుంది. కానీ రాంబాబు అలా అనుకోలేకపోయాడు. ఒక సంస్థ యజమానిగా తమ వివాహం జరిపించిన పెద్దమనిషిగా, తమ విడాకుల విషయం అడగడం, బాధపడ్డం సహజమే! కానీ మీరు కలిసి వుంటున్నారా? విడివిడిగా వుంటున్నారా? అని అడగడమే రాంబాబుకి కంగారు పుట్టించింది. అతనేం యథాలాపంగా అడిగినట్టేమీ కనిపించలేదు. మనసులో ఏదైనా వుంచుకునే అడిగి వుంటాడు. రామారావు ఆరోజు యింటికి వెళ్ళిపోతూ రాంబాబుని పిల్చి ''సాయంకాలం ఏడుగంటలకి ఓసారి మా యింటికి రా'' అనేసి జవాబుకోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు. ఆ పిలుపులోని ఆంతర్యం ఏమైవుంటుందాని ఆలోచించాడు. విడాకులు తీస్కోడం తప్పని మరోసారి క్లాస్ కండక్ట్ చెయ్యడానికే అని తనకి తనే జవాబుగూడా చెప్పుకున్నాడు.

రాంబాబు ఆ యింటికి వెళ్ళేసరికి, రామారావు హాల్లో ముసలి పెళ్ళికొడుకులా మిలమిల్లాడుతూ కనిపించాడు. నౌఖరు ఓ ట్రేతో విస్కీ సీసా, సోడాలు వగైరా మందుసెటప్‌ని తీసుకొచ్చి, టీపాయ్‌మీద పెట్టాడు. ఎప్పుడూ విస్కీ సీసానే చూడనట్టుగా అమాయకంగా చూశాడు రాంబాబు.

''ఇవాళ నా పుట్టినరోజయ్యా. ముసలాడికి దసరాపండగేమిటని నలుగురూ అంటారనే, నా పుట్టినరోజునాడు కేవలం ఒకే ఒక్క ఆత్మీయుణ్ణి పిల్చుకుని యింట్లోనే సింపుల్‌గా పార్టీ చేసుకుంటాను. ఈసారి నిన్ను పిలిచేను'' అంటూ గ్లాసులో మందు, సోడా వేసి రాంబాబుకి అందించాడు.

''చీఛీ, నాకు అలవాటు లేదు సా...'' అంటూ మొహమాటం నటించాడు రాంబాబు.

''ఫర్వాలేదయ్యా, యిప్పుడు నువ్వు నాదగ్గర ఉద్యోగస్థుడివీ కాదు, నేను నీ బాసునీ కాదు. జస్ట్, వుయ్ ఆర్ ఫ్రెండ్స్, తీస్కో''

''నాకు పెద్దగా అలవాటు లేదు, నన్ను క్షమించడండి సార్''

''యిందాకేమో అస్సలు అలవాటు లేదన్నావు, యిప్పుడేమో పెద్దగా అలవాటు లేదంటున్నావ్. యిందులో రెండోది కరక్టయితే, నువ్వు ఎంత తీస్కోగలిగితే అంతే తీస్కో'' అంటూ రామారావు చాలా ఉత్సాహంగా ప్రోత్సహించాడు. రాంబాబు తెగించాడు. రామారావుకి ఛీర్స్ చెప్పి, ఒక్కటంటే ఒక్కటే లార్జ్ పెగ్గు తాగి, ''థేంక్యూ సార్, నాకోటా అయిపోయింది'' అంటూ గ్లాస్‌ని బోర్లించేశాడు.

''భలేవాడివయ్యా, రెండు మామూలు పెగ్గులకి సరిపడగా ఒక్క లార్జ్ పెగ్ లాగేసి, నాకోటా అయిపోయిందీ అంటున్నావ్. నీ వయ

ను, నీ బలమే నాకుంటే, ఓ ఫుల్‌బాటిల్ తాగేసి, మిలట్రీవాడిలాగ ఠంచన్‌గా నడుచుకుంటూ వెళ్ళిపోయేవాణ్ణి'' రామారావు మాటల్లో కవ్వింపు కనపడింది.

''సారీ సార్, మీరంతా భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందు, 'బి' విటమిన్‌ని పుష్కలంగా తిని పెరిగినవాళ్ళు. మీరు ఫుల్‌బాటిలే కాదు, ఓ వైన్‌షాపు మొత్తాన్ని మింగేసినా మీకేం కాదు. కానీ, మేం ఎరువులు వేసిన పంటలు తిని బతికినవాళ్ళం. మాకు యింతకంటే దమ్ము చాలదు''

''అదేంటి రాంబాబూ! నీ భార్య అమలేమో నువ్వు ప్రతిరోజూ తప్పతాగొచ్చి ఆమెను తిడుతున్నావని, కొడుతున్నావని, నీ సమక్షంలోనే చెప్పింది. నువ్వు చూస్తే ఒక్కరెండే తాగి, యింక నావల్ల కాదంటున్నావ్. పైగా నువ్వు తొణక్కుండా, బెణక్కుండా స్టడీగానే వున్నావు. అయితే... అమల చెప్పిందంతా అబద్ధమంటావా?'' రామారావు ఒక్కో మాటని ఒత్తి ఒత్తి పలుకుతుంటే రాంబాబుకి అర్థమైపోయింది. తాగింతర్వాత తన ప్రవర్తన ఎలా వుంటుందో పరీక్షించడానికే, యింటికి పిల్చి మందు యిచ్చేడు. ఎత్తుకుపైఎత్తు వేసి, అతన్ని నమ్మించకపోతే, తమకి రెండు లోన్లు యివ్వడు.

''సారీ సార్... మీ పెద్దవాళ్ళముందు యింతకంటే ఎక్కువ తాగితే మర్యాద వుండదని ఒక్క లార్జ్ పెగ్‌తో సరిపెట్టేశాను. కానీ, మన కెపాసిటీ యింకా వుందండోయ్'' అన్నాడు.

''నీ కెపాసిటీ ఏమిటో తెల్సిపోయిందిగా. మందు తాగేక మనుషులు రెండురకాలుగా మారతారు. కొంతమంది అతిగా వాగుతారు. మరికొంతమంది మన్నుతిన్న పాముల్లాగ మాటామంతీ లేకుండా వుండిపోతారు. బహుశా యిందులో నీది రెండవరకమై వుంటుంది'' రామారావు, రాంబాబుచేత అతిగా వాగించి, నిజం తెల్సుకోవాలనే అలా కవ్వించాడు. కానీ, రాంబాబు రెచ్చిపోయి, అయిదారుపెగ్గులు తాగేశాడు. తాగేక పెద్ద లెక్చరివ్వాలని అతని అభిప్రాయం. కానీ, హాఫ్‌బాటిల్ తాగేక అతని





నోటంట మాట రాలేదు. అడుగు ముందుకు పడలేదు. పిచ్చి చూపులు చూస్తూ అక్కడే సోఫాలో పడి ఆ రాత్రంతా నిద్రపోయాడు.

''హుఁ... నన్ను మస్కాకొట్టడం నీతరంకాదు రాంబాబూ'' అంటూ రామారావు నవ్వి ఉదయంవరకు అతన్ని అలాగే వుండనిచ్చి, ఆ తర్వాత అతన్ని ఆటోలో యింటికి పంపించాడు.

మరోరోజు, రామారావు అమలని తన ఆఫీసురూములోకి పిల్చాడు. టేబుల్‌మీదున్న కొబ్బరిచెక్క, అరటిపండు, నాలుగు పువ్వులు, కొద్దిగా కుంకుమ ఆమెకిచ్చి, ''యివాళ శ్రావణ శుక్రవారమమ్మా. మా ఆవిడ పూజ చేసింది'' అన్నాడు. అమల ఆ పువ్వుల్ని జడలో పెట్టుకుని, బొట్టుని నుదుట దిద్దుకుని, కొబ్బరిముక్కని కళ్ళకి అద్దుకుని తింటుండగా రామారావు ఆమెను ఓరకంట చూస్తూ, ''క్రిష్టియన్ మతం స్వీకరించినవాళ్ళు కుంకుమబొట్టు పెట్టుకోరనుకుంటానే'' అన్నాడు. అమల ఉలిక్కిపడింది. దొరికిపోయిన దొంగలా బిత్తరచూపులు చూసింది.

ఆ రాత్రి రాంబాబు, అమల ఒకరి అనుభవాలు ఒకరితో చెప్పుకుని భయపడ్డారు. మనం నిజంగా విడాకులు పుచ్చుకుంటున్నామో లేదో తెల్సుకోడానికే నన్ను మందుతోను, నిన్ను సెంటిమెంటుతోనూ పరీక్షించాడు. మనం చాలా చాలా జాగ్రత్తగా వుండాలని, భోజనాలు చేస్తున్నప్పుడు, ఓ నిర్ణయం తీసుకుంటున్న సమయంలోనే, గుమ్మం బయటనించి ''మాదా కబళం తల్లీ'' అని ఓ ముష్టివాడి అరుపు వినిపించింది. ఇంత రాత్రిపూట ముష్టివాడు రావడం ఏమిటని యిద్దరూ ఆశ్చర్యపోయారు. ఈ ముష్టివాళ్ళ బెడద గ్రౌండ్‌ఫ్లోర్‌లో వున్నవాళ్ళకి తప్పదనుకుంటూనే అమల ఓ ప్లేటులో కొంచెం అన్నం, చారు తీసుకెళ్తుండగా రాంబాబుకి సడెన్‌గా ఓ సందేహం వచ్చి అమలను ఆగమన్నాడు. రామారావు గతంలో కొన్ని కేసులు పరిశోధించడానికి మారువేషాల్లో వెళ్ళేనని చెప్పాడు. ఆ ఫొటోలు కూడా చూపించాడు. ఇప్పుడు మేం కలిసి వుంటున్నామో, విడివిడిగా వుంటున్నామో తెల్సుకోడానికి, యిలా బిచ్చగాడి వేషంలో వచ్చాడేమో! చెప్పలేం... అతనసలే తిక్కశంకరయ్యల్లో మొదటిరకం. అమలని జాగ్రత్తగా ప్రవర్తించమని చెప్పి మరీ బైటకి పంపించాడు. ఒకవేళ రామారావు

యింట్లోకి వచ్చినా రావచ్చని భయపడి అమల వచ్చేవరకు బీరువా వెనక దాక్కున్నాడు. అమల భిక్షం వేసి, తిరిగొచ్చింది.

"వాడేనా?" అని ఆత్రంగా అడిగాడు. "కాదులెండి. వీడెవడో బక్కపల్చగా అస్థిపంజరంలాగున్నాడు." అని అమల చెప్పినా రాంబాబుకి కంగారు తగ్గలేదు. ఆ రాత్రంతా ఆలోచించి ఓ నిర్ణయం తీసుకున్నాడు. "మన బాస్ మహ్మద్‌బీన్ తుగ్లక్ కాబట్టి, అతను ఎప్పుడేంచేస్తాడో మనం వూహించలేం. ఇలా మనం కలిసివుండి క్షణక్షణం భయంభయంగా బతికేబదులు మన లోన్లు శాంక్షన్ అయ్యేవరకు నువ్వు మీ యింట్లో వుండు, నేను నా యింట్లో వుంటాను. కొన్నాళ్ళపాటు ఈ యింటి అద్దె కట్టే బాధ కూడా తప్పుతుంది" రాంబాబు చెప్పిన సలహా అమలకి నచ్చింది. కారు లేనప్పుడు యింత యిల్లుమాత్రం ఎందుకని అంగీకరించింది.

మరో ఆదివారం ఉదయం రామారావు రాంబాబుని తన యింటికి రమ్మని పిలిచేడు. ఇప్పుడేం పరీక్ష పెడతాడోనని భయపడుతూనే ఆ యింటికి వెళ్ళేడు. అక్కడ రామారావుకి ఎదురుగా వున్న సోఫాలో ఎత్తుగా, బలంగా, షోగ్గా వున్న ఓ పాతికేళ్ళ యువకుడు కూర్చున్నాడు. అతన్ని రాంబాబుకి పరిచయం చేస్తూ, "వీడు వినోద్ అని స్వయానా నా మేనల్లుడు. బాంబేలో రెండు ఇండస్ట్రీస్‌కి హోల్ అండ్ సోల్ ప్రొప్రయిటరు. ఇంకా పెళ్ళికాలేదు" అన్నాడు.

రాంబాబు గురించి వినోద్‌కి చెప్తూ, "నేను చెప్పేనే, అతనే యితను" అన్నాడు.

ఇద్దరూ షేక్‌హాండ్సు యిచ్చుకున్నారు. నా గురించి ఏమని చెప్పుంటాడు... అని రాంబాబు ఆలోచిస్తున్నాడు.

"నిన్నెందుకు పిలిపించేనంటే... మావాడు అమలని చూశాడట. ఆవిడ ఎవరూ, ఏవిటని అడిగితే ఫలానా ఫలానా అని చెప్పాను. అంతే! అమలని తప్ప మరో అమ్మాయిని చేస్కోనని పట్టుబట్టి కూర్చున్నాడు" రామారావు అన్న మాట రాంబాబుకి షాక్‌లా తలిగి, ఛర్రుమంటూ లేచి నిలబడ్డాడు.

"మీరు నన్ను అవమానిస్తున్నారు" అన్నాడు ఆవేశంగా.

"ఇందులో అవమానం ఏం వుందయ్యా? కోర్టులో యివాళో రేపో మీకు విడాకులు మంజూరుచేస్తారు. వాళ్ళెప్పుడు చేసినా, నా దృష్టిలో మీరు శాశ్వతంగా విడిపోయినట్టే లెక్క... అందుకే, మీకు విడివిడిగా హౌస్‌బిల్డింగ్ లోన్స్ కూడా శాంక్షన్ చేస్తున్నాను"

రాంబాబు గుండెల్లో పొంగుతున్న కోపం అనే పాలుమీద రామారావు రెండు లోన్లు అనే నీళ్ళు జల్లాడు. కానీ, పొయ్యిలోని మంటని మరింత ఎక్కువచేస్తూ మళ్ళీ మాట్లాడాడు.

"అమలని నువ్వు విడిచిపెట్టేశాక ఆవిడ ఎవర్ని పెళ్ళిచేస్కుంటే నీకెందుకు? ఏ ఎట్లో దిగితే నీకెందుకు? అలాగే, రేపు నువ్వెవర్ని పెళ్ళిచేస్కున్నా అడిగే హక్కు అమలకీ వుండదు. ఇప్పుడు మీ యిద్దర్లో ఏ ఒక్కరికీ మరొకరి మీద హక్కు, అధికారం లేదు. అలాంటప్పుడు నువ్వు అభ్యంతరం పెట్టడం ఎందుకు? ఒకవేళ, నీనించి విడాకులు పొందేక, అమల జీవితాంతం ఒంటరిబతుకు బతకాలనుకుంటున్నావా... తప్పు రాంబాబూ, అయిందేదో అయిపోయింది. యిప్పుడు ఎవరిదోవన వాళ్ళు విడిపోతున్నప్పుడు ఆవిడమీద నీకు పగెందుకు? అసలీ పెళ్ళి నువ్వే జరిపించేవనుకో. నీఅంత సంస్కారవంతుడు ఈ ప్రపంచంలో మరొకడు ఉండడు. కానీ, లెక్కప్రకారం మా మేనల్లుడి పెళ్ళి నేనే జరిపించాలి. కోర్టులో విడాకులు మంజూరు చేసేవరకు మావాడు ఆగుతానంటున్నాడు. అమలకోసం వీడు క్రిష్టియన్ మతం గూడా పుచ్చుకుంటానంటున్నాడు. పెళ్ళయ్యేక హనీమూన్‌కి వెళ్తానంటున్నాడు. అసలీ పెళ్ళి విషయం నీతో ప్రస్తావించవలసిన అవసరం నాకు లేదు. కాకపోతే, అమల తరఫు పెద్దవాళ్ళతో మాట్లాడే ముందు, నీతో కూడా ఓ మాట చెప్పాల్సిన నైతికధర్మం నాకు వుందనిపించి, నిన్ను పిలిచి చెప్తున్నానంతే!"

రాంబాబు తన ఆవేశాన్ని తమాయించుకోడానికి తన శాయశక్తులా ప్రయత్నించాడు గాని, సాధ్యపడలేదు. మర్యాదకోసమైనా చూడకుండా అక్కడనించి చరచరా బైటకి వెళ్ళిపోయాడు. ఆ సాయంకాలం బాగా చీకటి పడ్డాక రాంబాబు అమల యింటికి వెళ్ళి రామారావు




చెప్పిన విషయం చెప్పాడు. ఇది వారిద్దరూ ఊహించని పరిణామం కాబట్టి, కంగారుపడుతున్న రాంబాబుకి, ఆమె తోడు అయిందే తప్ప, సమన్వయించి బైటపడే పరిష్కారాన్ని సూచించలేకపోయింది. రాత్రి పదిగంటలవరకు అక్కడే వుండి రాంబాబు ఆ యింటినించి తన యింటికి బయలుదేరాడు. పదిగజాలు నడిచేసరికి, అక్కడో వ్యక్తి కారుకు ఆనుకుని నిలబడి పైపు కాలుస్తూ కనిపించాడు. అతనెవరో గుర్తుపడుతూనే రాంబాబు అదిరిపడ్డాడు.

అతను... రామారావు!

రాంబాబుని చూసి, చిన్నగా నవ్వి "నువ్వొస్తున్నది మీ ఆవిడ యింటినించే ననుకుంటాను. అలా వెళ్ళడంలో తప్పులేదు. బహుశా నేను వుదయం చెప్పిన పెళ్ళి విషయం అమలతో డిస్కస్ చెయ్యడానికి వెళ్ళేవని నేనూహించగలను రాంబాబూ! మా మేనల్లుడి తరపు పెద్దవాళ్ళు రేపోసారి అమలని చూస్తామంటున్నారు. ఈ పెళ్ళి చూపులు కోర్టుకి తెలిస్తే గొడవకావచ్చు. అంచేత చాలా రహస్యంగా జరిపించేస్తాను. నువ్వుగూడా ఎవరికీ చెప్పొద్దు" రాంబాబు కుతకుతలాడిపోయేడు. అతను తమ బాస్ కాకపోతే, యీ పాటికి చేతికొచ్చినదెబ్బ, కాలికొచ్చినతన్ను తన్ని ఆ పక్కనున్న మురికి కాలవలోకి విసిరేసేవాడు. ఆవేశాన్ని తమాయించుకోలేక గబగబా వెళ్ళిపోయేడు.

మర్నాడు వుదయం ఎనిమిది గంటలకే అచ్యుతానందం యింటినించి బైటకి వెళ్ళిపోయాడు. తొమ్మిదింపావుకి అమల ఆఫీసుకి బయలుదేరుతుండగా యింటిముందో కారు ఆగింది. ఎవరా అని అమల బయటకొచ్చింది. కారులోనించి దిగుతున్న రామారావుని చూసి బిత్తరపోయింది. అతను మాత్రం తిన్నగా లోపలకొచ్చి, మంచం మీద కూర్చుని, "చెప్పకుండా వచ్చినందుకు నువ్వు కంగారుపడతావని తెల్సినా రాక తప్పలేదు. ఇప్పుడు నేను మీ బాస్‌గా రాలేదు. భగవంతుడు దయజూసి నేను అనుకున్నట్టే జరిగితే, త్వరలో నువ్వు నాకు కూతురి వరసవుతావు"

అతను ఏ వుద్దేశ్యంతో అలా వరస కలుపుతున్నాడో గ్రహించింది అమల. "నేను మీ మేనల్లుణ్ణి పెళ్ళి చేస్కోను" అంది ఆవేశంగా.

"నిన్ను మా మేనల్లుడికిచ్చి పెళ్ళి చేస్తానని నీకెవరు చెప్పేరు? నేనెవరితోనూ యీ మాటన లేదే"

"నే, మీరు రాంబాబుగారితో అన్నారు"

"అన్నానా? ఔన్నేను అన్నాను, అన్నాను. కానీ, ఆ విషయం నీకెలా తెలుసు? మీరిద్దరూ కలిసి వుండడంలేదు. ఆఫీసులో కూడా మీరు మాట్లాడుకోవడం లేదట? మీకెలా తెల్సింది చెప్మా? ఒక వేళ రాంబాబు నిన్నరాత్రి యిక్కడ కొచ్చి చెప్పేడా?"

అమల యిరకాటంలో పడింది. రాంబాబు నిన్న రాత్రి యిక్కడకొచ్చిన విషయం యితనికి తెలిసే అడుగుతున్నాడా? లేక, వూహించి అడుగుతున్నాడా? ఆమె ముఖకవళికల్ని అతను ఓరకంట గమనిస్తూనే వున్నాడు.

"సరే నాకు శ్రమలేకుండా అతనే చెప్పేశాడు కాబట్టి, నాకు సగం పని తగ్గిపోయినట్టు. నువ్వు వూఁ అంటే రెండు పెళ్ళిళ్ళు ఒకే ముహూర్తానికి జరిపించేస్తాను"

"రెండు పెళ్ళిళ్ళేమిటి?" అమల అర్థంకానట్టుగా అడిగింది.

"అదేనమ్మా! నిన్ను మా మేనల్లుడికిచ్చి పెళ్ళిచెయ్యడానికి, మా బావగారి కూతుర్ని రాంబాబుకిచ్చి పెళ్ళి చెయ్యడానికి ఏర్పాట్లు చేస్తున్నాను. నిన్న ఆ విషయం కూడా రాంబాబుతో చెప్పేనే! మరి... నీ పెళ్ళి విషయం చెప్పినవాడు, తన పెళ్ళి విషయం ఎందుకు చెప్పలేదు? బహుశా తన పెళ్ళికి నువ్వు అభ్యంతరపెడతావని చెప్పుండడు. వూరికే అతను భయపడుతున్నాడుగాని, నువ్వెందుకు కాదంటావు. విడాకులు తీసుకున్నాక అతను ఎవర్ని పెళ్ళి చేస్కుంటే నీకెందుకు? నువ్వు ఎవర్ని చేస్కుంటే అతనికెందుకు?"

రామారావు అలా చెప్పుకుపోతుంటే అమలకి దుఃఖం ఆగడంలేదు. కరవుదీరా భోరుమని ఏడుద్దామన్నా వీలులేని పరిస్థితి! ఎందుకేడుస్తున్నావమ్మా అని అడిగితే ఏం చెప్తుంది? బయటకి పొమ్మని చెప్పడానికి అతను బాస్ అయిపోయేడు. మరో పక్క, రాంబాబు తనతో తన పెళ్ళి విషయం కూడా రామారావు ప్రస్తావించిన విషయం ఎందుకు చెప్పలేదనే ఆలో

చన మనసుని దొలిచేస్తోంది. "ప్రస్తుతం మీ పెద్దవాళ్ళెవరూ యింట్లో వున్నట్టులేరు. రేపొచ్చి వాళ్ళతో మాట్లాడతాలే" అంటూ గుమ్మంవరకూ వెళ్ళి, ఆగి మళ్ళీ అన్నాడు "మీకు హౌస్ బిల్డింగులోన్లు యివాళ, రేపట్లో గ్రెంట్ చేసేద్దామనుకుంటున్నాను. అఫ్‌కోర్స్ యీ పెళ్ళైపోతే, నీకా లక్షరూపాయల యింటితో అవసరమే వుండదనుకో" ఆ మాట చెప్పేసి వెళ్ళిపోయాడు. అతనో అర్థంకాని సమస్యలా తయారయ్యేడేమిటనుకుంది అమల. ఓవైపు లోన్ యిస్తానంటున్నాడు. మరో వైపు రెండో పెళ్ళికి ఏర్పాట్లు చేస్తున్నానంటాడు. ఇందులో ఏది నిజమో, ఏది నిజమైతే ఏం చెయ్యాలో అర్థంకాని స్థితిలోనే అమల ఆఫీసుకి బయలుదేరింది. రామారావు ఆరోజు లోన్స్ శాంక్షన్ చేస్తాడేమోనని రాంబాబు ఎదురు చూశాడుగాని, చెయ్యలేదు. కనీసం రాంబాబుని పిలవనైనా పిలవలేదు. ఓసారి పిలిచేడుగాని, అది కేవలం ఏదో లెటరు డిక్టేట్ చెయ్యడానికే! అంతకుమించి మరో విషయమేం మాట్లాడలేదు. "మీతో మీ పెళ్ళి విషయం కూడా రామారావుగారు మాట్లాడారా?" అని అమల రాంబాబుని అడగాలనే ప్రయత్నించిందిగాని, అవకాశం దొరకలేదు.

★ ★ ★

రాంబాబు యీమధ్యకాలంలో అనుభవిస్తున్న బాధలకి, మానసికమైన ఒత్తిళ్ళకి పరాకాష్ఠ ఆరోజు ఏర్పడింది. ఆఫీసుకి టైమయిపోయిందనే హడావిడిలో రాంబాబు వంట చేస్తుండగా, యింటిముందు పది, పన్నెండు ఆటోరిక్షాలు విపరీతమైన శబ్దం చేసుకుంటూ వచ్చి ఆగాయి. అందులోనించి చీటీ పాట మెంబర్సు ఓ యిరవైమంది దిగి, ఆవేశపడుతూ ఆ యింట్లోకి నడిచారు. అందులో మాజీ కౌన్సిలర్ తమ్మయ్యలింగం కూడా వున్నాడు. రాంబాబు వాళ్ళంతా ఎందుకొచ్చేరో వూహించలేకపోయాడు. వాళ్ళతోపాటు అమల కూడా వచ్చింది. ఆమె రావడం కాదు, వాళ్ళే తీసుకొచ్చినట్టుగా తెలిసిపోతోంది. అమల పరుగులు తీసి, పరుగులుతీసి, చివరకి పట్టుబడిపోయిన దొంగలా తలదించుకుని నేల చూపులు చూస్తోంది. అంటే, ఏదో జరిగిందన్నమాట!

వాదన ప్రారంభమయింది.

"మీరిచ్చిన గడువు యింకా వుంది కదండి. యిప్పుడు మళ్ళీ యిలా, నా యింటిమీదకి దండెత్తుకురావడం ఏమిటి? అసహ్యంగా" రాంబాబు పౌరుషంగానే అడిగాడు.

"ఎవరు చేసింది అసహ్యమైన పనండి? మీరూ, మీ పెళ్ళామే అందరికీ అసహ్యమైన పని చేశారు?" ఒకాయన హూంకరించాడు.

"ఏం చేశాం?"

"మీకు మొదటిచ్చిన గడువుచాలదని, మళ్ళీ ఎందుకు గడువు పెంచమన్నారు?"

"కొన్ని అనివార్యపరిస్థితులవల్ల..."

యిప్పుడు తమ్మయ్యలింగం జోక్యంచేసుకుని మాట్లాడేడు. "మీరు నాకు చెప్పిన అనివార్యపరిస్థితులు వేరు. మేం తెల్సుకున్నది వేరు మీ మొగుడూ పెళ్ళాలిద్దరూ దొంగాటలాడుతున్నారని, మాకు మస్కాకొట్టబోతున్నారని మాకు తెలిసిపోయే అందరం పరుగెత్తుకొచ్చేం"

అమల భోరుమంటూ ఏడుపు లంకించుకుంది. రాంబాబు ఆమె దగ్గరకెళ్ళి ఓదార్చబోతే ఒకాయన అతన్ని ఆపుచేసి వెటకారంగా అన్నాడు.

"ఆవిణ్ణి ఓదార్చడం కాదండి, మేమూ ఏడుస్తూనే వచ్చేం. మమ్మల్ని ఓదార్చండి ముందు"

"మీరు విడాకులు తీసుకుంటున్నారట. తీస్కున్నాక మళ్ళీ పెళ్ళి చేస్కోడానికి యిప్పట్నించీ సంబంధాలు చూసుకుంటున్నారట. ఈ విషయం మాకు చెప్పకుండా అనివార్యపరిస్థితులు, గాడిదగుడ్డూ అంటూ మాకు సినిమా స్టోరీలు చెప్పి, మా డబ్బు ఎగ్గొట్టానికి ప్లాన్లేస్తారా?" అందరూ రెచ్చిపోయి మాట్లాడుతున్నారు. విడాకుల సంగతి వాళ్ళకి తెల్సిపోయిందంటే, ఆఫీసులో ఎవరైనా చెప్పేరనుకోవచ్చు. కానీ, యీ రెండో పెళ్ళిళ్ళ గొడవ గురించి ఎవరు చెప్పేరు?

"ఇంకెవరండీ, హారికగారు చెప్పేరు" ఒకాయన అన్నాడు.

"హారికగారా?" అంటూ రాంబాబు ఆశ్చర్యపోయి, ఒకవేళ అమల ఏమైనా యీ విషయం హారికతో చర్చించిందా అని ఆమెవైపు చూశాడుగాని, ఆమె తల దించుకుని ఏడవడం తప్ప మరో ధ్యాసలో లేదు.

"హారికగారికీ విషయం ఎలా తెలి




సిందండి?''

"ఎలా తెలిసిందీ అని అడుగుతున్నారంటే, మీ పెళ్ళిళ్ళ మాట నిజమేనన్నమాట''

"మీరు రీజనింగులు తియ్యకుండా అసలు విషయం చెప్పండి సార్'' రాంబాబు చిరాగ్గా అన్నాడు.

"హారికగారు మా ఫేమిలీ ఫ్రెండు కాబట్టి నాకా విషయం చెప్పేరండి'

"ఆవిడకెవరు చెప్పేరట?''

"మీ బాస్ రామారావుగారు చెప్పేరట. వాళ్ళూ వాళ్ళూ ఫేమిలీ ఫ్రెండ్సట! ఇప్పుడీ విషయం ఎవరు చెప్పేరన్నది పాయింటు కాదండీ. మీరిద్దరూ విడాకులు తీస్కుని వేర్వేరు పెళ్ళిళ్ళు చేస్కుని పారిపోతే, మా బాకీ డబ్బు ఎవర్ని అడగాలట? మీరిద్దరూ కలిసే చీటీ పాట కండక్ట్ చేశారు కాబట్టి, మీరిద్దరూ కలిసే ఆ బాకీ తీర్చాలి. ఆ తర్వాత పెళ్ళిళ్ళే చేసుకుంటారో ఏట్లోనే దూకుతారో మీ యిష్టం''

రాంబాబుకి బుర్ర గిర్రున తిరిగిపోతోంది. ఏదో చెప్పబోయేడు కానీ వాళ్ళు అవకాశం యివ్వలేదు.

"మీరు యిలా యింత మందిని దగాచేసి, నష్టపరచి విడాకులు పుచ్చుకుంటున్నారని మేమంతా కలిసి, కోర్టుకి ఒక్క పిటీషన్ పెడితే రేపు మీకు కోర్టులో విడాకులు యివ్వరు''

మరో ఆయన సలహాయిచ్చేడు "అసలీ పెద్ద మనిషితో వాదోపవాదాలు, కేకలు, అల్లర్లు ఎందుకండీ అసహ్యంగా. వీళ్ళ రంగులు బయటపడ్డాయి కాబట్టి, పోలీస్ రిపోర్టిచ్చి అరెస్టు చేయిస్తే సరి''

మరొకాయన. అదే మన తక్షణ కర్తవ్యమంటూ పోలీసుల్ని పిలవడానికి వెళ్ళబోయాడు. రాంబాబు అతన్ని పట్టుకుని ఆపుచేశాడు. అందరి మధ్య నిలబడి, రెండు చేతుల్తో దండం పెట్టి, వినయంగా చెప్పేడు.

"చూడండి సార్! మమ్మల్ని కొంతమంది కొన్ని రకాలుగా మోసం చేశారుగాని, మేమెవర్నీ మోసం చెయ్యలేదు. చెయ్యాలని కూడా అనుకోలేదు. మేం మీ బాకీ చెల్లించడానికే విడాకులు తీసుకుంటున్నాం. అలా చేస్తే మాకు రెండు హౌస్ బిల్డింగ్ లోన్లు వస్తాయి. ఆ డబ్బుని మీకు యిచ్చేద్దామనుకుంటున్నాం''

ఎవరో చప్పట్లు కొడుతున్న శబ్దం వినిపించి రాంబాబుతోసహా అందరూ గుమ్మంవైపు చూశారు.

రామారావుగారు చాలా సీరియస్ మూడ్‌తో నిలబడి చప్పట్లు కొడుతున్నాడు.

అయిపోయింది, మా పని ఫినిషైపోయిందనుకుంటూ అమల మరింత బిగ్గరగా ఏడవనారంభించింది.

"నువ్వు కాస్త ఏడ్పు ఆపు తల్లీ'' అంటూ అమలని గద్దించి రామారావు ముందుకి వచ్చేడు.

"మీ పన్నాగాన్ని మీ నోటంట చెప్పించడానికే నేను ప్రయత్నించాను. నేను గతంలో మారు వేషాలు వేసి, రహస్యాల్ని బయట పెట్టించేనని చెప్పేను. ఈసారిగూడా ఆ రూట్లోనే మీ పన్నాగాన్ని బయటపెడతానని నువ్వూహించేవు. కానీ, మీ యిద్దర్ని సెంటిమెంటుతో కొట్టి మీచేతనే మీ నేరాన్ని బయట పెట్టించాను. ఇప్పుడు నీ బాస్‌గా నీ మీద మోపుతున్న అభియోగాలు చెప్తున్నాను. మోటర్‌సైకిల్ కొంటానికి లోన్ తీసుకున్నావుగాని, కొన్నావా? లేదు! విడాకులు తీసుకుంటునట్టుగా నోటీసులు యిచ్చుకున్నారు, విడివిడిగా బ్రతుకుతున్నామని నాతో చెప్పేరు. కానీ, అదంతా నిజమా? కాదు. నెంబర్ త్రీ! మీరో సంస్థలో వుద్యోగస్థులై వుండి, ప్రైవేటు చీటీ పాటలు నిర్వహించకూడదు. కానీ నిర్వహించారు! యింత మందిని మోసం చేశారు. సో, యీ నేరాలన్నింటికి శిక్షగా మీయిద్దర్ని యీ క్షణమే డిస్మిస్ చేస్తున్నాను''

రాంబాబు "సార్ సార్'' అంటూ రామారావు చేతులు పట్టుకుని ప్రాధేయపడబోయాడు.

"అయామ్ సారీ రాంబాబూ! నేను మంచిని ఎంతగా ప్రోత్సహిస్తానో, చెడ్డని అంతగానే ఖండిస్తాను. మీరు నన్నో బాస్‌గానే కాదు, ఓవ్యక్తిగా కూడా మోసం చేశారు. మీ పెద్దలు మీ పెళ్ళిని కాదంటే, మీ పెళ్ళి జరిపించిందెవరు? నేను! అలాంటి నన్నో విడాకులు పెడాకులంటూ మోసం చేశారు. దానికి మీరు శిక్ష అనుభవించాల్సిందే''

జనంలో కలకలం ఎక్కువైంది. "యిప్పుడు వీళ్ళ వుద్యోగాలు తీసేస్తే వీళ్ళు మా బాకీలెలా

తీరుస్తారండి?''

రామారావు చాలా సీరియస్‌గా జవాబు చెప్పేడు. ''ఎలా తీరుస్తారండీ అని నన్ను అడుగుతారేమిటి? మీరు నాకేవైనా చెప్పి వీళ్ళ 'తో చీటీలు కలిపేరా? లేక, వీళ్ళు నా అనుమతి తీస్కుని, నా భరోసాతో చీటీలు కండక్ట్ చేశారా?''

తమ్మయ్యలింగం అన్నాడు ''మీరు అనుమతిస్తే వీళ్ళని పోలీసులకప్పజెప్తాం''

''వీళ్ళిద్దరూ యిప్పుడు నాదగ్గర పనిచేసే వుద్యోగస్థులు కారు కాబట్టి వీళ్ళని, మీరు మీ యిష్టం వచ్చినట్టు చేస్కోవచ్చు''

రామారావు ఆ మాటనగానే తమ్మయ్యలింగం పోలీస్‌లకి ఫోన్ చెయ్యడానికి వెళ్ళాడు. రామారావు ఏదో చెప్పబోతూ, వులికిపడి కిందకి చూశాడు.

రాంబాబు, అమల ఆయన కాళ్ళ దగ్గరున్నారు. ఏదో గొణుకుతున్నారు. బహుశా అది క్షమాపణ డైలాగులే అయివుంటాయని గ్రహించి వారిద్దర్ని లేవనెత్తాడు. ''ఈ పరిస్థితుల్లో మీరు క్షమాపణ చెప్పకేం చేస్తారు? కానీ, మీ పరిస్థితి అందరిముందు యింత పతనానికి జారడానికి ముందే మీరెందుకు ఆలోచించలేదు? మీర్ధు యిద్దరూ యిద్దరే! ఆలోచించరు. ఇప్పుడు జరిగిందంతా దైవకృతమంటారా? లేక, మీస్వయం కృతమంటారా?''

రాంబాబు, అమల యావజ్జీవ ఖైదీల్లాగ తలలు దించుకున్నారు. ''హారిక తన మామగారికి సీరియస్‌గా వున్నప్పుడు హైదరాబాద్ వచ్చింది. ఆమె మామగారు, నేనూ స్నేహితులం. అక్కడ నాకు హారిక కలిసింది. మాటల మధ్యలో మీ ప్రస్తావనొచ్చింది. మీరు కారు మీద రావడం, హారికతో మీరు చెప్పిన మాటలూ అన్నీ నాకు తెలిశాయి. మీరు తప్పుతోవలో పరుగులు తీస్తున్నారని గ్రహించాను. నా ఆఫీసులో పనిచేస్తూ, నా చేతులమీదగా దంపతులయిన వాళ్ళు యిలా అక్కరకురాని పరుగులు పెడుతున్నారే అని బాధ పడ్డాను. మీకు నోటితో హితబోధచేస్తే నన్నో చాదస్తం మనిషికింద తీసి పారేస్తారుగాబట్టి, మీ ఆలోచనలకి, మీరు పెట్టే పరుగులకి ఎలాంటి విషాద పరిణామాలు ఏర్పడతాయో ప్రాక్టికల్‌గా చూపిస్తే తప్ప మీకు కనువిప్పు కలగదని నేనూ, హారికా ఆలోచించేం. అప్పట్నించి మీరు యిక్కడేం చేస్తున్నారో హారిక ఎప్పటికప్పుడు నాకు ఫోన్‌లో చెప్తూనే వుంది. తర్వాత ఏమేం చెయ్యాలో నేను ఆమెకు చెప్తూనే వున్నాను. ఆమె నా సలహాల్ని అమలు చేస్తూనేవుంది. కానీ మీరు విడాకులు తీస్కోడానిక్కూడా తెగించినప్పుడు నేను హైదరాబాద్‌నించొచ్చి, నాటకాన్ని స్వయంగా ఆడించక తప్పలేదు.

నేను మీకు వుద్యోగాలు యిచ్చినప్పుడే, ఒక మనిషి జీవితం సుఖంగా గడవడానికి కొన్ని చిట్కాలు చెప్పేను. నువ్వు సుఖపడాలనుకున్నప్పుడు, నీకంటే తక్కువ ఆదాయంతో పోల్చుకోమన్నాను. మీ యిద్దరికీ కలిపి మూడు వేలు జీతం వస్తోంది. వెయ్యి రూపాయిలు, రెండు వేలూ వస్తున్నవాళ్ళు ఎక్కడో కాదు, మన ఆఫీసులోనే వున్నారు. వాళ్ళతో మీరు పోల్చుకునుంటే, వాళ్ళకంటే మనం ఎంతహాయిగా బతుకుతున్నాం అనే సంతృప్తి మీకుండేది. కానీ అలా చెయ్యకుండా మీరేం చేశారు? హారికతో పోల్చుకున్నారు. అక్కడే అమల మొట్టమొదటిసారిగా తప్పుచేసింది. హారికని చూస్తూ అమల ఎంతసేపూ, ఆవిడ ఒకప్పుడు తన పనిమనిషి కూతురు, పనిమనిషి కూతురు అని హీనంగా చూసి, ఆవిడే అంతగొప్ప పొజీషన్లో వున్నప్పుడు, నేనెంత గొప్పగా వుండాలీ అనిఆలోచించిందేతప్ప. ఆ పనిమనిషి కూతురు ఎన్ని అర్హతలు సంపాదించి, అంత గొప్ప వ్యక్తికి భార్య అయి, అంత వైభవాన్ని అనుభవిస్తోందీ అని ఒక్కసారి గూడా ఆలోచించలేదు. అక్కడ మీరు రెండోసారి దెబ్బతినేశారు. ఆమె పొజీషన్ని చూస్తూ అమల అక్కసు పట్టలేక తనకీ ఓ కారుందని అబద్ధం చెప్పింది. ఆ తర్వాత ఆ మాటని నిజం చెయ్యడం కోసం మీ శక్తికి మించిన పరుగులు తీశారు. తీసీ తీసి, చివరకి మీరు డిస్మిస్ కావడం, పోలీస్ అరెస్టులదాకా వచ్చేరు'' రామారావు రెండు క్షణాలు ఆగేడు.

''ఔనుసార్... యిదంతా అమల తొందరపాటుతనంవల్లే వచ్చింది'' అన్నాడు రాంబాబు.

''షటప్'' అంటూ గద్దించాడు రామారావు. ''యూ ఆర్ ఏ ఫూల్! సీతారాములు అరణ్యవాసం చేస్తున్నప్పుడు కూడా చాలా హేపీగానే





బతికేరయ్యా. కానీ, సీతాదేవి అడవిలో బంగారు లేడిని చూసి మోజుపడి, ఆ లేడిని తెచ్చిపెట్టమని కోరింది. రాజ్యాన్ని, వైభవాల్ని త్యాగం చేసొచ్చిన సీత ఆ బంగారు లేడి మీద మోజు పడ్డం ఆమె తప్పు! అడవిలోకి బంగారు లేడి రావడం ఏమిటని కూడా ఆలోచించకుండా రాముడు కేవలం ఆమె సంతృప్తికోసం ఆ లేడిని పట్టుకోవాలని పరుగెత్తడం అతని తప్పు! ఆ తప్పులకి ఫలితంగా పద్నాలుగేళ్ళపాటు భార్యాభర్తల మధ్య వియోగం ఏర్పడింది. అదే సీతాదేవి బంగారు లేడి కావాలన్నప్పుడు ఛీ... నోర్ముయ్. ఆ లేడి మనకెందుకూ అని మందలించి వుంటే వాళ్ళకన్ని కష్టాలు వుండేవి కావుగా! ఆ పనిని ఆనాడు ఆ రాముడూ చెయ్యలేదు. మీ ఆవిడ మొదటిసారిగా, హారికతో సమానంగా వూహించుకుంటూ కార్లు, లగ్జరీ సామాన్లు కొందామన్నప్పుడు నువ్వూ చెయ్యలేదు. మీ ఆవిడకి ఫాల్స్ ప్రెస్టేజి వెలగబెట్టే బలహీనత వుంది. అదే బలహీనత నీకూ వుంది. అందుకే మీరిద్దరూ ప్రేమించుకునేటప్పుడు గూడా నిజాయితీ పాటించకుండా, ఒకర్నొకరు మరొకరు అబద్ధాలాడుకున్నారు. ఆ తర్వాత గూడా ఆమె చెప్పిందానికి తగ్గట్టుగా నువ్వూ తల ఆడించేవు. అందుకే, ఇప్పుడు మీరిద్దరూ మా అందరిముందు తల దించుకునే పరిస్థితి ఏర్పడింది. మరో ముఖ్యమైన పాయింటు రాంబాబూ! నువ్వూ పెద్దవాడివి కావడానికి, నీకంటే గొప్పవాళ్ళతో పోల్చి చూస్కొని, వాళ్ళలాగే నువ్వూ కృషిచెయ్, ఏనాటికైనా వాళ్ళతో సమానమవుతావ్. యింకా కృషి చేస్తే వాళ్ళని కూడా మించిపోతావ్, అని చెప్పేను. కానీ, నువ్వేం చేశావ్? హారిక భర్తని చూశావ్. మీది పరుగెత్తి పాలుతాగే టైప్ సార్, నాది మాత్రం నిలబడి నీళ్ళుతాగే టైప్ సార్ అంటూ ఓ స్టేట్‌మెంట్ యిచ్చేవని విన్నాను. యూసీ మిస్టర్ రాంబాబూ! నిలబడి నీళ్ళు తాగడం బెటరనుకునే వాళ్ళని చాలామందిని చూసేనయ్యా. వాళ్ళు నిజంగా నిలబడి నీళ్ళు తాగడంతో సంతృప్తి పడితే మంచిదే! కానీ, అలాంటి వాళ్ళలో నూటికి తొంభైమంది థియరీ చెప్పినట్టుగా ప్రాక్టికల్‌గా నడుచుకోరు. పరుగెత్తి పాలు తాగేవాడిలాగ వీడు పరుగులు తియ్యడు. వాడు కష్టపడినట్టుగా వీడు చచ్చినా కష్టపడడు. కానీ, వాడు తాగే పాలు తనకీ కావాలని ఆశపడతాడు. అసూయపడతాడు. నీ విషయంలోనూ అదే పొరపాటు జరిగింది. హారిక భర్తతో నీకు పోలికటయ్యా? వాళ్ళ జీతం పదిహేనువేలు, కాబట్టి కారు మెయింటైన్ చేశారు. మీ యిద్దరి జీతాలూ కలిపితే మూడువేలు. అలాంటి మీకు కారెందుకయ్యా. ఇంక, మీ ఆవిడ! హారిక యింట్లో వుండే ప్రతీ వస్తువు తన యింట్లో వుందని కోతలు కోసింది. అది మీనోటి దురద! ఓసారి పొరపాట్న నోరు జారేశాం కదాని, ఆ అబద్ధాన్ని నిజం చెయ్యడానికి అప్పులు చెయ్యడాలు, అద్దెకి సామాన్లు తీసుకురావడాలు... యివన్నీ ఎందుకండీ? వుద్యోగస్థుల బడ్జెట్‌కి, గవర్నమెంటు బడ్జెట్‌కి ఫండమెంటల్‌గా ఓ తేడా వుంది. మన ఆదాయం ఎంతో చూస్కొని, మనం చేస్కొనే ఖర్చుల్ని లెక్కవేస్కోవడం మనం చెయ్యాల్సిన పని! ఖర్చు ఎంతవుతుందో ముందు లెక్క వేసి, దానికి తగ్గట్టుగా పన్నుల రూపంలో ఆదాయాన్ని సమకూర్చుకోవడం గవర్నమెంటు చేసే పని! కానీ మీరు గవర్నమెంటు పద్ధతిలో ఆలోచించి, ఘోరంగా దెబ్బ తినేశారు''

రాంబాబు గుటకలు మింగుతున్నాడు తప్ప నోటంట మాటరావడం లేదు. ఇంటి ముందు ఏదో జీపు ఆగిన చప్పుడు వినిపించింది. తమని అరెస్టు చెయ్యడానికి పోలీసులు వచ్చేరనుకుని అమల భోరుమంటూ ఏడ్చింది. కానీ, యింటిముందు ఆగింది జీపు కాదు, కారు! అందులోనించి హారిక ఓ బ్రీఫ్‌కేసు పట్టుకుని దిగింది. ఆమె వెంట తమ్మయ్యలింగం దిగాడు.

బ్రీఫ్‌కేసు పట్టుకుని లోపలకొస్తున్న హారికనే అందరూ ఆసక్తిగా గమనించారు. ఆమె వచ్చి రామారావుతో ఏవో సంజ్ఞలు చేస్తూ నిలబడితే జనంలో వున్న ఒకాయన సహనం చచ్చి అడిగాడు.

"ఇంతవరకూ ఈయన ఇచ్చిన లెక్చరూ బాగానేవుంది. ఈవిడొచ్చి ఈ రామారావుగారికి చేస్తున్న సైగలూ బాగానే వున్నాయి. కానీ మా బాకీ డబ్బు తీర్చే విషయం గురించి ఒక్క మాటా చెప్పరేవండి''



''మాకంటే, చీటీలు పాడేసుకుని చేతులు ఎత్తేసిన ఆ ఇద్దరే బెటర్‌లా వుంది''

వాళ్లని నవ్వుతూ చూసి హారిక అంది. ''సారీ ఫ్రెండ్స్. వాళ్లు మీకంటే బెటర్ అని పించుకోవడానికి వాళ్లేం నిజంగా ఎగ్గొట్టెయ్యలేదు. నా స్నేహితురాలు, ఒకప్పుడు నేను బీదరికంలో బతికినరోజుల్లో నాకింత తిండిపెట్టి, నాకు తన పాతబట్టలిచ్చి ఆదుకున్న అమలకి కనువిప్పు కలిగించడానికి రామారావు పూనుకుంటే ఆ పని నాకూ ఇష్టమే కాబట్టి నా యధాశక్తి నేనూ సహాయం చేశాను. మీతోపాటు ఈ చీటీపాటల్లో పాల్గొన్న నాగేంద్రకుమార్‌గాని, రఘుపతిగాని తర్వాత చీటీలకి డబ్బు ఎగ్గొట్టలేదు. నాగేంద్రకుమార్‌కి శంభల్‌పూర్ ట్రాన్స్‌ఫర్ అవడం నిజం. కానీ, తన ఎడ్రస్ తెలియకుండా దొంగాటలాడ్డం అంతా రామారావుగారి ప్లాన్. అలాగే రఘుపతిగారు ఉద్యోగంనించి సస్పెండ్ అవడం నిజం. కానీ మిగతా నెలలకి డబ్బు కట్టలేనని చెప్పడం మాత్రం మా నాటకంలోని భాగం మాత్రమే! అలాగే మా మరిది తీసుకున్న డబ్బుని తిరిగివ్వడానికి ఏవో కారణాలు చెప్పి ఆలస్యం చెయ్యడం కూడా రామారావుగారి సలహా ప్రకారమే నడిపించాను. మార్వాడీ వచ్చి వీళ్ల కారుని లాక్కోవడం కూడా మా పథకం ప్రకారమే జరిగింది'' అంటూ హారిక అమల దగ్గరకెళ్లి ''నేను చేసిందాంట్లో తప్పుంటే క్షమించు. ఇదిగో నీ దగ్గర తీసుకున్న అప్పు రెండు లక్షలు, ప్లస్ వడ్డీ, లెక్క చూస్కో'' అంటూ తన చేతిలో ఉన్న బ్రీఫ్‌కేసును ఆమె చేతికిచ్చింది. రెండు లక్షలు చేతికి అందినా రాంబాబు ముఖంలో లైటు వెలగలేదు. అది గ్రహించి రామారావు చిన్నగా నవ్వుతూ అతని దగ్గర కొచ్చేడు.

''నీ బాధ నాకు అర్థమైందయ్యా. ఇన్ని పరుగులూతీసి, ఇంత టెన్షనూ అనుభవించింది ఈ రెండు లక్షల కోసమే అయినప్పుడు ఈ డబ్బుని బాకీకింద జమకట్టెయ్యడమేమిటా అని బాధపడుతున్నావుకదూ. నీ బాధ తొలగే ఏర్పాటు కూడా నేను చేసేవుంచాను''

రాంబాబు తల ఎత్తి ఆసక్తిగా చూశాడు. ''ఔనయ్యా మీ చీటీపాట మెంబర్సంతా పెద్ద మనుషులే! వీళ్లని నీ మీదకిప్పుడు ఎగదోయడం కూడా నా నాటకంలో ఒక భాగమే. ఇకమీదట మీకు మీ ఉద్యోగాలుంటాయి. మీ చీటీపాట కూడా మళ్ళీ నడుస్తుంది. అయితే, ఆ చీటీల్ని మీరు నిర్వహించకూడదు కాబట్టి, మీ బదులు, ఈ మాజీ కౌన్సిలర్ తమ్మయ్య లింగం నిర్వహిస్తాడు. ప్రజాసేవ చేసే ఛాన్సు వస్తే దంచేస్తాను. పొడిచేస్తానూ అంటున్నాడు గదా. ఈ చీటీపాటని సక్రమంగా నిర్వహిస్తే, వచ్చే ఎన్నికల్లో ఇతన్ని పోటీలేకుండా కార్పొరేటర్ పదవికి గెలిపిస్తానని వాగ్దానం చేసి ఒప్పించాను. మీ రెండు లక్షలు మీకు అందాయి కాబట్టి, వీటితో ఏదైనా మంచి పనిచెయ్యండిగాని, దాంతో ఏ విమానమో, హెలికాప్టరో కొనుక్కోవాలని ప్రయత్నించకండి''

రామారావు మాటలకి అందరూ నవ్వారు. చలపతి, అచ్యుతానంద ఎప్పుడు వచ్చారో గాని, వాళ్ళూ ఆ జనంలో నిలబడ్డారు.

''మా వాడికి గ్రహస్థితి బాగులేక ఇలాంటి ఇబ్బందుల్లో పడ్డాడుగాని వాడి తెలివితేటలకే మందీ బంగారం'' అన్నాడు చలపతి, రాంబాబు చేతిలోనించి బ్రీఫ్‌కేసు తీసుకోబోతూ. కానీ రాంబాబు ఇవ్వలేదు. రామారావు ఇప్పుడు చలపతిమీద దృష్టి సారించాడు.

''మీవాడి గ్రహస్థితి సరే, మీ సంగతేమిటి? మీకు పనిగండం వుందా? ఉద్యోగం చెయ్యడం మీ ఒంటికి పడదా? పనిచెయ్యకుండా తిండి తినడంకూడా దొంగతనంకిందే లెక్కకొస్తుందని గాంధీగారు చెప్పారుకదండి. యాభైఎనిమిదేళ్లు దాటాక ఉద్యోగం చెయ్యకూడదు, అంతకుముందు పనిచెయ్యకుండా వుండకూడదు. అదే నా స్లోగన్. నాకు వయసయిపోయింది. ఇంక నన్ను నా కొడుకే పోషించాలని కబుర్లు చెప్పేవాళ్లంతా మా ఆఫీసులోని స్వీపరు పైడమ్మని చూసి బుద్ధి తెచ్చుకోవాలండి. ఆవిడకిప్పుడు అరవైరెండు సంవత్సరాలు. కొడుకులు, కోడళ్లు అందరూ వున్నారు. అయినాసరే, నా సంపాదనమీదే నేను బతకాలి తప్ప ఎవరికీ నేను భారం కాకూడదని నాతో చెప్పబట్టే ఆవిడ వయసుని చూడకుండా, కేవలం ఆవిడ ఆత్మగౌరవాన్ని గౌరవించి ఆ ఉద్యోగం ఇచ్చాను. ఆవిడ మీలాంటి బద్ధకస్తులకి ఆదర్శం''







చలపతి తల దించుకున్నాడు.

★ ★ ★

రాజాసీతారామదాసు, తను చెప్తున్న కథని ముగిస్తూ, "రామారావు ఆడిన నాటకంవల్ల రాంబాబులో పట్టుదల, కార్యదీక్ష పెరిగాయి. ప్రైవేటుగా చదివి పెద్ద డిగ్రీలు పాసయ్యాడు. ప్రస్తుతం ఓ ఇండస్ట్రీకి జనరల్ మేనేజరుగా వుంటున్నాడు" అన్నాడు.

"మీరు చెప్పిన కథ, రాంబాబు, అమలల్ని రిపైర్ చెయ్యడానికి రామారావు ఆడిన నాటకం, దాని ఫలితం అన్నీ బాగున్నాయి గాని, రామారావు పాత్రే సహజత్వానికి దగ్గరగా వున్నట్టులేదు" అన్నాడు రిటైర్డ్ ఆడిటరు.

సీతారామదాసు చిన్నగా నవ్వుతూ, గెడ్డం నిమురుకుంటూ "ఎందుచేత?" అన్నాడు.

"తన దగ్గర పనిచేసేవాళ్ల గురించి అంత శ్రద్ధ తీసుకునేవాళ్లు ఈ రోజుల్లో ఎవరుంటారండీ? వుండరు"

"అలా ఎందుకనుకోవాలి? మీరు చెప్తున్న ఈ రోజుల్లోనే రాజాసీతారామదాసు అనబడే నేను బతికే వున్నానుకదా?"

"భలేవారే సార్! మీరు బతికుండబట్టేకదా ఈ స్టోరీలన్నీ మాకు చెప్తున్నారు"

"నేను చెప్తున్నది కల్పించిన స్టోరీ కాదండీ బాబూ! వాస్తవంగా జరిగిందే. మీరు అసహజంగా వుందని చెప్పిన రామారావు పాత్ర నేనే. నా పూర్తిపేరు రాజాసీతారామదాసు అయినా, అందరూ నన్ను రామారావనే పిలుస్తారు. నేను చెప్పిన రాంబాబే ఇప్పుడు మా కంపెనీకి జనరల్ మేనేజరు. ఇంక అసహజం గురించి అంటారా, నేను రిటైరయిందగ్గర్నించి మీ అందర్నీ ముప్పూటలా మేపుతూ కథలు చెప్తూ కాలక్షేపం చెయ్యడం సహజమైన పనే అంటారా? అసహజమైన పనంటారా?" అతను సూటిగా, సీరియస్‌గా అడిగాడు.

"నిజంగా జరుగుతోంది కాబట్టి ఇది సహజం కిందకే వస్తుందండి"

"ఔనుగదా! అలాంటప్పుడు నా దగ్గర చేసేవాళ్లు తప్పు దారిన పడినప్పుడు వాళ్లని రిపైర్ చెయ్యడం కూడా నా బోటివాడికి సహజమే గదా?"

"ఔనండోయ్" అంటూ అందరూ బలవంతంగా నవ్వు తెచ్చుకుని నవ్వేశారు. అలా నవ్వకపోతే, నిత్యం భువన విజయంలో పండితగోష్టిలా సాగుతున్న ఈ కాలక్షేప కార్యక్రమాన్ని రేపట్నించి రద్దుచేసేస్తాడన్న భయమే వారిచేత అలా నవ్వించింది. ●

# నవ్వుల కత్తెలు

## మనీ మిరకిల్

వినాయక్ బరువుగా అడుగులు వేస్తూ ఆయాసంగా నడుస్తున్నాడు. పాపం అతని వయసు చిన్నదే. అయినా ఉన్నట్టుండి లావు పెరిగిపోవడం ప్రారంభించి వందకేజీలు దాటిపోయాడు. రోడ్డుమీద నడవాలంటే సిగ్గుపడే స్థాయికి వచ్చేశాడు. అతికష్టంగా తన భారీకాయాన్ని మోసుకుంటూ డాక్టరుగారి క్లినిక్‌కి వచ్చి రొప్పుతూ నిలబడ్డాడు.

అక్కడ పేషెంట్లు చాలామంది ఉన్నారు. వాళ్ల దగ్గర కూర్చోవడానికి సిగ్గేసి చాటుగా నిలబడ్డాడు. అందరూ వెళ్లిపోయేవరకూ ఉండి అప్పుడు డాక్టరుగారి రూంలోకి ప్రవేశించి 'నమస్కారం సార్' అన్నాడు.

తల ఎత్తి చూసిన డాక్టర్ పరమేశ్వర్ అదిరిపడి క్షణంలో తేరుకుని కుర్చీలో కూర్చోమన్నాడు. మళ్ళీ అంతలోనే వారించి పక్కనే ఉన్న బల్లమీద కూర్చోపెట్టేడు.

"చెప్పండి. ఏమిటి మీ బాధ?" అన్నాడు.

"ఏం చెప్పమంటారు సార్. నన్ను చూస్తున్నారుకదా. ఇదే నా బాధ. ఎందుకు ఇలా తయారయ్యానో బోధపడ్డంలేదు. ఈ లావు ఎలా తగ్గుతుందా అని బెంగపట్టుకుంది సార్. నేను చెయ్యని ప్రయత్నంలేదు. ఉదయం జాగింగ్ చేశాను. సాయంత్రం వాకింగుకెళ్ళా



ను. ఫిజియోథెరపీలో జాయినయ్యాను. ఆయుర్వేదం, హోమియోపతి చివరికి అల్లోపతి కూడా వాడాను. ఫలితంలేదు. విసుగొచ్చి అన్నం మానేశాను. నీరసం వచ్చింది తప్ప లావు తగ్గలేదు. నాకు దిక్కుతోచని పరిస్థితిలో ఎవరో పుణ్యాత్ముడు మీ పేరు చెప్పాడు. ప్లీజ్ డాక్టర్... నా లావు తగ్గేమార్గం చెప్పండి. మీ మేలు ఈ జన్మలో మర్చిపోను'' అంటూ ఆయాసంగా ప్రాధేయపడ్డాడు వినాయక్.

డాక్టర్ చూపులతో దీర్ఘంగా వినాయక్‌ని అంచనావేసి చిరునవ్వుతో చెప్పాడు- ''చూడండి మిస్టర్. మీరేమాత్రం వర్రీ అవ్వొద్దు. నేను ఇలాంటి కేసులు చాలా ట్రీట్ చేశాను. మీరు చేయవలసిందేమిటంటే ఓ పదిరోజుల పాటు హాస్పిటల్‌లో జాయిన్ అవ్వాలి. రోజూ నిద్రపోయేముందు నేనిచ్చే కాప్స్యూల్ వేసుకోవాలి. అంతే మీరు చెయ్యవలసింది. పదకొండోరోజుకి మీరు బరువు తగ్గిపోయి సన్నబడతారు'' అన్నాడు.

వినాయక్ నమ్మలేకపోయాడు. అతని మొహం చూసిన డాక్టర్ ''ఇక మీరేం ఆలోచించకండి. అన్నట్టు భోజనం కూడా ఏమాత్రం తగ్గించక్కర్లేదు. మీరు తప్పకుండా సన్నబడతారు. గ్యారంటీ'' అంటూ నమ్మకంగా చెప్పాడు. మారుమాట్లాడకుండా వినాయక్ ఆ సాయంత్రమే హాస్పిటల్‌లో జాయినయ్యాడు. పడుకునేముందు డాక్టరు పరమేశ్వర్ ఇచ్చిన కాప్స్యూల్ వేసుకున్నాడు, ఆ రాత్రి అతనికి ఒక కల వచ్చింది.

''వినాయక్ విశాలమైన సముద్రంమీద ఒంటరిగా చిన్న పడవలో ప్రయాణం చేస్తున్నాడు. అకస్మాత్తుగా మధ్యలో పడవ తిరగబడిపోయింది. అతిప్రయాసతో ఈదుకుంటూ చాలా సేపటికి ఒక్క దీవి చేరుకున్నాడు. దీవంతా చక్కని పరిమళాలు వెదజల్లే పూలతోటలతో నిండివుంది. లోపలకి ప్రవేశించాడు. వెనుకగా ఏదో చప్పుడయ్యింది. తలతిప్పి చూసి ఆశ్చర్యపోయాడు. కొన్త దూరంలో అర్ధనగ్నంగా అందమైన యువతి, చుక్కలమధ్య చంద్రుడిలా ఒంటరిగా కనిపించింది. వినాయక్‌ని చూడగానే చిరునవ్వుతో రమ్మని సైగ చేసింది. అతను పరిగెత్తాడు. ఆమె దూరంగా పారిపోయి మళ్ళా సైగ చేసింది. అతను వెంటపడ్డాడు. ఆమె మళ్ళా పారిపోయింది. ఇలా ఆమె వినాయక్‌ను దీవంతా పరిగెట్టిస్తూనే వుంది. అతడు ఆ వంపుసొంపులకి, అందానికీ దాసుడై ఆమెను తన సొంతం చేసుకోవాలని వచ్చే వగర్పును కూడా లెక్క చేయకుండా వెనుక పరిగెడుతూనే ఉన్నాడు''

కల చెదిరి కళ్ళు విప్పేసరికి తెల్లారిపోయింది. ఇలా పదిరోజుల పాటు కొనసాగింది. ప్రతిరోజూ కలలో ఆమే కనిపించి పరిగెట్టేది. వినాయక్ వెంబడించేవాడు. పదకొండోరోజు ఉదయం వినాయక్ అనుకోకుండా నిలువుటద్దంలో తనని చూసుకుని విస్మయం చెందాడు. తన కళ్లను తనే నమ్మలేకపోయాడు. బాగా లావు తగ్గిపోయి సన్నగా, నాజూకుగా ఉన్నాడు. బట్టలు లూజుగా వేలాడుతున్నాయి. సంతోషంతో డాక్టర్ని అభినందనలతో ముంచెత్తాడు.

వారం తర్వాత మిత్రుడు గణపతి, వినాయక్‌ను చూసి బోల్డంత ఆశ్చర్యపోయాడు. ''బాబ్బాబు నువ్వెలా సన్నబడ్డావో చెప్పి కొన్త పుణ్యం కట్టుకోరా. నా లావు తగ్గడానికి ఎన్ని అవస్థలు పడుతున్నానో చూస్తున్నావుకదా. అసలు ఇంత తొందరగా ఎలా బరువు తగ్గేవురా?'' అంటూ ప్రాధేయపడ్డాడు.

వినాయక్ డాక్టరు పరమేశ్వర్ గురించి చెప్పి జరిగింది వివరించాడు.

గణపతి ఆనందంగా మర్నాడే హాస్పిటల్లో జాయిన్ అయ్యాడు. రాత్రి భోంచేశాక కాప్స్యూల్ వేసుకుని పడుకున్నాడు. అతనికీ కల వచ్చింది.

''గణపతి సముద్రం మీద చిన్న పడవలో ప్రయాణం చేస్తున్నాడు. అకస్మాత్తుగా పడవ మునిగి పోయింది. అతిప్రయాసతో ఈదుకుంటూ ఒకదీవి చేరుకున్నాడు. చుట్టూ చూశాడు. ఎవరూ కనిపించలేదు. దీవంతా భయంకరమైన చెట్లతోనూ, పుట్లతోనూ నిండిపోయి పెద్ద అడవిలా ఉంది. లోపలికి ప్రవేశించాడు. వెనుకగా ఏదో చప్పుడయింది. తలతిప్పి చూసి అదిరిపోయాడు. ఒళ్ళంతా చెమటల్లు పట్టాయి. కాళ్లు గడగడ వణికాయి. నగ్నంగా పదిమంది అనాగరికులు బరిసెలు ఎత్తి పట్టు

కుని నిలబడి చూస్తున్నారు. అంతే. అతడు ప్రాణభయంతో పరిగెట్టాడు. వాళ్ళు గుండెలు అవిసేలా చంపండి, నరకండి అంటూ కేకలు వేస్తూ వెనకాతల పడ్డారు. గణపతి ఆపకుండా దీవిచుట్టూ పరిగెడుతూనే ఉన్నాడు. వాళ్లు కూడా వెంటాడుతూనే వున్నారు''

తెలతెలవారుతుండగా కల చెదిరిపో యింది. పదిరోజులపాటు ఇదే కొనసాగింది. పదకొండోరోజుకి గణపతి కూడా సన్నగా అయి పోయాడు. చాలా ఆనందం కల్గింది. కానీ కల తాలూకు భయం మనసులో ఉండిపోయింది. డిశ్చార్జ్ అయ్యాక వినాయక్‌ని కలుసుకుని జరిగింది చెప్పాడు.

''ఇద్దరం ఒకే డాక్టర్ దగ్గిర ట్రీట్‌మెంటు తీసుకున్నాంకదా. మరి మనకి వేరువేరుగా కలలు ఎందుకు వచ్చాయి. అందులోనూ నాకంత భయంకరమైన కలేంట్రా బాబూ'' అనడిగాడు.

వినాయక్ చిరునవ్వుతో ''మరేంలేదు. నేను డాక్టర్ పరమేశ్వర్‌గారి ఖరీదయిన ప్రవేటు నర్సింగుహోమ్‌లో జాయినయ్యాను. నువ్వు ఆయన పనిచేసే గవర్నమెంటు జనరల్ హాస్పిటల్లో జాయినయ్యావు. అదీ తేడా!!'' అన్నాడు.

మూర్ఛవచ్చినంతపనయ్యింది గణపతికి. ''కలలు కూడా డబ్బుని బట్టే మారిపోయేరోజులు వచ్చాయా...'' అంటూ నిట్టూర్చాడు.

-బళ్లా షణ్ముఖరావు

# అదీ సంగతి

వీరనాంచారి గొప్ప విప్లవ రచయిత్రిగా మోయలేనంత పేరు ప్రఖ్యాతులు గడించింది. ఆమె పగలనక, రేయనక కుడిచేత్తో, ఎడం చేత్తో రాసి పడేస్తుంటే పుస్తకాల షాపులనిండా పుంఖాను పుంఖాలుగా ఆమె రచనలే. ఆంధ్ర రచయితలందరి రచనలూ ఒక ఎత్తయితే వీరనాంచారి పుస్తకాలొక ఎత్తు. చిన్నా పెద్దా, ముసలీ ముతకా అనే భేదం లేకుండా అనేకమంది వీరనాంచారి వీరాభిమానులయ్యారు.



ఒకరోజు వీరనాంచారింట్లో పని మనిషి రాలేదు. వేసవి సెలవలు కావడంతో పిల్లలు ఊళ్ళకి వెళ్ళారు. భర్త బ్రహ్మానందం చాలా సేపు కాఫీ కోసం చూశాడు. పని మనిషి రాలేదని అర్థమైంది. భార్యామణి అంట్లు తోమడమంటే అంత తేలికవ్యవహారం కాదు. పెన్ను పట్టుకు గిలకమంటే నిమిషానికి నలభై మైళ్ళ స్పీడులో వెళ్ళిపోతుంది ఆవిడ కలం, కానీ పనులు చేయడంలోమాత్రం ఎదురుతిరుగుతుంది ఆవిడ కరం. లాభంలేదనుకుని, హొటల్లో కాఫీ తాగి వచ్చాడు.

"చూశావా, బ్రహ్మం! ఈ మనిషి ఇంకా రాలేదు"

బ్రహ్మానందం విననట్లు నటించాడు.

తనని తోమమంటుందేమోనని అతడి భయం.

"లేస్తూనే ఓ మాంఛి కథ రాయాలనుకున్నాను. కాఫీ తాగందే మూడ్ రాదు" విసుక్కుంది.

బ్రహ్మానందం పేపర్ చదవడంలో లీనమయ్యాడు.

"నీకేం చీమ కుట్టినట్టు లేదే" అరిచింది భర్త మీద.

"ఏ చీమా కుట్టలేదు"

"ఏడ్చినట్టుంది నీ బోడిజోకు. కాఫీ తాగొచ్చావా?"

"ఆఁ... ఎంతకీ పెట్టకపోతే"

"ఇదే పచ్చిస్వార్థమంటే. నాకు తేకూడదూ ఫ్లాస్కులో...?" అంతే బ్రహ్మానందం ఆవిడ ఉపన్యాసం ప్రారంభించకముందే కాఫీ తీసుకురావడానికి పరిగెత్తాడు.

ఇంతలో పనిమనిషి వచ్చింది.

"ఇప్పుడా రావడం" ఉరిమింది నాంచారి.

"మా అత్త కొట్టిందమ్మా"

నాంచారి పాతకోపం చల్లారిపోయి, కొత్త కోపం తెచ్చుకుంది. "సిగ్గులేదూ అలా చెప్పడానికి? అత్త కొట్టడమేంటి, ఎదురు తన్నకపోయావా?"

"ఊరుకోదమ్మా, అదో రాక్షసి"

"విప్లవమంటే ఏమనుకున్నావు, ఎదురుతిరగడమే. నే రాసేదంతా దానిమీదే. నీలాంటివాళ్ళు కళ్ళు తెరవాలనే నా ప్రయత్నం. సరే... ముందెళ్ళి ఆ అంట్లుతోము, తీరిగ్గా మాట్లాడ్తా" అంది.

ఆ తర్వాత కూడా గిరిజ అత్తమీద ఫిర్యాదులు చేసింది. ఒక్కో రోజు వచ్చేదేకాదు. పైపెచ్చు మరుసటిరోజు అత్త కొట్టినందుకు ఒళ్ళు నొప్పులు, కాళ్ళు నొప్పులు అంటూ మూలుగుతుండేది.

వీరనాంచారికి ఒళ్ళు మండిపోయేది. పని మనిషి గిరిజ అత్తని దుష్టపాత్రగా చిత్రించి అనేక కథలు అల్లింది. ఆవేశంగా ఆక్రోశించింది. బానిస బ్రతుకు బ్రతుకేకాదని గిరిజని చివాట్లు పెట్టింది వీరనాంచారి. చైతన్యం తెచ్చుకోమని హితబోధ చేసింది. అన్నీ నెమ్మదిగా వినేసి చివరికి 'నా వల్ల కాదమ్మా, అది రాక్షసి' అనడం గిరిజకు అలవాటయిపోయింది.

ఒకసారి గిరిజ వరసగా మూడ్రోజులు రాలేదు. ఈమధ్య వీరనాంచారికి గిరిజమీదకంటే రాకపోవడానికి కారణమయిన ఆమె అత్తమీద మరీ కోపమొస్తోంది. అంట్లు తోముతుంటే, ఇల్లు ఊడుస్తుంటే, బట్టలు ఉతుకుతుంటే- తనమీద తనకే చెప్పలేనంత జాలేసింది. ఆ సమయంలో తనెంత రాసుకోవచ్చు అని పదేపదే అనుకుంది. గిరిజ అత్తని వెనకటి రాజకుమారుల కథల్లోలా సీ.ఎమ్. ఇంటి ముఖద్వారం దగ్గర వేళ్ళాడేయాలి అనుకుంది నాంచారి కసిగా.

నాలుగోరోజు పక్కింటి వాళ్ళ పనిమనిషి సరోజని పిలిచి

"మా గిరిజ రావడం లేదు. కాస్త నువ్వెళ్ళి కనుక్కో. దాని అత్త పరమ రాక్షసట మళ్ళీ కొట్టిందేమో" అంది వీరనాంచారి.

సరోజ కిసుక్కున నవ్వింది.

నాంచారి చుర్రున చూసింది.

"దానికి అత్తే లేదమ్మా. పిల్లలు కూడా లేరు. మొగుడు శానా మంచోడు" అంది సరోజ. తెరుచుకున్న నాంచారి నోరుమూసుకోడానికి చాలా టైం పట్టింది.

-వి.నాగరత్న

# చతుర

# ఆడలేనురా గోపాలా పై సమీక్షలు

ఆగస్ట్ 'చతుర' మీకందించిన అమృతలాల్‌నాగర్ నవల 'ఆడలేనురా గోపాలా'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## పరాకాష్ట...!

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

ఆగస్టు చతుర నవల "ఆడలేనురా గోపాలా..." స్త్రీ పతనాన్ని మెట్టుమెట్టుగా పరాకాష్టకు చేర్చి చూపడంలో సఫలీకృతమైంది. కానీ ఆ పతనాన్ని గ్లోరిఫై చేయవల్సిన అవసరంగాని తత్ప్రయోజనంగాని కనిపించలేదు. రచయిత ఎంతగా నిర్గుణియా ప్రత్యేకతలను ఎత్తి చూపినా కథనాత్మక సంఘటనలు నిర్గుణియాపట్ల సానుభూతిని కల్గించలేకపోయినాయనే చెప్పాలి. ఆమె త్రాగుడును కూడా గొప్ప వేదాంతికతత్వంగా ఒప్పించబోయి బోర్లాపడ్డారు రచయిత.

అయితే సంఘంలో అంటరానివాళ్ళుగా ఉన్న పాకీవాళ్ళ జీవితాల్ని, వాళ్ళ ఆవేశానుభూతుల్ని పరితల కళ్లకు కట్టించడంలో రచయిత ప్రతిభ సర్వత్రా వెల్లడైంది. ఒక అట్టడుగువర్గం స్వాతంత్ర్యోద్యమానికి ముందు ఎదుర్కొన్న దయనీయ పరిస్థితులను స్వాంతంత్ర్యపు నెలలోనే అందించిన "చతుర" ఆలోచన బాగుంది. నిర్గుణియా కౌమారంలో సరైన అండ, అదుపు లేక మగవాడికి బలైపోయింది. ఆ తర్వాత కూడా ఆమె జీవన సూత్రం ఆమె ఆధీనంలో లేకుండా, గాలివాటుకు కొట్టుకుపోయిన ఉధృతమైన ఒత్తిడుల తుఫానును చాలా చక్కగా చిత్రించారు రచయిత. కులచేతన మనిషిని వదలదని మోహన్, నిర్గుణియా ఇద్దరూ నిరూపించేరు. బ్రాహ్మణ్యానికి భ్రష్టత్వానికి మధ్య ఆమె సంఘర్షణ, రక్తంలో ఇంకిన సంస్కృతి తాలూకు తిరుగుబాటు అత్యంత సహజంగా, సజీవంగా రూపుకట్టాయి. అయితే నిర్గుణియాలోని ద్వైదీతత్వం, నిలకడలేని దిగజారుడుతనం ఆమెను కొరుకుడుపడని పాత్రగా నిలబెట్టింది. పాఠాలు ప్రారంభించగానే మొదలు చేసిన పాకీపనిని అసహ్యించుకోవడం, చివరికి అందులోనే ముక్తినొందడం అయోమయంగా ఉంది. అలాగే మోహన్‌ను బందిపోటుగా మార్చడం దేనికో అర్థంకాదు. నవల ఆద్యంతం కలిగించిన హింస, ద్వేషం, జుగుప్స భావపరంపరలో నిర్గుణియా ఓటమి దళితజాతులపట్ల రచయిత ఆశించినట్లు సానుభూతి కలిగించలేదు. వాళ్ళు సమాజంలో ఒక వర్గంగా తప్ప జనజీవన స్రవంతిలో ఒకరన్న భావన కలగకపోవడం రచనలో పెద్ద లోపం.

మొత్తంమీద మంచి-చెడుల తూకంలో చెడువైపుకే మొగ్గుచూపినట్లుగా అనిపించే ఈ నవలలో శర్మగారిలా మంచిని మాత్రమే చూడగల్గితే ఫర్వాలేదు. విషయసేకరణకు పనికొచ్చే నవల అని మాత్రం చెప్పవచ్చు.

-పి.ఎల్. చూడామణి
పెరుమాళ్లపల్లి

## నాగరికతకే సిగ్గుచేటు!

(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

ఆడదాని బతుకులోని పరాధీనతను "ఆడలేనురా గోపాలా" నవలలో మనసుకు హత్తుకునేలా చిత్రించేరు. ఎంతటి ధర్మనిష్ట వున్నా





మరెంతటి ప్రజ్ఞ, దీక్ష ప్రదర్శించినా, బతుకులో కనీస సుఖాన్ని ఆశించి ఎన్నెన్ని కష్టాలకు నష్టాలకు తెగించి ధైర్యంగా నిలబడినా, మగవాడి అండలేకుండా ఆడది ఈ లోకాన్ని ఎలా యీదలేదో ఈ పాడు వ్యవస్థలో ఆమె శక్తిసామర్థ్యాలన్నీ ఎలా బూడిదలోపోసిన పన్నీరయిపోతున్నాయో, ఆమె చీకటి సముద్రంలో చిక్కుకుపోయి దాస్యంలో మగ్గిపోయి ఎలా హతమారిపోతుందో, ఎన్ని అవగుణాలు ఎంతటి దుర్మార్గం మూర్తీభవించి వున్నప్పటికీ మగవాడు ఎలా అధికారం చెలాయిస్తూ ఆడదాన్ని ఎలా అణిచి పెట్టగలుగుతున్నాడో నవలలో అడుగడుగునా సున్నితంగా మృదువుగా ఎత్తి చూపడంతో రచన చాలా ప్రయోజనకరంగా సాగింది.

స్త్రీల దారుణ పరిస్థితితో పోల్చినా కూడా మన సమాజంలో పాకీపనివారి పరిస్థితి పరమ దయనీయంగా వుంది. హరిజనోద్ధరణ ఉద్యమాలు ఒకపక్క స్వర్ణోత్సవాలు, వజ్రోత్సవాలు జరుపుకుంటున్నాయి. కానీ పాకీపనిని ఒక వృత్తిగా రద్దుచేయాలంటే ఇప్పటికీ వందలు వేలకోట్ల రూపాయలు అవసరమంటూ పథకాలు వల్లించే దశలో మాత్రమే వున్నాం మనం. ఈ సమస్య ఈనాడు మళ్ళీ కాంగ్రెసు పెద్దలకి ఓ పాపులర్ నినాదంగా ఉపయోగపడుతుంది. ప్రతివారూ ఫ్లషవుట్ లెట్రిన్‌లు కట్టించుకోండి అనే అతిచిన్న అభ్యర్థనను కూడా 45 ఏళ్ళ స్వాంతంత్ర్యం తీర్చలేకపోయింది. మన స్వాంతంత్ర్యానికి ఇంతకంటే పెద్ద వ్యాఖ్యానం ఏం వుంటుంది? లెట్రిన్‌లు కట్టించడానికి ప్రపంచ బ్యాంకునుండి కోట్లడాలర్లు అప్పు అడుక్కుని దాంతో నాయకులు, కంట్రాక్టర్లు బ్యాంకు బేలన్సులు భవనాలు కట్టుకోగలిగేటంతవరకూ ఎదిగాం. ఇలాంటి సమయంలో ఈ సబ్జెక్టుమీద నవల తెనిగించి అచ్చువెయ్యడం ఎంతైనా బావుంది.

సమాజాన్ని పట్టి పల్లారుస్తున్న రెండు పెద్ద సమస్యల్ని కథతో పెనవేసుకుపోయేలా చిత్రిక పట్టడంలో రచయిత గొప్ప నేర్పు చూపారు. అయితే ఆధ్యాత్మికత, బ్రాహ్మణ-సంస్కృత సాంప్రదాయికత సమస్యల వాడిని కొంత మెత్తబర్చాయనిపించింది. నవలకి నిర్గుణీయా అని పేరు పెడితే ఇంకా బావుండేదేమో!?

అనువాదం, స్వతంత్ర రచనే అన్నంతగా నప్పింది. చక్కటి నవల అందించినందుకు ధన్యవాదాలు.

-ఎం. హేమలత
మద్రాసు

## నూతన దృక్పథం!

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

"**ఆ**డలేనురా గోపాలా" ఆధునిక నవలా సాహిత్యంలో ఒక కొత్త దృక్పథంతో రాసిన నవలగా చెప్పుకోవచ్చు. ఈ నవలలో పాకీపని ఎంత కష్టమైనదో, ఎంత ఏహ్యామైనదో, ఎంత మానసికక్షోభ కల్గిస్తుందో సభ్య సమాజానికి తెలియజేయడమే రచయిత ఉద్దేశం. అందుకే నిర్గుణియా పాత్ర సృష్టించాడు రచయిత. ఆమెను బ్రాహ్మణకులంలో పుట్టించి పాకీకులంలోకి మార్చడానికి రెండు కారణాలుండవచ్చు. అసలు పాకీకులం అనేది ఒక కులం కాదు, అది బలవంతులు బలహీనులపై చేసిన శారీరక, మానసిక దాడివలన ఏర్పడిన ఒక మానవ సముదాయం అని చెప్పవచ్చు. నిర్గుణియా ఒకవేళ పాకీకులంలోనే జన్మించియుంటే ఆ పనిలో ఆమె అనుభవించే మానసిక క్షోభను వర్ణించడం సాధ్యమయ్యేదికాదు. ఉన్నత కులంలో పుట్టినవారికి ఇతరుల మలమూత్రాలు ఎత్తేటప్పుడు కల్గే తీవ్ర మానసిక క్షోభ పాకీకులంలోనే పుట్టిన అలవాటుపడిన వారిలో కలగదు.

రచయిత నేటి సమాజంలో పరతంత్రతకు దాస్యత్వానికి మారుపేరైన స్త్రీకి తగిన ఆశ్రయం లేకపోతే ఎలా తెగిన గాలిపటంలా మారుతుందో కూడా నిర్గుణియా ద్వారా చూపించారు. స్త్రీ యొక్క దయనీయమైన స్థితి ఉన్నతకులం నిమ్నకులం, హిందు-ముస్లిం తేడా లేకుండా అన్నింటా ఒకేవిధంగా ఉంది. స్త్రీని ఈ స్థితినుండి మార్చటానికి స్పష్టమైన, విధానపరమైన నిర్ణయాలు అవసరం. అప్పుడే స్త్రీకి సమానత్వం అధికారం దొరుకుతుంది. నవలలో రచయిత నాటి కాంగ్రెస్‌లోని బహన్



జీ-భాయిజీలాంటి పదాల వెనుకదాగిన కుళ్ళు సంస్కారాన్ని అస్పృశ్యతను, మతఘర్షణలను వటావంచలు చేశారు. దాదాపు 350 పేజీలున్న మూల నవలను చతుర కోసం సగానికిపైగా కుదించి అనువదించటంవల్ల పాఠకులాన్ని ప్రభావితం చేసే సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రాజకీయ స్థితిగతులను పూర్తిగా వివరించలేకపోయారు. కేవలం నిర్గుణియా పాత్రను మాత్రం అనువదించినట్టయి నవల సంపూర్ణతత్వాన్ని పొందలేకపోయింది. అయినా మొత్తానికి ''చతుర'' తను ప్రచురించే నవలలో వైవిధ్యముంటుందని మరో సారి నిరూపించింది. చతురకు, అనువాదకులకు ధన్యవాదాలు.

-నరశింహారావు కళ్యాణి
నారాయణపేట

## మహాప్రస్థానం

*(నాలుగవ బహుమతి రు:25/- పొందిన సమీక్ష)*

ఎన్ని దశాబ్దాలు, శతాబ్దాలు దాటినా కులాల మధ్య అంతరాలు మాత్రం మార్చలేనివిగానే మిగిలిపోతున్నాయి. ఒకవేళ ఎవరయినా మార్చడానికి ప్రయత్నించినా, సంస్కృతీ సంప్రదాయాలమధ్యగల భేదాలపేర ఎన్నో అగాధాలను సృష్టిస్తున్నారు.

ఒక ఉన్నత వంశంలోని యువతి వేరొక హీనకులస్తునిగా పరిగణించబడే ఒక యువకునితో మానసిక, శారీరక దౌర్బల్యానికి లోనై సహజీవనానికి సిద్ధపడినప్పుడు ఆమె అనుభవించిన మానసిక సంఘర్షణ ప్రతీ ఒక్క మనసునీ కల్లోలపరుస్తుంది. ఒక కులంనుండి మరొక కులానికి జరిగిన మహాప్రస్థానమే ఈ నవల సారాంశం.

ఈ నవలలోని కథానాయిక ఒక ఉన్నత వంశంలో జన్మించినా మానసిక బలహీనతతో తప్పటడుగు వేసిన ఒక దౌర్బల్య వనితే అనిపిస్తుంది.

పరిస్థితుల ప్రాబల్యంతో ఒక వృద్ధుడికి భార్య అయి శారీరక దౌర్బల్యంతో ఒక పాకీవాడితో లేచిపోయిందని అన్పించుకున్న మహిళ.

అంతేకాదు, ఒక బందిపోటు దొంగ భార్య - అయినా, అడుగడుగునా అవమానాలపాలౌతూ, అవహేళనలకి గురౌతూ, జీవితాన్ని ఒక ఛాలెంజ్‌గా తీసుకుని, ముందుకి సాగడంలో ఎంతో ధైర్యాన్నీ, తెగువనీ చూపుతూ ఎంతో వ్యక్తిత్వాన్ని ప్రదర్శించిన నిర్గుణియా పాత్ర చిత్రణలో రచయిత నేర్పు అభినందించవలసిందే.

పొన్నపల్లి పల్లవి
గుడివాడ

## ద్వంద్వ ప్రవృత్తి?

*(అయిదవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

**'ఆ**డలేనురా గోపాలా!' ఒక సామాన్య స్త్రీని ఉన్నత వ్యక్తిగా చిత్రీకరించడానికి ప్రయత్నించి విఫలమైంది.

ముసలి భర్తవల్ల తన యవ్వన సహజమైన కోర్కెలు తీరని నిర్గుణియా పాకీవాడైన మోహన్‌తో లేచిపోతుంది. బ్రాహ్మణస్త్రీ అయిన నిర్గుణ్ మోహన్‌ని పాకీవృత్తి మాన్పించి సంఘంలో ఒక గొప్పవ్యక్తిగా నిలపాలనుకుంటుంది.

నిన్నటివరకు నిర్గుణియా అతడికి యజమానురాలు. కానీ ఇప్పుడు అతనే (మోహన్) యజమానై ఆమెను బానిసను చేశాడు. సిగరెట్టుతో ఆమె బుగ్గలను కాల్చి ఆనందిస్తాడు. ఇంక నిర్గుణియా అతన్నేం మార్చగలదు? ఆవిధంగా ఆమె బతుకు దుర్భరమైంది. ఏ శారీరక సుఖాలకోసమైతే తహతహలాడి లేచి వచ్చిందో అవి కూడా మోహన్ బందిపోటుగా మారడంతో దూరమవుతాయి. మోహన్ బందిపోటుగా మారినవైనం నాటకీయంగా వుండి, రక్తికట్టలేదు. పాఠకులకు అయోమయాన్నే మిగిల్చింది.

ఒకానొక పరిస్థితిలో ఆమె బసంత్‌లాల్‌ను, ఎండర్‌సన్‌లను కూడా కోరుకుంది. తన ముసలి భర్త చనిపోయాడని తెలిసి తలస్నానం చేస్తుంది. నా మదిలో మోహనుడొక్కడికే స్థానం అనుకునే నిర్గుణ్ ఈ 'వింతప్రవర్తన' ఆశ్చర్యం గొలుపక మానదు.

ఇలాంటి ద్వంద్వప్రవృత్తిగల 'నిర్గుణ్'ను




రచయిత 'బురదలో తామర'గా వర్ణించడంలో అంతరార్థమేమిటో!

బానిసబతుకు వద్దని, స్త్రీలు స్వేచ్ఛగా జీవించాలని కలవరించే 'నిర్గుణ్' ధైర్యంచేసి బానిసత్వంనుండి ఎందుకు విముక్తురాలు కా లేకపోయింది? ఆమెకు పరిస్థితులు అందుకు అనుకూలంగానే వున్నాయికదా!

ఈ నవలలోని ముఖ్యమైన లోపమేమి టంటే- నవలను మక్కీకి మక్కీ తెలుగులోకి అనువదించడం.

నవలలో 'రచయిత' పాత్రను తీసివేసి, ఆత్మకథ ధోరణిలో నిర్గుణియా కథ చెప్పడమో లేక రచయిత కథ చెప్పడమో చేసివుంటే ఇంకా బావుండేది. 'రచయిత' పాత్ర 'నిర్గుణి యా'ను ఆకాశానికెత్తడమే పనిగా పెట్టుకుని పేలవంగా మారింది.

నిలువెల్లా కాముకత్వం మూర్తీభవించిన నిర్గుణియా పాత్రను ఉన్నత వ్యక్తిగా రంగు పులిమి చిత్రీకరిద్దామనుకున్న 'రచయిత' ఉద్దేశం నెరవేరలేదనే చెప్పాలి.

-రవితేజ
గద్వాల

## చెరగని ముద్ర

*(ఆరవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

**అ**మృతలాల్ నాగర్‌గారి 'ఆడలేనురా గో పాలా' వినూత్నమైన కథాఇతివృత్తంతోను, విశి ష్టమైన శిల్పంతోను, పాఠకుల మనోఫలకాలపై చెరగని ముద్ర వేసేలా వుంది.

ఈ నవల ప్రధానంగా రెండు సమస్యలను స్పర్శించింది. పాకీవాళ్ళు, ఆడవాళ్ళు, రచ యిత చెప్పినట్లు నేటికీ బానిసలుగానే బతుకు తున్నారు.

"... పాకీదానిగ ఆడిపోసికొను ఈ పాపిష్టి లోకమ్ము నీ బాకీ తీర్చుకొనంగ లేదు జన్మజన్మా లకునో" అన్నారు పాకీపిల్లను గూర్చి కరుణశ్రీ గారు.

బానిసత్వాన్ని, వెట్టిచాకిరీని నిషేధించా మని ప్రభుత్వం బాకాలు ఊది చెబుతున్నా ఒకపక్క నేటికీ పాకీపని కొనసాగుతూనే వుంది. ఆపనికంటే నికృష్టమైన బానిసత్వం ఏముంది? వారి జీవన విధానాన్ని స్టడీచేసి చక్కగా చిత్రీకరించారు ఈ నవలలో. మను ష్యుల బానిసత్వానికి ప్రతీకలైన పాతకాలపు మరుగుదొడ్లను పూర్తిగా రూపుమాపినప్పుడు పాకీవాళ్ళకు విముక్తి లభిస్తుందని నిర్గుణియా పాత్రద్వారా చెప్పినదే పరిష్కారమార్గం.

ప్రకృతిసహజంగా మనిషిలో చెలరేగే కోరిక లవలన కామాంధురాలై కాలుజారిన యువతు లకు ప్రతీక ఈ నవలలోని నిర్గుణియా. ఉన్నత వంశంలో జన్మించి, ఉన్నతభావాలు అలవర్చుకొన్నను, యవ్వనంలో తండ్రి ఉంపు డుగత్తె పెంపకంలోకి మారడంతో ఆమె జీవితం మలుపు తిరిగింది. అక్కడి అశ్లీల చేష్టలు, వాతావరణం ఆమె నైతికంగా పతనం కావడానికి కారణమైనాయి. శరీర వాంఛలు ఆమె పాకీయువకునితో లేచిపోవడానికి దారితీ శాయి. లేచిపోయిన స్త్రీలు సమాజంలో చరిత్ర హీనులుగా మిగిలిపోతున్నారు. మగవాడైతే ఎందరినైనా ఉంచుకోవచ్చు.

నిర్గుణియా మోహన్ పాకీవాడూ, బందిపో టు దొంగా అయినా అమితంగానే ప్రే మించింది. పాకీవృత్తిని అసహ్యించుకొన్నా, పాకీవాళ్ళను గౌరవించింది. వారిని ఉద్ధరించ డానికి నడుం బిగించింది. ఇన్‌స్పెక్టర్ బసంత్, క్రిస్టియన్ ఎండర్‌సన్ ప్రలోభాలకు ఆమె లొంగలేదు. నిర్గుణియా తనలోని కోరిక లను పొయ్యిలోని కట్టెలలాగా ఒక దగ్గరకు చేర్చి దాని సెగమీద తనను తాను కాల్చు కుంటూ, ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ఏర్పరచు కొంది. ఆత్మవిశ్లేషణ చేసుకొని తన నిజస్వరూ పాన్ని గుర్తించింది. తను ఎంచుకొన్న మార్గంలోనే చివరిదాకా పయనించింది. అందుకే ఆమె రచయితకు ఒక యోగినిలా, పంకజంవలె పవిత్రమైనదిగా కనబ డిందేమో!

నిర్గుణియాను విశిష్టవ్యక్తిగా తీర్చిదిద్దడమే ఈ నవలయొక్క గొప్పతనానికి కారణం. వసంతగారి అనువాదం బాగుంది. ఇంత మంచి నవలను అందించినందుకు 'చతు ర'కు కృతజ్ఞతలు.

-సారెడ్డి ప్రతాపరెడ్డి
హుజూర్‌నగర్

చతుర ఫీచర్

యదార్థగాథ

# విష నాగరాజ్

నవంబర్ 1991లో ఓ ఉదయాన్నే బెంగుళూరు పోలీసులకు ఓ శవం గురించిన సమాచారం అందినపుడు, అది సంచలనమైన కేసుగా మారుతుందని తెలియదు. మామూలుగా అప్పుడప్పుడూ కనిపించే అనాథ శవాల కేసులాగే అనుమానాస్పద మృతికి సంబంధించిన విషయంగానే భావించారు. ఐతే, ఆ శవం ఓ యువతిది కావటంతోనూ, మానభంగం జరిగిన అనుమానంవల్లా ముఖ్యంగా శవం గొంతుచుట్టూ చీర కొంగు చుట్టి వుండటం, గొంతు నులిమి చంపిన లక్షణాలు కనిపించటంవల్లా కొంచెం చురుగ్గానే వ్యవహరించారు పోలీసులు. ఆ శవం ముంజేతిపైన 'సిద్ధరాజు' అనే పేరు పచ్చబొట్టు కనిపించటంతో ఆమె సిద్ధరాజు భార్య అయివుండవచ్చునని అనుమానం వచ్చింది. బెంగుళూర్‌లో అదృశ్యమైపోయిన ఓ అమ్మాయి భర్త పేరు కూడా అదే కావటంతో ఆ దిశగా పరిశోధన మొదలెట్టారు పోలీసులు.

ఈ శవం విషయం పోలీసులు ప్రకటించిన వెంటనే, బెంగుళూరుకు చెందిన ఓ సాయంకాల పత్రిక ఒక క్లూ అందించింది. కనకపురలోని అంబేద్కర్ కాలనీ ప్రాంతం నుండి, బెంగుళూరుకు బంధువులతోపాటు వచ్చి అదృశ్యమైపోయిన ఓ నవదంపతుల అంతర్థానం విషయాన్ని గుర్తుచేసిందా పత్రిక. నవదంపతులతోపాటు వధువు అక్కా, చెల్లెలూ ఓ ఆటోలోనూ, యితరులు మరో ఆటోలోను కాటన్‌పేట ప్రాంతానికి బయలుదేరి వెళ్ళగా వధూవరులతోపాటు ఆ యిద్దరు యువతులూ ఏమైపోయారో తెలియరాలేదు. వాళ్ళు మళ్ళీ ఎవరికీ కనిపించలేదు. బెంగుళూరు పొలిమేరల్లోని యూకలిప్టస్ చెట్లమధ్య దొరికిన యువతి వీళ్ళలో ఒకరైవుండవచ్చునని పోలీసులు కూడా భావించారు. ఈ అంతర్థానం విషయాన్ని వధువు తండ్రి హెన్నయ్య, కెంగెరిగేట్ పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశాడు. బెంగుళూరు పోలీసులు హెన్నయ్యను పిలిపించారు. ఆ శవం తన కూతురు జయమ్మదని గుర్తించి బావురుమన్నాడు హెన్నయ్య. ఈలోగానే, జయమ్మ శవం దొరికిన పరిసరప్రాంతాలను క్షుణ్ణంగా గాలించిన పోలీసులకు మరో యువతి శవం కూడా, అదే లక్షణాలతో దొరికింది. జయమ్మతోపాటు అదృశ్యమైపోయిన హెన్నయ్యా మరో కూతురు గౌరమ్మదాశవం. నలుగురిలో యిద్దరు శవాలుగా దొరకటంతో, మిగిలిన కొత్తదంపతుల విషయంలో ఆందోళన అధికమయింది. ఆ నవదంపతులు ఏమైనట్టు?

జయమ్మ, గౌరమ్మ లిద్దరిపైనా అత్యాచారం జరిపి, వారి చీర కొంగులతోనే వాళ్ళను గొంతు నులిమి చంపారు. రెండు హత్యలూ ఒకే వ్యక్తి చేసినట్టు, కొన్ని ఆధారాలతో నిర్ణయించుకున్నారు పోలీసులు. అప్పటికే ఈ అంతర్థాన విషయాన్ని బెంగుళూర్ అడిషనల్ సూపరింటెండెంట్ ఎస్.కె. వేణుగోపాల్ సారథ్యంలోని బృందం పరిశీలిస్తూంది. అందులో యిద్దరు శవాలై దొరకటంతో, ఇలాంటి కేసులు అప్పటికే మరికొన్ని కూడా అపరిష్కృతంగా వుండటంతో డి.యస్.పి. టి.జయప్రకాశ్ వ్యక్తిగత శ్రద్ధ తీసుకుని ఈ కేసును పరిశోధించాడు. నలుగురూ అంతర్థానమైన వైనాన్ని ఆరాతీశారు పోలీసులు.

కనకపురకు చెందిన హెన్నయ్య, అక్కడి అంబేద్కర్‌నగర్ కాలనీలోని ఓ పాకలో కాపురం వుంటున్నాడు. అతని పొరుగున వుండే గోవింద అనే యువకుడి గుడిసెకు, గోవింద స్నేహితుడైన నాగరాజ్ అనే అతను వచ్చి, అతనితోపాటు వుండసాగాడు. నాగరాజ్ లారీ డ్రైవర్‌గా పనిచేస్తున్నాడనీ, అతను వధువు వేటలో వున్నాడనీ, తొందరలోనే కాలనీ వానులందరితోపాటు హెన్నయ్య కూడా గ్రహించా





డు. తను వాచ్‌మన్‌గా పనిచేస్తున్నాడు. నాగరాజ్ వయసు 27 ఏళ్ళు. ఐనప్పటికీ తన కూతురు, 18 ఏళ్ళ హొన్నమ్మను నాగరాజ్‌కిచ్చి పెళ్ళిచేయటానికి ఉత్సాహం చూపాడు హొన్నయ్య. నాగరాజ్‌కు చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోయారనీ, ఒంటిగాడనీ తెలిసింది. అంతేకాక కాలనీలోని వాళ్లందరితో కలిసి మెలిసివుంటూ, మంచివాడుగా అతికొద్ది రోజుల్లో పేరు తెచ్చుకున్నాడు నాగరాజ్ హొన్నయ్య ప్రతిపాదనకు సమ్మతించడమే కాకుండా, అతను యిస్తానన్న వెయ్యి రూపాయల కట్నం విషయంలో కూడా నాగరాజ్ బేరమాడలేదు. వధువుకు పెళ్ళిచీరతోపాటు, తాళి కూడా తానే కొని తెచ్చి, మరింత సంతోష పరిచాడు నాగరాజ్. ఈ సంబంధం హొన్నమ్మకు యిష్టంలేకపోయినా, బంధువులంతా కలిసి ఆమెను ఒప్పించారు. కనకపురలోని సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసులో నవంబర్ 4వ తేదీన పెళ్ళి జరిగింది.

పెళ్ళి జరిగిన కొద్దిరోజుల తరవాత, తను కొన్ని వస్తువులు కొనుక్కోవలసి వుందని చెప్పి, మామగారిదగ్గర 8 వందల రూపాయలు అప్పుగా తీసుకున్నాడు నాగరాజ్. కొనుగోలు కోసం బెంగుళూరు బయలుదేరుతూ, అక్కడ తన పిన్నివుందనీ, ఆమె దగ్గరికి తన భార్యతోపాటు, అందరూ వెళితే బావుంటుందనీ చెప్పటంతో హొన్నయ్య కుటుంబసమేతంగా బయలుదేరాడు. హొన్నయ్య, అతని మిగతా కూతుళ్ళు రాజమ్మ, జయమ్మ, గౌరమ్మ, అల్లుడు సిద్ధరాజు, దొడ్డతాయి అనే మరోబంధువూ, నాగారాజు, హొన్నమ్మలతోపాటు బెంగుళూర్‌లోని లక్కసంద్రకు బయలుదేరారు.

బెంగుళూర్‌లోని కాటన్‌పేట చేరుకోగానే హొన్నమ్మ, జయమ్మ, గౌరమ్మలతోపాటు నాగరాజ్ ఒక ఆటోలోనూ, మిగిలిన వాళ్ళు మరో ఆటోలోనూ బయలుదేరారు. దారిలో ఏం జరిగిందోకానీ ఆటోలు విడిపోయి, హొన్నయ్య, తదితరులు ఎక్కిన ఆటో లక్కసంద్రకు చేరుకుంది. మరో ఆటో జాడలేదు. నాగరాజ్ యిచ్చిన చిరునామాను బట్టి, అతని పిన్ని యిల్లు వెతకనారంభించారు హొన్నయ్య, తదితరులు. తమకన్నా ముందుగా వాళ్ళే చేరుకుని వుంటారని అనుకున్నారుగానీ, నాగరాజ్ యిచ్చిన చిరునామా తప్పుదని తెలిసిపోయింది. ఏమయిందో అర్థంకాలేదు. నాగరాజ్ తదితరులు ఎక్కిన ఆటో ఎంతకూ అడంగు చేరలేదు. దిక్కుతోచని హొన్నయ్య, తనలాగే తన అల్లుడూ తికమకపడి, తమ కోసమూ, చిరునామా కోసమూ వెదికి, తిరిగివెళ్ళిపోయి వుంటాడనుకుని కనకపురకు తిరిగి వెళ్ళాడు. వాళ్ళు అక్కడికి కూడా రాలేదు. రెండు, మూడు రోజులు గడిచినా వాళ్ళ జాడ తెలియకపోవటంతో, గత్యంతరంలేని పరిస్థితుల్లో కెంగిరి గేట్ పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశాడు హొన్నయ్య. ఆ రోజున నాగరాజ్, హొన్నమ్మలతోపాటు వెళ్ళిన జయమ్మ, గౌరమ్మల శవాలు లభించాయి. మరి నాగరాజ్, హొన్నమ్మలు ఏమైనట్టు?

ఈ కేసులో నాగరాజ్‌పైన అనుమానం కలిగింది డి.యస్.పి. జయప్రకాశ్‌కు. పెళ్ళిరోజు వధూవరులను తీసిన ఫోటోలోని నాగరాజ్ ఫోటో ప్రతులు పోలీసులందరికీ అందించి అన్వేషణ మొదలుపెట్టించాడు జయప్రకాశ్. నాగరాజ్‌కు సంబంధించిన మరిన్ని ఆధారాల కోసం ప్రయత్నించసాగారు పోలీసులు. ఈ తరుణంలో, అయ్యప్పస్వామి దీక్షలో వున్న ఓ వ్యక్తి హొన్నయ్య దగ్గరికి వచ్చాడు. తాను కొత్తనూరు నుండి వస్తున్నాననీ, హొన్నమ్మ పంపగా వచ్చాననీ చెప్పాడతను. తన భర్త తనను బంధించి హింసిస్తున్నాడనీ, తన అక్కపైనా, చెల్లెలిపైనా అత్యాచారం చేసి, వాళ్లను అతనే చంపాడనీ, ఆ పిచ్చివాడి బారినుండి తనను రక్షించవలసిందిగా తన తండ్రికి తెలియజేయమనీ హొన్నమ్మ వేడుకోగా తాను వచ్చాననీ అయ్యప్పస్వామి వివరించాడు. ఈ విషయాన్ని పోలీసులకు తెలియచేశాడు హొన్నయ్య.

ఎస్.పి. జయప్రకాశ్, అడిషనల్ ఎస్.పి. వేణుగోపాల్, ఆనెకల్ పోలీస్‌స్టేషన్ ఇన్‌స్పెక్టర్ చంద్రశేఖర్‌లతోపాటు ఒక పోలీసు బృందం కొత్తనూరులోని నాగరాజ్ స్థావరానికి ఈ సంవత్సరం ఫిబ్రవరి 20వ తేదీన వెళ్ళారు. నాగరాజ్ సులభంగానే లొంగిపోయాడు. తనకూ, హత్యలకూ ఎలాంటి సంబంధమూ లేదని వాదించాడు నాగరాజ్ కానీ తన చెల్లెలు




గౌరమ్మను తన కళ్ళ ముందరే మానభంగం చేసి, హత్య చేశాడన్న హొన్నమ్మ ప్రత్యక్షసాక్షాన్ని పోలీసులు విశ్వసించారు. అంతేకాక, తాను ఒక మామూలు హంతకుడితో వ్యవహరించటం లేదనీ, యిది జటిలమైన కేసనీ అనిపించింది డి.యస్.పి. జయప్రకాశ్‌కు.

ఫిబ్రవరి 1989 నుండి నవంబరు 1991లో గౌరమ్మ, జయమ్మల హత్యలు జరిగినప్పటిదాకా బెంగుళూరు, కోలార్, ధర్మపురి జిల్లాలలో అనేకమంది యువతులు మానభంగానికి గురై, చీరకొంగుతో గొంతు బిగించి చంపబడటం, ఆ కేసులు అపరిష్కృతంగా వుండటం అతనికి తెలుసు. ఆ హత్యలన్నీ కూడా గౌరమ్మ, జయమ్మల హత్యావిధానాన్నే పోలివున్నాయి. అందుచేత పోలీసులు, నాగరాజ్ అరెస్టు విషయాన్ని వెంటనే ప్రకటించలేదు. పదిరోజుల అనంతరం మార్చి 1వ తేదీన తమ పరిశోధనా వివరాల్ని పోలీసులు ప్రకటించగా కర్నాటక రాష్ట్రంతో పాటు, దేశమంతా నివ్వెరపోయింది. తాను కనీసం 24 మంది యువతులను అత్యాచారం జరిపి, హత్యచేశానని నాగరాజ్ పోలీసులకు చెప్పుకున్నాడు. కానీ ఈ సంఖ్య కనీసం 44 అయివుండాలనీ, అంతకన్నా ఎక్కువ కూడా అయివుండవచ్చుననీ పోలీసులు అంటున్నారు.(పోలీసులు అసలు నవంబర్ 1991లోనే నాగరాజ్‌ను అరెస్టు చేశారనీ, కానీ సాంకేతిక కారణాలవల్ల ఆ తేదీని ఫిబ్రవరి 20, 1992గా చెబుతున్నారనీ కొన్ని పత్రికల కథనం. ఈ మూడు నెలల కాలంలోనూ పటిష్టమైన కేసును సిద్ధంచేయటంలో, నాగరాజ్ అందించిన సమాచారాన్ని విశ్లేషించి, నిర్ధారించుకోవటంలో గడిచిందని అంటున్నారు. అలాగే, అయ్యప్పదీక్షలో వున్నవ్యక్తి హొన్నయ్యకు అందించిన సమాచారం ఆధారంగా నాగరాజ్‌ను అరెస్టుచేశారని కాక, పోలీసులు నాగరాజ్ ఫోటోల ఆధారంగా అతనికోసం చేపట్టిన గాలింపులో, ఆ ఫోటోలోని వ్యక్తిని కొత్తనూర్‌లో చూసిన ఓ పౌరుడు అందించిన సమాచారంతో తామే స్వయంగా వెళ్ళి, ఫిబ్రవరి 20, 1992న నాగరాజ్‌ను అరెస్ట్ చేశామని పోలీసువర్గాల కథనం).

అరెస్టు తరువాత నాగరాజ్ స్వయంగా తాను చేసిన హత్యల వివరాలను పోలీసులకు తెలిపాడు. ''ఈ హత్యలన్నీ ఎందుకు చేశానో నాకే తెలియదు'' అని కాసేపు, ''నేను ఎన్నడూ




హత్యలు చేయలేదు. నేను హత్యచేశానని పోలీసులు చెబుతున్న స్త్రీలలో ఎవ్వరినీ నేను కనీసం చూడనైనాలేదు'' అని కాసేపూ చెబుతున్న నాగరాజ్, మతిచాంచల్యం కలిగినవాడిగా కనిపించి, శిక్షనుండి తప్పించుకోవాలని చూస్తున్నాడని అంటున్నారు. ''అతని జ్ఞాపకశక్తి అమోఘం'' అన్నాడో పోలీస్ అధికారి. ఈ జ్ఞాపకశక్తితో, అతను అందించిన చిన్న చిన్న వివరాలనుసైతం యదార్థాలతో సరిపోల్చుకుని, నిజమేనని నిర్ధారించుకోగలిగామని పోలీసులు అన్నారు. ఎవరెవరిని, ఏయే పరిస్థితుల్లో, ఏవిధంగా చంపిందీ, కొన్నిసార్లు ఎవరెవరి సహాయం తీసుకుందీ పూసగుచ్చినట్టుగా వివరించాడట నాగరాజ్. అతను తనకు సహాయం చేసినవారిగా చెప్పినవాళ్ళల్లో చంద్రం, నాగరాజ్ అనే యిద్దరిని మాత్రం పోలీసులు అరెస్ట్‌చేయగలిగారు. మానభంగంవరకే తనకు తెలుసుననీ, హత్యల విషయం నాగరాజ్ ఆలోచనే అనీ, తమకు ఎలాంటి ప్రమేయం లేదనీ చెప్పుకున్నారు ఈ యిద్దరూ. ఒకటి తరువాత ఒకటిగా వరుసహత్యలు చేసినవాళ్ళు చరిత్రలో చాలామందే వున్నారుగానీ, వాళ్ళందరినీ మించి అత్యధిక సంఖ్యలో మానభంగంతోపాటు హత్యచేసినవాడు నాగరాజ్. బొంబాయిలో 1983 నుండి 1986 వరకూ 10 మందిని వరుసగా రాతితో తల పగులగొట్టి హత్యచేసిన 'స్టోన్‌మన్' జాడ పోలీసులకు తెలియలేదు. బొంబాయివాసులకు ఈ పీడ వదిలిందనుకుంటుండగా జూన్ 1989 నుండి 1990 ఆరంభంవరకూ కలకత్తాలో 11 మంది యిలాగే హతులయ్యారు. ఈ హంతకుడు కూడా యింతవరకూ పట్టుబడలేదు. ఈ యిద్దరూ ఒకరే అయివుంటారని అనుకుంటున్నారుగానీ, ఆ ఆలోచనతో అతను మళ్ళీ ఎక్కడ మొదలుపెడతాడోనన్న భయం కలిగి పోలీసులూ, పౌరులూ వణికిపోతున్నారు. ఆ హంతకుడు ఒకడే ఐతే బొంబాయి తరువాత కలకత్తాలో మొదలుపెట్టడానికి మూడు సంవత్సరాల వ్యవధి తీసుకున్నాడు. మళ్ళీ మొదలుపెట్టటానికి ఎంత వ్యవధి తీసుకుంటాడో తెలీదు. ఇలా వరుసగా హత్యలు చేసే 'సీరియల్ కిల్లర్స్'లో 'జాక్‌దరిప్పర్' అగ్రగణ్యుడు. ఇతను 1888లో ఆగస్టు మొదలుకుని నవంబర్‌కల్లా, నాలుగు నెలల్లో 7 గురు వేశ్యలను గొంతుకోసి చంపి, వాళ్ళ శరీరాలను ఓ పద్ధతిప్రకారం ముక్కలుగా కోశాడు. మానవ శరీరశాస్త్రంలో అనుభవజ్ఞుడైన ఓ సర్జన్‌లాగా ఎంతో నైపుణ్యంతో చేసిన ఆ మారణకాండతోనే అవన్నీ ఒక వ్యక్తే చేశాడని నిర్ధారించి, ఆ హంతకుడికి 'జాక్ ద రిప్పర్' అనే పేరు పత్రికలే పెట్టాయి. 'సీరియల్ కిల్లర్' అనే పేరు అతనితోనే వాడుకలోకొచ్చింది. అతన్ని అరెస్టు చేయలేని కారణంగా లండన్ పోలీస్ కమీషనర్‌తోపాటు, హోమ్ సెక్రెటరీ కూడా రాజీనామా చేయాల్సివచ్చింది. అంత సంచలనం కలిగించీ అజ్ఞాతంగానే వుండిపోయిన జాక్‌ద రిప్పర్ తరువాత అతని వారసులు కొందరు బయలుదేరి ప్రజల్లో భయాందోళనలు కలిగించిన సందర్భాలు చాలా వున్నాయి. వారిలో తాజా వ్యక్తి నాగరాజ్.

'సీరియల్ కిల్లర్స్' ఎందుకలా తయారవుతారు? వీళ్ళను గుర్తించటానికి వీలవుతుందా?- లాంటి ప్రశ్నలలో కొన్నింటికి నిపుణులు జవాబులు చెబుతున్నారు. వీటిలో చాలా ఆశ్చర్యకరమైనదేమిటంటే 'సీరియల్ కిల్లర్స్' అందరూ కూడా మచ్చలేనివారుగా కనిపిస్తూ, సందేహాస్పదమైన పనులు చేయకుండా, సాదా సీదాగా, వీలైతే మంచివారుగా, పెద్దమనుషులుగా, అమాయకులుగా కనిపిస్తుంటారు. ఈ హంతకుల వేటలో చాలామందిని మొదట్లో పోలీసులు అందరితోపాటు అనుమానించి, నిర్దోషులుగా భావించి వదిలేసిన ఉదంతాలెన్నో ఉన్నాయి. ఎందరో అమాయకులను ఎన్నో రకాలుగా అనుమానించి, నిఘాలువేసిన పోలీసులు, ముదిరేవరకూ అసలు హంతకులను అనుమానించలేకపోయారు. ఒక్కమాటలో చెప్పాలంటే 'మిస్టర్‌క్లీన్'గా కనిపిస్తారు వీళ్ళు. నాగరాజ్ కథనం ప్రకారం అతని మొదటిహత్య సుమతి అనే అమ్మాయితో ప్రారంభమయింది. పోలీసుల రికార్డులనుబట్టీ, నాగరాజ్ చెప్పినదాన్నిబట్టీ కూడా సుమతి హత్యకేసులో చాలామందితోపాటు నాగరాజ్‌ను కూడా పోలీసులు అనుమానంమీద ప్రశ్నించారు. కానీ తాను సుమతినెప్పుడూ చూడలేదని, అనుమానరహితంగా పోలీసుల్ని ఒప్పించి, నిర్దోషిగా

వదిలేయబడ్డాడు నాగరాజ్. అదే అతను చేసిన మొదటి హత్య అయితే, అతనిపైన పోలీసులు మరింత అనుమానపడివుంటే, ఎన్నో ప్రాణాలు బలికాకుండా ఆగిపోయేది. కానీ పోలీసుల తప్పుకన్నా, నేరస్తుని చాకచక్యమే గొప్పదవుతుంటుంది యిలాంటి కేసుల్లో. 'సీరియల్ కిల్లర్స్' అందరూ కూడా చాలా తెలివితేటలు గలవారని వారు హతులను ఎన్నుకోవడంనుండి హత్యచేసి, ఆధారాలు దొరకకుండా తప్పించుకోవటంతోపాటు, అనుమానంమీద అరెస్టయి, వదిలేయబడటంవరకూ నిరూపిస్తాయి. వక్రమార్గంలో మళ్ళిన తెలివితేటలే 'గొప్ప నేరస్తులను' తయారుచేస్తాయని మానసిక శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

మానసిక నేరస్తులందరి నేరాలూ బాధాకరమైన బాల్యంతో ముడిపడివుంటాయి. వారి నేర ధోరణులూ, మనస్తత్వాలూ, ముఖ్యంగా పేదరికం కష్టాలు, తండ్రి లేకపోవటం, తల్లివలన మానసిక, శారీరక హింసలకు గురికావటంలాంటివి. ఇలాంటి గతంతో ప్రారంభమయ్యే జీవితాల్లో, మతి చాంచల్యంతోనూ, అపరిపక్వ మేథస్సుతోనూ, అసాధారణమైన ఆలోచనా ప్రవృత్తితోనూ భవిష్యత్తులో నేరస్తులుగా మారేవారందిలోనూ ఆ కాఠిన్యం, కసాయితనం చిన్నప్పటినుండే కనిపిస్తాయి. కీటకాల్నీ పెంపుడు జంతువుల్నీ చిన్నపిల్లల్నీ దారుణంగా హింసిస్తుంటారు వీళ్ళంతా. ఈ ప్రాథమిక లక్షణాలు, జీవితంలో తరువాత ఎదురయ్యే అనుభవాలనుబట్టి కొందరిలో అణగారిపోతే, మరికొందరిలో వేళ్ళూనుకుని స్థిరపడి, నేరస్తులను చేస్తాయి. నేరస్తులంతా తప్పనిసరిగా మానసిక రోగులు కావాలని లేదుకానీ, ఇలాంటి విచిత్రమైన నేరస్తులలో చాలామంది మానసిక రోగులే. వీళ్ళలో విచిత్రమైన ఆలోచనలూ, నమ్మకాలూ, భ్రమలూ కనిపిస్తాయి. మనదేశంలోనే, 1960 దశకంలో 42 మందిని హత్యచేసి, 1969లో పట్టుబడిన రామన్‌రాఘవ, తననీహత్యలు చేయమని సూర్యభగవానుడు ప్రేరేపించాడనీ, ఆయన ఆదేశాలవల్లనే భారత, పాకిస్తాన్ యుద్ధం జరగకుండా వుండటానికి తాను ఈ బలులు చేశాననీ చెప్పాడు.

బొంబాయిని సంచలనంలో ముంచెత్తిన రామన్‌రాఘవను పిచ్చివాడిగా డాక్టర్లు నిర్ధారించటంతో కోర్టు అతనికి యావజ్జీవ కారాగారశిక్ష మాత్రమే విధించింది. పూనాలోవున్న యెరవాడ సెంట్రల్ జైల్‌లో శిక్ష అనుభవిస్తూ, కిడ్నీలు పాడవడంతో ఆమధ్యనే మరణించాడతను. అశరీరవాణి ఆదేశాలతో ఆరుగురు వ్యక్తులను హత్యచేసి, మరో ఏడుగురు వ్యక్తుల్ని హత్యాప్రయత్నంలో గాయపరచిన న్యూయార్క్ హంతకుడు డేవిడ్ బెర్కోవిజ్ కూడా మానసికరోగే. కానీ నాగరాజ్ మానసికరోగి అనుకోనవసరంలేదనీ, ప్రతీ 'సీరియల్ కిల్లర్' తప్పనిసరిగా పిచ్చివాడు కానవసరంలేదనీ మానసిక శాస్త్రజ్ఞులు, మానసిక వైద్యులూ అంటున్నారు.

సీరియల్ కిల్లర్స్‌లో కొందరు కేవలం స్త్రీలను మాత్రమే హత్యచేశారు. వీళ్ళంతా ఆ హత్యలతో మానసికంగా సెక్స్ సంతృప్తి పొందుతారని అంటున్నారు. రేప్‌చేసి, హత్యలు చేసినవాళ్ళలో 'బోస్టన్‌స్ట్రాంగర్'గా పేరొందిన ఆల్బర్ట్ డీసాల్వో ఒకడు. బోస్టన్‌లో 1962 ప్రాంతాల్లో 13 మందిని రేప్‌చేసి, గొంతు నులిమి చంపేశాడితను. ఇతని బాల్యం బాధాకరంగా గడిచిందే. తల్లీ, తండ్రీ యిద్దరూ ప్రతిరోజూ విపరీతంగా కొట్టేవారట ఆల్బర్ట్‌ను. నాగరాజ్ చేసిన అన్ని హత్యలూ స్త్రీలవే, ఒక్కటితప్ప. ఆ ఒక్కరినీ కూడా కక్షతో చంపానని చెప్పాడు నాగరాజ్. కోలార్ బంగారు గనులప్రాంతంలో, తనను కత్తిచూపి బెదిరించి వాచీ, ఉంగరంతోపాటు, బట్టలు కూడా దోచుకున్న బాషా అనే వ్యక్తిని, మరోసారి బస్సులో వెళుతూ గుర్తించి, అతన్ని కక్షతో హత్యచేసినట్టు చెప్పాడు నాగరాజ్. కానీ దీన్ని పోలీసులు విశ్వసించటంలేదు. ఎందుకంటే, కొన్ని హత్యలతర్వాత, ఎప్పటిలాగే ఊరు మారి, కోలార్ బంగారుగనుల దగ్గరి బంగారుపేటకు మారిన నాగరాజ్, అక్కడ క్యాజువల్ లేబర్‌గా బతకటం ప్రారంభించి, జేబులు కొట్టటం, దొంగతనాలు చేయటం కొనసాగించాడు. అదే కాలనీలో, ఇటుకల ప్యాక్టరీలో కూలీగా పనిచేస్తున్న బాషా, అతని భార్య నూర్‌జహాన్ కాపురముంటున్నారు. బాషాతో స్నేహం కలుపుకున్న నాగరాజ్, 23 ఏళ్ళ నూర్‌జహాన్‌తో చాలా చొరవగా ప్రవర్తించేవాడు. ఈ విషయంలో




అతన్ని ఓసారి బాషా హెచ్చరించగా, నూర్జహాన్ తన చెల్లెలిలాంటిదనీ, ఆమెపట్ల తనకు ఎలాంటి దురూహలూ లేవనీ చెప్పి నమ్మించాడు నాగరాజ్. ఆ తర్వాత ఓరోజు రాజా అనే తన స్నేహితుడ్ని వెంటబెట్టుకుని బాషా యింటికి వెళ్ళాడు. (నాగరాజ్ సహాయకుల్లో ఒకడిగా అరెస్టయ్యాడు రాజా). బాషాకు 'దావత్' యిస్తానని చెప్పి, అతన్ని వెంటబెట్టుకుని, హెూటల్కు బయలుదేరతీసి, దారిలోనే హత్యచేశాడు. ఈ హత్య కూడా బాషా పాంటు బెల్టుతో గొంతు బిగించి, తన పద్ధతిలోనే చేయటంవల్ల కూడా తనను దోచుకున్నాడన్న కక్షతో చంపాననే నాగరాజ్ వాదాన్ని పోలీసులు విశ్వసించటంలేదు. అంతేకాక, బాషాను చంపినవెంటనే తిరిగి వెళ్ళి, నూర్జహాన్ను బలవంతంగా ఎత్తుకుపోయారు నాగరాజ్, రాజాలు. ఆమెను ముందుగా రాజా బలవంతంగా అనుభవించిన తరువాత నాగరాజ్ తాను కూడా ఆమెపై అత్యాచారం జరిపి, ఆమె పైటతోనే గొంతుబిగించి, చంపేశాడు. నాగరాజ్ చేసిన ప్రతీ హత్యా మృతురాలి పైటతో గొంతుబిగించి చేసిందే. బాషాను కూడా అతని బెల్ట్తోనే ఉరి బిగించి చంపాడు. గొంతు నులమటంలో ఆనందం పొందుతూ, హతులు పొందే బాధను కళ్ళారా చూసి, పైశాచికానందం పొందటమే నాగరాజ్ ధ్యేయమని పోలీసుల వాదన. హతురాలి ఛాతీపై కూర్చుని, ఆమె కట్టుకున్న చీరనే గొంతుచుట్టూ బిగించి, ముందుకు వంగి, ముడి బిగదీయడంతో, హతుల బాధను అతి దగ్గరగా చూడగలిగే అవకాశం వుండటంవల్లనే, అతను చంపటానికి ఈ మార్గం ఎన్నుకుని వుంటాడని అంటున్నారు. ఒక్క బాషాను తప్పిస్తే, అందరూ స్త్రీలనే హత్యచేసిన నాగరాజ్, తను పెళ్ళాడిన యువతులనుమాత్రం చంపకపోవటం విశేషమే. ఇది అంతుపట్టని విషయం. ఈ విషయంలో నాగరాజ్ వివరణకోసం, మానసిక నిపుణుల విశ్లేషణకోసం చూస్తున్నారు పోలీసులు.

తమ అన్వేషణలో భాగంగా, నాగరాజ్ కుటుంబసభ్యులను కలుసుకున్నారు పోలీసులు. నాగరాజ్తో తమకు ఎలాంటి సంబంధమూ లేదని చెప్పారు. ఓ క్వారీలో పనిచేస్తూ జీవితం నెట్టుకొస్తున్న అతని తల్లీ, ఇద్దరు అన్నదమ్ములూ, ఇద్దరు అక్కచెల్లెళ్ళూ కూడా తమను వేధించవద్దని వేడుకున్నారు. చాలా సంవత్సరాల కిందటే తమను వదిలేసిన నాగరాజ్తో యిప్పుడు తమను ముడిపెట్టటం వల్ల అవమానభారం తప్ప తమకు ఒరిగేదేమీలేదనీ, అతనితో తమకు అవసరంలేదనీ అన్నారు వాళ్ళంతా.

సెల్వాన్, కుమార్ అనే పేర్లతో కూడా వ్యవహరించిన నాగరాజ్, 27 సంవత్సరాల కిందట తమిళనాడులోని బందెహాళ్ళి అనే ఊళ్ళో పుట్టాడు. అతని తండ్రి కరియప్పకు రాళ్ళు కొట్టుకోవటం జీవనాధారం. భార్య, ముగ్గురు కొడుకులూ, ఇద్దరు కూతుళ్ళూ వున్న కరియప్ప, తన చాలీచాలని సంపాదనలో ఎక్కువ భాగం తాగుడుకే ఖర్చుపెట్టాడు. పిల్లల్ని విపరీతంగా కొట్టేవాడు. నాగరాజుకు ఐదేళ్ళవయస్సులో, కుటుంబంతోపాటు బెంగుళూరుకు మారాడు కరియప్ప. పొట్ట పోసుకోవటానికి స్థిరమైన ఉద్యోగమేదీ దొరక్క, అడపాదడపా సంపాదించినదంతా తాగి, తాగుబోతుగా ఉద్యోగానికి అనర్హుడుగా మారాడు. లివర్ పాడైపోవడంతో కరియప్ప కొన్నేళ్ళలో చచ్చిపోయాడు. దాంతో నాగరాజుకు మరికొంత స్వేచ్ఛ వచ్చింది. బతుకుతెరువుకోసం ఏదో ఒకటి చేయవలసి వచ్చింది. కానీ ఏం చేశాడో ఎవరికీ తెలియదు. చిన్నతనంలో తాను ఏం చేసిందీ చెప్పటానికి నాగరాజ్ యిష్టపడటంలేదు. మూడు నెలలపాటు పోలీసులు జరిపిన తీవ్ర పరిశోధనలో కూడా నాగరాజ్కు ఉద్యోగం యిచ్చిన ఒక్క మనిషిగానీ, అతను ఉద్యోగం చేసిన ఒక్క ఆధారం కానీ లభించలేదు. దీన్నిబట్టి చిన్నతనంలోనే నేరాలకు పాల్పడి వుంటాడని నిర్ధారించుతున్నారు పోలీసులు.

క్వారీలో రాళ్ళు కొట్టటం యిష్టంలేని నాగరాజ్, బెంగుళూర్ నగర పొలిమేరల్లో తన కుటుంబాన్ని విడిచి, నగరంలోకి ప్రవేశించాడు. కొన్నాళ్ళు కూలీగానూ, ఆ తరవాత ఆటో డ్రైవర్గానూ పనిచేశానని చెవుతున్నాడతను. అతని 23వ ఏట, తన ఆడపడుచు మంజమ్మతో పెళ్ళి సంబంధం కుదిర్చింది నాగరాజ్ అక్క. పెళ్ళిచేసుకున్నాడు. చెప్పాపెట్టకుండా

రోజులతరబడి కనిపించకుండా పోయేవాడు. వచ్చిన తరవాత మాత్రం, ఒక్కోసారి పెద్దమొత్తాలలో డబ్బు తెచ్చి, ఖర్చుపెట్టేవాడు. ఈ విషయాలు భార్య ఆరాతీస్తే, తను బాంబే లాంటి ప్రదేశాలకు లారీ నడిపాననీ, అందుకు ముట్టిన ప్రతిఫలమనీ చెప్పేవాడు. అతను లారీ నడపగా చూసిన వాళ్ళెవ్వరూ లేరు. తనకు లారీ నడపటమే రాదని పోలీసులతో చెప్పాడు నాగరాజ్. ఐతే ఈ పెళ్ళి ఎక్కువ రోజులు నివలలేదు. గర్వేబావిపాల్యకు చెందిన ఈ మంజమ్మను తొందరలోనే వదిలేశాడు. ఆమె దగ్గరున్న కొద్దిపాటి నగదూ, నగలూ కాజేసి, బెంగుళూర్‌కు వెళ్ళిపోయాడు. బెంగుళూర్ రైల్వేస్టేషన్‌లో దొంగతనాలు చేసి వుండాలని పోలీసుల వాదం. రాజా, చంద్ర అనే రైల్వే దొంగలతో పరిచయం కలిగింది. వీళ్ళు, అజాగ్రత్తగా వున్న ప్రయాణీకుల సామాన్లు దొంగిలించడం , జేబులు కొట్టటం లాంటివి చేసేవాళ్ళు. ఇంతేకాక బెంగుళూరులో ట్రెయిన్ దిగిన వారిలో కొత్తగా వచ్చిన తమిళ ప్రయాణీకులను గుర్తించి, వారికి ఊరు చూపించటమో, అడ్రెస్ చెప్పటమో లాంటి మిషతో ఏకాంత ప్రదేశాలకు తీసుకువెళ్ళి, కొట్టి, సామాన్లు, నగలూ, డబ్బూ దోచుకోవడం, స్త్రీలనైతే బలాత్కారం చేయటం కూడా చేసేవారు. ఈమధ్యలో, బలాత్కారంతోపాటు హత్య కూడా చేయాలనే ఆలోచన నాగరాజ్‌కు ఎప్పుడు కలిగిందో చెప్పటం కష్టం. ఎందుకంటే, బెంగుళూర్‌లోని మెజెస్టిక్ ఏరియాలో తప్పిపోయిన సుమతి అనే అమ్మాయితో తన మారణకాండ ప్రారంభించానని నాగరాజ్ చెబుతున్నాడు. ఈ సంఘటన 1989లో జరిగింది. కానీ, ఇలాంటి హత్యోదంతాలు 1987 నుండీ పోలీసుల దృష్టికి వచ్చాయి. ఐతే, మానభంగం వరకూ తన అనుచరుల ప్రమేయం వుంది కానీ, తను చంపిన ప్రతి స్త్రీనీ తానే స్వయంగా చంపాననీ, అందులో తన అనుచరులకెవరికీ భాగం లేదని చెప్పుకున్నాడు నాగరాజ్. ఇది మాత్రం పోలీసులకు కూడా నమ్మశక్యంగానే వుంది.

తన మారణహోమంలో తొలి సమిధగా నాగరాజ్ చెప్పుకున్న సుమతి 17 ఏళ్ళమ్మాయి. దక్షిణ కన్నడ జిల్లాలోని కుందపురకు చెందిన సుమతి, మత్తికేరెలో వున్న తన అక్కాబావలతో కొన్నాళ్ళుండటానికి ఫిబ్రవరి 1989లో బెంగుళూర్‌కు వచ్చింది. కాస్త మేద కురాలయిన సుమతికి కొద్దిగా నత్తి కూడా వుంది. మే నెల 19వ తేదీన తన అక్క, మరికొందరితోపాటు మెజెస్టిక్ ప్రాంతంలోని ఓ థియేటర్‌లో ఓ కన్నడ సినిమా చూసి, యింటికి బయలుదేరిన తరవాత, సుభాష్‌నగర్ టెర్మినస్ దగ్గర క్రిక్కిరిసిన జనసమ్మర్దంలో తన వాళ్ళ నుండి విడిపోయింది. ఆ మహానగరంలో యింటికి ఎలా చేరుకోవాలోనన్న ఆలోచనతో భయాందోళనలతో, పిచ్చిదానిలా కంగారుగా తిరుగుతున్న సుమతి, నాగరాజ్ కంటపడింది. ఇలాంటి విషయాల్లో అప్పటికే ఆరితేరిన నాగరాజ్ మిత్రులతో ప్రణాళిక సిద్ధమయింది. నాగరాజ్, సుమతి దగ్గరికెళ్ళి విషయం ఆరా తీశాడు. తాను తప్పిపోయానని చెప్పుకుంది సుమతి. ఆమెను ఇల్లు చేరుస్తానని చెప్పి, దగ్గర్లో వున్న ఆటో దగ్గరికి తీసుకెళ్ళాడు. వీళ్ళిద్దరితోపాటు మరో ముగ్గురు కూడా అదే ఆటోలో బయలుదేరారు. వారిలో (ప్రస్తుతం కస్టడీలో వున్న) చంద్ర కూడా వున్నాడు. బెంగుళూరు పొలిమేరల్లోని మడివల ప్రాంతంలోని మంగమ్మనపాల్య సమీపానికి వెళ్ళింది ఆటో. నాగరాజ్‌తోపాటు అతని ముగ్గురు సహచరులూ సుమతిపై మూకుమ్మడిగా అత్యాచారం జరిపారు. ఎప్పటిలాగే మానభంగంతో ఆగిపోకుండా, సుమతిపైటను ఆమె గొంతుచుట్టూ బిగించి, ఆమెను హత్య చేశాడు నాగరాజ్. మరునాడు సుమతి శవం జాడ తెలిసింది పోలీసులకు. అప్పటికే సుమతి తప్పిపోయిన విషయం ఉప్పర్‌పేట్ పోలీస్‌స్టేషన్‌లో రిపోర్టు చేశాడు ఆమె బావ. అనుమానంతో పిలిపించి, చూపించగా, ఆ శవం తన మరదలిదేనని గుర్తించాడు సుమతి బావ. అంతేకాదు, సుమతి ఒంటిమీదుండాల్సిన నగలు కూడా లేవని గుర్తించి, ఆ విషయం కూడా పోలీసులకు తెలిపాడు. నాగరాజ్‌కూ, యితర 'సీరియల్ కిల్లర్స్'కూ వున్న ప్రధానమైన తేడాల్లో యిదొకటి. 'సీరియల్ కిల్లర్స్'లో కొందరు హత్యలు మాత్రమే చేయగా, కొందరు మానభంగమూ, హత్యా రెండూ చేశారు. అమెరికాకు






చెందిన జెఫ్రీ డామెర్‌లాంటి వాళ్ళు కేవలం మగవాళ్ళనే చంపారు. అందులో, ఈ జెఫ్రీ డామెర్‌ది మరింత విచిత్రమైన కేసు. ఇతను ముందు హత్యచేసి, ఆ పురుషుల శవాలతోనే సంభోగం జరిపి, వాళ్ళ శరీర భాగాలు కొంత మేరకు తిని, మరికొన్నింటిని జాగ్రత్తగా, తన హత్యా చిహ్నాలుగా దాచుకున్నాడు. మిల్‌వాకీలోని అతని అపార్ట్‌మెంట్‌ను సోదాచేసిన పోలీసులకు కనీసం 15 శవాలకు సంబంధించిన తలలూ, గుండెకాయలూ, ఎముకలూ లాంటి శరీర భాగాలు ఫ్రిజ్‌లోనూ, యాసిడ్ పీపాలలోనూ కనిపించాయి. కానీ వీరెవ్వరిలోనూ శవాలను దోచుకోవటం మాత్రం లేదు. కానీ నాగరాజ్ మాత్రం తాను చేసిన ప్రతి హత్యలోనూ హతురాలి ఒంటిమీదున్న చిన్న చిన్న వస్తువుల్ని కూడా దోచుకున్నాడు. తన వాతపడిన వారి శరీర భాగాలను స్మృతిచిహ్నాలుగా దాచుకున్నా జెఫ్రీడామెర్‌లాగా ఈ వస్తువులను నాగరాజ్ దాచుకున్న దాఖలాలేవీ లేవు. ఆయా వస్తువులను అయినకాడికి అమ్మేసి, ఆ డబ్బుతో జల్సా చేసేవాడు నాగరాజ్. కిడ్నాప్, మానభంగం, దోపిడీ, హత్యానేరాలతో సుమతి కేసును పరిశోధించటం మొదలెట్టిన పోలీసులు, అనుమానంతో అరెస్టుచేసిన వారిలో నాగరాజ్‌కూడా వున్నాడు కానీ, అతను చెప్పినవి నమ్మటం తప్ప, అతనికి వ్యతిరేకంగా తమవద్ద ఆధారాలు కానీ, కనీసం గట్టి అనుమానం కానీ లేని పోలీసులు అతన్ని వదిలేశారు. కొన్ని వారాల తరవాత అపరిష్కృత కేసుల్లో చేరిపోయింది సుమతి కేసు. అది మొదలు. అక్కణ్నించి, గౌరమ్మ, జయమ్మల హత్యలు జరిగేవరకూ నాగరాజ్ మారణకాండ నిరాటంకంగా సాగిపోతూ, అపరిష్కృత కేసుల సంఖ్యను పెంచుతూ పోయింది.

నాగరాజ్ కాటుకు బలైపోయిన వారిలో అధిక సంఖ్యాకులు వేశ్యలే. ఇప్పటికి అతను ఒప్పుకున్న 24 హత్యల్లో 16 మంది మృతులు వేశ్యలు. అతను వేశ్యలను ఎంచుకోవటానికి కారణం ఏమిటి? సెక్సుకు సంబంధించి మానసిక వైపరీత్యం వున్నవారు తమ విపరీతమైన కోరికలను తీర్చుకోలేక 'సీరియల్ కిల్లర్స్'గా మారిపోతారనేది ఒకటి. సెక్సు పరంగా చేసిన, లేదా చేశానని భ్రమించిన విపరీతాలవలన కలిగే మానసిక అపరాధ భావనను, శరీరాన్ని అమ్ముకునే వేశ్యలతో ముడిపెట్టి, అలాంటి

'పాపులను' చంపటం ద్వారా తమలోని అపరాధ భావనను తగ్గించుకునే ప్రయత్నం చేయటంతో వరుస హత్యలు చేస్తారనేది మరొకటి. జాక్‌ద రిప్పర్ చేతిలో మరణించిన వారందరూ వేశ్యలే. కానీ నాగరాజ్ విషయంలో మాత్రం అధిక భాగం వేశ్యలు. వారు కాక అవివాహితులు, వివాహితులు కూడా అతనికి బలయ్యారు. ఈ విషయంలో పోలీసులు మరొక విధంగా చెబుతున్నారు. 'సీరియల్ కిల్లర్' దృష్టి ఎప్పుడూ వీలైనంత మందిని చంపటంపైనే వుంటుంది. సాధారణంగా వీళ్ళంతా తెలివైన వాళ్ళే అయివుంటారు. ఈ రకంగా ఆలోచిస్తే, తను చేసే హత్య తనను పట్టించేదిగా వుండకూడదు. అంటే, సంసారపక్షమైన వాళ్ళ జోలికి వెళితే, హతురాలి బంధువులు హత్యా పరిశోధన విషయమై పోలీసులపై ఒత్తిడి తెచ్చే ప్రమాదం వుంది. అలాకాక వేశ్యల విషయంలోనైతే ఈ ప్రమాదం లేదు. సాధారణంగా వేశ్యలందరూ కుటుంబ సంబంధాలు లేని వాళ్ళయి వుంటారు. ఒక వేళ వున్నా అవి అంత గాఢంగా వుండవు. కొద్ది రోజులు కనిపించక పోయినా వేశ్య గురించి పట్టించుకునే వాళ్ళుండరు. అసలు కనిపించకపోయినా, మరెక్కడికో ఎవరితోనో వెళ్ళిపోయిందనుకుంటారు. ఈ విధంగా హత్యనుండి దూరంగా పారిపోయేందుకు తగినంత సమయం వుంటుంది. మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే, ఎప్పుడో ఓ సారి ఎదురయ్యే సుమతిలాంటి అమాయకులను తప్పిస్తే, ఓ అపరిచితుడితో ఏ సమయంలోనైనా, ఎక్కడికైనా, నిరభ్యంతరంగా వెంటవెళ్ళగలిగేది వేశ్య ఒక్కరే. అందుకే తన హతురాళ్లలో ఎక్కువ మంది వేశ్యలను నాగరాజ్ ఎన్నుకున్నాడని పోలీసులు అంటున్నారు. హత్యలకు, యితర 'సీరియల్ కిల్లర్స్'లాగా నగరంలోని ప్రదేశాలను కాక సాధారణంగా జనసంచారం వుండని పొలిమేరలను ఎన్నుకోవటంలో కూడా నాగరాజ్ యిదే జాగ్రత్తను ప్రదర్శించాడని పోలీసులు చెబుతున్నారు. దాదాపుగా అతను చేసిన హత్యలన్నీ యిలాంటి ప్రదేశాలలోనే. అందువలన శవం బైటపడడానికే కొంతకాలం పడుతుంది. ఒక్కోసారి, వారం, పదిరోజుల పైన కూడా పట్టొచ్చు. నేరం చేసిన ప్రదేశం నుండి దూరంగా పోవటానికి యిది ఉపకరిస్తుంది.

నాగరాజ్ చేత బలైపోయిన వారిలో జయలక్ష్మి ఒకరు. ఈ పేరు సరైనది కాదని పోలీసుల అభిప్రాయం. ఎందుకంటే, నాగరాజ్ తాను చేసినట్టు చెబుతున్న ఈ హత్యలో దొరికిన శవాన్ని యింకా ఎవ్వరూ గుర్తించలేదు. నాగరాజ్ కథనం ప్రకారం అతను జయలక్ష్మిని హత్యచేసిన వైనం ఇలా వుంది.

నాగరాజ్ ఎప్పుడూ తన సమిధను తానే ఎన్నుకుంటాడు. అందులో అతను చూసే ప్రత్యేకతలేమిటో తెలియదు. కానీ కొన్ని ప్రత్యేకతలేవో వుంటాయిని మానసిక శాస్త్రజ్ఞులు అంటున్నారు. ఉదాహరణకు టెడ్‌బండీ అనే అతను హత్య చేసిన 28 మంది యువతులూ దాదాపు ఒకే పోలికల్లో వున్నవాళ్ళే. సాధారణంగా 13వ ఏటనుండి 20ఏళ్ల మధ్యలో కలిగే అనుభవాలను బట్టి, మన కంటికి కనిపించేవో, కనిపించనివో కొన్ని ప్రత్యేకతలున్న వాళ్ళనే యిష్టంతోనో, కోపంతోనో హత్యచేస్తారు 'సీరియల్ కిల్లర్స్'అని మానసిక శాస్త్రజ్ఞుల విశ్లేషణ. అలాగే నాగరాజ్ ఎన్నుకున్న వాళ్ళల్లో వున్న మొదటి ప్రత్యేకత అందరూ యువతులే (ఒక్క బాషా తప్ప). చీర కట్టుకున్న వాళ్ళనే ఎన్నుకుంటాడతను. కొద్దో గొప్పో నగలు కూడా వున్నవాళ్లను వీలును బట్టి ఎంచుకునేవాడు. అలాగే జనవరి 1991లో ఓ చలి రాత్రివేళ, బెంగుళూరు రైల్వేస్టేషన్ సమీపంలో తచ్చాడుతున్న జయలక్ష్మిని ఎన్నుకున్నాడు నాగరాజ్. అప్పుడు అతనితో గోపాల్ అనే అతని మిత్రుడుకూడా వున్నాడు. ఇద్దరూ కలిసి, ఓ వీధి స్తంభంకింద జయలక్ష్మితో మాట్లాడారు. గంటల లెక్కన అద్దె తీసుకునే ఓ చిన్న హొటల్ గదికి వెళదామన్న జయలక్ష్మిని వారించి, ఆరుబయలు ప్రదేశానికి వెళదామని సూచించాడు నాగరాజ్. ఇది గోపాల్‌కు కూడా ఉత్సాహం కలిగించింది కానీ, అక్కడిదాకా వెళ్ళటానికి ఏర్పాట్లు కూడా తానే చేస్తానని నాగరాజ్ చెప్పినప్పటికీ, అంతకు ముందు చాలా చిన్నమొత్తానికి ఒప్పుకున్న జయలక్ష్మి, రెండు వందల రూపాయలు కావాలని అడిగింది. నూటయాభై రూపాయలకు బేరం చేసి, ఒప్పించి, ఆటో తీసు




కున్నాడు నాగరాజ్. ముగ్గురూ ఆటోలో ప్రయాణించి, నగరపొలిమేరల్లోని ఓ అడవిలాంటి ప్రదేశానికి చేరుకున్నారు. అక్కడ దిగిన వెంటనే ఆటోకు డబ్బులిచ్చి, పంపించేశాడు నాగరాజ్. మరీ అంత దూరం తీసుకెళ్తారని అనుకోలేదు జయలక్ష్మి. దట్టంగా చెట్లు పెరిగి వున్న ఆ నిర్మానుష్యమైన ప్రదేశం చూసి, కొంచెం భయపడింది. మళ్లీ తానే నగరంలోకి చేరుస్తానని హామీ యిచ్చాడు నాగరాజ్. అంతే కాక తాను చేయగలిగింది కూడా ఏమీ లేకపోవటంతో జయలక్ష్మి అంగీకరించింది. మొదటి అవకాశం గోపాల్‌కే యిచ్చాడు నాగరాజ్. ఇలాంటి వ్యవహారాల్లో సాధారణంగా మొదటి అవకాశం తనకే కావాలని ప్రతివారూ వాదిస్తుంటారు గానీ నాగరాజ్ పద్ధతివేరు. అతని వెంట ఒకరుగానీ, అంతకన్నా ఎక్కువ మంది గానీ సహచరులున్న ప్రతిసారీ, యీ విషయంలో తనే ఆఖరి వాడుగా వుండేవాడు నాగరాజ్. ఇప్పుడూ అలాగే గోపాల్ తరవాతి అవకాశమే తీసుకున్నాడు. కడుపు దహించుకుపోయే పడుపుకత్తె అర్ధనిమీలిత నేత్రాల బాధలో పాటల పల్లవులు విన్నానన్న శ్రీశ్రీకి కూడా చెవులు హోరెత్తి, సర్వేంద్రియాలూ నిశ్చేష్టమయే రాక్షస రతి. ఐనా తనను వదిలి పెట్టకుండా వుండిపోయిన ఆ పైశాచిక విటుడు చేయగల మరింత కరాళ కృత్యం ఏమిటాని భయాశ్చర్యాలతో, తప్పని సరి సహనంతో ఎదురు చూస్తున్న జయలక్ష్మి పైటను ఆమె గొంతుచుట్టూ బిగించి, మెలితిప్పి లాగటం మొదలెట్టిన నాగరాజ్ ఆమె ఆఖరి శ్వాస వదిలేవరకూ తన రక్కసి పట్టును వదల్లేదు. ఊపిరి తోడేసేంతగా అనుభవించాడనుకుంది గానీ, నిజంగా ఊపిరి తోడేస్తాడని ఆ అభాగ్యురాలు ఊహించి వుండదు. ఆ తరవాత నిదానంగా దుస్తులు ధరించి, ఆ నిర్భాగ్యురాలి శవంపైనున్న చిన్నపాటి ఆభరణాలన్నీ వలిచేసుకుని, జేబులో వేసుకుని, గోపాల్‌తో కలిసి రోడ్డు పైకొచ్చాడు. ఇద్దరూ ఓ ట్రక్కును ఆపి, లిఫ్ట్ అడిగి, నగరం చేరుకున్నారు. ఆ రోజు రాత్రి, ఎప్పటికన్నా ఎక్కువగా తాగేసి చేసిన ఘనకార్యం తలుచుకుని పొంగిపోయారు. నాగరాజ్ మహిళామేధంలో యిది ఒక ఉదాహరణ మాత్రమే.

ఈ విధంగా యిప్పటికి 24 మందిని చంపానని చెప్పుకున్నాడు నాగరాజ్. కానీ కనీసం మరో 20 మంది హత్యలతో కూడా నాగరాజ్‌కు సంబంధం వుండవచ్చునని పోలీసులు అనుమానిస్తున్నారు. ఈ సంఖ్య మొత్తంమీద 50 దాటినా ఆశ్చర్యపడనవసరంలేదని మరికొందరు పోలీసులు అంటున్నారు. నాగరాజ్ చేసిన హత్యలలో అతనికి ఎవరి సహాయమూ లేకున్నా ఆ విషయం మాత్రం, అవి జరిగినప్పుడే కనీసం కొంత మందికి తెలుసు. వీళ్ళంతా, మానభంగం చేసిన నేరాలలో అతనితోపాటు పాలుపంచుకున్నవారే. ఐతే, విశేషమేమిటంటే, నేరం చేసిన ప్రాంతం నుండి మారుతూ, మరో ప్రాంతం చేరుకుంటూ, మూడు జిల్లాలలో తన మారణకాండ కొనసాగించిన నాగరాజ్, ఎక్కడికక్కడే తాత్కాలిక మిత్ర బృందాన్ని ఏర్పాటుచేసుకుని, వాళ్ళ సహాయంతో కిడ్నాప్పు, అత్యాచారం, దొంగతనాలూ చేయటం, వీరిలో ఏ ఒక్కరికైనా అతను హత్య చేస్తాడని ముందే తెలుసా అన్నది తేలవలసివుంది. 'సీరియల్ కిల్లర్స్'లో యార్క్‌షైర్ రిప్పర్'గా పేరుగాంచిన పీటర్ సట్‌క్లిఫ్‌కు కనీసం ఒక సహాయకుడు వుండాలని పోలీసు అధికారుల్లో కొందరు అనుమానించారేగానీ, అందుకు సరైన రుజువులేవీ దొరకలేదు. మిగతా 'సీరియల్ కిల్లర్స్' అందరూ తమంతట తాము, ఒంటరిగానే చేసారు హత్యలన్నీ. కానీ నాగరాజ్ విషయంలో ఇది మరో వైరుధ్యం. అతను చేసిన హత్యలలో చాలా వాటిలో ఎవరో ఒక అనుచరుడైనా అతనికి కొంతవరకూ తోడ్పడ్డాడు. లేదా కనీసం తోడున్నాడు. వీరిలో ఏ ఒక్కరి ద్వారానైనా పోలీసులకు ఎలాంటి క్లూ దొరకకపోవటం విశేషమే. అనుచరులద్వారా నేరం బైటపడే అవకాశం వున్నందువల్ల చాలా మంది నేరస్తులు చిరపరిచితులైన బహుకొద్ది మందిని మాత్రమే, తప్పనిసరి పరిస్థితుల్లో తమతో నేరంలో పాలుపంచుకోనిస్తారు. అలాగే తమ వ్యక్తిగత కారణాలతో, తమ మానాన తాము హత్యలు చేసుకుపోయే 'సీరియల్ కిల్లర్స్' కూడా తమ నేరంలో మరొకరి సహాయం తీసుకోరు. బాధితులుగా వేశ్యలను ఎన్నుకోవటంలో వివేకం ప్రదర్శించిన నాగరాజ్, చాలా మందికి తన నేరం



తెలిసేట్టుగా అనుచరులను ఎన్నుకుని, వారి ముందే ఎందుకు హత్యచేసాడన్నది అంతుతేలని ప్రశ్న. హత్యానేరంలో కూడా తాము యిరుక్కుంటామనీ, కనీసం కిడ్నాప్, రేప్ కేసులలో శిక్ష అనుభవించాల్సి వస్తుందనే భయంతో వాళ్ళు నోరు మెదపరని నాగరాజ్ భావించాడా? జాగ్రత్తలను గురించిన ఆలోచన కన్నా మానసిక ఆనందానికి ఎక్కువ విలువ యిచ్చి వుంటాడని మానసిక శాస్త్రజ్ఞులంటున్నారు. 'సామూహిక అత్యాచారం' సెక్స్ నేర ప్రవృత్తిలో ఒకటనీ, బహుశా నాగరాజ్ కూడా అందుకే అనుచరులను ఎన్నుకుని వుంటాడనీ వారు చెబుతున్నారు. ఎందుకంటే, ఎవ్వరి తోడ్పాటూ లేకుండా, ఒంటరిగా కూడా అతను కొన్ని హత్యలు చేశాడు. సహాయం అతని అవసరం కాదు, సమూహం అతని ఆనందం అయివుంటుందని వారి విశ్లేషణ.

అనుచరుల సాక్ష్యం విషయంలో నాగరాజు నిర్లక్ష్యం అతనికి హాని చేయలేదుగానీ, వేశ్యలను ఎన్నుకోవటంలో కనబరిచిన అజ్ఞానం అతని అంతానికి దారితీసింది. వేశ్యలను హత్యచేసినంతకాలం అంతగా వెలుగులోకి రాని నాగరాజ్, గౌరమ్మ, జయమ్మల హత్యలతో తన నిర్బంధానికి మార్గం సుగమం చేశాడు. గత సంవత్సరం తమిళనాడులోని ధర్మపురి జిల్లాలో ఒకే వేశ్యను ఎప్పటిలాగే హత్యచేసిన తరవాత కొంతకాలం ఈ హత్యలకు దూరంగా వుండాలనే ఉద్దేశంతోనే, గోవిందా అనే మిత్రుడితోపాటు గోవిందా స్వస్థలమైన పట్టుపరిశ్రమ కేంద్రం కనకపురకు వెళ్ళి అక్కడ పెళ్లిచేసుకునే ప్రయత్నం చేసి, హొన్నమ్మను పెళ్ళిచేసుకున్నాడు. పెళ్లి గురించి నాగరాజ్‌కు వున్న అభిప్రాయమేమిటో తెలియదుగానీ, ఇంతమంది స్త్రీలను దారుణంగా హత్య చేసిన నాగరాజ్ తానే తాళి కట్టిన వారిని మాత్రం ప్రాణాలతోనే వుంచాడు. అతని మొదటి భార్య మంజమ్మను, ఆమెతో వేగలేక, సంసారభారం భరించలేక, కుటుంబ వాతావరణంలో ఇమడలేక వదిలేశానని చెప్పుకున్నాడు. ఆ తర్వాత హస్సనేర్‌కు చెందిన శాంత అనే అమ్మాయిని కూడా పెళ్ళి చేసుకున్నాడు. ఈ అమ్మాయితో కూడా కొద్దిరోజులు కాపురం చేసి, ఆమె దగ్గరున్న కొద్దిపాటి నగదూ, నగలూ లాక్కుని, ఆమెను వదిలేశాడు. ఆ తరవాత అతను చేసుకున్న మూడో పెళ్ళి హొన్నమ్మను. ఈ పెళ్ళితోనే అతని నేరచరిత్రకు తెరపడింది.




ధర్మపురి హత్య తరవాత పోలీసుల వేటకు చిక్కకుండా వుండాలనే ఉద్దేశంతోనే హెన్నమ్మను పెళ్ళిచేసుకున్నాడు. కానీ పెళ్ళి తరవాత అతని నేరప్రవృత్తి మళ్ళీ ఎప్పుడు తలెత్తిందో తెలియదు. హెన్నమ్మ కుటుంబంలో కనీసం ఒక్కరినైనా మానభంగం చేసి, హత్య చేయాలనే ఉద్దేశంతోనే అందరినీ బెంగుళూర్ బయలుదేర దీయించాడా? అందుకు అంతదూరం వెళ్ళాల్సిన అవసరం లేదు. ఆ మాత్రం కుంటిసాకూ, అవకాశమూ కనకపురలోనే దొరికివుండేది. లేక బెంగుళూరులో మెజెస్టిక్ ప్రాంతంనుండి దాటి వెళుతున్నప్పుడు అదే ప్రాంతంలో తాను వలలో చిక్కించుకున్న సుమతి గుర్తుకొచ్చి, మళ్ళీ అలాంటి ఉత్తేజపూరితమైన అనుభవం కోసం మనసు తహతహలాడి, అక్కడికక్కడే ఆలోచించుకుని తన మామకు తప్పుడు చిరునామా ఇచ్చి, తను మరో ఆటోలో వాళ్ళను ఎత్తుకుపోయాడా అన్నది తెలియదు.

మొత్తానికి తన భార్య హెన్నమ్మతో పాటు వదిన జయమ్మ మరదలు గౌరమ్మలను తన ఆటోలో ఎక్కించుకున్న తరవాత అనుకున్నట్టుగా లక్కసంద్రకుకాక ఆనెకల్‌కు పోనిమ్మని ఆటో డ్రైవర్‌కు చెప్పాడు. అదేమిటనీ ప్రశ్నించిన ముగ్గురమ్మాయిలకూ, ఆనెకల్‌లో తన మరో పిన్నివుందని సర్దిచెప్పాడు. దాదాపు చీకట్లు ముసురుకుంటున్న సమయంలో, నగర పొలిమేరల్లో బన్నెరఘట్ట నేషనల్‌పార్క్ సమీపంలోని ఓ గ్రామపు వరిచేల దగ్గర ఆటో ఆపించాడు. ఏవో మాయమాటలతో తన భార్యనూ, గౌరమ్మనూ ఒక చెట్టు దగ్గర వుండమని చెప్పి, వదిన జయమ్మను తీసుకుని ఊళ్ళోకి వెళుతున్నానని చెప్పి, బయలుదేరాడు నాగరాజ్. వరిచేలలోకి వెళుతుండగా అక్కడ, తన నేరాలలో పాతసహచరుడైన శంగుట్ట, అక్కడిదాకా తనకు తెలియకుండా తమ ఆటోను అనుసరించి వచ్చాడని నాగరాజ్ కథనం. నాగరాజే అతన్ని రమ్మని వుండవచ్చునని పోలీసులు అనుకుంటున్నారు. అత్యాచారనేరంవరకూ భాగస్తులను అనుమతించి, హత్య మాత్రం తనొక్కడే చేసే నాగరాజ్‌లో సామూహిక అత్యాచారంపట్ల ఆసక్తితోపాటు 'వోయర్' మనస్తత్వం కూడా వుండవచ్చునన్న మానసిక విశ్లేషకుల వాదనకు శంగుట్ట వ్యవహారం బలం చేకూర్చుతుంది. స్త్రీల నగ్నసౌందర్యాన్ని చూడాలనీ, ఇతరుల రాసక్రీడను చూడాలనే కుతూహలం యవ్వనప్రాంగణంలోకి అడుగిడుతున్న వారిలో వుండటం సహజమే. చాలామంది మగవారిలో ఇలాంటి కోరికలు వుండటం కూడా విపరీతం కాదు. కానీ అలా చూడటం కోసం ఉచ్చనీచాలు మరిచి ఎంతటి సాహసానికైనా తెగించి పరువు పోగొట్టుకునే పరిస్థితులు కలిగినా వెనుకాడని వారికి 'వోయర్'లుగా పరిగణిస్తారు. ఇలాంటి 'వోయరిస్టు' ప్రవృత్తివలన కూడా తాను అనుభవించి హత్య చేయడానికి ముందు, తన అనుచరులను అనుభవించమనే అలవాటు నాగరాజ్‌లో వచ్చి వుండవచ్చునని అనుకుంటున్నారు. శంగుట్టను పిలిపించడంలోని అవసరం ఇదే అయివుంటుంది. మొత్తానికి నాగరాజ్‌తోపాటు శంగుట్ట కూడా కలిశాడు. ఇద్దరూ కలిసి ముందుగా జయమ్మ చీరను బలవంతంగా లాగేశారు. ఆ తరవాత మామూలే. పక్కనున్న యూకలిప్టస్ చెట్లమధ్య జయమ్మను హత్య చేసి, అరగంటకల్లా, తన కోసం ఎదురుచూస్తున్న హెన్నమ్మ, గౌరమ్మలను కలుసుకున్నాడు నాగరాజ్. అతనితోపాటు జయమ్మ లేకపోవటంతో వాళ్ళు ఆరాతీశారు. ఆమెకు హఠాత్తుగా విపరీతమైన తలనొప్పి రావటంవల్ల తన పిన్ని ఇంట్లోనే వుండిపోయిందని బదులిచ్చాడతను. కానీ ఆటో మళ్ళింపునుండి అంతా అనుమానాస్పదంగా కనిపిస్తుండటంతో, అతని జవాబులో తృప్తిపడని ఇద్దరమ్మాయిలు గుచ్చి గుచ్చి ప్రశ్నించారు. కాస్సేపటికి కోపంతో వాళ్ళిద్దరినీ కొట్టాడు నాగరాజ్. అంతటితో ఆగకుండా, తన భార్య హెన్నమ్మ కళ్ళముందరే ఆమె చెల్లెలు గౌరమ్మపై అత్యాచారం జరిపి, గౌరమ్మ పైటతోనే ఆమె మెడను బిగించి, హత్య చేశాడని పోలీసుల కథనం. ఆ తరవాత హెన్నమ్మను మెయిన్ రోడ్డువైపుగా లాక్కుపోయాడు. తెల్లారేదాకా అక్కడే వుండి, వేకువజామునే ఓ బస్సులో కొత్తనూరు తీసుకుపోయాడు. అక్కడ ఒక ఇంట్లో హెన్నమ్మను బందీగా వుంచాడు. కొత్తనూరులో అరెస్టవటంతో అతని హత్యలకు తెరపడింది.

''అదృష్టవశాత్తూ, అపూర్వమైన జ్ఞాపకశక్తి వుందతనికి'' అన్నాడు డి.యస్.పి. జయప్రకాశ్. మాకు ఎంతో సహకారం అందించాడు. తనకు గుర్తువచ్చిన హత్య గురించల్లా వివరాలు అందించాడు. హత్యాస్థలానికి తీసికెళ్లాడు. ప్రతీ వివరమూ కళ్ళకు కట్టినట్టు వర్ణించాడు. ఐతే అరెస్టయిన దగ్గర్నించీ కొంత వింతగా ప్రవర్తిస్తున్నాడు. అది కావాలని చేస్తున్నాడో, నిజంగానే అలా మారాడో తెలియదు కానీ, మరిన్ని హత్యలకు సంబంధించిన వివరాలు అందిస్తాడని మాత్రం ఆశిస్తున్నాం. తను చేసిన హత్యల గురించీ, తను తీసుకున్న జాగ్రత్తల గురించీ, ఒక్కోసారి ఎంతో గొప్పగా, ఉత్సాహంగా వివరిస్తాడు. ఆ తరవాత అసలు తానే హత్యలూ చేయలేదంటాడు. ఒక్కోసారి తాను జయమ్మ, గౌరమ్మలను చంపినట్టు మాత్రం ఒప్పుకుని, మిగతావన్నీ తనకు పోలీసులు అంటగడుతున్నారని అంటాడు. మరోసారి ఎన్ని హత్యలు చేశాడో తనకే తెలియదని అంటాడు. దీని వెనుకనున్న మానసిక కారణాల గురించి పోలీసులు తలబద్దలు కొట్టుకోవటంలేదు. వాళ్ళకు కావలసింది నేరస్తుడు దొరకటం, అతనిమీద నేరాలు నిరూపించగలగడం. ఈ దిశలో తాము పరిపూర్ణవిజయం సాధించామనే పోలీసులు భావిస్తున్నారు.

నాగరాజ్‌ది ఉక్కులాంటి శరీరం. వ్యాయామం చేసినట్టు, అథ్లెటిక్స్‌లాగా చురుగ్గా కదిలే అవయవాలతనివి- అని వర్ణించాడు అడిషనల్ ఎస్.పి. అయిన ఎస్.కె. వేణుగోపాల్. ''అతని ఇంటిని మేం చుట్టుముట్టినప్పుడు ఎలాంటి ప్రతిఘటనాలేకుండా లొంగిపోయాడు. ప్రశాంతంగా వచ్చి అరెస్టయ్యాడు. చాలామంది స్త్రీలను చంపానని ఇంటరాగేషన్‌లో తనే చెప్పాడు'' అని వివరించాడు ఆనెకల్ పోలీస్‌స్టేషన్ ఇన్‌స్పెక్టర్ చంద్రశేఖర్. పోలీసులు ఇంటరాగేషన్ కోసం పిలిపించిన ఒకవ్యక్తి జేబుకొట్టేసి, ఆ డబ్బు స్టేషన్ ఊడ్చేవాడికిచ్చి,తనకూ, తన ఇద్దరు అనుచరులకూ బిర్యానీ తెప్పించుకున్నాడట నాగరాజ్ బిర్యానీ తింటూ పట్టుపడినప్పుడు ప్రశ్నించగా నిర్భయంగా ఉన్నాదున్నట్టు చెప్పేశాడట. అలాగని అతను అన్నీ నిజాలే చెబుతాడని నమ్మటానికి లేదు. పరస్పర విరుద్ధంగా అతను చెబుతున్న విషయాలను వాస్తవాలతో సమన్వయపరచటానికీ, మరిన్ని కేసులు అతనితో ముడిపడి వుంటే వాటిని వెలుగులోకి తేవటానికీ కృషి చేస్తున్నారు పోలీసులు. అతనికి వ్యతిరేకంగా అతని మూడోభార్య హొన్నమ్మతోపాటు, మొదటి భార్య మంజమ్మ, రెండో భార్య శాంతల సాక్ష్యాలను కూడా సేకరించటానికి ప్రయత్నిస్తున్నారు.

నాగరాజ్ పిచ్చివాడా- అన్నది తేల్చవలసివుంది. పుట్టుకతో ఏర్పడిన వైకల్యంవలన శృంగారంలో జడత్వం కలిగినవాళ్ళు, ఒక్కోసారి తన శృంగార భాగస్వామి హత్య ద్వారా మాత్రమే సంతృప్తిని పొందుతారనీ, సాధారణంగా ఇలాంటివాళ్ళు కేవలం వరుసగా రేప్‌లు చేయటమో, వరుసగా హత్యలు చేయటమో ఏదో ఒకటి చేస్తారు. కానీ నాగరాజ్ ఈ రెండూ చేయటం ఆశ్చర్యంగా వుందనీ, బెంగళూరుకు చెందిన సైకియాట్రిస్ట్ డాక్టర్ పి.కోదండరామ్ అన్నారు. బాల్యంలో తల్లి ఆధిపత్యంవలన తాను మగవాణ్ణని నిరూపించుకోవాలని అంతశ్చేతనతో గూడు కట్టుకున్న భావనవల్లనో, విపరీతమైన మాంద్యానికో, ఆత్మన్యూనతాభావనకో లోనవటంవల్లనో, మితిమీరిన అహంకారంవల్లనో కూడా ఇలాంటి నేరస్తులుగా మారే అవకాశం వుందనీ మానసిక నిపుణులు చెబుతున్నారు. ఐతే, ప్రతీ 'సీరియల్‌కిల్లర్' తప్పనిసరిగా మానసిక వైకల్యం కలవాడేనని నిర్ధారించటం కుదరదనీ, నాగరాజ్ ఎలాంటివాడో, పరిశీలించి నిశ్చయించాల్సిందేననీ అంటున్నారు. ఎలాంటి వాడైనప్పటికీ మొత్తానికి ఒక వరుసహత్యల గొలుసుకు ముడిపడింది. ఒక విషనాగరాజ్ బారిన పడకుండా మరికొందరు బతికిపోయారు. ప్రస్తుతం తనపై విచారణకోసం ఎదురుచూస్తూ కస్టడీలో వున్నాడు నాగరాజ్.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

